# జ్ఞానపీఠ విశ్వనాథ

# శ్రీమద్రామాయణ కల్పవృక్ష కావ్యవైభవము

వ్యాస సంపుటి




[illegible]

ఉత్తమ పరిశోధన నిబంధన బంగారు పతక గ్రహీత

డాక్టర్ కోటి సూర్యనారాయణ మూర్తి

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

A CRITICAL STUDY OF THE POETIC WORK OF
VISWANADHA RAMAYANA KALPA VRUKSHAM
Telugu

Compiled by

Dr K S N Murthy,
Mangala varapu pet
PEDDAPURAM-533 437
East Godavari District

Published 1992 January
Copies 1000

Price Rs 75/-

Copies can be had at

Smt Koti Bhramarambha Devi
Mangala varapu pet
PEDDAPURAM-533 437
East Godavari District

Printed at
Maheswara Art Printers
Main Road,
PEDDAPURAM-533 437

This Book is Published with the Financial Assistance of
Tirumala Tirupati Devasthanams
under their Scheme Aid to Publish Religious Books

# శ్రీ మద్రామాయణ కల్పవృక్ష కావ్య వైభవము

## విషయ సూచిక

# ముందుగా నా మాట

## తర తరాల జీవన దీప్తి రామాయణము

అత్యంత ఉత్కృష్టమైన రామాయణ మహాకావ్యమును రచించినవారు ఆదికవి వాల్మీకుల వారైతే, తరువాత అనేక మంది కవులు తమ తమ భాషలయందు రామాయణమును రచించి తమ ప్రజలకు రామాయణ కావ్య మాధుర్యమును చవిచూపి తమ జన్మలను తమ రామాయణములను తమ పేర్ల మీద సార్ధకము చేసికొని ఆ శ్రీరామచంద్రుని కృపకు పాత్రులైనారు తులసీ రామాయణము, రంగనాథ రామాయణము, భాస్కర రామాయణము, మొల్ల రామాయణము, కంకంటి రామాయణము మొదలైనవి ఇవే గాక ఇంకను అనేక రామాయణములు వచ్చినవి ఇంచుమించు అన్ని భాషలయందును రామాయణములు వచ్చియున్నవి వచ్చుచున్నవి ఇకముందు గూడ వచ్చును అంతటి పరమ మహాత్మ్యమైనది, భారతీయులకు పరమ ప్రామాణికమైనది రామాయణము. ఆ కోవకు చెందినదే శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి శ్రీమద్రామాయణ కల్పవృక్షము

## ఆదర్శ జీవనది

20వ శతాబ్దమున తెలుగు సాహితీ చరిత్రలో గోచరించే విశిష్ట వ్యక్తి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. ఆధునిక సాహిత్యమున ఎన్ని ప్రక్రియలున్నవో అన్నింటియందు వేలుపెట్టి చేపట్టి తెలుగు సాహితీ నందనవనమును కన్నులపండుగగ అలంకరింపజేసిన మహామనీషి కవిసమ్రాట్టు కళాప్రపూర్ణ జ్ఞానపీఠ బహుమతి గ్రహీత డాక్టరు విశ్వనాథ సత్యనారాయణగారు మీదుమిక్కిలి ఇతడు మన వాడు మన ఆంధ్రుడు

తర తరాల తెలుగు జాతివారు తమదని చెప్పుకోదగ్గ మహా కావ్యము శ్రీమద్రామాయణ కల్పవృక్షము ఒక్కరోజున లేదా ఒక మాసమున లేదా ఒక సంవత్సరములో పుట్టబడినది గాదు అర్ధ శతాబ్దము కాలమును మిగిగిన మహాకావ్యము అది. అందులకే ఆ కావ్యమునకు దేశమంతటి నుండి పలు ప్రశంసలను అందుకున్నది జ్ఞానపీఠ బహుమతితో అందల మెక్కినది. అర్ధ శతాబ్దము పాటు రచించిన రామాయణ కల్పవృక్ష కావ్యమును అన్ని కాండలను అన్ని వేల పద్యములను పూర్తిగ చదవకుండగనే అర్ధము చేసుకోకుండగనే తెలుగునాట అనేకమంది వక్తలు తమ ఊకదంపుడు ఉపన్యాసములు ఇచ్చుచున్నారే గాని, కల్పవృక్ష కావ్యమునందు శ్రీ సత్యనారాయణ గారు అనుసరించిన పంథా ఏమిటి? వారు చేసిన మార్పులు ఎందులకు? ఆ మార్పులవలన వారుగాని, లేదా సమాజముగాని పొందవలసిన తీరు ఏమిటి? వారు ఏమి ఆశించి ఈ మహాకావ్యమును రచించినారు, ఇన్ని రామాయణములు ఉండగనే మరల రామాయణమును ఎందులకు రచించవలసి వచ్చినది? అని ఎవ్వరును గ్రహించుట లేదు సరిగదా వివరించుట లేదు

శ్రీ విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షముపై పలు విశ్వవిద్యాలయముల యందు ప్రసిద్ధ ఆచార్యుల పర్యవేక్షణలలో పరిశోధనలు జరుగుచున్నవి ఇప్పటికే ఎన్నో సిద్ధాంత వ్యాసములు వచ్చియున్నవి. వచ్చుచున్నవి ఇకముందు గూడ రాబోవును ఎంతమంది కవులు ఎన్ని విషయములు చెప్పినప్పటికిని ఇంకను చెప్పవలసిన విషయములు అనేకము ఉన్నవి కావ్యమునందు అది కామధేను వంటిది గదా!

విశ్వనాథ చాలా లోతైన భావకుడు, రచయిత ఆయన శబ్దశక్తి అనితర అసమాన్యమైనది. వారు చెప్పిన పద్యమును వారే ఒక సభయందు ఒక వ్యాఖ్యానము చేసి, వేరొక సభయందు మరొక విధముగా వ్యాఖ్యానము చేసి సమర్ధించారు మరొక విధముగా

వ్యాఖ్యానము చేయవచ్చని వారే తెలిపారు అంతటి శబ్దశక్తి సంపన్నులు

అంతటి శబ్దశక్తి నిండియున్నటువంటి, పల్లె సంస్కృతి నిండియుండి సామాజిక సంస్కారము సంప్రదాయము నిండియున్నటువంటి జీవనదీప్తి రామాయణ కల్పవృక్ష కావ్య వైభవముపై సమగ్రమైన, విభిన్న తత్త్వములుగల ఆచార్యుల, కవుల, పండితుల నుండి వ్యాసములను సేకరించి గ్రంథ రూపమున తీసుకు రావలయునన్న తలంపు చాలా కాలము క్రిందట కలిగినది తలంపు విన్నంతనే నన్ను ప్రోత్సహించిన సాహితీ పిపాసి, జాతీయాచార్యులు, నేషనల్ ఎమిరిటెస్ ఫెలో మీదుమిక్కిలి నా గురుదేవులు ఆచార్య యస్వీ జోగారావుగారు ఆ శ్రీరామచంద్రునిపై భారమువేసి, ముందుకు దూకు వెనుక నేనున్నాను అని సెలవిచ్చారు గురువర్యుల ఆజ్ఞతో బరిలోనికి ముందుకు దూకాను దూకాక తెలిసినది నది సముద్రములో దూకానని అయినా భయపడలేదు ముందుకు సాగాను ఆ ప్రయత్నమున దేశమున పలు విశ్వవిద్యాలయముల ఆచార్యుల నుండి ప్రామాణిక వ్యక్తులను సంప్రదించి వ్యాసములను సేకరించి నాను ఇప్పుడు గ్రంథరూపమున తమ ముందు పెడుతున్నాను

ఎంత చెప్పినా, ఎంత వ్రాసినా ఇంకా ఎంతో చెప్పసాధ్యమయిన కవి, ఇంకా ఎంతో మిగిలిపోయే కవి మన సత్యనారాయణ గారు వారు భౌతికముగా మరణించినప్పటికిని మన అందరి హృదయముల యందును తెలుగునాట లోగిళ్ళ యందును ఎప్పటికిని చిరస్మరణీయుడే

నా అభ్యర్థనను మన్నించి ఈ సంకలన గ్రంథమునకు వివిధ విషయములపై తమ తమ వ్యాసములను అందించిన మహానుభావులందరకీ నా హృదయ పూర్వక నమస్కారములు, మీదు మిక్కిలి వారికి నేను ప్రత్యేకముగా కృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాను

విశ్వనాథ వారిమీద నుండే అపారమైన భక్తితో ఎంతో ఆర్థిక ప్రయాసలకు లోనైనప్పటికిని ఈ గ్రంథమును వెలుగులోనికి తీసుకొని రావాలనే పట్టుదల, తెగింపుతో ముందు కురికి, చివరకు ఈ రూపమున గ్రంథమును తీసుకొని రావటము జరిగినది

త్వరితగతిని ముద్రణ చేయించినందువల్లన కొన్ని కొన్ని చోట్ల అక్షర దోషములు తెలియకుండగానే దొర్లినవి సహృదయులైన పాఠకులనుండి ఈ విషయమున మన్నింపు కోరుచున్నాను

ఈ చిన్ని ప్రయత్నము తెలుగు సాహిత్యమున చంద్రునికో నూలుపోగు వంటిదని, నా ప్రయత్నమును, నా సాహసమును తప్పక ఆదరించి అభిమానిస్తారని ఆశిస్తూ

మరొక్కమారు వ్యాసకర్తలకు కృతజ్ఞతలను తెల్పుకుంటూ
ఇటువంటి దైవకార్యమును చేయుటకు నాకు జన్మనిచ్చిన
నా తల్లిదండ్రులు [లేటు] కోటి వీర్రాజు వేంకటరత్నం గార్లకు
నమస్సుమాంజలర్పించుచూ
నిత్యము నా ఎదలో నెలవున్న శ్రీ సీతారామచంద్రుల వార్ని
భక్తి ప్రపత్తులతో ధ్యానించుతూ

అంతేకాదు ఇంకా అదృశ్యరూపములో ఆకాశంలో విహరించే
రసభావ దేవతా రూపమైన పలుకులదేవి పరివారానికంతటికీ
సవినయింగా సాగిలపడుతూ

తమనుండి సెలవు కోరుతూ

పెద్దాపురం
15-1-1992

వినమ్రతతో
**కోటి సూర్యనారాయణమూర్తి**

**Prof. S. V JOGA RAO**
M A, Ph D, Hon D Litt (A U & U S A)
National Professor of Telugu 1984
U G C Emeritus Fell w - 1988
Professor U S S R - 1965 67
Principal, A U, 1980 83
*New Delhi Sahitya Akademy Awardee-1989*
ANDHRA UNIVERSITY

VISAKHAPATNAM
530 017 A P, India

Date 15-1-92

# సహృదయ భూమిక

విశ్వనాథ అంటే విశ్వనాథే ఏ విశ్వానికి నాథుడాయన? అంటే కవితా విశ్వానికి రామాయణం వ్యాసుడే వ్రాసి వుంటే ఎలా ఉంటుందో అలా వుంది ఆయన వ్రాసిన ఈ శ్రీమద్రామాయణ కల్పవృక్షం వాల్మీకి వ్యాసు లిద్దరి వ్యక్తిత్వాలు గంగాయమునల్లా సంగమించి పోయాయి ఆయన మూర్తిమత్వంలో

ఆయనయొక్క సారస్వత సృష్టి అనేక మహాసముద్రం చెరువులకు రేవులుంటాయి కాని సముద్రానికి రేవులుండవు అయినా ఆయన వాఙ్మయ పరిశోధనా విషయంలో నేను అగ్రతన్సరుడనై వివిధాంశములపై పలువురిచేత పరిశోధనలు చేయించి అనేకమందిని డాక్టరు పట్టభద్రులను చేశాను ఆ సందర్భంలో ఆ మహాకావ్యం యొక్క లోతుపాతులు నా అవగాహనకు వచ్చాయి. అప్పటినుంచి దేశంలో ఆ కావ్యాన్ని ఎంతమంది చదువుతున్నారు? ఎవరెవరికి ఏపాటి అవగాహన ఏర్పడినది? అని తెలుసుకోవాలనే జిజ్ఞాస ప్రారంభమైంది తత్ఫలితమే రామాయణ కల్పవృక్షం గురించి పెద్దాపురంలో నా ప్రియ శిష్యుడు డాక్టరు కోటి సూర్యనారాయణ మూర్తి ఆధ్వర్యమున మహోన్నతముగ జాతీయ స్థాయికమైన సాహిత్యగోష్ఠి జరిగినది. అది నా రూపకల్పనలో

అసలు దీనికంతటికీ మూలం నా ప్రియ శిష్యుడు డాక్టరు కోటి సూర్యనారాయణ మూర్తి యొక్క ఆశయం, ఆదర్శం, అభినివేశం అతనికున్న సాహితీ వాల్లభ్యం ఇంతా అంతా కాదు సత్సంప్రదాయముల యెడల పెద్దల యెడల గురువుల యెడల భక్తి శ్రద్ధలు వినయ విధేయతలు ఇంతా అంతా కాదు. తాను కార్యము

చేయవలసి వచ్చినపుడు అది ఎంతటి బృహత్కార్యమైనా జంకు గొంకు లేకుండ, తన భుజస్కంధములపై నిలిపికొని ముందుకు సాగి జయప్రదము చేయగల సమర్థత గలవాడు కార్యము నెడల దీక్షా దక్షత గలవాడు అతని ఆమంచి లక్షణాలు అతని సాహితీ మిత్రులు, గౌరవనీయులైన పెద్దలు అందించిన సహకారములే ఆ జాతీయ సదస్సు యొక్క విజయ, విభవములు ప్రధాన కారణములు దేశం నలుమూలలనుంగి ఎందరో ఆచార్యులూ విచ్చేసి ప్రసంగాలు చేశారు

ఆ కార్యక్రమములో శ్రీ జువ్వాడి గౌతమరావుగారు సుమారు గంటున్నరసేపు చేసిన రామాయణ కల్పవృక్ష కవితా గానం. ఆయన ఒక్కొక్క పద్యం చదువుతూవుంటే సభ సభంతా ఉల్లాసవారాసి నుగ్రూతలూగి పోయింది ఆ గాత్రగాంధర్వ మాధుర్యానికే గాదు, ఆయన పద్య పఠనంలోని ఒడుపువల్ల రామాయణ కల్పవృక్ష కవితా పరమార్థం ఏ విధమైన వివరణ లేకుండానే సభవారికి సద్యోహృద్యమమూ సహృదయ నైవేద్యము అయిపోయింది అప్పుడు తెలిసింది అస్మదాదులందరికీ అతిలోకమైన విశ్వనాథ ప్రతిభా సహకృతమైన కవితా కమనీయత

అదినరే, ఆయా విద్వత్ప్రసంగాలను సమీకరించి ఇలా గ్రంథరూపంలో వెలయించడము సామాన్య విషయము గాదు అదొక గొప్పపరిశ్రమ, మాకోటి చేసిన ఆపరిశ్రమకు నా సౌహార్దిక సాధువాదమూ మంగళాశాసనం సాహిత్యరంగములో దీనికి ఒక ప్రత్యేకత ఇదే సంపాదించు కుంటుంది

'నా, మార్గమ్ము ను గాదు, వీని దరయన్ నాతాత ము త్తాతలం
దే మార్గమ్మును గాదు మార్గమది యింకేదో యనంగా వలెన్
సామాన్యుండనరాదు వీని కవితా సమ్రాట్త్వమా హేతువై
ఈ మచ్చిమ్యని తావరించినది నేనెంతో ముదమ్మొందగా"

ఇది విశ్వనాథకు గురుదేవులు కవికుల వీరహంవీరుడు చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారు ఇచ్చిన కితాబు

యస్వీ జోగారావు

# నాకు నచ్చిన కవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఉ. అక్షరలక్ష లంచిత శుభాక్షతలై విలు వొందునట్లుగా
అక్షరమైన హ్లాద మెదసాక్షిగ సర్వరసజ్ఞ జాతికిన్
దక్షతనిచ్చు సూరిసురధాణికి సత్కవితా కళా మహా
ధ్యక్షున కొక్క లక్షయిడి ధన్యతగాంచెను జ్ఞానపీఠమున్

సీ. ఒక గండభేరుండ మొక గంధవేదండ
మొక యున్నత మహీధ్ర మొక సముద్ర
మొక వేద మొకశాస్త్ర మొక మహాభాష్యమ్ము
నొక పురాణ మ్మొక యుపనిషత్తు
ఒకఝుంఝ యొక వృష్టి యొకఝరి యొక ప్రౌఢ
నాయికాయిత పురుషాయితమ్ము
ఒకపండితోద్దండు డుద్ధతుం డొక యోద్ధ
ఒక మహాసమ్రాట్టు నొక మహర్షి

స్మృతి దగిలి పాయకుండు తదతి విశిష్ట
కావ్యహేతుత్రయీ వ్యక్తిభవ్యతలను
వరుస నొక్కొక్కదాని భావనము సేయ
నాకు నచ్చినకవి విశ్వనాథ యొకడు

జాతీయాచార్య యస్వీ జోగారావు
విశాఖపట్టణము

# స్త్రీ పాత్ర చిత్రణం

ఉటుకూరి సుహాసిని, ఎం. ఏ.,

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్.
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్.

ఆర్ష కవి, ఆదికవి అయిన వాల్మీకి మహర్షికి వినయంతో నమస్కరించనిదే రామాయణ కావ్య చర్చ చేయడం అనుచితం కాదు ఆనాడు వాల్మీకి రామాయణ కథాకావ్యగానం చేయకపోతే ఈనాటి మన భారతీయ సాహిత్యం ఏ రూపంలో వుండేదో మనం ఊహించలేము.

రామాయణం రామచరిత్ర మాత్రమే కాదు. సీతాచరితం కూడా. సీతారాములు భారతదేశానికే కాదు సర్వ మానవ జాతికే ఆదర్శప్రాయులు. సీతారాముల పేర్లు, వారి జీవితాలు భారతీయుల జీవితాల్లో పెనవేసుకుని ఉన్నాయి. సీతాచరిత్ర మననంలోనే ఆ కావ్యంలో స్త్రీ పాత్ర కెంత ప్రాధాన్యం వున్నదో విశదమౌతుంది. ఏ కావ్యానికైనా కథ ప్రధానం కాదు. అందులోని పాత్రలూ, పాత్ర చిత్రణము, పాత్ర పోషణమూ జీవాధారం. ఉత్తమ పాత్ర సృష్టి, తచ్చిత్రణలే కవి యశస్సుకి కారణభూతమౌతాయి. అందులోనే కవిలోని శిల్పకళానైపుణ్యాన్ని ప్రదర్శించగలుగుతాడు అట్టివాడే సత్కవి. ఆ కావ్యం సత్కావ్యం.

కావ్య పాత్రలు కూడా సమాజంలోని మానవుల ప్రతిరూపాలే. సమాజంలోని ఒక్కొక్క మనిషికీ ప్రతీకగా ఒక్కొక్క పాత్రను కవి సృష్టిస్తాడు. సమాజంలో విభిన్న పరిస్థితుల్లో, విభిన్న దృక్కోణాలలో మానవ ప్రవృత్తి ప్రకటితమైనట్లే, కావ్యంలోకూడా అద్దంలో వలె మానవ ప్రతిబింబం దర్గోచరమౌతుంది. ఒక్కొక్కసారి ఆయాపరిస్థితుల్లో పొత్తుకుదరని లక్షణాలు కూడా ఉంటాయి.

క్షణక్షణానికీ నూత్న వినూత్న దృక్పథాలతో, లక్షణాలతో అవిర్భ విస్తున్న మానవుని చూడ్డానికి, నిశితాతినిశితమైన చూపు, సూక్ష్మాతి సూక్ష్మమైన వివేచన కవికి కావాలి. ఆ పాత్రను ఆ విధంగా మలచ డానికి అనితరసాధ్యమైన ప్రతిభ కూడా కావాలి. కోమలమైన, చమత్కార పూర్వకమైన రచనా నిర్మాణ సంపత్తి, మానవ హృద యావిష్కరణ శక్తికూడా కవికి ఉండాలి. అప్పుడే ఆ కావ్యం రస రమ్యంగా వుంటుంది. ఉత్తమ కావ్యత్వ స్థితిని పొందుతుంది. అట్టి ఉత్తమ, శాశ్వత పాత్ర సృష్టిచేసి అమూల్య సంపత్తిని భారతీయుల కందించిన కవిపుంగవుడు వాల్మీకి. భారతీయ కవులందరూ ఆ మహాకవి అనుయాయులే.

వాల్మీకి రామాయణానికి భారతదేశంలో అన్ని భాషలలోను ఎన్నో అనుసరణలు, ప్రక్రియా వైవిధ్యం గల అనేక కావ్యాలూ కోకొల్లలుగా ఉద్భవించాయి. తెలుగు భాషలో కూడా ప్రక్రియా వైవిధ్యంగల అనేక రామాయణాలున్న విషయం విదితమే. వాటిలో విశ్వనాథ వారి రామయణ కల్పవృక్షం విశిష్ట వ్యక్తిత్వం గల ఒక మహాకావ్యరాజం. వినూత్నములు, మనోహరములు, అవాల్మీకములు అయిన సన్నివేశ కల్పనలు, అసాధారణ పాత్ర చిత్రణా వైవిధ్యములు ఆ కావ్యానికంత ప్రాశస్త్యాన్నీ ప్రచారాన్నీ తెచ్చిపెట్టాయి. కాండాంతర్గత భాగ విభజనలో కూడ విశ్వనాథ తన ప్రతిభను, స్వతంత్రతను చాటి చూపించారు. వాల్మీకివలె సర్గలుగా కాక ఆయా భాగలలోని కథా ప్రాముఖ్యాన్ని బట్టి ఇష్టి, అహల్య, అభిషేకాది ఖండములుగా విభజించారు.

విశ్వనాథ వారి పాత్రచిత్రణ వినూత్నమైనది, విశిష్టమైనది. ఆయా సన్నివేశాన్ని బట్టి, ఆయా సందర్భానిబట్టి, పాత్రల మన స్తత్వాన్ని విశ్లేషించుకొంటూ స్వయం వ్యక్తిత్వంగల పాత్రలుగానూ, స్వయం ప్రకాశవంతమైన పాత్రలుగానూ, మహత్తరమైన రమణీయ

శిల్పాలుగాను తీర్చిదిద్దారు. అందునా వారి స్త్రీ పాత్ర చిత్రణం అత్యద్భుతం. విశ్వనాథ వారి ఒక్కొక్క స్త్రీ పాత్ర ఒక్కొక్క సుందర శిల్పం. రమణీ రామణీయకం. రామాయణంలోనే మిక్కిలి దూషణకు గురయ్యే కైక, మంథరలను కారణ జన్ములుగా చిత్రించారు. వాల్మీకి ప్రాధాన్యం ఇవ్వని శాంత పాత్రకు విశేష స్థానాన్నిచ్చి వాటికి ఒక నిర్దిష్టమైన ప్రయోజనాన్ని చేకూర్చారు. ఉదాత్త పాత్రలైన సీత, శబరి, అహల్య మొదలగు పాత్రలను ఎంతో నిశితం గానూ, నిర్ధరం గానూ చిత్రించారు. విశ్వనాథ శేముషీ ధురంధరులైన శ్రీ చెళ్లపిళ్ల వారి శిష్యుడే అయినా కవిత్రయాన్ని, పోతన శ్రీనాథులను తన గురువులుగా పేర్కొన్నారు ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి, తిక్కన్న శిల్పవు తెనుగుతోట ఎఱ్ఱన సర్వమార్గేచ్ఛావిధాత్రయందు, పోతన్న తెలుగుల పుణ్యపేటి అన్నారు. వాల్మీకి, వ్యాస, భాస కాళిదాసాదులకు కై మోడ్పు ఘటించారు. ఇక వీరి అనువాద రచనా విధానంలో కవిత్రయం వారిని శ్రీనాథాదులను అనుసరించారు. వాల్మీకిని అనుసరిస్తూనే మూలకథకు భిన్నం కాకండా స్వకపోల కల్పనా చాతుర్యాన్ని, చమత్కారాన్ని జోడిస్తూ తనదొక స్వతంత్ర కావ్యంగా భాసింప చేశారు. వీరిలో నన్నయ్య తిక్కనాదులను చూస్తాం. వీరి శైలీవిధానాల్ని చూస్తాం. వారి ఉక్తి చమత్కారాన్ని గమనిస్తాం. వారి వాక్పటిమను దర్శిస్తాం. అందులోనే విశ్వనాథను చూస్తాం. కవి సమ్రాట్టును చూస్తాం. కల్పవృక్ష మధురఫలాన్ని రుచి చూస్తాం. ఇదివారి ప్రత్యేకత.

విశ్వనాథ స్త్రీ పాత్ర చిత్రణ గురించి ఒకింత ముచ్చటించుకుందాం.

మూలకావ్య గాథా కల్పనలు కల్పవృక్షంలో ఎన్నో, వాల్మీకి రామాయణం అయోధ్యాపుర వర్ణనతో ప్రారంభం కాగా, కల్ప వృక్షం సంతానం కోసం పరితపించే దశరథుని మనోవేదనతో ప్రారంభ మౌతుంది. వాల్మీకంలో దశరథునకు ముగ్గురే భార్యలు. కల్ప

వృక్షంలో మూడు వందల మంది భార్యలు. ఇది ఆనందరామాయణం మొదలగు కావ్యాలలో ఉన్నది. జనశ్రుతికూడా ఇంతే విశ్వనాథ లోకప్రసిద్ధమైన అవాల్మీకమైన అంశంతోనే ప్రారంభమైంది. ఈ మూడు వందల మందిలో ఇంపారిన ప్రేయసులు, గుణగణాఢ్యులు ముగ్గురు కలరని మొదటిదైన ఇష్టిఖండంలో చెప్పబడింది. వారిలో కోసల రాజపుత్రి దేవేరి ముక్తికాంతా సమానాకార, నవశరత్కాల మందాకిని. సుమిత్ర శాంత గుణపేటిక, ఉపాసనా స్వరూప, సితపుండరీకవనము. ఇక మూడవ భార్య కైకయ రాజకన్య హేలారతి డాగు రేకుల తళత్తళ కాటుక, రాజుకంటికి మధుసామగానమూర్తి నునునల్ల కల్వపూవు - అని అంటూ ధర్మకామంబులు వీరెంట దశరథుడు రసమూర్తులైన ముగ్గురు భార్యల యందును అమృత సౌఖ్యానుభూతిని, అధ్యయన సౌఖ్యాన్ని, తీర్థభోగ సుఖాన్ని కన్నాడట. ఈ విధంగా కవిసామ్రాట్టు కావ్య ప్రారంభంలోనే ముగ్ధ మనోహరంగా స్త్రీ పాత్ర ప్రవేశం చేయించారు. అంతేకాదు భార్యాభర్తల మధ్యగల అన్యోన్య ప్రేమ బంధాన్ని, మానవ జీవితంలోనే పవిత్రమైన ధర్మార్థకామమోక్ష భావ వైశిష్ట్యాన్ని. భగవద్భావాధ్యయన సౌఖ్యాన్ని స్త్రీ ద్వారా పొందవచ్చుననే పరమమైన అభిప్రాయాన్ని విశ్వనాథ వారు ఎంత రమ్యంగా పొందుపరచారో! ఆదర్శమూర్తి, సత్యధర్మ వాక్పరి పాలకుడు అయిన శ్రీరామచంద్రునికి, జన్మనిచ్చిన తల్లి, పెంచిన తల్లులు అంతటి ఉత్తమ చారిత్రులు కాబట్టే రాముడు కూడా అంత ఉజ్వలమూర్తి కాగలిగాడన్న సత్యాన్ని విశ్వనాథ కావ్యారంభంలోనే సూచ్యార్థగ సూచన చేశారు. తన కడుపున శ్రీమన్నారాయణుడే పుట్టగలడన్న వార్తను వినిన కౌసల్య ఆయనకు స్వాగతం ఇవ్వడానికి ఎంతగానో సంబరపడుతుంది.

పుత్రకామేష్టి చేసే సందర్భంలో దశరథుడు సుమంత్రాదుల సలహాపై రోమపాదుని అల్లుడైన ఋశ్యశృంగుని అయోధ్యకు తీసుకు రావడానికి నిశ్చయిస్తాడు. ఆసందర్భంలో సుమంత్రుడు ఋశ్యశృంగుని

కథను దశరథునికి వివరిస్తాడు. అంగదేశాధిపతి రోమపాదుని పనుపున ఋశ్యశృంగుని వద్దకు అడవిలోకి వెళ్లిన ఆటవెలదుల నాట్యవిన్యాసాల్ని, వారి ప్రవర్తనను ఎంతో ఔచిత్యవంతంగా చిత్రించారు. ఎక్కడా అశ్లీలతకు తావీయకయే కడు రమ్యంగా రచించారు. వారి భరతనాట్య శాస్త్ర విన్యాణాన్ని వర్ణించడానికి 'ఏకాంతిక కేళీ కళా రహస్యార్థనవాత్యంత ధ్వనిమద్గీతా సంతానము భరతశాస్త్ర సరణిన్ బాడన్' అని సుదీర్ఘ సంస్కృత సమాసాన్ని ప్రయోగించారు. ఇంకొకచోట భావం బాగా తెలిసేలా 'నాటుపొంగులు తరగపూలంబు రోచు లూగిసలు మధురేఖలు నొదిగి వెనుక కరుగుటలు, ముందు వచ్చుటలైన నాలుగం బుధులువోలె' అని తేటతెలుగు సమాసాల్ని వాడారు. పైగా వారు రూపాజీవలే అయినా 'భూపశ్రేష్ఠుని కూతుపెన్మిటంచు' ఆ మునిని పూజించారట. చూశారా విశ్వనాథ ఔచిత్య పాలన

రామాయణ కల్పవృక్షంలో రాముని అక్క శాంత పాత్రకు అత్యంత ప్రాధాన్యం కల్పించబడింది. జానపద రామాయణాదులలో ఆ పాత్రకున్న ప్రాధాన్యాన్ని బట్టే విశ్వనాథ కూడా ఆ పాత్ర కంతటి విశిష్ట స్థానాన్నిచ్చారు. అంతేకాక శ్రీరాముని జన్మకు శాంతా ఋశ్యశృంగులు ప్రధాన కారకులు కదా ! విశ్వనాథ శాంత పాత్రకు విశిష్ట ప్రాధాన్యం కల్పించడం చాలా ఔచిత్యవంతమైన విషయమేనని విశదమౌతుంది. వాల్మీకి శాంత పాత్రకు అంతటి ప్రాధాన్యాన్నీయలేదు. ఆయన బాలకాండలో "అన్తఃపుర స్త్రియః శాన్తాం దృష్ట్వా తథాగతామ్. సహభర్త్రా విశాలాక్షీం ప్రీత్యానన్దము పాగమన్," - భర్తతో కలసి వచ్చిన శాంతను, విశాలాక్షిని అంతఃపుర స్త్రీలందరు ప్రేమానందాలతో చూచారని మాత్రమే చెప్పాడు. శాంత దశరథుని పుత్రికయని, రోమపాదునకు పెంపకానికి ఇచ్చాడని వాల్మీకి చెప్పలేదు. వాల్మీకి శాంతను రోమపాదుని పుత్రికగానే

చిత్రించాడు. విశ్వనాథ దేశంలోని ఇతర రామాయణాలలో ప్రచారంలో వున్న అవాల్మీకమైన ఇతివృత్తానికే ప్రాధాన్యం ఇచ్చారు.

కల్పవృక్షంలోని ప్రతి పాత్ర ఏదో ప్రాముఖ్యాన్ని, అంతరార్థాన్ని కలిగి ఉంటుంది. ఆయన పాత్రలు మూసలో పోసిన బొమ్మలు కావు. వాటిలో స్పందన ఉన్నది. జీవం, చైతన్యం ఉన్నాయి. కొన్ని పాత్రలు భావి సూచకాలుగా మలచబడ్డాయి శాంత పాత్ర అట్టిదే. ఋశ్యశృంగుని అయోధ్యకు తీసుకురావడానికి రాజులతో సహా అంగరాజ్యానికి వెళ్తాడు. అక్కడ శాంతను చూడగానే అయనలో ఇన్నాళ్లుగా అణిగిపోయిన పుత్రికా ప్రేమ పొంగిపొరలుతుంది. శాంతను చూచి - తల్లీ! నిను కడుపున కాంచినాడ నేననుకొన నా మనసున ధైర్యం చాలదు. తొనుకునా దత్తాపహరణ దోషంబంచున్'- అని తన సహజ వాత్సల్యాన్ని ఎలా తనలో దాచుకొన్నది వివరిస్తాడు. చాలా కాలం తర్వాత కలసికొనిన శాంతా కౌసల్యలు రెండు వల్లికల యందం బొప్పగ కౌగిండ్లలో నిమిడి పోయారట. తల్లీ కూతుళ్లకు గల ఆ మమతాను బంధాన్ని విశ్వనాథ మనోహరంగా వర్ణించారు. యజ్ఞనిర్వహాణ కొఱకు శాంతాఋశ్య శృంగులను దశరథుడు అయోధ్యకు తీసుకుని వెళ్తాడు. శాంత రోమపాదుని ఇంట్లో కంటె అయోధ్య లోనే ఎక్కువ ప్రేమ నూల్కొని యున్నదని ఋశ్యశృంగుని నోట చెప్పిస్తారు విశ్వనాథ ఎంత పెంపకమైన సహజమైన పితృ ప్రేమ చాలా గొప్పదని ఋజువు చేశారు కవిసామ్రాట్టు

కవులు తత్కాలీన సమాజానికి ప్రతినిధులు. సాహిత్యం సమాజ దర్పణమను సూక్తికి విశ్వనాథ కూడా నిదర్శనంగానే నిలుస్తారు. వ్రాస్తున్నది పౌరాణికుల చరిత్రే ఐనా తన తెలుగుదేశపు టాచార వ్యవహారాలాన్ని, సంప్రదాయాల్ని వీరు మఱువలేదు అవసరమైన చోట్ల ఆయా సన్నివేశాలలో తెలుగుతనాన్ని, తెలుగు సంప్రదాయాన్ని ఆయా పాత్రలకు, కథకు అతుకు పెట్టని విధంగా

అతుకు పెట్టారు. శాంత అయోధ్యలో ఉండగా సంవత్సరాది పండుగ వచ్చింది సన్నమామిడి పిందెలతోడి వేపూత ప్రసాదాన్ని సంప్రదాయ బద్ధంగా దశరథుని చేత ఆమెకు పెట్టించారు కవిగారు. కౌసల్య, సుమిత్ర, కైకేయి, శాంతలు గర్భం ధరించారు. వారికి గర్భిణీ స్త్రీలకు చేసే ఆచారాలను విధుల నన్నింటిని యథావిధిగా దశరథుడు చేయించాడు విశ్వనాథవారు వర్ణించిన ఈ ఆచారాల్లో అసలైన సిసలైన తెలుగు దనం కన్పిస్తుంది. కల్పవృక్షంలో శాంత పాత్ర మళ్లీ దర్శనమిస్తుంది. తమ్ముని పెండ్లికి తరలి వచ్చిన శాంతను చూడగానే కౌసల్య కుమార్తెను అతి ప్రేమతో కౌగిలించుకొని "తల్లీ! నీవు వచ్చితివి నా బరువు తీరినది. మూడుపట్టున చమురు పెట్టుటకు, తమ్ముని దిద్దుటకు, ఆడపడుచువు వచ్చావు. నాకు చాలు-" అనగానే శాంత పొంగిపోయింది. విశ్వనాథ ఇక్కడకూడా తెలుగు ఆడపడుచుల ధర్మాల్ని, విధులను హృద్యంగా చిత్రించారు. తమ్ముని పెండ్లిలో అక్కకు ప్రాధాన్యం కూడ ద్యోతక మౌతుంది. విశ్వనాథ శాంతను ఒక ఉదాత్తురాలిగా, పరిపూర్ణత్వం కలిగిన ఒక స్త్రీమూర్తిగా మలచారు.

ఈ అవతార ఖండంలోనే కైక పాత్ర ప్రాధాన్యం తొలిసారిగా కానవస్తుంది "ఆకృత నొంటెకు చెల్లెలు కైకేయికి, ముసలిదాది కలదొక్కతె. లానేకాలము పతి యచటికి బోకుండిన దానితోడి మునుగును తేలున్."- మంథర ఏమి చేయమంటే అదే చేస్తుంది కైక. ఆమె చేయవద్దంటే చేసే పనిని కూడా ఆపివేస్తుంది ఆఖరికి సింగారించుకొని పతిని కలియంగా - దాది కిష్టం లేకపోతే భర్త వద్దకు వెళ్ళదు కైక. అంతటి మంథర ఆజ్ఞానువర్తిని కైక. అయితే ఆమెకు వ్యక్తిత్వం లేదా. ఒక మహారాజుకు ముద్దుల భార్య కదా! కాని దానికి కారణం - తల్లి నెఱుగని దోషమ్ము తగిలి కైక, కన్నతల్లి చూడని మమకారమెల్ల తన్ను చేతుల పెంచిన దాది మీద నొలుకపోస్తుందట. మరియొకసారి ఒదిగ ఉంటుందట. విశ్వనాథ ఇక్కడ ఒక విసురు

విసిరారు. తల్లులను కోల్పోయి దాదుల చేతులలో అతి గారాబంగా పెరిగిన పిల్లలు ఇలాగే ఉంటారని వారు సూచించారు. ఈ పెంపకం ఒక్కొక్కనాడి సంసార విచ్ఛిత్తికి, అనురాగ బంధ విచ్ఛిత్తికి దారి తీస్తుందని కూడా తెలిసిన విషయమే. కైక యొక్క ఈ మనస్తత్వం భవిష్యత్తులో జరుగబోయే శ్రీరామ వనవాసానికి, దశరథుని మరణానికి సూచ్యార్థ సూచన. దుష్ట శిక్షణా ప్రయత్నానికి నాంది బీజం ఇక్కడే నాటబడింది. "సరియైన పెంపకము లేని రాచ సంతాన మెంత నెగ్గడితనమో గరువమ్ము పట్టుదలయో.. చాన కఖిలమును మంథరయే నేర్పిందట. మరి ఆ ముద్దులగుమ్మ మంథరమాట వినక ఇంకెవరిమాట వింటుంది ? కైకకు సర్వోపచారాల్నీ ఎంతో నేర్పుగా ముసలిది నిర్వహించేదట. చివరకు కాహళ రావాన్ని కూడా రాచబిడ్డ చెవులకు వినిపించనిచ్చేది కాదట. ఈ మురిపెమంతా కైక ముందు ముందు తన మాటను జవదాటకుండా చేయడానికేనేమో! కైక పట్టపురాణికంటె ఎక్కువ రీవి ఒలకపోసేదట.

విశ్వనాథ అరుదైన ఛందాలను ఎన్నింటినో కల్పవృక్షంలో సమయోచితంగా వాడారు. వసంతరుతు ఆగమనాన్ని సూచిస్తూ మధుమతి వృత్తాన్ని, హంసరుతాన్ని, భ్రమరవిలసితాన్ని, శ్రీరామ చంద్రుడు జన్మించే సందర్భంలో-పంకశ్లథము అనే ఛందాన్ని ప్రయోగించారు. ఇలా ఎన్నో ఛందాలు కావ్యంలో అడుగడుగునా కానవస్తాయి.

కైకకు రాముడంటే ఎనలేని ప్రేమ. రామునకు కూడా స్వంత తల్లి కంటె పినతల్లి కైక అంటేనే వల్లమాలిన ప్రేమ. ఉపనయనవేళ కైక శ్రీరామునకు మణులు కుట్టిన పట్టుదట్టిని, పిడిన మరకతాలు పొదిగిన చురకత్తిని, వజ్రపుంజితమ్ము వాలుటమ్మును భిక్షగా పెట్టింది. ఆమె ప్రేమను చూచి రాముడు మొగము వనింతయై మురిసి పోయాడట. అతి సర్వత్ర వర్జయేత్ - అన్నట్లుగా కైకకు రామునిపై గల

ఈ వాత్సల్యం ముందు ముందు శ్రీరాముని వనవాసానికి కారణ భూతమౌతుందని ఆమెకు కూడా తెలియదు గదా! కైక పాత్రను అయోధ్యాకాండలో అద్భుతంగా మలచారు కవిసామ్రాట్టు.

శ్రీరామునికి దశరథుడు యువరాజ్య పట్టాభిషేకం చేయనున్నాడని విని కౌసల్య మిక్కిలి సంబరపడిపోతుంది రామచంద్రుడు తల్లి ఆశీర్వాదం కోసం వచ్చినప్పుడు - అభినవ జలధర శ్యాము డెదుర నిలిచినట్లు సాక్షాత్కరించాడట కౌసల్యకు. ఆమె ఈ సమయం కోసమే ఇరువది నాలుగేండ్లుగా ఎదురు చూస్తున్నానని కొడుకుతో అంటుంది. ఇక్కడ కుమారుని అభివృద్ధికి ఆతురతతో ఎదురు చూచే మాతృ హృదయం హృదయాంగమమైన రీతిలో చిత్రించబడింది. మరి కైక కూడా కౌసల్య కంటె ఎక్కువగా సంతోషిస్తుంది. కానీ ఇక్కడే ఒక అపశ్రుతి పలికింది రామునకు ఎందుకో రాజ్యకాంక్ష లేదు. కైకను చూడడానికి వెళ్లి రాముడు తల్లితో నేను రాజ్యం చేయడం వేల్పుల కిష్టంలేదమ్మా అని తీక్షణంగా ఆమెవైపు చూస్తాడు. అప్పుడు కైక అతనితో ఏమి అనకుండానే సౌధం లోపలికి వెళ్లిపోతుంది. కానీ ఆవార్త ఆమెకు ఎంతో సౌఖ్యప్రదమౌతుంది

ఇక ఇక్కడ నుండే కథ ఆరంభమౌతుంది. ఈ లోగా మంథర రాముని యౌవరాజ్య పట్టాభిషేక సంబరాలను చూచింది. ఆమె కావార్త భుజగ విషమెక్కినట్లు ఎక్కిందట ఆ ముసలిది ఆనంద డోలికల్లో తేలిపోతున్న కైక వద్దకు వచ్చి ఆమెను ఎన్ని విధాల రెచ్చగొట్టాలో అన్ని విధాల రెచ్చగొడుతుంది చివరకు ఆమె ఒక మహారాణి అనికూడ చూడదు - దౌర్భాగ్యమాకారమైనదాన! నీకు నిద్దుర ఎట్లు పట్టునే దరిద్రురాల అని తన అధికారాన్నంతటినీ ఆమెపై ప్రదర్శిస్తుంది. రాముడు రాజైతే కైకకు, భరతునికి, తనకు తిండి కూడా ఉంచడు, అంటుంది. భరతుణ్ణి వివాహం కాగానే తాతల ఇంటికి పంపడం దశరథుని కుట్ర అని లేనిపోని నిందలను వేస్తుంది అయినా

కైక ఇసుమంత కూడా చలించదు. పైగా "రామునకేమిలోపమే, బాలుని శుభం కోరుకోవే" అని మంధరను మందలిస్తుంది. ఆమె మంధరతో ఇలా అంటుంది. రాముడు అభిషేకాన్ని నిరాకరించినట్లుగా చెడ్డకల వచ్చింది - అలా జరగ కూడదని ప్రార్థించవే - అంటుంది. ఇక్కడ ఆమెకు గల మాతృ హృదయం, రామునిపై ఆమెకు గల నిష్కళంక వాత్సల్యం వ్యక్తమౌతాయి. ఇంకా ఇలా అంటుంది. భరతుడు రాజై ఒరిగించేదేమిటి? రాముడు ఒరిగించనిదేమిటి? రాముడు సర్వసామ్యుడు, సర్వోత్తముడు రాముని జూచినం చాలుగదే! అంటుంది. ఎంతటి అనిర్వచనీయ ప్రేమ. రాముడు ఒక యోగి. రాక్షసుల ప్రతాపము పాలిట మార్తాండుడు. అందుకే ఆయన మానవ శరీరము ధరించాడని మందలిస్తుంది మంధరను. ఈ ఘట్టములో కైక వంటి స్త్రీలు సామాన్య స్త్రీల ప్రలోభాలకు లొంగిపోరని, వారు దృఢ చిత్తులై ఉంటారని వర్ణించారు కవి. కాని ఒక్కొక్కసారి చెడు ముందు మంచి ఓడిపోక తప్పదని కూడా ఋజువుచేయడానికో ఏమో చివరకు కైకేయి మంధర దుర్బోధలకు లొంగిపోతుంది. దశరథుడు తనకిచ్చిన వరాల విషయాన్ని మంధర కైకకు గుర్తుచేసి ఆమెను లొంగదీసుకుంటుంది.

విశ్వనాథ ఇక్కడ కథకు ఆయువుపట్టయిన ఒక మహత్తర సత్యాన్ని చిత్రీకరించారు కైక మంధర మాటలకు లొంగినట్లుగా కనిపిస్తుంది. కానీ అంతరాంతరాలలో ఆమె ఎవరికీ లొంగలేదు. పట్టాభిషేక విషయాలలో రాముడు తనతో చెప్పిన వైరాగ్యపు మాటలను జ్ఞప్తికి తెచ్చుకుని మంధర మాటలను ఒక సాకుగా పెట్టుకొంటుంది తద్వారా దుష్టశిక్షణకు శిష్టరక్షణకు కైక రాముని ప్రోత్సహించినది. ఆమె అంత పట్టుదల పట్టకపోతే రాముడడవికి వెళ్లడం సీతాపహరణం, దుష్ట రావణసంహారం జరిగేవి కావు గదా! తన వాక్చాతుర్యంతో మంధర తనను లొంగదీసుకున్నప్పుడు ఆమె మంధరతో - పొట్టిదానికి పుట్టెడు బుద్ధులని నీవల్ల ఋజువైంది.

నీమతి వైభవంబు, నీపట్టినపట్టు, నీ నీతి విభవంబును లోక రాహస్యవేత్త సామ్రాట్టు తనంబు చెల్లును సుమా . అని మంథర తెలివి తేటలను ప్రశంసిస్తుంది ఈ ప్రశంస మంథరకు ప్రశంసగానే ఉంటుంది. కాని కైక మాత్రం రామావతార ప్రయోజనాన్ని మనస్సులో దర్శించుకుంటుంది. ఆమె తన నిర్ణయంపట్ల సంతృప్తురాలౌతుంది.

తన వనవాస వార్తను తెలిసికొనిన రాముడు కైక ఆశీర్వాదాన్ని పొందడానికి ఆమెవద్దకు వస్తాడు. కైక రాముని తీవ్రంగా చూచింది. కైక చూపు వల్ల రామునికి ఆమె అంతరంగం అర్థమైంది. అడవికి వెళ్లి తీరాలి అన్నది రాముని నిర్ణయంకాగా 'అయితే వెళ్లిరా నాయనా!' అని చూపుల్తోనే ఆశీర్వదిస్తుంది కైక. ఈ విషయం లోకానికి, చివరకు దశరథునికి కూడా తెలియదు. ఆ తల్లీ కొడుకుల కిద్దరికి మాత్రమే తెలిసింది. ఈ విధంగా మంథర ఒకసాకుగా రామ వనవాసాన్ని తనమీదనే పెట్టుకుని కైక లోకానికి ఎంతో మేలు చేసింది. కైక లోకానికి ఎంతో మేలుచేసింది. కైక చూపులో ఒక వైపు లాలన, ఒకవైపు గర్వరేఖ, ఆశీర్వాదం ఉన్నది. ఇన్ని భావాల్ని కైక ఒకేసారి ప్రదర్శింప గలిగింది. అది ఆమెకు మాత్రమే సాధ్యం. విశ్వనాథ కల్పనా సామర్థ్యానికి ఒక చక్కని నిదర్శనం. వాల్మీకి కూడా ఈ ఘట్టాన్ని ఇంత రసరమ్యంగా తీర్చి దిద్దలేదేమో!

విశ్వనాథ చేతిలో రూపుదిద్దుకున్న మరొక స్త్రీపాత్ర అహల్య. తన యాగ రక్షణకు విశ్వామిత్రుడు రామలక్ష్మణులను తనతో తీసుకుని వెళ్తున్నప్పుడు దారిలో తాటక వృత్తాంతాన్ని వివరిస్తాడు. వారితో దుష్టురాలైన తాటకను చంపమని విశ్వామిత్రుడు రాముని ప్రోత్సహిస్తాడు రాముడు ఆమెను చూచి "లచ్చి! నీవా యనురం జూబతే" పిరికి వాడైతే దీన్ని చూడగానే ప్రాణాలు వదుల్తాడని తమ్ముడితో నవ్వుతూ అంటాడు. విశ్వనాథ తాటక రూపాన్ని, ఆమె చేతలను కండ్లకు కట్టినట్లుగా వర్ణించారు. వీరి పాత్ర చిత్రణలో

అడుగడుగునా సజీవ పాత్ర చిత్రణ, రూప సాక్షాత్కార సామర్థ్యమూ గోచరమౌతుంటాయి. చివరకు రాముడు తాటకను లోకరక్షణార్థం సంహరిస్తాడు.

విశ్వామిత్రుని యాగ సంరక్షణానంతరం రామలక్ష్మణులు మునితో మిథిలకు ప్రయాణమౌతారు. దారిలో విశాల నగర సమీపంలోనున్న రమ్యమును, నిర్జనమును నైన ఒక ఆశ్రమాన్ని చూచి రాముడు "మునివర్జితమైన ఈ ఆశ్రమ మెవరిదని" విశ్వామిత్రుని ప్రశ్నిస్తాడు. విశ్వామిత్రుడు రామునికి అహల్యా వృత్తాంతాన్ని విశదీకరించి చెప్తాడు.

విశ్వనాథ జనప్రచారంలో వున్న అవాల్మీకమైన ఇతివృత్తాన్నే స్వీకరించారు. అంశాన్ని ఆయన ఎంతో మనోహరంగా కథలో పొందుపరచారు. దేవేంద్రుని కూడిన అహల్యను గౌతముడు - ఇహ వర్ష సహస్రాణి బహూనిత్వం నివత్స్యసి - వాయుభక్షా నిరాహారా తపంతీ భస్మ శాయినీ, అదృశ్యా సర్వ భూతానా మాశ్రమేస్మిన్'' అంటూ దశరథాత్మజుడైన రాముడు వచ్చేవరకూ అలాగే ఉండమని శపిస్తాడు. వాల్మీకి కథనం ఇది కానీ గౌతముని శాపం వల్ల అహల్య శిలా రూపాన్ని పొందినట్లూ, రామపాద రజః స్పర్శచే పూర్వ రూపాన్ని పొందినట్లూ జనశ్రుతి - ఈ అంశాన్నే విశ్వనాథ కల్ప వృక్షంలో స్వీకరించారు గౌతముడు అహల్యను శపించినప్పుడు ఇంద్రుడు తనను వేయేళ్లుగా కాంక్షిస్తున్నట్లూ, ఇన్నాళ్లూ ఆ కోరికను బిగపట్టితిననియు, మోహం తన్ను చివరకు జయించిందనీ, ఆ మోహం తీర్చి నీ సతిగా నన్నేలుకొనుము కానీ జాతి నెడ్డెదును స్వామీ! అని అహల్య భర్తతో అంటుంది. గౌతముడు అహల్యతో "నీ మోహం ఎప్పుడు విచ్చునో అప్పుడే రామచంద్రుడు వచ్చి నీకు సజీవత్వాన్ని ప్రసాదిస్తాడని శాప విమోచనం చెప్తాడు. రామ పాద స్పర్శ తగిలిన బండబారాయి పంచేంద్రియ స్థాయిని పొంది సశరీర కాంత యైన

విధాన్ని విశ్వనాథ వర్ణించిన తీరు అనన్య సదృశం. అనితర సాధ్యం. ప్రభు మేనిపై గాలి పయి వచ్చినంతనే పాషాణానికి స్పర్శ వచ్చింది. ప్రభు కాలి సవ్వడి ప్రాంతమైనంతనే శిలకు చెవులు కలిగాయి. ఇలాగే క్రమంగా నాసిక, కనులు వచ్చాయి. ఆమె సశరీరురాలైన అహల్యగా మారి రాముని పాదాలకు కృతజ్ఞతతో నమస్కరించింది. మధ్యాహ్నిక క్రియా చరణం తర్వాత అందఱు భోజనాలకు కూర్చొని యుండగా అహల్య ఒక చేత్తో పరమాన్నాన్ని, మరొక చెత్తో గంగా జలంతో నిండిన కమండలువును తీసుకుని అన్నపూర్ణాదేవి వలె ప్రత్యక్షమై రామునికి నీరాజన మిచ్చింది. ఇప్పట్టున కవిగారి భావ ప్రకటన మిక్కిలి ప్రశంసా పాత్రం. రామచంద్రుడు ఆతిథ్యాన్ని స్వీకరించ గానే ఉపల హృదయవీధి ఉపనిషద్విశాన మొలిక శ్రీరామ భద్రాభి రామమూర్తి యగుచు తోచెనట. ఈ ఘట్టాన్ని వాల్మీకి పొడి పొడి మాటలలో చెప్పి ఊరుకున్నాడు. అహల్య పాత్రను, ఆమె భక్తిని విశ్వనాథ అపురూపంగా చిత్రించారు.

మిథిలలో అహల్య కుమారుడైన శతానందుడు రాముని ద్వారా తన తల్లికి శాపవిమోచన మైనదని, ఆమె సశరీర అయిందని తెలుసుకొని చాలా ఆనందిస్తాడు, ఆయన జనకుని పురోహితుడు. కులగురువు. "అర్ఘ్య మొసంగెనా జనని ఆకృతి పొందీ" .... అనిన శతానందుని ప్రశ్నకు రాముడు "నా నొసట నిద్దతే యుంచినారు విజయ తిలకము. పనికి బయల్దేరు వేళ అమ్మ కౌసల్య, గౌతమాశ్రమ మున అమ్మకన్న ప్రేమతో అహల్యయును నాకు"...అని అహల్యను గూర్చి మాతృభావంతో ఎంతో పవిత్రంగా స్మరించు కుంటాడు. రాముని ఈ మాతృభావంతో అహల్య పాపాలన్నీ ఒక్కసారిగా క్షాళనమయ్యాయి గదా ! అహల్య కూడ తనకు శాపవిమోచనం కావించిన శ్రీరాముని దేహమును అఖిల దేవతలను సకల మార్గము లుగా పరిరక్షణ చేయుటకై రామునికి తిలకం పెట్టిందట. ఆమె

కృతజ్ఞతా భావమెంత పవిత్రమైనది, భద్రమైనది. ఇది విశ్వనాథ వారి మనోహర కల్పనా సామర్థ్యానికి ప్రతిభా పాటవాలకూ మచ్చుతునక. అహల్య శ్రీరామ ప్రశంసార్హురాలు కావడం ముదావహమైన విషయం.

కళ్యాణ ఖండంలో సీతా వివాహ వృత్తాంతాన్ని మూలానుసారిగానే విశ్వనాథ వర్ణించినా అక్కడక్కడ కొన్ని మార్పులను చేసి కావ్య శిల్పానికే మెరుగులు పెట్టారు. శివధనుర్భంగ వేళలో — జనకస్థానంలో రాముడు ధనస్సుపై దృష్టి నిల్పి మందహాస వదనుడై గుర్వాజ్ఞకై ఎదురు చూస్తుంటాడు. గుర్వాజ్ఞ అయింది అప్పుడే పై అంతస్థులో అంతఃపుర స్త్రీల కదలికను గుర్తుపట్టి తల ఎత్తాడు. అప్పుడే 'ఇదమిత్థమని నిర్ణయింప గారాని దేకోర్కియో రూపుగైకొన్నయట్లు, జన్మ జన్మాంత సంగతమ్మయిన యాశా బలం అవధికి సాగినట్లు, తన సృష్టిలోని యుత్తమ భావ మానందముగ పొంగి బింబమై పొడిచినట్లు... అరుంధతి, అహల్య కౌసల్యల ముఖముల కంటె పవిత్రమగుచు, శృంగార భావ మొడిసి పట్టిన ముఖచంద్రుని చూచాడట. మహత్తరమైన, పవిత్రమైన, ఈ శృంగారభావం ఎంతటి సుశిక్షితులకు అబ్బుతుంది. శ్రీరాముని చిత్తము జానకిపైన, చేయి ధనుర్లసక్తము పైన ఏకకాలంలో ప్రసరించింది. సీత వీర్య శుల్క. జనకుడు సర్వాభరణ భూషితయగు సీతను అగ్ని సమక్షమున రాముని కభిముఖముగా నిల్పి -

"ఇయం సీతా మమసుతా, సహధర్మచరీ తవ
ప్రతీచ్ఛ చైనాం భద్రంతే పాణిం గృహీష్వ పాణినా"

అని పలికి మంత్రపూరితమైన జలమును రాముని హస్తమున విడిచాడు. విశ్వనాథ వారు సీతా వివాహ ఘట్టమును వాల్మీకి వలెనే వివరించారు. కానీ అహల్య రామునికి తిలకము దిద్దుట, వివాహ ఘట్టమున సీత చెలులతో మేడపై నుండి చూచుచుండుట, ధనస్సు నెక్కుపెట్టు

సమయంలో రాముడు సీతవంక చూడగా ఆమె సిగ్గుతో తొలగి పోవుట విశ్వనాథ చేసిన మనోహరమైన కల్పనలు.

ఇక విశ్వనాథ వారి చేతిలో రూపు దిద్దుకొన్న మరొక స్త్రీ పాత్ర శబరి. వారు శబరిని మాధుర్య భక్తితో కూడిన మహాభక్తురాలుగా చిత్రించారు. శబరి ఆశ్రమాన్ని సమీపిస్తున్న రామునకు విరహ బాధ అతిశయించింది. రాముడు శబరి కన్నులలో తన ప్రతిబింబమును చూచి విరహ బాధనంతటిని మరచాడు. శబరి తాను తెచ్చిన పండ్లను రామున కిచ్చి ఆరగింపుమని ప్రార్థిస్తుంది. రాముడు నీవు తిని రుచి చూచి చెప్పనిదే నేనెట్లా తింటా నంటాడు. అపుడు ఆమె పండ్లను తిని రుచి చూచి తర్వాత రామునికి పెడ్తుంది. శబరి రాముని ప్రాణనాథా అని సంబోధిస్తుంది. విశ్వనాథ శబరీ శ్రీరామ సమాగమాన్ని భక్తిమయంగా వర్ణించారు. శబరీ శ్రీరాములకు మధుర భక్తిని కూర్చడాన్ని కొందఱు విమర్శించారు. కానీ మధుర భక్తికి ఈడుతో పనిలేదు. రాముడు "శబరీ! నీవు నన్ను ప్రాణేశా అంటున్నావు నాయీడేమిటి నీయీడేమిటి" అని ప్రశ్నిస్తాడు. నీకు నా యెడల ఆభావం కలగడం నాభాగ్యం. కానీ కష్టం కూడ ఒక్కొక్క తఱి కష్టంగానే ఉండదు. నీ ప్రేమలో నా సీతా విరహాన్ని మఱువగలుగుతున్నా" నంటాడు మాతంగముని స్వర్గానికి వెళ్తూ రామలక్ష్మణులు దర్శన భాగ్యం కొఱకే శబరిని ఆశ్రమంలో వేచి యుండమంటాడు. ఈ మధురభక్తి మోక్షరతితో కూడినదే కాని కలుషితమైన మోహంతో కూడినది కాదు. విశ్వనాథ ఈ భక్తిని అత్యంత హృద్యంగా వర్ణించారు. వాల్మీకి రచనలో ఈ భక్తిభావం అతి నిగూఢంగా ఉన్నది. శబరీ రాముల సంభాషణను విశ్వనాథ అనన్య సామాన్య రీతిలో వర్ణించారు.

విశ్వనాథ వారి స్త్రీ పాత్ర చిత్రణం ఒక విశిష్ట శిల్పకళా నిర్మాణం. అది సామాన్యుని ఊహ కందని ఒక మహా సుందర సౌధరాజం.

వాల్మీకి రామాయణం కరుణరస ప్లావితం కాగా విశ్వనాథ కల్పవృక్షం శాంత రస తరంగితమైంది అంగరసాలైన శృంగారాది రసాలు కూడా ఆయా ఘట్టాలలో సముచిత స్థానాన్ని పొంది కావ్యాన్ని రసరమ్యం చేశాయి. ఋశ్యశృంగ వర్ణనలో సున్నితమైన హాస్యం, తాటక వర్ణనలో భయానకం, అహల్యా శాపవిమోచనంలో అద్భుతం, సీతా వివాహ ఘట్టంలో ఉదాత్త శృంగారం, దశరథుడు, రాణులు బిడ్డలపై ప్రేమ ప్రదర్శించిన సందర్భంలో వత్సల రసం, రామ వనవాస ఘట్టంలో కరుణ రసం, కైక రాముని వనవాసానికి పంపే ఘట్టంలో క్రోధం - ఇలా ఇవన్నీ శాంతానికి అంగభూతాలుగా ప్రదర్శింపబడ్డాయి. రస నిర్వహణలో కూడా విశ్వనాథ తాను చేయి తిరిగిన వారే నని నిరూపించుకున్నారు.

విశాలావనీ చరితం సీతా రామ చరితం
సాహితీ రస భావభావితం, రామాయణ కల్పవృక్షం.

# విశ్వనాథ దర్శించిన సీత

ఆచార్య కోలవెన్ను మలయవాసిని

"సీతాయాశ్చరితమ్ మహత్" అంటూ సీతచరిత్రను రామాయణంగా రూపొందించినాడు వాల్మీకి సర్వభారతీయ సంస్కృతీ సంపన్నమయిన దివ్య స్రోతస్విని సీతామహాదేవి. ఆధునిక కవులలో తనదైన యనుభూతి తనదిగా భావించుకొని కవితారూప తపస్సు చేసి సద్యోనిర్గతమైన సర్వకవితా సంభారములు శ్రీరామచంద్రునికి నైవేద్యంగా రామాయణ కల్పవృక్షాన్ని రచించారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

విశ్వనాథవారి రామాయణంలో మొదటగా సీతాదర్శనం శ్రీరామచంద్రునితో పాటుగా శివధనుర్భంగవేళలో పాఠకులకు కూడా కలిగింది బాహిరమైన అంగాంగ సౌందర్యం కాకుండా అంతరమైన భావనామూర్తిగా సీత రామునికి తోచింది

శివధనస్సును ఎత్తబోయే తరుణంలో తలఎత్తిన శ్రీరామునకు -

"ఇదమిత్థమని నిర్ణయింపగా రానిదే
కోర్కెయో రూపుగైకొన్న యట్లు
జన్మజన్మాంతర సంగతమ్మైన యా
శాబలం బవధికి సాగినట్లు
ప్రాణముల్ బయటికివచ్చి ముగ్ధాకార
మొనయించి దర్శనమిచ్చినట్లు
తన సృష్టిలోని యుత్తమభావమానంద
ముగ బొంగి బింబమై పొడిచినట్లు
లల యరుంధతియును సహల్యమును గోప
లాత్మజాతయు ముప్వురి యాననముల
కన్ను పవిత్రమగుచు శృంగార భావ
మొడిసి పట్టిన ముఖచంద్రు డొకడు తోచె"

తనసృష్టిలోని ఉత్తమభావం ఆనందముగ పొంగిబింబమై పొడిచినట్లుగా కనిపించడంతోపాటు శ్రీరాముడు ఆనాటికి దర్శించిన ముప్వురుస్త్రీలు- అరుంధతి, అహల్య, కౌసల్యల ఆననములు కన్న, పవిత్రమవడమే కాకుండా, శృంగారభావం ఒడిసి పట్టిన ముఖచంద్రుడొకడు రామచంద్రునికి కనిపించాడు అని విశ్వనాథవారి వర్ణన ఈ పద్యంలో ప్రతీపాదంలోని భావన అనుభవైకవేద్యమైనట్టిది శివధనుస్సు తాళప్రమాణమైయున్నది అది జానకి దృష్టికి అడ్డమ్ముగా వచ్చునేమో యని ఎంచి రాముడు త్రాడు వీలలాగినాడు లాగగానే –

అతని దృష్టికి జానకి యాగలేదు
అతని కృషికి శివధనుస్సాగ లేదు
సీత పూజెడ వెన్నుగా శిరమువంచె

శారో పేతుడైన రాముని దృష్టి తనను చేరగానే సీత పూజెడవెన్నుగా శిరసు వంచినదట

సీత శ్రీరామునికి భార్య కాబోతున్నదన్న విషయం తెలియగానే శతానందుడు సీతను లాలిస్తూ –

'ఈయమ్మయయెు సిరులెత్తినట్టి పతాక
ఇక్ష్వాకువంశ కీర్తిందిరకును " అంటూ మురిసిపోతాడు శతానందుని పలుకులు ప్రతిపది సార్ధకమయినట్టివి

సీతారాముల ఐక్యతను వివరించడమే విశ్వనాథవారి ప్రధానమయిన దృష్టి ప్రకృతి పురుషులయిన ఆ దంపతులు ఒకరిలో ఒకరుగా, ఏకమూర్తులుగా, అవినాభావ సంబంధ బంధురులై ప్రకాశించునట్లుగా భావించిన విశ్వనాథ భావన అడుగడుగునా వారి రచనలో ప్రస్ఫుటమవుతూనే ఉంటుంది

వివాహమైన కొత్తరికలో రాముని గురించి చెప్తూ రాముని మేనిలోని ప్రతిరక్తపు బిందువు జానకి మనోజ్ఞామృత భావనా సుమ ధురాంచి కోమల పారిజాతమాలా మధువాసనాభర విలాసముగా నయిన్దేంద్రియంబులన్ ప్రామినదౌ నవా వ్యమధురం బనుభూతి యొకండు పొల్చుగన్ —

పారిజాతపుష్పంకంటె అత్యంత సౌకుమార్యము, సువాసనాపరి తము అయిన జానకీస్పర్శన రాముని ప్రతిరక్తబిందువుకు, పంచేంద్రియాలకు మధురాతి మధురమయిన ఇనుమడించిన చెప్పలేని అనుభూతిని కలిగించినదట. అంతటి అత్యంత పవిత్ర ప్రేమభావనా సంకేతము డయినస్వామి సీతను వైదేహీ, మైథిలీ, జానకీ అటుంచమనరాదా అను పిలుపు అమ్మవారికి 'ప్రాణములన్నింటి యందు హత్తుకొన్నది'

" సీత శ్రీరామచంద్రుని చిత్తపదము
రామచంద్రుడు జానకీ ప్రాణపదము
రాము సర్వభువనాభరణి రమణి సీత
ధరణి జా జీవితా తప శరణి స్వామి "

అని సీతారాముల దాంపత్యమాధుర్యకతను వర్ణించారు విశ్వనాథ.

లౌకికమయిన శారీరక సౌందర్యంతోపాటు అధ్యాత్మిక సుసం స్సంపదతోకూడిన సౌందర్యం సీతది ఈ భావనను వారి రామాయ ణంలో అకంపనుడు, హనుమంతుడు పాత్రల ద్వారా వ్యక్తం చేయ బడింది

సకల సృష్టిలోని సర్వసౌందర్యంబు
మూటకట్టినట్లు ముగుదరాగు

అంటూ అకంపనుడు సీతాసౌందర్యం నిగూఢ శృంగార్థముల వల్ల జయించిందో చెప్పే సందర్భం విశ్వనాథవారి అద్భుతసృష్టి ...

'నిగమమహార్థముల్ జగము నిండెను దన్నిగమాంత వైఖరుల్
నిగమచయంబుకన్న హవణించెను దన్నిగమాంత చూడమై
తగిలెను బ్రహ్మనాబడు పదార్థము బ్రహ్మము మౌళిసీత క్రొం
జిగురుపదంబు గోటి రుచిచే రుచి మంతమదెంత చిత్రమో'

అశోకవనిలో సీతను వెదుకుతున్న హనుమన్నకు సీతాముఖాంభోజాన్ని దర్శించగానే మెదలిన భావన –

ఈ యమముఖాబ్జముననే
వోయాధ్యాత్మిక మహస్సులు దితజ్యోత్స్నా
ప్రాయముగ నులికి వచ్చెడు
నీయమ జానకియె సంశయేతరఫణితిన్

అధ్యాత్మికనేపథ్యంతో సీతాదేవిని చూపించడానికి ప్రయత్నించారు విశ్వనాథ. కృశీభూతయై యున్న సీత, ఢిశితదృష్టి లేకనువదింపగ బడ్డ మహాగ మోక్తినాన్ ఉన్నదట. అసలు మైథిలుల కన్నులలో వేదాంతార్థములుండునంటూ – రాముడు సౌమిత్రితో పలికినట్లు విశ్వనాథవారి అభివర్ణన

'అన్నా మైథిలు లాడబిడ్డలకు వేదాంతార్థ సంభార భా
వోన్నత్యంబు జనించి రక్తమున నేత్రాబ్జంబు లల్లండు నా
యెన్నండైన, దదూర్మికా నయనసాహిత్యంబులో లోతులం
గన్నావా। యొకయుర్వి జాతకనులేక, ధి ప్రభావంబులా।

ఆధ్యాత్మిక సాహిత్య ప్రపంచమున కాటుపట్టయిన విదేహ రాజగృహంలో పెరిగిన మిథిలా నరేశ్వరుల ఆడబిడ్డలకన్నులలో – వేదాంతార్థ సంభారాలుంటాయనే కల్పన విశ్వనాథవారిదే ప్రియురాలి

నయన సాహిత్యంబులో లోతులంకను గలిగిన సమర్థుడా రామచం
ద్రుడొకడే

సీతారాములు భిన్నంగా కనిపించినా వారిద్దరు ఒకటే ఒకరు అర్థంకావాలంటే మరొకరు కూడా అర్థంకావలసిఉంది వారు అద్వైత మూర్తులు అన్న విషయాన్ని ప్రతిపాదించడానికి అంజనేయుని ముఖత కవి అనిపించిన పలుకులే పరమ నిదర్శనాలు అశోకవనంలో సీతను చూడగా చూడగా హనుమకు కలిగిన భావన

"చేతమునందు బూర్వమున శ్రీరఘుం రామునెఱింగి నట్లుగా
నేతల పోసినాడనిపుడీయమ గాంచినయంత సర్వమ
జ్ఞాతముగ నుండె నను సంగతి నాకాఱుగంగ నయ్యెడున్
సీత నెఱుంగకుండ రఘుశేఖరుదర్థముెడు పూర్తిగా"

సీతను తెలుసుకోకపోతే రాముణ్ణి పూర్తిగా తెలుసుకున్నట్లుకాదని పరమవిజ్ఞాని ఆంజనేయుని మాటగా అనిపించి ఆ భావనకొక ఔన్నత్యాన్ని కల్పించారు విశ్వనాథ

అశోకశాఖాగ్రంలో కూర్చుని హనుమ మానసముద్యగ్రముగ సమాధానపరచి జలకరాట్సుతాభావ నిశ్చలము రామచంద్రదహృదయింబువోలె నచ్చటను నిలిచె - అలా సావధానుడైయున్న సమయంలో రావణుడు సీతను దర్శించిడానికి వచ్చాడు ఆ పరిస్థితిలో సీత ఏ విధంగా హనుమకు దర్శనమిచ్చినదో వర్ణించే పట్టున విశ్వనాథవారి ఉపమలు వారి ఉపజ్ఞకు దీపికలు

సోమకాసురుడు దొంగిలించబడగా కళవళం పడు త్రయీ కాంత వలెనూ హిరణ్యాక్షుని దౌష్ట్యానికి పాలిపోయి క్రిందుమీదైన భూసుందరివలెను తానే సర్వేశ్వరుడనను అహంకారియైవర్తించు హిరణ్యకశిపుని సభలో సర్వ పత్రిశయుభీతిని చూచు శిష్యోక్తివలెను

బలిచక్రవర్తి చేతిలో తనస్థితిని కోల్పోయి కృశీభూతయైన స్వర్గలక్ష్మివలెను, కార్తవీర్యుని పరాక్రమమునకు అంభయని అరచి దిగులుపడిపోవు అతిథ్యదేవత వలె కనిపించినది సీత

కళవళపడే త్రియీ కాంత
క్రియమీదగు దారుణి సుందరి
ప్రళయభీతిని చెందిన విష్ణుభక్తి
దిగులుపడిపోవు ఆతిధ్యదేవతల -

సమాహారరూపంగా సీతాసాధ్విస్థితిని అమలోదాత్తములయిన ఉపమలతో సాక్షాత్కరింపజేసిన ప్రతిభ విశ్వనాథ వారిధి

సీతలో రాముణ్ణి, రామునిలో సీతను దర్శించిన ప్రతిభాశాలి హనుమన్న కిష్కింధలో రామునితో పరిచయం కలిగింది హనుమకు రాముని విరహ తీవ్రతని, రాముని ప్రతిజ్ఞని ప్రత్యక్షంగా దర్శించి ఉన్నాడు బాహిరంగా కనిపించే కోదండాన్ని, రాముని దివ్యమంగళ రూపాన్ని కనులనిండా కాంచిఉన్నాడు సీతామాతలో రామమూర్తిని ప్రతిష్ఠించుకో గలిగాడు సీతను రామమయంగా భావించాడు

అకృతి రామచంద్ర విరహాకృతి, కన్నొమతీరుస్వామి చూ
పాకృతి కన్నులన్ ప్రభుకృపాకృతి కైశికమందుఠామదే
హాకృతి సర్వదేహమున యందునరాఘవ వంశమౌళిధ
ర్మాకృతి కూరుచున్న విధమంతయు స్వామి ప్రతిజ్ఞమూర్తియై

రాఘవవంశమౌళి ధర్మాకృతిసీత దాంపత్య ధర్మానికి రాజధర్మానికి కూడ రామునకామె సర్వదా సర్వథాసహకరించినది రాముని ధర్మమే సీత

సీతతో సంభాషణ నెరపిన సందర్భంలో హనమ మీరిరువురు ఒకరిలో ఒకరున్నారు అనే విషయాన్ని

పరగమీరు మీరు భద్రమ్మునా నుంటి
రొకరి యాత్మలందు నొక్క రొకరు
వట్టిపిచ్చి జగము పట్టిపాలార్చకు
డంబ ! కొంటిమీ పదాంబుజములు _ అంటాడు

ఈ పిచ్చి జగము మీరు వేరువేరుగా ఉన్నారనుకుంటుంది మీరు ఒకరిలో ఒకరు భద్రమూర్తులై ఉన్నారు కదా ఈ లోకాన్ని బాధించకండి. నీవు అంబవు జగన్మాతవు అంటూ చిన్న హెచ్చరికచేస్తాడు.

సీతారాములు ఈ అవినాస్థితిని గురించి సీతారాములు చేతనే చెప్పించిన నేర్పు విశ్వనాథది

రావణునితో సీత _

"పతియుజలంబు నేను సుబగ్నివాహము రాఘవుడాకసంబునే
నత మృదంగీతి నిద్రుడగు నాయన నేను హవిస్సువేదసం
తతియతడే సర్వంబు వసుధీపతి తారసమూర్తి స్థాయినే
నతనికి నాకువైన యవినాస్థిత దుస్థితి పొందదెప్పుడున్"

సృష్టిలోని పంచభూతములు స్థితిగతులు తప్పినా రాముడుపతి నేను భార్యను, అనే విషయాన్ని అసురకాంతులకు వివరిస్తుంది సీత తన అవినాస్థితి స్థిరమని ఆమె ప్రగాఢ విశ్వాసం అట్టి ధైర్యభావో చేత విశ్వనాధ సీత

జలధు లేదు నింకి నజలజబంధు
డొక్కమసిబొగ్గుగా వైన నుర్వియొల
చిల్ల పెంకులుగానగు స్థితియునైన
నతడు పతినేను భార్యనే యసురలార

వాయువు స్పర్శగుణమును బాసియున్న
నగ్నియందున, దేజమ్ము నమరకున్న
జలము నందున శైత్యమ్ము నమసియున్న
నతడు పనిసేసు ధార్యనే యసుర లార

ఇంతగా వివరించినా ఆసురులు సీతాతత్త్వం బోధపడక ఆమెను చంప బోయారు తనను చంపబోయిన రాక్షసస్త్రీలతో సీత — చంపండి 'నాయీ శరీరము నశించినను నేను రఘూద్వహుని యందనపాయినిని' అంటుంది సీత రామునకు అనపాయిని అనే విషయం కిష్కింధలో లక్ష్మణునిచేత రామునకే చెప్పించారు

చందురునకు వెన్నలంబోలె జనక దుహిత
నీకు ననపాయిని మహానీమహేశ "

భాగవతంలో రుక్మిణిని గురించి చెప్పే సందర్భంలో "అనపాయిని" అనే విశేషణాన్ని పోతన పదేపదే చెప్పినట్లే విశ్వనాథవారు కూడా ఈ విషయాన్ని చెప్పారు

అరణ్యకాండలో అకంపనుడు — 'అతడు ప్రాణి ఆమె ప్రాణంబు' అనడం రాముడు —

"ఇది నాకెప్పుడు తెలియును
మదవతి నాప్రాణ చయము మద్దేహమున్
యెద మేధబుద్ధి సర్వము "

అనడం వీరి అవినాభావస్థితికి ఐక్యతకు ఉదాహరణములే సీతాపతిపై రామునకగల ప్రేముడి ఎట్టిదో సీతకే తెలుసు అందుకో — ఆమె రాముడు నేనన్నచో ఒక దనుజ సంహారమే చేయును నేన నేనిచో అతండు త్రిజగత్సంవరంబు చేయును అంటుంది ఇంతగా చెప్పినా రాముని తత్త్వమామెకు అంద అందయున్నదట

వింటి దవ్వను కొన వేయి వింట్లదువ్వు
వెదకి కొనివచ్చెనన దానెవెదుక నగుట
ప్రభుని రాముని యాత్మతత్త్వంబు నెదకు
నందియందక జానకి యటుమ బించి

అయితే సీత తన తత్త్వాన్ని గురించి మాత్రం రాక్షసాంగానలతో వివరంగా చెప్పదు. తానెవరో ఏమిచేస్తున్నదో చెప్పింది

"నేను తల్లి సావిత్రినై యమునకు ధర్మసూక్ష్మంబు పదేశించితిని . . . .నేనిపుడు 'సీతనై యనుస్యూతముగా వచ్చు పాతివ్రత్యంబునకు పరమ ప్రామాణ్యంబు కల్పించు చుంటి" అంటుంది

అనసూయాదేవి నీ ప్రాతివ్రత్యము కొనియాడ దగినది అని అన్నప్పుడు సీత ఆ మెచ్చుకోలు తనకు తగదని — దానికి తగినది రాముడేననీ సమాధానం చెప్తుంది

'నా! రాఘుస్వామి శౌర్యమేమందుతల్లి
యా మహాస్వామి సంపూర్ణుడతనియందు
నను బతివ్రతయగుట గుణంబుగాదు
సద్వ్రతయ కాకపోవుట సంభవంబు

ఆగౌరవమంతా ఆమహాస్వామికే దక్కాలనే మహోన్నతభావమే ఆమె ప్రాతివత్యానికి ఉదాహరణం కాదా?

తామిద్దరము ఒకటే అనే రహస్యాన్ని తానే చెప్పబూను కుంటుంది విశ్వనాథ వారి సీత అగ్నిపరీక్షకన్నీ అయత్తమై ఉన్నారు. ఆ సంధర్భంలో సీత —

'వినమలోషద్భుద చండమ్మూర్తికి నైవేద్యంబు కాబోవు నేనొక రహస్యంబు చెప్పెదనంటుంది. సీతారాములు అంటే ఏమిటో ఆరహస్యమేమిటో తానై చెప్పాలనుకుంటుంది సీత అయితే చెప్తున్నది రామునికే రామునికి కూడా తెలియని రహస్యం సీతకే తెలిసినది, లోకానికి కూడా వివరిస్తున్నదామె 'నీవు దీపము, నేవత్తి నీవు వహ్నివని భావంబు' అంటుంది దీపము, వత్తి, అగ్ని మాత్రమే కాదు అసలు ఇరువురము నొకవెలుగన.

వెలుసగమును దీనివెలుగు శివుడొక్కరుండు అంటూ_ఒకానొక దివ్యమైన వెలుగులో తామిరువురు చెలిసగమనీ ఆరహస్యం సర్వజ్ఞుడయిన శివునకు మాత్రమే తెలుసునని చెప్తుంది ఒక వెలుగన చెలిసగము అన్న భావన అత్యద్భుతమైనది వత్తిని, అగ్నిని వేరుచేసి చూడవచ్చు కాని ఒక వెలుగును రెండుచేసి చూడడం సాధ్యమా! ఏది వేరుచేయడం అసంభవమో ఆ ఉపమానం సీతారాముల ఐక్యతకు స్వీకరింపబడినది

దాంపత్యధర్మమనే ఆ వెలుగు భారతజాతిని మహత్తమయిన ముందుకు మార్గంలో నడిపించేశక్తిగా అనాదిగా గుర్తింపబడుతున్నదే ఆ వెలుగు పరాశక్తి రూపమయినట్టిది. అందుకే విశ్వనాథవారు సీతను పరాశక్తిగా అభివర్ణించారు

రావణుడు సీతను పట్టబోయిన పట్టున -

అంతస్థితి హేతుభూతయైన వైష్ణవి, పరాశక్తి పాంచజన్యముఖీ, సుదర్శనపాలిత యిట్లనుకొనియె అంటారు

రచనలో ఆయా తావులలో కవి వాడిన విశేషణాల్లో సీత పరమేశ్వరి అనే భావాన్ని వ్యక్తం చేసారు

కాముకుడైన రావణుడు సీతను 'ఉక్తిస్వాదురసావతార పరిణామోల్లాస రూపా' అంటూ సంబోధిస్తూ-

నేను తృణమనైన సీత కోక
చిలుకపేచు నెగురు మలక హారిత
యేటువాలు గాగనెగురవే మద్బుజా
పంజరంబు నందు పంజరశకు।

ఈ చివరిపాదం 'ఒంకార పంజరశుకీ' అనేమాటను స్ఫురింపచేస్తుంది।

లక్ష్మివి, జగదాంబవు, సమాజ్ఞాచక్రనిభృత పాలన కళానేత్ర చైతన్యస్వరూప, నేనాత్మేశ్వరి యోగమూర్తిని, విచిత్రలోకేశ్వరి మాయ మున్నగు సంబోధనలతోపాటు అయోధ్యకాండలోని సుమంత్రా సీతరథస్థయైన సీతవర్ణన ఈ భావాన్ని వివరిస్తున్నది

సీ॥ సింహ మహోక్ష సంసేవ్యమానోభయ
పార్శ్వహిమాలయ వ్రభుకుమారి
యానంద సత్సనాథా నూన సుస్థితి
ప్రథమానచిత్కళా ప్రథమ రేఖ
మత్స్యకేతన మధుమాస సేవాస్వీకృ
తి ప్రౌఢకళ రతిదేవి మూర్తి
వీరేంద్రరస నావిష్కార మోదాఢ్య
చరమ భాగస్థయుత్సాహకళిక

బుద్ధ్యహంగారయుగ జాత్త మధ్యభాగ
నిహితమన ఇంద్రియంబున నెగడు తెలివి
రాణమైయి సుమంత్రాసీతరథము విూద
జానకీదేవి సర్వభూషణయు దోచె

ఇక పాతివ్రత్య విషయమై అగస్త్యుడు అభివర్ణించిన విధమే ఆమెకు ప్రత్యేకమైన మెచ్చుకోలు

రమణి రమణీయత్వము ననెయారాధనీయ
రమణి భార్యాత్వమునను నారాధనీయ
రమణి సీతపతివ్రతోత్తమజగచ్ఛి
రసమణిరానమగు లహారాధనీయ

సీత అత్యంతారాధనీయ అనే భావం మహర్షి అగస్త్యునకే కాదు, ఆంజనేయునకు అంగదునకు కూడ అధికంగానే ఉన్నది అసలు విశ్వనాథ వారికే సీతామాత ఎడలగల పూజ్యభావము ఆరాధన ఆయా పాత్రల ముఖత రచించినారనవచ్చును

సీతను దర్శించి వచ్చిన హనుమతో అంగదుడు తక్కిన విషయాలన్నీ తరువాత చూసుకుందాం సీతా మహాత్మ్యం గురించి చెప్పు అని అడుగుతాడు వెంటనే ఆంజనేయులు ఆమెను మనసులో భావించుకొని

కన్నులు కల్గినందుధరణీ కన్యగ గాంచవలెన్ నమస్కృతిన్
మున్నవజేయు నెంచిన నుక్ష్మాసుతకుం బానరింపగా వలెన్
విన్నధరాకుమారి కనుపీన లపండువుగ వినన్ వలెన్
మన్నన రామభార్య పదపంజంల సన్నిధసేవన్ వలెన్

పుట్టువు కృతార్థత పొందాలంటే హనుమవాక్యాలు అక్షరాలా పాటించవలసినదే మరి అనాడు హనుమ ఈనాడు విశ్వనాథ సీతా మహాత్మ్యాన్ని దర్శించగలిగిన పుణ్యమూర్తులు

విశ్వనాథవారి దృష్టిలో సీత పరమపాతివ్రత్య భవ్యచరిత, అనపాయిని ధర్మదేహిని, వరదేవతాస్వరూపిణి, సీతారాములు

దాంపత్యధర్మ ప్రతిపాదకులు అయా పాత్రల మాటున తానే సీతను దర్శించిన అనుభూతి పొందారాయన అశోకవనంలో సీతకు తన్ను తాను ఎఱిగించుకోవడానికి హనుమంతుడు రామకథను చెట్టు మీదనుండి చెప్తాడు అయితే ఆ చెప్పడంలో సీతను చూడడాన్ని ఒక మహాద్భాగ్యంగా ఆదొక అందరాని దివ్యానుభూతిగా ప్రదర్శించడం విశ్వనాథవారి సొత్తయింది అవాల్మీకమయిన అద్భుతకల్పన విశ్వనాథవారి ఆత్మీయతకు అద్దం పడుతున్నది

సీ॥ మాతృదేవి సమాజ్ఞా తీర్థ సుస్నాత
వినతా తనూజుండు వేల్పుబువ్వ
కనుగొన్న యట్లుగా గనుగొంటి జానకీ
దేవి గవేషణా తీర్థఫలము
పరమయాజ్ఞికులు నిర్భర మహోచ్ఛందోవ
తారంబు గాయత్రి తత్త్వమూర్తి
గనుకొన్న యట్లుగా గనుగొంటి జానకీ
దేవి శ్రీరఘురాము దీపరంబు

కవి మహర్షి తపోగ్ని చేత్రాగి శ్రేణి
సర్వతేజ ఫలంబు రసంబు తుదకు
చూచినట్లుగ జూచితి క్షోణి జాత
జారితార్థ్యంబు జన్మకు సంఘటింప

జన్మకు చారితార్థ్యంబు సంఘటింప సీతాదర్శనం చేయడానికి అవకాశం కల్పించిన సీతారాములకు శిరసువంచి నమస్కరిస్తూ ముగిస్తున్నాను



# కల్పవృక్షములో కైకేయి

జువ్వాడి గౌతమరావు

రామాయణ కల్పవృక్షములో విశ్వనాథవారు కైకేయిని తీర్చిన తీరు వేరు లోకమునకు తెలిసిన కైకేయి దుష్టురాలు, స్వార్థము నాశించి సర్వ జనప్రియుడైన రాముని అడవికి పంపించినది

కల్పవృక్షములో కైకేయికున్న స్థానము గొప్పది ఆమె స్వభావములో గరువమున్నది, పట్టుదల యున్నది ఉద్విగ్నత యున్నది కాని దౌష్ట్యము లేదు ఆమెను ఇట్లు తీర్చిదిద్దుటకై కల్ప వృక్షకవి మొదటి నుండియు జాగ్రత్తపడినాడు మువ్వురు రాణులను ప్రవేశపెట్టినపుడే 'కోసలరాజకన్యదేవేరి సుమిత్రశాంత గుణపేటిక' అని ఇద్దరు రాణుల సంగతి చెప్పి 'కేకయరాజకన్య హేలారతి దాగు రేకుల తళ్కులకాలుక రాజుకంటికిన్' అని చెప్పినాడు ఆమె రాజుకు మిక్కిలి ప్రియురాలు అందుకే ముందు ముందు రాముని పరితప్తకు ఏ ధాత్వము కలిగించు శక్తి ఆమెకున్నది.

సంతానము లేక దిగులుపడుచున్న ఒక మహారాజున్నాడు యజ్ఞోద్భవమైన పాయసమహిమవలన ఆతనికి పుత్రులు గలిగిరి ఒక మహర్షి తానై వచ్చి రాజునొత్తిడిచేసి ఆయన పెద్దకుమారుని తీసికొనిపోయి మహాస్త్ర విద్యాదానముచేసెను ఆ కుమారుడు సర్వ రాజన్యలోకమునకు ఎత్తుటకే సాధ్యముకాని శివుని విల్లును విరిచి సీతాదేవిని పెండ్లియాడెను రాజుకొడుకునకు యౌవరాజ్యాభి షేకమును నిర్ణయించెను ఇంతవరకు సాధారణచరిత్ర అక్కడ కైకేయి ప్రవేశించినది రామాయణము కథమైనది 'యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే తావద్రామాయణ కథాలోకేషు ప్రచరిష్యతి' అంతటి కథమైనది

కైకేయి 'మధుసామగానమూర్తి' యని 'సునునల్లకల్వపూవు' అని కల్పవృక్షము చెప్పినది. ఆమెకడుపులో పరమభాగవత శేఖరుడైన భరతుడు పుట్టబోవుచున్నాడని సూచన మిగిలినది విశ్వనాథవారి మాటలలోనే చెప్పుట సమంజసము "మనమతము ఉపాసనామతము ఆఉపాసనను సాధించుటమెట్లు? ఉపాసనయొక్క ప్రథమస్వరూపము యజము దానిని చేయుట వేదములయొక్క సాహాయ్యముతో ఇది పరమేశ్వర నిర్దేశము _ సామవేదమిచ్చుట తదుపలక్షకముగా చెప్ప బడినది వేదములలో దేవతలు పిలువబడుదురు. స్తోత్రములు చేయ బడుదురు ఆ స్తోత్రములలో ప్రధానమైనది సామవేదము ఈ యర్థ మిట్లుండగా దశరధుడు కైక యందెక్కువగా రమించుచున్నాడని వ్యంగ్యము "

ఆ కైకేయితో రాజు నేను పుత్రులు కలుగుటకై యజ్ఞముచేయ నిశ్చయించితిని నీవు 'దీక్షానిధివైవ్రతముబూను' మనగా ఆమె 'నాతోనేమగు ఆ కోసల భు నాయకసతకు మొదట పుట్టగవలయున్' 'అవ్వనితా శిరోమణికి ఆత్మజుడింటిన దివె నెంబడిన్ దివ్వియగాగ మీకులము గీధిని వెల్గును' అన్నది తన పుత్రుడు రాజ్యమేల వలయునన్న కోరిక మొదటినుండియు కైకకు లేదని కల్పవృక్షము స్థాపించుచున్నది

రాజునకు నలుగరు పుత్రులు కలుగగా కైకేయికి రాముని యందమితమైన ప్రేమ ఆ రామునకు గూడనంతే 'కాళ్ళు వచ్చిన దాదిగా కైకకొరకు పరుగలెత్తును శ్రీరామభద్రమూర్తి నిద్రమేల్కొ న్నదిగ రామభద్రుకొరకు అంగలార్చుచు జనుకేకయాత్మజాత' ఇది వారిద్దరి నడుమ నున్న యాకర్షణ ఏదైన శౌర్యవృత్తమును చేసినచో కైకేయి మెప్పు పొందవలయునని రాముని కోరిక

ఒకలోకాద్భుత శౌర్యవృత్తమ్ము న్నుత్సాహో ప్పారగాజేసి కై
కకుగాన్పించు కొనున్ రఘూద్వహుడు ఆ కైకేయి యానంద బా
ష్పకదంబంబులు గద్గద స్వరములున్ సంతోష కుల్యాతరం
గక డోలా గమనంబులునే మురిపెమ్ముల్గ్రా జూచుచున్ జూచుచే

ఆమె "నా తండ్రికి రంగనాధుండు రక్ష. దేవి కౌసల్యపాతివ్రత్యరక్ష శ్రీ వశిష్ఠుల తపస్సే వధుల్ రక్ష. దశరథేశుల పూర్వతపసులు రక్ష ప్రశమితాఖిల దైత్యభావంబు రక్ష" అని దృష్టితీసి పోయును రాముని యందు ప్రేమయేకాదు ఆమెకు కౌసల్యయందాదరమున్నది వశిష్ఠుని యందు భక్తియున్నది దశరథునియందు పరిశుద్ధమైన విశ్వాసమున్నది. దైత్యభావమునందు విరోధమున్నది

రామునకుపనయనమైనది ఇరువురు తల్లులకు మ్రొక్కి రాముడు కైకకు మ్రొక్కగా ఆమె విలక్షణముగా చలించినది ఆమె భిక్ష కూడ విలక్షణముగానే యున్నది "కేకయాత్మజాత కేశవునకు భిక్ష పెట్టె మణులు కుట్టిపట్టు దట్టి పిడినిమరకతమ్ము తొడిగిన చురకత్తి వజ్రపుంఖితమ్ము వాలుటమ్ము" అప్పుడు

మొగమున నింతయై మురిసిపోయెను రాముడు కైకకన్నులం
దిగము మరింత యింత యయియేళ్ళులుపారె తదంతరాంతర
స్థగిత రఘూద్వహ ప్రవిలసచ్ఛిశుమూర్తి మరింతయింతయై
జగములు పట్టరాని యొక సాహస దీర్ఘ తనుత్వ మొప్పగన్

కైకేయి పెట్టినది సాభిప్రాయమైన భిక్ష నమస్కరించుచున్న రాముని చూడగానే ఆమె "ప్రేమోల్బణ మోదబాష్పవీచీ దారాగ్రామిత దృగ్రేఖ" మైనది మిగిలిన తల్లులిరువురు భిక్షపెట్టినప్పుడు రామునికి కలిగిన సంతోషమును కవి వర్ణించలేదు కాని కైక చురకత్తిని, వాలుటమ్మును భిక్షపెట్టగనే వటువైన శ్రీరామచంద్రుడు పొంగిపోయినాడు మురిసిపోయిన రామచంద్రుని చూచి కైక కన్నులలోని

చెమ్మకాలువగా ప్రవహించినది తన హృదయములో మెరయుచున్న శిశుమూర్తి ఇంతయై జగములు పట్టరాని సాహస దీక్షతను పు కలవాడైనాడు త్రివిక్రమత్వము స్ఫురించుచున్నది ఆ తల్లికొడుకులిద్దరు ఒకరినొకరు బాగుగా ఎరిగినవారు తల్లికొడుకులమధ్య సామాన్యముగానుండు ప్రేమభావము నతిక్రమించిన యొక స్నేహభావము ప్రత్యయము, వారిద్దరి మధ్యనున్నది

ఈ రాముడు భవిష్యత్తులో నెప్పుడో 'దైత్యసంహార గాథా పాండిత్య సముద్రమూర్తి' కాగలడని కైక హృదయములో నేదో విశ్వాసమున్నది అందుకే దృష్టితీసిపోసినపుడు 'త్రశమితాఖిల దైత్యభావంబు రక్షయన్నది అందుకే భిక్షగా చురకత్తిసి వాలుటుమ్మును పెట్టినది ఆ విశ్వాసముతోనే అతనికి విలువిద్యలోని మెలకువలు నేర్పినది

'తనవిల్తో గతిపట్టు నమ్ముసెటు సంధానింప కైకేయి తా
నన మేశాసనమా ప్రభూత్తమునకున్ చక్కంగ కైకేయి విం
టిని ఈ ప్రక్కగ నమ్మికుల్ వగలుకొంటే దాకునందంచుటె
ప్పును లక్ష్యంబును దాకు రాముడును నవ్వున్ నవ్వు గైకేయియున్'

ఇది కైకేయి రామునికి విలువిద్యలోని రహస్యములు నేర్పిన తీరు కైకేయికి లోకోత్తములైన ధనుర్విద్యా రహస్యములు తెలియునని కల్పవృక్షములో కల్పింపబడినది. పూర్వము దేవదానవయుద్ధము జరిగినప్పుడు దశరథుడు కైకను తోడుతీసికొని వెళ్ళెను. ఈమెను యుద్ధమునకెందుకు తీసికొనివెళ్ళినాడు? ఆమె యుద్ధవిద్య యంతయో దశరథునికి తెలియునని యర్థము ఆ యుద్ధములో ఆమె దశరథుని ప్రాణాలు కాపాడినది కనుక కల్పవృక్షములో ఆమె ధనుర్విద్యా రహస్యము లెరిగినదిగా నిర్మింపబడినదని విశ్వనాథ వారి అభిభాషణము ముందు ముందు రాక్షసుల

యుద్ధము చేయుచున్నప్పుడు శ్రీరాముడు వారితో నీవెంత నేర్చిరివై నను కైకేయిదేవి విద్యావిష్కారము ఎరిగినవాడవుకావు అందుచేత నీ విద్యావ్యర్థము నీవు నాముందు నిలువలేవు అని వారిని సంహరించును

ఏ విశ్వాసముతో రామునికి విలువిద్య నేర్పినదో ఆ విశ్వాసము తోనే కైకేయి శ్రీరాముని అడవికిపంపినది కల్పవృక్షములోని కైకేయి ఆ పనిని తాత్కాలిక పుత్రమోహమునకు లోనై చేసినదికాదు మంధర బోదనలకు లొంగిచేసినదికాదు రామచంద్రుని ప్రేరణతో చేసినది. ఆ కార్యాచరణములో తనకుగలిగిన మహాదుఃఖమునోర్చి కొని భవిష్య త్కాలములో మాసిపోని తన అపకీర్తి ని తెలిసిచేసినది ఆమెకు కావల సినది భరతుడు రాజగుటకాదు రాముడడవికి పోవుట ఆ రామునకు కావలసినదికూడ అదియే అతనినడవి కంపుటలో ఆమె దుఃఖపడినది. విధవయైనది కన్నకొడుకుచేత ద్వేషింపబడినది అన్నియు నోర్చి కొనినది కాని రాముని కోరికను సఫలము చేసినది ఊరక మంధర బోధనలకులొంగి పుత్రమోహవశమై రామునడవికి పంపెడిదైనచో దశరథుని దుస్థితి చూచి మనస్సు మార్చుకొనవచ్చును సుమం త్రుని మాటవీనవచ్చును వశిష్ఠులు చెప్పినపుడు వినవచ్చును. ఆమెకు కలిగినది పుత్రవ్యామోహముకాదు స్వార్థముకాదు. క్లిష్టమైన కార్య మునిర్వహింపవలసి వచ్చినపుడు పరమధీరులకైనను కలిగెడు మనః క్లేశము క్షుద్రమైన హృదయదౌర్బల్యమును త్యజించి చివరివరకును మేరునగధీరగా నిలబడినదామె శ్రీరామ వనవాసవేళ సర్వజనులకు ఏదో విధమైన వ్యామోహము క్రమ్ముకొన్నది కాని నిశ్చలముగా నిలచినదిద్దరే మొదటివాడు శ్రీరాముడు రెండవది కైకేయి. ఆపని చేయుటలో ఆమెకు అపారముగా దుఃఖము కలిగినమాటనిజమే కాని ఆదుఃఖము ఆమె తనలోనే యదుముకొన్నది తనకర్తవ్యపాలనము నతిక్రమింపనీయలేదు

శ్రీరాముని యువరాజ్యాభిషేకము ప్రకటింపబడినప్పటినుండి

భరతుడు రామునివద్ద పాదుకలను గ్రహించి నంతవరకు కథ కొంత జాగ్రత్తగా చదివినచో కైకేయికి కల్పవృక్షములోనున్న గొప్పస్థానం తెలియును తెల్లవారినచో పట్టాభిషేకము ఆరాత్రి ఉపవాసి నిష్ఠాపరుడైన రాముని యెదలో

దేవతలై రసాముదవతీ వ్రతాతీ మధుకృత్కుమారకా
దైవతలోక కార్యచరితవ్రత! నిత్యదశావతార ధా
రావిదితాఖిలోత్తమ పురాణ కథాకమనీయమూర్తి! దే
వావలికంట కాపనయనా! యని పిల్చినయట్లుతోచినన్

అంతేకాదు - "దానవసింహము పంక్తికంధరుండేమయిపోయె భవ
త్ప్రతిజ్ఞ తానేమయిపోయె"అన్నట్లనిపించినది ఈ దైవతోక్తి శ్రీరామ చంద్రుని ఆత్మకు "బందుగులేగుదెంచి మాటాడినట్లుకాగా మనస్సులో ఏదోనిర్ణయము చేసికొని" ఆయపరాక్రమున్ రఘువరాన్వయ దీపము మెల్లలేచి కైకేయి గృహంబులం జనియె? అట్లువచ్చిన రామునిజూచి కైకేయి భయబడి రేపుప్రొద్దున అభిషేకమనగా నీవు వ్రతభంగము జేసి ఇట్లు వచ్చుటయేమి? ఈ నడిరాత్రివేళ ఏమి ముంచుకొనివచ్చినది అని యడిగినది అంత రాముడు

'అమ్మ! సమాధిలో నిటలమందున వేల్పులు వచ్చి నన్ను రా
జ్యమ్మును చేయవద్దని యట్లుయితోచిన ఏమి చేయకే
నిమ్మెయివచ్చితిన్ నిజమదేమియొ నాకునుగూడ నట్లెరా
జ్యమ్మునయందు కోర్కి యనునట్టిది గుండియబట్టిలేదునున్

అనిచెప్పగా శ్రీరాముని పరిహసించి పంపింతమనుకొన్నది ఇప్పుడట్లే యుండునులే అంతస్థమైన జానకిని సింహాసనమందు చూచిరేపు మరొకవిధముగా నుండును పొమ్మన్నది ఒకవ్యూహమును సిద్ధముచేసికొనివచ్చిన శ్రీరాముడంత తేలికగా వదలిపెట్టెడివాడా

అతని నేత్రములలో నొక తీవ్రమైన కళ ప్రకాశించినది. నేను రాజ్యమే చేయవలసివచ్చినచో నీవు నేర్పిన 'కోదండకళా విచిత్ర గమనశ్రీ మేమగుం జెప్పవే' అన్నాడు సుస్థిరమై సైన్యపరిరక్షిత మైన రాజ్యమును పాలించుటకు కింత చాపవిద్యయక్కరలేదు దీనినే మిచేసికోవలె 'అమ్మా! ఈ అమ్ములతో బొమ్మలు చెక్కుకొందునా? నమస్కరించుటకు వచ్చిన జనవ్యూహములను పగులుమందునా? అని రాముడనగా కైకేయికి ఆశ్చర్యమైనది ఇదియేదో గంభీరమైన వ్యవహారమువలె నున్నది పరిహాసముతో తేలిపోవునది కాదు. ఈ రామునకు విలువిద్య తాను నేర్పుటయే కాదు. వాడు వెంటబడి నేర్చుకొన్నాడు. ఏలమిన్ తానిది వేళపాళయని లేదెల్లప్పుడున్ రామ చంద్రులు తానన్ తన కార్ముకంబు వడిజేరున్ కైకేయీ సౌధ భూముల' నిజముగా ఈ విద్యకు ప్రయోజనమేమి? కైకేయికి తెలియలేదు 'సీధనువున నున్న చిక్కన సుతారము లెందులకోవచింపు' అని అడిగినది రాముని నేత్రములలోని తీవ్రకళ యట్లే యున్నది అతడన్నాడుకదా 'తల్లీ అదికాదమ్మా! 'నేను రాజ్యమ్ము సేయుట నిక్కువముగ లేదు వేల్పుల కిష్టమ్ము లేదనంగ రామచంద్రుని తీక్ష్ణ నేత్రములుచూచి తాను కైకేయి సౌధములోనికేగె' అతీక్ష్ణ నేత్రములతో ఆ సంభాషణతో అతడామెకు తన అవతార రహస్యమును చెప్పినాడేమో తెలియదు. ఉపనయన వేళయందలి 'తదంతరంతర స్థగిత రఘూద్వహ ప్రవిల సచ్ఛిశుమూర్తి మరింత ఇంతయై జగముల పట్టరాని యొక సాహస దీర్ఘ తనుత్వ మెప్పగన్" అన్న పద్యమిచ్చుట యను సంధించుకొనుట ఉచితముగ నేమో! కైకేయికి మరల మాటాడ వలసిన యవసరము కలగలేదు ఆ తీక్ష్ణ నేత్రములు చూచి ఆమె లోపలికిపోయినది శ్రీరాముని వనవాసమునకు బీజ నిక్షేపము ఇచ్చట జరిగినది

తెల్లవారినది ప్రొద్దు కెంజాయ తొలకొండనద్దినది మంథర బోధ మొదలైనది అక్కడనుండి కైకేయి మాటాడిన ప్రతిమాట నిశిత ముగా పరిశీలింపదగినది మంథరతో మాటాడిన ఆమె మొదటి మాటలు

శ్రీరాముడు 'సర్వానుప్రాంగణ ముగ్ధదీపిక, ఆశాసంపాదకుడెల్ల జీవులకు, దీక్షాధర్మపారంపరీ వ్యాసంగుడు రమాసర్వస్వాముడు, నరోత్తముడు, రాముడొకయోగి, మరిన్ దితిజోగ్రవారి మార్తాండుడు దానికై తనువుదాల్చె" ఇవి ఆమాటలు వినుచున్న మంథర ఏమి సామాన్యులారా? ఆ గూనిది 'యోగియైనయెడనేలా రాజ్యవాంచల్ మహాదను జోగ్రాంబు పతంగుడైనను అయోధ్యా వీధులందుడిరో దను రామునిచిత చంపబడగా?" అని ప్రశ్నించి కైకేయి యన్న మాటలను ఆమెపైకే విసిరినది ఇది నిజముగా సమాదానములేని ప్రశ్న. యోగికి రాజ్యమెందుకు? రాక్షసులు అయోధ్యలోనున్నారా? సహజముగా, అమాయకముగా గనబడుచున్న ప్రశ్న రాత్రి రామునితో మాటాడినప్పటి నుండియు కైకేయి హృదయములోనేమో యున్నది దానికింతవరకు నిశ్చయాత్మకస్థితి రాలేదు మనమేదో అస్తినాస్తివిచికిత్సలో నుందుము అవతలివాడు తన ప్రయోజనము నాశించి మనకేదోచెప్పును అందులో మనకొక మార్గము గోచరించును కాని దానిని పాటించుట మిక్కిలి దుష్కరము. రాముడు కోరినది తనను రాజ్యపాలనమునుండి తప్పించుమని మంథర కోరుచున్నది రాముడు రాజుకావద్దని రాముడు తనకు ప్రాణము ఈ దాసియందు తనకు మమకారము ఈ ఇరువురి కోరికలయొక్క సమానత కర్థమేమి? మంథరకోరిక నంగీకరించి రాముని కోరికమీదనైనా అంతగా తనకిష్టుడైన వానిని రాజ్యభ్రష్టుని చేయగలదా? ఏ మహాశక్తి తన్నిట్లు ప్రేరేపించుచున్నది? ఇది మాయలోని ఘర్షణ ఉరిపోసుకొందునన్న మంథరతో కైకేయి నన్నంత దూరములాగకు జాగ్రత్త నాది మొండిపట్టు నేను వనములకు పొమ్మన్నచో రాముడు క్షణములో రాజ్యము వదలిపెట్టును కాని రాజెట్లంగీకరించును? మంథర దానికే ఎదురుచూచుచున్నది నీ కిష్టమేని ఉపాయమే లేదాయన్నది ఆ ఇష్టమన్న మాట విని కైకేయి భగ్గమని మండి ఇష్టమనిఎవరన్నారు ఉపాయము చెప్పమన్నది రాముని అడవికి పంపుటకు తాను కారణముకావచ్చును కాని ఆపని తనకిష్టమైన

మాత్రముకాదు. ఇష్టముకాకపోవుట ప్రాతికూల్యము ఉపాయము చెప్పమనుట అనుకూల్యము ఈ ప్రాతికూల్యానుకూల్యములు కని పెట్టిన మంథర వరములసంగతి జ్ఞప్తికితెచ్చి ఉపాయము నుపదేశించి నది అంతేకాదు నువ్వు వ్నాఫుకదా! అట్లేరాముడు రాక్షససంహారము చేయుచు పదునాల్గేండ్లు అరణ్యవాసము చేయవలయునని వెక్కి రింతగా మాట్లాడినగి ఆ శోకమూటవిన్న కైకేయికి పరిమాణము మించిన కోపమువచ్చినది 'బిగుసుగాలి పడగ పెడగాగ దాచిన బుస్సుమన్న తాచు పొలతివోలె కైక రామమూర్తి కఠిన రాక్షస కీట రాజి కాలిక్రింద రాచనున్న' ఆకోపము చూచి మంథర మరల రెట్టించుచున్నది 'అంతటి కోపమేమిటికి? జానవియేకద చెప్పుచుం టినే నెంతలు దైత్యులలో మరియు నెంతయు రాముడు నాకునేల?" నేను నీమేలుకోరి చెప్పుచున్నాను ఇష్టములేకపోతే పోనిమ్ము' అన్నది కఠినరాక్షస కీటరాజి కాలిక్రింద రాచవలయునన్న కైకేయి నిశ్చయము తిరుగులేనిదైనది

ఈమంథర కైకేయిలయొక్క సంభాషణలో ఆద్యంతము కైకేయి మనస్సులోని ఘర్షణ ప్రత్యక్షమగుచున్నది.ఇప్పటినుండి కార్యోన్ముఖ మైన కైకేయి మనకు కనబడుచున్నది. తానొక క్లిష్టతరమైన కార్య మునునిర్వహించవలయును అది తనకిష్టములేనిది. మిక్కిలి దుఃఖకర మైనది దానిని నిర్వహించుటలో తాను మనసార మేద్చుటవదలి రేఖామాత్రముగనైనను దుఃఖమును ప్రదర్శించుటకు వీలులేదు. రామునిపై తనుకున్న ప్రేమను వెల్లడించుటకు వీలులేదు కౌసల్య కన్న దుఃఖము కేవలము రామ విషయికమైనది కైకేయికి రామ వియోగ దుఃఖమొకటి, తనమూలముగా రాజు నశించి పోవునన్న దుఃఖమొకటి, యుగ యుగాల వరకు తాను దుష్టురాలైన నవతితల్లిగా అపకీర్తి పాలైపోదనన్న దుఃఖమును బయటపడకుండ లోన నదుము కొనటలోనున్న అమానుషమైన శ్రమమొకటి- ఇట్లు మానవమాత్రులు

భరింపరాని మహాఘోర దుఃఖముచేత ఆమె హృదయము చితికిపోవు చున్నను ఆ భారమును సహించి ఆమె ఈ భారమును నెరవేర్చినది

'లీనాంతర్వ్యథ మందు దిన్న పులివోలెన్ కైక లోలోనలో

లోనర్ దాగుడుసుళ్ళు వొందుచు' ఆమె కోపగృహమందు ప్రవేశించినది అక్కడకు ఆమెను వెదకుచు దశరథుడు వచ్చినాడు ఇక్కడనుండి కైకేయి మనస్సులోపను బాధయొక్క ప్రమాణము నిర్ణయించుట కష్టము ఆ బాధ ప్రకటించుటకు వీలులేదు అందుచేత దాని అసహ్యత ఇబ్బడిముబ్బడి యగుచున్నది. తాను ప్రవేశించినది కోపగృహములో, ఎవ్వరైనను ఆమెకు కోపమువచ్చినదనియే యను కొందురు దశరథునట్లే యనుకోన్నాడు కాని దశరథుడు మంథర కాదు తన ముద్దుటిల్లాలి ముఖములో ప్రతిబింబించు భావములను గుర్తుపట్టుటలో నిత్యవ్యగ్రుడు 'నీకేదికావలయునోయిది యాకునవ్రాసిన నృపాజ్ఞయై చెల్లగదా ఈ కోపము కోపగృహ మ్మాకులపాటుయ్యే' అని కోపగృహమును ప్రవేశించినవాడు ఆమెను శోకాకృతిగా గుర్తించి కళవళపడి 'ఉవిదా! కోపమునంది యుంటివనినే నూహించితింగాని ఇంతపు దుఃఖంబు వహించి తంచెరుగ ఏలా యింత దుఃఖంబు' అని అడిగినాడు ఇంతవుదుఃఖంబు అన టరో ఆమెదుఃఖముయొక్క తీవ్రత తెలియుచున్నది - ఆమె వెంటనే సర్దుకొని 'చివురుంగమ్మల తెచ్చి కోలగు క్రుధాక్షేపంబుగా కైక భూధవ! కోపంబును శోకనుంచనెద వద్దావంచన ప్రక్రియల్' అన్నది ఇది కైకేయికి తన దుఃఖము ప్రకటించరానిస్థితి. ఇంత దుఃఖపడి ఆపనిచేయుట యెందులకన్నచో ఆది శ్రీరామచంద్రుల ఇష్టము అందువలన పట్టరాని క్లేశము కలిగినచో దానినోర్చికోవలయును అంతే

కాని రాజు తనశోకమును గుర్తుపట్టినాడు ఇక జాగుచేయుటకు వీలులేదు ఆమె వెంటనే వరద్వయము మాటతెచ్చి అసలు విషయమును మరచి 'ప్రాణములోని ప్రాణము' 'నీనా భేదంచే యెరుగని

తాదాత్మ్యశ్రీ' అని నన్ను మోసము చేయుచున్నావా అని రాజు నుపాలంభించినది దశరథునకు వరములిచ్చుటలో అభ్యంతరమే లేదు. పైగా అభిషేకపుటుత్సాహములో నున్నాడు తొందరలోనున్నాడు. మాటల లోపలం గల చమత్క్రియ యుండగనిమ్ము నీవు ఆమాటను నెప్పతెచ్చితివి మాన్పితినెప్పుడు నేనుగాని . కోరుమేపాటివో నీదు కోరికలు అన్నాడు ఇంకేమి? వరములు కావలసిన స్త్రీ కోరుకో మన్న వెంటనే తన వరములు చెప్పవలెనుగదా? ఆమె చెప్పలేదు

'అనినన్ కైకేయి శోకకోపములు పెల్లైయేడ్వ భూమిశుడున్
ననితా చిత్తరకత్తెవౌదు విదుగో వాంఛింపు మే నిత్తున
న్ననుకంపంబును బొందికైక ధరణీంద్రా! ఇత్తు నన్నంత చు
ల్కన కాదిచ్చుట యన్న భూమిపతియున్ కన్నుల్ సెరల్ కెంపులై'

తనకొడుకు రాజుకావలయునన్న స్త్రీకి రాజువరమిత్తు నన్న పుడు సంతోషము కలుగవలయును కాని దుఃఖమెందుకు? ప్రసన్నత కలుగవలయును కాని కోపమెందుకు? కోరుకోమని రాజు రెట్టించిన పుడ కంపమెందుకు? శ్రీరాముని వనవాసము క్షణక్షణము నిశ్చయమై పోవుచున్నది ఇది యామెశోకము దానిని విఘటనము చేయగలిగిన రాజు దానికి మరింత కారణమగుచున్నాడు. ఇది కోపము ఈ వర ములు తననోట రాకతప్పదా? మార్గాంతరములేదా? అవి విన్న దశరథుని స్థితియేమగును? అందుచేత కంపము దశరథుడు విపత్స ముద్రముతో మునుగుటకు బెత్తెడెడములో నున్నాడని ఆమెకు తెలియును అందుచేత ధరణీంద్రా! ఇత్తు నన్నంతచుల్కన కాదిచ్చుట యన్నది అంతటిమాట దశరథుడు పడలేదు నిత్యసత్య వ్రతుడైన ఆ మహారాజు రోషతామ్రాక్షుడై రామునిమీద నొట్టిడుకొని వరమ ఘోరముగా ప్రతిజ్ఞచేసినాడు ఈ కైకేయి తానేమి మాటాడినను ఏమిచేసినను అది క్షణక్షణముగా రాముని వనవాసమునకే కారణ మగుచున్నది ప్రతిజ్ఞను విన్న ఆమెయెట్లు స్పందించినచో చూడుడు

"ఆమాటల్ వినుచున్ లతాంగి భయ భీతాక్షుల్ విచారించి ఓ
హా మార్తాండ ముఖాఖిలామరచమూ! ఓ భూత సంతానమా!
మీ మీ సాకిరి భావముల్ గనుడు! భూమీనేత ఈ దృక్ప్రతి
జ్ఞా మోహావిల పారవశ్య కవితా జ్ఞావశ్యుడై పల్కెడున్"

ఇంక వరప్రదానము నందామె కిసుమంతైన సందేహ లేదు సందేహమెంత స్పష్టముగా నివారింపబడినదో అంత అధికముగా ఆమెకు భయమైనది ఆమె సర్వదేవతలను సమస్తభూతములను తన నిర్దోషిత్వమునకు సాక్షులుగా బిలుచుచున్నదో యేమో! ఆ దేనదానవ యుద్ధములో ఆమె తనకర్తవ్యమును నెరవేర్చినది కాని వరములు కావలెనని అడగలేదు వాటి యక్కరయే తనకులేదు. వాటిని గురించి ఆమె మరచియె పోయినది రాజ్యము వద్దన్నవాడు రాముడు. వరములు జ్ఞాపకము చేసినది మంధర. తాను నిమిత్తమాత్రమై ఇంత అపకీర్తిని నెత్తిన వేసికోవలసి వచ్చుచున్నది

ఆమె తనవరములు బయటుపెట్టినది వరములువిన్న దశరథుడు శోకించును, దూషించును, కోపించును, బతిమాలును మహాభయ గ్రస్తుడైన దశరథుని వాచాలాత సాగుచునే యుండును. అంతసేపు కైకేయి ఒక్కమాట మాట్లాడదు.

"పతివచోభి ముఖీనయౌ పడతియాత్మ
నిమున నిమునంబునకు నేదొనిలువరింబె
క్ష్మాతలేంద్రుడు దుఃఖవాచులుడైన తదణి
కైకెయి దుఃఖనిస్తబ్ధమగు"

ఇరువురికీ కలిగినది దుఃఖమే. దశరథుని దుఃఖము పరివిధ విధముల ప్రకటింపబడుచున్నది ఆమె దుఃఖము ప్రకటించుటకు వీలులేనిది అందుచేత ఆమె నిస్తబ్ధమైనది ఎవరిబాధ అధికము?

ఇంతవరకు కైకేయి తనవిధిని తాను నెరవేర్చినది ఇక మిగిలినది అనుష్ఠింపవలసినది శ్రీరాముడు తండ్రి దుస్థితిచూచి శ్రీరాముడు కారణమడుగగా ఆమె

"ఆ శంరమ్మగ వచ్చు దుఃఖమును కోపావేశమున్ నేత్రరే
ఖాకోణమ్మున యత్నమై యడిమి చిక్కంబట్టి దంతద్వయా
స్తోకా ఘట్టనజేసి క్రిందవి నెత్రుం జిమ్మ నల్లంత సే
పాకన్బట్టిన పొంగనన్ వెనుక పాటౌవేళ కిరీతిగన్

అవునోయీ! రాఘవుడ పితృవాక్య పరిపాలనంబు దెప్పరమై పాల్యవిధిం గొప్పరమౌవ్రత మవినయులకు జేతకోనిదగు వ్రతమునుమీ అది నీవుచేయగలవా? మదినాలోచించి బదులుమాటాడు మనన్"

దశరథుని దుస్థితికి కారణ మింతవర కెవ్వకిని తెలియదు తనవరములు దశరథునికి చెప్పిన తరువాత ఆమెమాటాడిన మొదటి మాట సుమంత్రునితో రాముని తీసికొనిరమ్మని చెప్పినది ఇది రెండవమాట—మిక్కిలి ప్రగల్భమైనమాట— ఈ మాటల అర్థమొక్క శ్రీరామచంద్రునకే తెలియునట్లు ఆమె మాటాడినది మిగిలినవారికి సామాన్యధర్మము చెప్పినట్లున్నది రాముని హృదయమామె యెడల మిక్కిలి కృతజ్ఞతామయమై పోయినది అతడు 'తల్లీ! నీవు చెప్పిన వ్రతమునే గౌతమమహర్షి భార్యయైన అహల్యాదేవి నాకు పరమహితముగా చెప్పినది ఆ గురూపదేశ విధిని నేనెట్లు విస్మరింతు' నన్నాడు అప్పుడామె తనవరములను బయటపెట్టినది మొదటిది రాముడు అడవులకు బోవలయును రెండవది భరతుడు రాజు కావలయును దశరథునికూడ ఈ క్రమములోనే ఆమె వరములడిగినది వాల్మీకములో ఈ క్రమము వ్యత్యాసముగా నున్నది ఇది కల్పవృక్షములో చేయబడినమార్పు—ఇక్కడ కైకేయికి ముఖ్యమైనది రాముని అడవి

కంపుట, వరములు ప్రకటించిన వెంటనే ఆమె మనస్సులోని బాధ యంతయు బయటపడినది

"రామా! ఇన్ని దినాలు దాచితినిరా రక్షోవిధంబై నవ
త్నీ మాత్సర్యము నేడు బ్రద్దలయి పండెన్ గంద్రకోనన్ ధను
శ్శ్రీ సూత్పాణివి నీవు నోటరెవి నీ సేమంబు క్లిష్టంబె యా
నే నాటెచ్చిన మీరు రామవులు పోరా సత్యవాక్పాలనన్

అడిగిన దేమో యడిగితి బుదుతడ! మునుమూచి తిట్టబోయుడు తండ్రింబడి నీవును తరిమితరిమి యడిగించిన తండ్రి యిట్టులైనాడు గదా" అప్పటినుండియు జనములు తన్ను ఏ విధముగా దూషింతురో అవి తన లక్షణములుగా కైకేయి చెప్పకొన్నది. ఇంతేకదా నా బ్రతుకు, నేను రాక్షసిని సవతితల్లిని అభావమును క్షాళనముచేయుట తోసాధ్యము అమెపడుచున్న మానసికవ్యథ రామునకు తెలియును. అది తనకోసము పడుచున్నదని తెలియును, అంత అయోధ్యలో ఆమెను దూషింపనివారు లేరు. అతని హృదయ మామెయెడ పరమ స్నిగ్ధమై అతడామెను అనునయించెను "నీ యుపకారమున్ మరువనే మరి యోజనసి!" "సిను మన్నింతు అహల్యకన్నను హిమానీ సత్కృపారాశిగన్"

'ఏవరయుగ్మమీ వడిగితే వరయుగ్మము రాజ్యసంగె నే
నావరయుగ్మపాలన కృతార్థజనుష్కుడనైతినేని నా
యా వరపాలనాత్త సుకృతాఖిల దివ్యత యందు తల్లిశ్రీ
దేవత నీవు, నన్ను నుమతింపుము నీదు పదార్చకుండుగా'

ఈ మాటలు రాముడు కైకేయియందు తన కృతజ్ఞతను వెల్లడించి ఆమె దుఃఖమును ఉపశమింప జేయుటకైయున్నవి కాని అవి జన బాహుళ్యమునకు కైకను గురించి ఉన్న నాపమును సమాయింపలేవు కదా

కైకేయి ఒక్కరాముని వనవాసమే కోరినది. కాని ప్రస్థానవేళ సీతాలక్ష్మణ సహితుడైన శ్రీరాముడు వనవాసమునకు సిద్ధమై వచ్చినాడు ఈ పరిణామమునకామెను దూషింవనివాడులేడు చివరకు సుమంత్రుడు కైకేయిని కులఘ్ని వి పతిఘ్ని వని పలువిధముగా దూషించును రాముని వనవాసమునకు సుమంత్రాదు లెంత దుఃఖించుచున్నారో కైకేయి యంతే దుఃఖించుచున్నది కాని ఆమెసమాధానము చెప్పు స్థితిలోలేదు 'సుమంత్రుడు సాక్షేప సానుకంపముగను బతిమాల కైకేయి మోమునందు కదలిక లేదు' ఆమె రాయివలె నైనది. చివరకు రాముడే ఆమె పక్షము వహించి మాటడును

'ఈ ధర్మంబును జేయు సాయపడె దానెంతో కృపాంరాశి యా
సాధున్ నా పినతల్లిపట్టుకొని మీ సాధింపులీ కోపమున్
బాధల్ వేల్ బెదరింపులున్ నిజము నాప్రాణంబు దుఃఖించెదన్ ..

''అని కైక పాదములకుం బ్రణామ మొనరించి తల్లి బాధపడకు పుత్రుని కతమున నగుబాధలు జనని సహింపకయ యేను సైరింతురు'

అని చివరకు వనప్రస్థానవేళ శ్రీరామచంద్రుడు

"కైకేయి పదమ్ము లందుకొని నీ వాశీస్సు లీకున్న బో
వన టన్నన్ పినతల్లి మూర్ఛగవి చిప్పంబేరి పోవోయి నీ
వనముల్ నాకొడుకిందు రాజగును నీ బాహాధనుఃక్రూర మా
ర్గ ముల్ చేయు నుపద్రవంబున మహాకాంతారముల్ ఘోషిల్లున్"

"నిరభిమానను నిర్లజ్జ నిర్భయాత్మ
జేసితివి నన్ను సర్వ సన్యాసినవ్ వ
నిన్ జనుము సవతితల్లిన్ ననున్ శ
పించి సవతి తల్లిగనె చూపించినావు"

ఈ మాటలలో ఆమె భవిష్య జ్జీవితములోని వైయర్థ్యమంతయు ధ్వనించుచున్నది నీవనముల్ అన్నది సాభిప్రాయమైనమాట నీవు కోరు

కోనిన వనములకు నీవుపో అక్కడ నీబాణములు దేయు ఉపద్రవము వలన మహాటవులు ఘోషిల్లనీ, కాని నేను మాత్రమిచ్చుట నిరభిమాననుగా సిగ్గులేనిదానినిగా సవతితల్లినిగా మిగిలిపోవుదును ఇది రాముడు చేసినపని తాను సర్వసన్న్యాసినియైనది

'నాయాశీస్సుల వేటికి ఒయీ! రఘురామ నీకునున్నవి చాలును
నాయాశీస్సులు భవతుని కైయని నినుబోలె నా తడగుటకు రామా
'అననందప ఛీఛీయనిరి చివరగిదాక రక్షించుటకు
రాముడు సంతోషించె'

ఈ మాటలలోని అర్థము మిగిలినవారికి తెలియలేదు నా కొడుకు భరతుడుండగా నేను నిన్నెందుకాశీర్వంతును అని కైకేయి యన్నదనుకొని వారందరును ఛీఛీఅనిరి ఈ భేదభావమామెలో నున్నచో 'నినుబోలె నాతడగుటకు రామా' అని యనదు. నీవలెనే ఆ భరతుడు కూడ సుగుణధాముడగును. నీవు అడవికిపోగా వాడు రాజ్యమేలునా? వాడు కూడ మునియై నీవలెనే జటాధారియై బ్రతుకును పొదుకా పట్టాభిషేకమంతయు కైక యాశీస్సులో ధ్వనించుచున్నది. తల్లి చివరిదాక తనపనిని జారుపాటు లేకుండగా నిర్వహించి నందుకు రాముడు సంతోషించినాడు ఆ తల్లి కొడుకులు లోపలనొకటే. ఇంత వరకు జరిగినకథలో వారిద్దరి ఈ అన్యోన్యము మాటిమాటికి ప్రదర్శింపబడినది

వారిరువురి యీ సంబంధము భరతునికి తెలియదు మరెవ్వరికి తెలియదు. దశరథుని మరణానంతరము భరతుడు చూచిన అయోధ్యలో దేవాలయములలో దీపధూపములులేవు యజ్ఞగోష్ఠులలో అగ్నులులేవు పూవుటంగళ్ళలో పూవులులేవు గట్టాపణములు విరహితధనములు పౌరులందరు పరదీనమూర్తులు వస్త్రములు నిర్మలమాధుర్య [illegible] లేనివి భరతుని మనములో అనేక సందేహములు [illegible]

దెబ్బతిన్న హృదయము గలవాడై అతడు రాచనగరులో ప్రవేశించి నాడు అక్కడ పిలిచిన పలికెడు దిక్కులేదు ఇదిమేమిటి? రాజున కేమి విపత్తు వచ్చినది ఎవరి నడుగవలయును? అట్టే కాళ్ళీర్చు కొనుచు భరతుడు తల్లిగృహములో ప్రవేశించినాడు. ఆ గృహము కూడ దీనతా భాజనమైనది ముంగిట సేవకులులేరు తానే తల్లిని వెదుకి కొనవలయును తుదకెక్కడో మాసినదుప్పటి కప్పుకొని నేలపైబడి యున్న తల్లి కనబడినది ఈ తల్లికొడుకుల కలయిక దగ్గరనుండి క్షణక్షణము శరీరముత్పులకమగు ఘట్టము రాముని వనప్రస్థాన కథ అంతయు కల్పవృక్షము గాఢదుఃఖ విచలిత చేతస్కయైన కైకేయి చేత భరతునకు చెప్పించినది ఇది యామెను శిక్షించుటయా? శ్రీరామ చంద్రుని నిజస్వరూప దర్శన మామెకైనదని సూచించుటయా? లోక మునకు మహాపాపముగా కనబడుచున్న పాపమునుకాని తనపాప మును దుఃఖాగ్నిచేత నిశ్శేషముగా దహించుటయా? అన్నియును కలిసి హృదయభేదన పటువైన యొక పరిస్థితి అక్షరాక్షరము పరిశీ లింపదగినది కైకేయీ భరతుల స్వరూపమును విశదీకరించునది. కన్న కొడుకుకూడ తన విషమపరిస్థితిని గమనింపక దుఃఖకోపములకు వశుడై తనను మహాఘోరముగా నిందించుచుండగా తన నిజస్థితిని చెప్పుకోజాలక లోలోపల కుమిలిపోవుచు ఏకాకినియై నిస్సహాయు రాలై దుఃఖభాగిని యైనప్పటికి రామకార్యవ్యగ్రతనుండి రేఖామాత్ర మైన చలింపని ఒక ధీరవనితయొక్క గూఢపీయూష పూర్ణమైన హృద యస్థితిని వివరించునట్టిది

ఆ స్థితిలో తనదగ్గరకువచ్చి పాదాభివందనముచేసిన కొడుకుమ చూచి తల్లియేమి చేయును? 'హా మహారాజా! రాక్షస సంహారముసకై తీర్చిదిద్దిన సురసేనా సమూహమున కగ్రభాగమునందున్న మహా వీరుడా!

"హా కైకేయీ ప్రాణ! హా కైకేయీ సమారబ్ధ దుస్తంత్ర నిరస్త ప్రాణ
హాహా యనుచు చిట్టునావటిల్లి యొకింత దుఃఖపుం బొంగు నాపి
కొనుచు నాయనా కబురంపినారటోయీ నీకు యెవరుపంపిరటున్న
యేనెరుంగ ఊరకరమ్మని నట్లునన్ గరపి తెమ్మటంచు పంపిరి
కాబోలు ఏలపోయె తండ్రి? ఏవ్యాధివచ్చెను? తండ్రి జూడనైన
నే నోచుకోబోతని

భరతుని గుండియ కిది మొదటి అఘాతము ఒకటి వెంట
నొకటిగా తగులు అఘాతము లింకనున్న వి అవి భరతుడే అడుగ
వలయును కైకేయియే చెప్పవలయును ఇది అయోధ్యాకాండ
ములో మిక్కిలి నాటకీయముగా తీర్చబడిన ఘట్టము, తండ్రిపోయి
నాడని తెలిసికొన్న భరతుడు తాను వెంటనేపోయి రామచంద్రుని
చూడవలయు నను

జనకుని దుఃఖభార వివశంబుగ గుండియతోడి రామచం
ద్రుని గనకుండ నాక్రచటు దోచటంచును బిగ్గనేడ్చి, లే
చిన సుతు గాంచి కైకయి విశీర్ణ హృదంతర యోయి నా
యని నిను జెప్ప రెవ్వరును అయ్యదినేను వచింపగా వలెన్

శ్రీ వశిష్ఠులు నన్ను శిక్షించుటకును
నీకు నిజమైన వార్త నందింపలేదు
తల్లియని యింతకున్ మున్న తాల్చినట్టి
యడుగులంటిన చేతులు కడిగి కొమ్ము"

ఈ మాటలు మాటాడిన కైకయి విశీర్ణ హృదంతర మరుక్షణ
ములో ఆమెరూపము మారినది, ఆమె ముఖంలో తైక్ష్ణ్యము, కన్నులలో
కనలు దోహమునందు కంపముతో ఇంతవరకు మాటాడినది తాను
కాదన్నట్లుగా ఇట్లు మొదలుపెట్టినది 'నాయనా! సర్వరాజ్యము

నీకై చేసిపెట్టితిని దీనిని నీవేలుకో రాచవానికి అన్నదమ్ములు మొదలైన వారెవ్వరులేరు. రాజ్యలోభము వానిలో దోషముకాదు గుణమే నీతితో గెలిచిన రాజ్యము ఖడ్గముతో గెలిచన దానికి లొచ్చు కాదు 'దోర్వ్యలయి మహాప్రతాపశిఖి శ్రీప్రభుడా రఘురాముకత్తితో గెలువనురాదు నీవునయి గెల్చితి రాముని తల్లి నీతిచే" మరికొంత సేపు అయోధ్యారాజ్య గ్రహణములోని సామంజస్యమును భరతునికి బోధించిన కైకేయి ఒక విచిత్రపుమాట యన్నది

"ఈ రాజ్యంబును నీవుగాని కొనినన్ హేలాధనుశ్శ్రీకళా
పారావారుడు రామచంద్రుడి సుమ్ము బట్టించుకోడా
శ్రవప్రారూఢా కృతి వాని పక్షమున జెప్పంగల్గుదున్"

భరతుని కింతవరకు తండ్రిపోయిన యాపద యొక్కటియే తెలియును. ఈమె యేమి మాటాడుచున్నది తండ్రిపోయి తానేడ్చు చుండగా జ్యేష్ఠునివదలి తనను రాజ్యమేలుమనుట యేమి? ఆరాముడు రాజ్యమును పట్టించుకొనక పోవుటయేమి? ఆ పట్టించుకొనక పోవు టకు రాముడు అశ్రవ ప్రారూఢాకృతి- అనగా మాటదాటనివాడు వినయవంతుడు అగుటకు సంబంధమేమి? ఇవి భరతునికి పుట్టిన ప్రశ్నలు

భరతుడు లేనప్పుడు జరిగినకథ యంతయు కైకేయి భరతునికి అంచె లంచెలుగా జెప్పుచున్నది తండ్రియందు భరతునకున్న భక్తిప్రేమలు కైకేయికి తెలియనదికాదు మహాఘోరమైనవార్త దానిని రేఖామాత్ర మైన అనుమానించని వాని నెత్తిన ఆకస్మాత్తుగా వేయరాదు అంత దుఃఖములో ఆమె ఈ సమయజ్ఞత చివరివరకును పాటించినది ఇంత వరకు రెండుచెప్పుటమైనది దశరథుడు మరణించినాడు రాముడ డవికేగినాడు ఈ కథను కైకేయి చివరినుండి మొదలు పెట్టినది _ మొదటినుండి మొదలుపెట్టిన్నచో ఈ సమస్త విలయమునకు తానే

కారణమని తెలిసిన భరతుడు తనయెదుట నిలువడు. తనమాట వినడు భరతుడు మరల అడిగినాడు

" అనిన భరతుండు శ్రీరాముడ డవికేలయెగె జనకుండు
సురక నిన్నే లతిట్టె
ననిన కైకేయి యిట్లనె నట్టులడుగు ముట్టిపడి వచ్చు పుట్టు
పూర్వోత్తరంబు "

'అది యెప్పటిమాటో మున్ను దైత్య సంస్ఫోట వేళనున్ శ్రీపతి యొ ప్పిదమగు తేజమ్మది బల్లిదమై కౌసల్య పవ్వళించదు బరువై'

ఆమెకథ అక్కడ మొదలుపెట్టినది — కైకేయి ఇంతవరకు శ్రీరాముని గూర్చి మాటాడుచు శ్రీ పత్రిభుడు, శ్రీ పతి, శ్రీపతి, హేలాధనుర్లక్ష్మీ కళాపారావారుడు—ఇత్యాదిమాట లుపయోగించినది—ఇది యెప్పటిదో దైత్యసంస్ఫోటనము నాటిమాట యని మొదలుపెట్టి వరములమాట చెప్పి తానుకోరిన రెండువరములు చెప్పినది. రాముని వనవాసమును కోరినానని చెప్పుచు అతనిని " దైత్యసంహార గాఢా పాండిత్య సముద్రమూర్తి' యన్నది. ఎప్పటి దేవదానవ యుద్ధము? తానడుగని వరములు రాజిచ్చెద ననుట యేమి? అవి తానిన్నేండ్లు విస్మరించుట యేమి? ఈ అభిషేకవేళ

" నాపై నాకును లేని ప్రేమయిది నిండెన్ మంథరా దాసికిన్
నీపల్యంకిక దానిపల్లకి యడే నీకోసమూ కోర్కులన్ వ్యాపింపించిబి"

ఏదో కార్యకారణ సామాగ్రి అల్లుకొని యున్నట్లున్నది ఈ మహా వ్యూహములో తాను నిమిత్తమాత్రురాలు ఆ వనములకు పోయి నవాడు శ్రీపతి, దైత్యసంహార గాఢా పాండిత్య సముద్రమూర్తి కావున భరతుడు మిక్కిలి దుఃఖ విచలితుడు అస్థిలో ఇంత సూక్ష్మ పరిశీలనము

చేయదు రాముడడవికి పోగా రాజు రామా! లక్ష్మణా! సీతా! యని పరిభాషింతుడై విలపించి మరణించినాడని కైకేయి ముగించినది రాముడుపోగా లక్ష్మణులను గూర్చి రాజెందు కేడ్వవలయుననగా కైకెయి సమాధానమిది 'రాముడు వసింపని నీదు నయోధ్యలోపలన్ కైకయిగాక జానకియు గైకొని లక్ష్మణుడున్ వసింతురా? అకున నీనె లున్ వదలి అకని యుండునటోయి భూమిపా!" సీతారామలక్ష్మణుల ఐక్యము చెప్పుటతో బాటు ఇక్కడ మరియొక స్ఫురణకూడ నున్నది రామచంద్రుని విషయములో లక్ష్మణు డెట్టివాడో భరతుడుకూడ నట్టి వాడే రాముడు లేని అయోధ్యలో భరతుడుకూడ నుండును ఇట్టి సూచనలు కల్పవృక్షములో అడుగడుగున నుండును

దిగ్భ్రాంతి పొందిన భరతుడు రాముడే రాజగును నేనే యడవికి పోదునన్న భరతునితో కైకేయి "రామచంద్రుడనినన్ ప్రధానాంశు తేజో వినూతన నారాయణమూర్తి శాసిత సమస్తప్రాణి నేవేగుటా దౌతని యేగుట యొక్కడా" అని రామునిగూర్చి తన యవగతిని మరింత స్పష్టము చెప్పినది రాజ్యము వద్దన్న భరతునిగూర్చి ఆమెకు మెచ్చుదల యైనది "మహిరాజ్య బందు వైరాగ్య మేచిన నీకున్ బదిలంబు" కాని "రాముడు వనసీమన్ నివాసంబు కొంగున తానై ముడి కట్టె మల్లువలె నీకున్ వచ్చునా చూచెదన్' ఇది యామె మాట ఆ రాముని సంగతి తనకు తెలియున్ను వీరికేమి తెలియును? కాని ఆమెగోడు భరతుడే వినలేదు మరెవ్వరు విందురు? వినకపోవు టయేకాదు తల్లియందొక కోపమును పెంచికొన్నాడు. ఇక నుండి తనయందలి భరతుని కఠోరభావము కూడ తాను సహించవలయును భరతుని కామె యందుగలిగిన భావము చూడుడు "నిను దూయ రాదు కత్తిం జనని వగుట" నాకుం దల్లి యటంచు చెప్పబడు కాంతా దుష్ట సంకల్ప రీఢాకూటస్థుని గాగనన్ జనము లాడన్వచ్చు"నిరతము నామెకునేనెవరో నిక్కము నాకును ఆమె యెవ్వరో"తానిర్మించిన మట్టి

సౌధము తనంతన్ నేల మట్టమ్ముగా నైనన్ జూచి దివాంధమై యరచు గా కాయమ్మ” ఇట్లైనన్నీ! - భరతుడు అయోధ్యకు వచ్చినతరువాత కైకేయి దుఃఖము తరుగుటకు బదులు హెచ్చినది దాని ఉపశమన మునకై భరద్వాజ మహర్షి కొంత ప్రయత్నము చేసినాడు. భరతుని కామె స్వరూపమును చెప్పినవాడు కూడ భరద్వాజుడే భరద్వాజా శ్రమము నుండి శ్రీరామదర్శనమునకై బయలుదేరువేళ భరద్వాజుడు ముప్పురు రాణులనుజూచి భరతునితో “ఉద్యజ్జాతీ సుమహాసుడై ముని కుమారా యెవ్వారెవ్వరుపీ” రనగా భరతుడు కౌసల్యను సుమిత్రను గూర్చిచెప్పి కైకేయినిచూచి చూపు మరల్చికొని మాటాడక నిలబ డును. అప్పటి కైకెయి మనస్థితిని మనమూహించు కొనవలయును ఆ నిశ్శబ్దమును చీల్చి భరద్వాజుడు కైకేయి మహత్త్వము ఇట్లు వర్ణించినాడు

“ అమర సాహాయ్యార్థ మరిగిన యెడ
దశరథ భూమిపాలు సారథియుతాను
ఘోర నీతి సంక్లిశ్య మానార్థవేళల
మహిపాలుని రహస్య మంత్రితాను
శ్రీ రఘు రాముని చిత్రి ధనుఃశ్రీ
కళాధృతి హేతు నూత్నగాధి ఋషితాను
సర్వదైవత ఋషి సంతానకార్య
సంఘాత శ్రీ సంధానకర్త్రి తాను
తనను పెంచిన ఋణము దీర్పను
హృదంతరాంతర ప్రాణమగు బిడ్డ నవని కంపె
మంథరా ప్రార్థనము పొంకె మగువ కైక
ఆమె నీకు గౌరవనీయురాలు కాదె”

‘భిన్నపడకోయి సర్వఘ్ను కేవలముగ
భద్రతా వారి రాశిగా బరిణమించును

భరద్వాజులు చెప్పినట్లుగా ఈకథలో ఆమెకున్న బాధ్యత నిరుపమానమైనది దుఃఖమును నిరుపమానమైనదియే ఆ దుఃఖము నామె భరద్వాజుల ముందు ప్రకటించగా మహర్షి

"సకలము కర్మాధీనము సకలము నియమిత ఫలంబుచానా! యిది యెరికి తెలియ బోవ దవ్వారికి మాత్రము నీకృతి విపరీతార్థమగున్"
అని యోదార్చినాడు

చివరకు అరణ్యములో రామభరత సంవాదములో రాముడు భరతుని మాటలన్నిటికి అన్ని విధముల సమాధానముచెప్పగా కైకేయి కొంత తల్పించుకొనిది.

'అగ్నినడిగెడి వరమునివారిసొమ్ము గాలినడిగెడునది నీవు కదలరాదు
వరములీరీతినడిగెడి వారలెవరొ తవలి యిచ్చెడివారు లాఘవులుగాని'
'ఇదివరమడుగుటకాదును ఇది యిచ్చుటకాదు ఇచ్చియిచ్చుటకాదున్
మనుడియ తమ్ముడడగిన పొదలిక మాతృమ్ముత్రోసిపుచ్చుట
యౌజా'

అని కొంత భరతుని కోరికను గురించి మాటాడును ఎవరెన్ని విధముల చెప్పినను రామమూర్తిని వనవాసమునుండి మరలింప జాలదని కైకేయికి తెలిసిన విషయమే రాముని సమాధానమునువిన్న కైకేయి

'తెలిసినదా రఘూత్తముని తెన్నది రామునితెన్ను, కన్నబి
డ్డలవనిఋచ్చు కీర్తి పసడక్కెను నాకును, డక్కె రామచం
ద్రుల దయచేత, నాయెడద నూల్కొను దీపపువర్తిచేత లో
యలబడి వచ్చు నాతని రహస్యము నేను వచింప నేటికిన్'

'అనిసభవీడి కైకచన నాస్యమునందున రామమూర్తి దుః
ఖనిభృతుడయ్యె-' ఇది కైకేయీ రామచంద్రులు పరస్పరము అర్థమౌ

చేసికొన్న తీరు. బాలకాండములో విశ్వామిత్రు డెటువంటివాడో అయోధ్యకాండములో కైకేయి అటువంటిది హనుమదాది మహా వానరులవలె అమెకూడ రామకార్యమునకై తన సర్వస్వ మర్పించిన సచ్చరిత్ర

రావణ వధానంతరము అంజనేయుడు ముందువచ్చి నందిగ్రామములో సర్వకథయు భరతునకు నివేదింవగా భరతుడన్న మాట

'కైకేయీ సముపజ్ఞ మియ్యది జగత్కళ్యాణగాథా ప్రవా
హాకారంబయి పొల్చు రామకథ, అహా! నీవు నీవంచు, ని
ర్భీకులో వారలు వారలంచును నిరూపింపంబడెన్ ధాత్రికిన్
కాకన్ కోసల రాజులన్ మిగులు నొక్కండై జగన్నాథుడున్'

కల్పవృక్షములో కైకేయికున్న స్థానమిది



# శ్రీ విశ్వనాథవారి పాత్రపరికల్పనము

సి హెచ్. యస్. వి. రమణికుమారి

సంప్రదాయ కవితా మార్గములో పరమాధికుడై, మహా కావ్యము, ఖండ కావ్యము, గేయము, శతకము, ఉదాహరణము, నాటకము, నాటిక, నవల, కథానిక ఉపన్యాసము, విమర్శనము, మొదలగు వివిధ ప్రక్రియలతో పరిపరి రీతులుగ వాగ్దేవి నలంకరించి ఆరాధించుచు నవనవోన్మేష ప్రజ్ఞా పాటవములతో భారతీయ సంస్కృతి సంప్రదాయములను స్థిరీకరించుచు తనదైన ఒకానొక భావాన్ని సంతరించుకొనిన అధునిక సుప్రసిద్ధ మహాకవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

వీరు చెళ్ళ పిళ్ళ వంశజులైన వేంకటశాస్త్రిగారికి అనుంగు శిష్యులు అంతేకాదు. అలఘు స్వాధురసావతార ధిషణాహంకార సంభార దోహల బహ్మమయ మూర్తియగు వీరి శిష్యరికము చెళ్ళపిళ్ళ వంశస్వామికే ఒక మహాభోగము

స్వీయ ప్రతిభ పాండిత్య విశేషాదువలన విద్వజ్జనుల నాకర్షించుటయే కాక భారత ప్రభుత్వముచే కవి సామ్రాట్, పద్మ భూషణ బిరుదములనంది, ఆంధ్రరాష్ట్రము, అన్య రాష్ట్రము లందును అనేక సన్మానములందుకొని ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవిగా, జ్ఞాన పీఠ పురస్కార స్వీకర్తలుగ జగద్విఖ్యాతిగాంచిన మహా కవి విశ్వనాథ ఆంధ్ర సాహిత్యమున గల వివిధ ప్రక్రియుల అన్నింటిన రామాయణము ఇతి వృత్తముగ గ్రహింపబడిన గ్రంథములనేకము లున్నవి. మఱియు నితర భాషలలోని కథ పలు విధములుగ అనువదింపబడినది రామాయణమీ విధమగు వ్యాప్తి నొందుటకు తత్కాథాంతర్గత వస్తువు యొక్క విశిష్టతయే మూల కారణము.

లోకోత్తరము, ఉదాత్తము, ఆదర్శ ప్రాయమునగు రామాయణ మింతటి జనాదరణమును, విశ్వవ్యాప్తిని, పొందుటకు మూల కారకులు మన వాగ్గేయకారులు, త్యాగయ్య, క్షేత్రయ్య, అన్నమాచార్యులు, పురందర దాసు, మొదలగువారు ఉదాత్త చరితాన్వితమైన రామకద నాపాత మధురమయ భణితిని గానముచేసి సర్వజన మనో మందిరములందు రామ ముద్రను శాశ్వత మొనర్చిన రామభక్తాగ్రేసరులు వారు

శ్రీ మద్వాల్మీకి విరచిత శ్రీమద్రామాయణానంతరము వెలువరింపబడిన రామకథాకావ్య కర్త లందరి హృదంత రాళములలో నుదయించి ఒకానొక ప్రశ్న ఉన్నది "రామాయణమును మఱల మఱల ఎందుకు రచించాలి?" అని

దానికి సమాధానముగ - అధునికాంధ్ర సుప్రసిద్ధ కవిశ్రేష్ఠులు - శ్రీ విశ్వనాథ వారి రామాయణ కల్పవృక్ష రచనకుగల అనేక హేతువులను వివరించిరి వానిలో 'జీవుని వేదన' ప్రధానమైనది ప్రతి జీవునకును పరమావధియైన నాల్గవ పురుషార్థమును సాధింపవలెనను కోరిక అంతఃకరణమునందు వ్యక్తావ్యక్తముగ నుండును. జీవాత్మ రూపములో నున్న పరమాత్మ దేహమును విడచి స్వస్వరూపమును పొందుటయే మోక్షము ఈ మోక్షార్థమును సాధింపవలెననెడు జీవ సంబంధమైన వర్ణనాతీతమగు తపనయే 'జీవుని వేదన' వ్యక్తియొక్క పూర్వజన్మ పరంపరాదాది గతము లయిన సహృదయత సంస్కారము ఆ వ్యక్తికి జీవగత లక్షణములై యొకానొక తత్త్వాన్వేషణమునందు, వేదన రూపమున వివశత్వమును కలిగించుచుండను, ఈ తృశమగు జీవుని వేదనయు, "వ్రాసిన రామచంద్రుడు కథ వ్రాసితి వంచనిపించుకో, వృథా ప్రయాసము గాక, కట్టుకథ లైహికమా? పరమా" యటంచు దా జేసిన తంద్రియాజ్ఞయు ప్రధాన ప్రేరకములు కాగా

మౌని వాల్మీకి కృత సత్కావ్య నిర్మాణ రేఖా సామాగ్రి సహితమైన భాషా సంక్రాంత ఋణమును దీర్చుకొన దలచి, అనగా సూత్రప్రాయమగు శ్రీ మద్వాల్మీకి విరచిత మహా వాక్యమయిన రామాయణమునకు భాష్య రూపమున శ్రీమద్రామాయణమును రచించి కావ్య సామాగ్రి సంబంధమైన సమస్త గుణములకు కల్పతరువుగ, మహాకావ్యముగ రూపొందించి దీనిద్వారా మౌని వాల్మీకి ఋణమును తీర్చుకొనుటకు హేతువు కాగా

రామకథా సుధా సేవనమున "తనదైన యనుభూతి తనది గాన" స్వీయానుభూతికొఱకు, ప్రకృతి-పురుషుల (సీతారాముల) అద్వైత తత్త్వమును బోధించుచు, భక్తిని - ప్రవృత్తిని స్థాపించుచు సర్వధర్మమూర్తి యైన కథా రచన ద్వారా సర్వధర్మమూల బీజముగ అవిచ్ఛిన్న సంప్రదాయ సంస్థాపనార్థియై శ్రీ విశ్వనాథ శ్రీమద్రామాయణ కల్పవృక్ష రచన గావించెను

ఆధునికాంధ్ర సాహితీ నందనోద్యాన వనంలో ఈ మద్రామాయణ కల్పవృక్ష మొక అపూర్వమైన ప్రక్రియా స్వరూపము అనవచ్చును శ్రీమద్రామాయణ కల్పతరు మూలమున అనేకములయిన శాఖోప శాఖలున్నప్పటికి ప్రధాన శాఖలుగ పరిగణింపబడు పాత్రధారులు కొందరుగలరు వారిని విశ్వనాథవారెట్లు పోషించిరో, ఆయా పాత్రల పరికల్పనములోగల వైవిధ్య మెట్టిదో "సహేతుకముగ నిరూపించుట ఈ పరిశోధనా వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము

## దశరథుడు మువ్వురు రాణులు

శ్రీమద్రామాయణమునకు మూల పురుషుడగు దశరథుని పరిచయము చేయుచు శ్రీ విశ్వనాథ ఇ-

"తన కడుపు విష్ణు బండించుకొనుట చేత
ముని జగన్నేత కశ్యపు మొదవి యుద్ది
దశరథుం డొప్పు నైక్ష్వాకు ధరణీ పతులలోన

అని అతి సామాన్యముగ చెప్పి, అతని భార్యలను, వారి స్వభావములను, వారి వారి యందా ధరణిశునకు గల ప్రేమానురాగములయొక్క స్థాయిని స్ఫురింపజేయుచు సక్రమముగ సహజముగ ఒక ఉత్పలమాల, ఒక సీస పద్యములందు వర్ణించినాడు

కౌసల్య ముక్తి కాంతా సమానాకార
నలి సుమిత్ర యుపాసనా న్వరూప
విజయ రమాకార వినయాంబుధి సుమిత్ర
కైకేయి మధుసామగాన మూర్తి
కౌసల్య నవ శరత్కాల మందాకిని
సిత పుండరీకంబు శ్రీ సుమిత్ర
మందార పుష్పంబు మహిళా మణి సుమిత్ర
కైకేయి నను నల్ల కల్వపువ్వ

దశరథున కెందరు భార్యలున్నను వారిలో మర్యాదగల ముగ్గురు వారు సద్గుణాఢ్యులు వారిలో కౌసల్య దేవేరి ఈమెను 'దేవేరి' అనుటలో ఒక పట్టపురాణిగ రాజ లాంఛనము ప్రకారము సకల విధముల మర్యాదనిచ్చి దశరథుడామెను గౌరవించుననియు, అర్ధాంగిగ తగినంత ఆత్మీయతను మాత్రమామెయందు దశరథుడు కలిగియుండ లేదనియు స్ఫొరకము

సుమిత్రను "శాంతగుణ పేటిక" అని పోల్చుటలో ఎటువంటి క్లిష్టపరిస్థితులలో నైనను ఆమెను ఉద్వేగము గాని, ఈర్ష్యా

సూయలు గాని, కోపతాదులగాని లేక నిర్మలమును, నిశ్చలమును ప్రశాంతమునైన మనస్థితి గలదను స్ఫూర్తి కలుగుచున్నది

ఇంక కైకేయిని "రాజు కంటికి హేలారతి డాగు రేకుల తళతళ కాటుక" అని వర్ణించుటలో సామంజస్యము — కాటుక — కంటికి ఆకర్షణీయమైన అలంకార విశేషమేకాదు నేత్రము ఆరోగ్యముగ నుంచు ఔషధము కూడ కైక నిట్లు కాటుకతో పోల్చుటలో నొక అంతర్యమున్నది "సర్వేంద్రియాణానయనం ప్రధానం అలాంటి ప్రధానేంద్రియమునకు ఆరోగ్యము నిచ్చును, ఆకర్షణను కూడ ఇనుమడింపజేయు గుణవిశేషము కాటుక కున్నది అటువంటి దట అలాంటిదట కైకేయి అనగా దశరథేశున కామెయే హృదయేశ్వరి. ప్రేమాస్పదురాలు. ఈ కారణముగ ఆమె ఏమి కోరినను కాదనకుండ ఆవశ్యము నెఱవేర్చవలెనను స్వభావము దశరథున కున్నట్లు మనకవగతమగుచున్నది మరియు కంటి ఆరోగ్యమును కాటుక కాపాడునట్లే దశరథుని వంశము యొక్క క్షేమము కొఱకు పాటుపడు స్వభావము కైకయందున్నట్లు విదితమగుచున్నది మరియు సీస పద్యములో వీరిని గూర్చిన మరికొన్ని మాటలున్నవి.

కౌసల్య ముక్తి కాంతా సమానాకార—నవ శరత్కాల మందాకిని ఒడిదుడుకులు లేక స్వచ్ఛంగా ప్రశాంతంగా ప్రవహించునది ఒండు తిరిగి తీసుకొన్న నీరము ఆమెలోనున్న సుమిత్రి సిత పుండరీకంబు అనగా మూర్తీభవించిన సత్త్వగుణము కైకేయిను నల్ల కల్వపూవు— ఈమె రాజు కంటికి డాగురేకుల తళతళ కాటుకి, కైకేయి తమోగుణ మూర్తి ఇచ్చుటి సుమిత్ర 'మందార పుష్పంబు" అనగా కైకేయితోడి సుమిత్ర రజోగుణమూర్తి మొత్తముమీద కౌసల్య సత్త్వమూర్తి, సుమిత్ర సత్వ రజోమూర్తి, కైకేయి వయోమూర్తి ఈ విధముగ నిండు వస్తు ధర్మముననుసరించి వ్యక్తి స్వరూప స్వభావముల నద్దము పట్టి చూపిన చిత్రణమిది ఇందు దశరథుని హృదంత రాళ

మున కైకేయికిగల స్థానమింతగా సభివర్ణించుటలో కని యుద్దేశము రాబోవు ఘట్టములలో కేకయ రాజపుత్రికి దశరథుడు వరముల నొసంగుటలో గల ఔచిత్యమును బీజ ప్రాయముగ సూచించుటయే. ఇట్లు ప్రదాన కథలో కీలకమైన విషయములకు కథారంభములోనే పాత్రలద్వారా బీజవాపము చేయుట క్రాంతి దర్శకులయిన మహా కవుల ప్రత్యేక లక్షణము మూలమున వీరిని గూర్చిన వర్ణనలేదు. సూత్రప్రాయము కథ మాత్రమున చెప్పబడినది

దశరథాత్మజా గ్రగణ్యుడయిన రామచంద్రునియెడ దశర దాదులు జూపిన వాత్సల్యము కంటె కేకయాత్మజ జూపిన వాత్స ల్యము విశేషమైనది ఔరసుడుకాకున్నను శ్రీరామచంద్రుని బాల్యము నుండియు అమితమగు ప్రేమాదరముల నాతనిపై యామె చూపి నది. రామభద్రుడును కన్నతల్లి కౌసల్య యందు కంటెను కైకేయి యందత్యంతమైన చనువు గలిగి సన్నిహితుడయి ప్రవర్తించుచుండెడి వాడను విషయము విశ్వనాథ - విరచితములయిన కొన్ని సంఘట నలను పరిశీలించినచో నిర్ధారింపవచ్చును

"కాళ్ళు వచ్చిన దాదిగ గైక కొఱకు
బరువు లెత్తును శ్రీరామ భద్రమూర్తి
నిద్రమేల్కొన్న దాదిగ రామ భద్రు కొఱక
నంగలార్చుచు 'జను' గేక యాత్మ జాత "

రామచంద్రునకు కైకేయికిగల అవినాభావ సంబంధమెంత గాఢముగా నున్నదో మరియు వారిరువురకు గల అంత రింగిక సామీప మెట్టిదో పై పద్యములో స్పష్టమగుచున్నది.

చిన్నపిల్లలు తామేదైన ఘన కార్యమును గావించినపుడు తనకు అభిమాన పాత్రులు చనువుగల వ్యక్తుల ముందాకార్యమును

గురించి ఇంతింతలుగ వర్ణించి చెప్పుట, వారును తమ పిల్లలకు దృష్టి దోషము తగులకుండ రక్షబెట్టుట మురిపెముతో ముద్దులాడుట అను నది లోకసహజకార్యము

అట్లే రాముడేదేనొక అద్భుత శౌర్య వృత్తమును గావించి నచో కైకేయి యెదుట తన ఘనతను వెల్లడి చేయుచుండునట. దానిని కన్నులార చూచిన కైకేయియు అతనికి కులదైవంబగు రంగనాథుని ధర్మ మహిమలు, ఘోని హవిస్సులు కౌసల్య పాతి వ్రత్యము, శ్రీవశిష్ఠుల తపస్సేవధులను దశరథేశుని పూర్వ తపస్సు లను ప్రశమితాఖిల దైత్యభువంబులను రక్షగా బెట్టి దిష్టి తీసిపోసి, వీపున నేల మన్నద్ది చమిరి చంకనెత్తు కొనునట.

ఇందు పరిశీలించ దగిన విశేషాంశమేమనగా — కైక—శ్రీరా ములు సవతి తల్లి కొడుకులు, లౌకికముగ ఆలోచించినచో కైకకు శ్రీరాముని యందు మాత్సర్యము, ఈర్ష్యాసూయా ద్వేషము—లుండ వలెనేగాని తద్వ్యతిరేక భావములగు ప్రేమాదరములుండ అసహజము అట్లే శ్రీరామునికిను కైకయందు భయిము, దాని ద్వారా కలుగు అసామీప్యము మొదలగునవి ఉండవలెనే కాని తద్వరిక్తములైన చనువు, మమతానురాగము లుండుటయు అసహజమే

అయినను లోక సహజమయిన లక్షణములకు విరుద్ధముగ లోకాతీతములగు లక్షణములు నాయా పాత్రలలో ప్రోదిచేసి పాత్ర చిత్రణము చేయుచు ఔచిత్యమును పోషించుట కవి రచనా ప్రౌఢికి నిదర్శనము అంత్రేకాదు వీరి యనుబంధము నింతగా వర్ణించుటకు కొక ముఖ్యోద్దేశ్యమున్నది శ్రీరామావతార ప్రయోజనమును క్షుణ్ణ ముగా నెఱిగిన వక్తి కైకేయి అందువలననే ఆమె పినతల్లిగా కాక, రామావతార ప్రయోజనమును నెఱవేర్చుటకు కంకణము గట్టుకొనిన

పరమ ధీక్షా పరతంత్రురాలుగా కైకేయి శ్రీరాముని యందు విశ్శేషముగ మమతానురాగములను కల్గి యుండుటయే కాక, తదనుబంధముతోడనే శ్రీరామ వ్యక్తిత్వమును తీర్చి దిద్దుటకు నిరంతరము కృషి చేసినది. శ్రీరామావతార ప్రయోజనమును నెఱవెర్చుట తన ప్రధాన కర్తవ్యముగా భావించినది కైకేయి తత్కర్తవ్య నిర్వహణమున కనువుగా రాముని విషయమున శైశవ నుండియు ఆమె జాగరూకత వహించినది తత్కారణముననే వటువై తనకు మ్రొక్కిన రామ చంద్రునకు కైకేయి, 'మణులు కుట్టి పట్టు దట్టిన పిడిని, మరకతమ్ము తొడిగిన చుఱకత్తిని, వజ్ర పంఖితమైన వాలుటమ్మును భిక్షగా నిచ్చినది శ్రీరామచంద్రుడను -

"మొగమున నింతయై మురిసిపోయెను రాముడు, కైక కన్నులం దిగము మటిఁత యంత యయి యేళ్ళులు వారె"

రామచంద్రునిలో గల యానందోత్సాహమునకు కారణము వారి ఇరువురును పరస్పరము ఒకరి నొకరు క్షుణ్ణముగా నెఱుంగుటయే

రాముడు భావిలో దైత్య సంహార మొనరించి శిష్టరక్షణ గావించి ఆదర్శ పురుషుడు కాగలడని కైకెయి విశ్వాసము అందు వలననే శ్రీరామ చంద్రునకు కైకయి శౌర్య ప్రేరకమగు భిక్షనాతని కొసంగినది తన కభీష్టమగు వస్తువు నామె నుండి తనకు లభించుట వలన అతనిలో అవిధముగ మురిపెము గల్గినది

యదార్ధమునకు కైకేయికి రామచంద్రుని యెడల విశేష మయిన మమతానురాగము ఉన్నను, బాలకాండముననందే యింతగా నభివర్ణించు అవసరము లేదు, అయినను భవిష్యమున రామున కరణ్యవాసమునకు కైకేయి వరముల నడుగుటలో ఆమె స్వార్ధము కారణము కాదను అభిప్రాయమును పాఠకుల హృదంతరాళములలో

ధృవపరచి ఇంతవరకు కైకేయి కోరిన వరములు స్వార్థపూరితములు. ఆమె మూర్తీభవించిన స్వార్థమునకు ప్రతీక" అను అపవాదులను పాఠకులలో రూపుమాపుటకే విశ్వనాథ వారు కైకను శ్రీరాముని యందుగల మమతను, శ్రీరామచంద్రునకు కైకేయాత్మజాతతో గల సాన్నిహిత్యమును నింతగా అభివర్ణించినాడు

## మంథర

రామ కథలోని ప్రధానమైన మలుపునకు ముఖ్య కారకు రాలు, కేకయి రాజపుత్రిక కంపకముగ వచ్చిన దాది మంథర. రామాయణమున నామె పాత్ర లేనిచో రామకథ పరిసమాప్తి మరి యొక విధముగ మలుపు తిరిగెడిదేమో అటువంటి మంథర పాత్రను రామాయణ కల్పవృక్షమున మరింత పరిపోషకముగ మలచు నుద్దే శ్యముతో విశ్వనాథ బాలకాండముననే ఆమెను ప్రవేశ పెట్టినాడు ఈమెను గూర్చి పాఠకులకు పరిచయము చేయుచు, కవి -

"అకృతికి నొంటెకు జెల్లెలు
కైకేయికి ముసలిదాది కలదొక్కతె తా
నే కాలము పతి యచటికి
బోకుండిన దాని తోడ మునుగును దేలున్"

ఇది ఆమె బాహ్య స్వరూప వర్ణనము ఏ వ్యక్తినైనను బాహ్య స్వరూపమును బట్టి మానసిక లక్షణములను కొంతవరకు అంచనా వేయవచ్చును

పై పద్యము ననుసరించి ఈమెతో కైకేయికి గల సామీప్య సంబంధ మెట్టిదో, కైకేయిపై ఆమె పరిభాశ మెంతగా నున్నదో ద్యోతక మగుచున్నది.

అల్లాగే మంధర యందు కైకేయి పరివర్తన మెట్లుండునో తెల్పు పద్యములు రెండున్నవి.

"నుదుట గస్తూరి బొట్టు చదురుగా దీరిచి
మునలిది వలదన్న మొగము తుడుచు
శ్రీరంగనాథుని సేవింప మడిగట్టి
మంథర వలదన్న మానివేయు
గౌసల్య గన బోవగా బండి బిలిపించి
వగ్గు కాదన్నచో బంపివేయు
గోర్కి సింగారించుకొని పతి గలయగా
దాది కిష్టము లేదో తగ్గిపోవు
తల్లి నెఱుగని దోషమ్ము తగిలి కైక
కన్న తల్లి జూడని మమకారమెల్ల
దన్ను జేతుల బెంచిన దాది మీద
నొలుక పోయును గుండెలో నులికి పడుచు"

మడికట్టు వలదన్న మంథర
నాతి లోలో రంగనాథు గొలుచు
దాది యుత్తిడి మహాధన చేలములు గట్టి
కాంత కాషాయిముల్ కాంక్ష సేయు
మునలి రత్నాసనమ్మును పీడనీయమి
బాదుకల్ తొడిపోవ, బడతి యెంత
నడివగ్గు నదువులు నగ మిష్టమై కాక
యతివ నేనిందుండ ననుచు బలుకు
నెపుడొ మంథర మాటకు నెదురు తిరుగు
నొక్కొకప్పుడు మంథర కొడిగి యుండు
నెంత గొడ్డమ్ములైన నాయింతి యెడద
ప్రభువు శ్రీరంగనాథుడు పాయకుండు"

కైకకు మంథర ఏమి చెప్పిన నదియే ప్రమాణము. వస్త్రధారణము, అలంకరణము, ఇష్టదేవతార్చనము, కౌసల్యాదుల దర్శనము, అదినిది యననేల? సర్వ విషయములందును ఆమెకు మంథర మాటయే ఆచరణీయము కైక నిర్వర్తించు ప్రతి కృత్యము నందును సలహాల నిచ్చుచు, తన యిష్టాయిష్టములను వ్యక్తము చేయుటయే కాక, తన కిష్టమైన కార్యములందు కైకకు ప్రవృత్తియు అయిష్ట కార్యములందు నివృత్తిని కలిగించుచుండును మఱియు సరియైన పెంపకములేని రాచ సంతానమగుటచే కైకకు మంథరయే సర్వస్వము, ఆమెయే కైకను గరుపంపు దినమును, పట్టుదలయు సర సమును, మొదలగు రాచ స్త్రీల కావశ్యములగు లక్షణములన్నింటిని నేర్పినది. కైకయు జన్మించినదాడిగా కన్నతల్లి నెఱుగకుండుటచే నామెకు తల్లియందుండు మమకారము నంతటిని, తనను చేతులార పెంచిన దాదిపై జూపు చుండును ఒక్కొకసారి మాత్రము వ్యతిరేకించు చుండును

కైకేయి మంథర పాత్రల యొక్క స్వభావ స్వరూపములను తెలియజేయు మంథర యొక్క ప్రభావము కైకేయి యెడ ఎంతగా నున్నదో అభివర్ణించుచు, ఆమె యెడ కైక కంతటి భయము, ఆమె మాట జవదాటలేని మానసిక బలహీనత కైక కల్గియుండుటకు కారణమును సహేతుకముగ నిరూపించి, భవిష్యత్తులో కైకేయి "దశరధుని రామ వనవాసము భరతుని పట్టాభిషేకము" అను వరముల నడుగుటలో కైకేయి స్వార్థ మినుమంతయైన లేదనియు, కైకేయి నిర్వర్తించు సమస్త కార్యములకు మంథరయే ప్రేరణకు రావాలనియు నొక్కి వక్కాణించుటకు, కైకేయి పాత్రను మరింత స్వచ్ఛముగ నిస్వార్థముగ మలచుటకు మంథర పాత్రనింతగా వర్ణించి బాలకాండము నందే భవిష్యత్కథా గమనమునకు నాంద పల్కినాడు విశ్వనాథ

లౌకికముగ నాలోచించినచో విశ్వనాథ మంథర పాత్ర

యందు కూడ ఒకానొక విచిత్ర రీతిలో ఔచిత్యమును పోషించినాడు అనిపించును

లోకములో కన్న ప్రేమకంటె పెంచిన ప్రేమ గొప్పది. "అను విషయమును నిర్ధారించు ఇతి హాసములు మన వాఙ్మయమున నున్నవి ఉదా:- శకుంతల - కణ్వ మహర్షి శ్రీకృష్ణుడు - యశోద.

ఈ పెంచిన మమతా విశేషముచే మంథర కైకేయియొక్క వంశాభివృద్ధిని కోరి, దశరథుడు శ్రీరాముని పట్టాభిషిక్తుని గావించు సన్నాహము చేయునపుడు సమయము కనిపెట్టి, పూర్వము దశరథుడు తనకిచ్చిన వరములను ఇప్పుడడుగుమని ప్రేరణ చేసినది. ఇది స్థూల దృష్టికి గోచరించు విషయము సూక్ష్మ దృష్టితో పరిశీలించినచో శ్రీరామావతార ప్రయోజనము సిద్ధింపజేయు ప్రధాన పాత్ర మంథరయే యనిపించును ఈమె ప్రేరణ బలవత్తరముగా లేనిచో కైకేయి దశరథుని రామసంబంధమైన వరము లడిగెడిది కాదేమో భరతుని పట్టాభిషిక్తుని గావించుటకు రామ వనవాస మావశ్యకము కదుగదా, మరేదైనా మార్పు చేయవచ్చును; కాని ఏ విధమయిన మార్పు చేసినను శ్రీరామ వనవాసము వలన కలుగు దుష్ట శిక్షణ, శిష్ట సంరక్షణ రూపమగు శ్రీరామవతార ప్రయోజనము నెరవేరదు అందువలననే భరతుని పట్టాభిషేకముతో పాటు శ్రీరామవనవాసమును కోరికను గూడ కోరుమని కైకేయిని మంథర ప్రేరేపించి, తన్మూలముగ శ్రీరామావతార ప్రయోజనమును సిద్ధింపజేయు కార్యములను నిర్వర్తింపజేయుటకు ప్రోది చేసినది

మఱియు మంథరను అకృతికి ఒంటెకు చెల్లెలని పోల్చుటలో విశ్వనాథవారు ఔచిత్యమును పోషించి రనవచ్చును. ఎట్లనగా - ఒంటె ఎడారి ప్రాంతములలో తన శక్తికి మించిన భారమును సహితము వహించు వాహకము

రహదారులలో ప్రయాణము మెవ్వరికైనను సులభము – సంగమము కాని ఎడారులలో అధిక భారముతో చేయుట దుర్లభము. అయినను ఒంటె తన ఏ సహజ ప్రవృత్తితో వృత్తి ధర్మము నిర్వర్తించునో అట్లే మంథరయు తన ధర్మమును పాటించినదని, విశ్వనాథవారి ఉద్దేశ్యము చెప్పుట ఎట్లనగా కైకేయ రాజుపుత్రికి అరణపు దాదిగా వచ్చిన మంథరకు కోసల దేశము అనుపానులు తెలియని ఎడారి ప్రదేశము వంటిదే

అయినను తల్లి స్థానములో నుండి కైకను బాల్యము నుండి పెంచి పెద్దచేసి ఆమె సర్వసమును తానే అయి పెంచిన మమత అనెడు సహజ లక్షణముచేత కైకేయి వంశాభివృద్ధి కోరియే కైకతో దశరథుని వరముల నడుగుమని ప్రేరేపించినది కాని ఆ మంథరకు స్వార్థము అణుమాత్రము లేదు ఎందువలననగా ఆమెది కేవలము పెంపుడుదాది స్థానము కైకేయి వంశమెంతగా అభివృద్ధి పొందినను ఆమె స్థానములో స్థాయిలో ఉన్నతమైన మార్పు సంభవము కాదు మరియు ప్రత్యక్షముగ కైకేయి వంశాభివృద్ధితోపాటు పరోక్షముగ దశరథుని వంశోన్నతికి, అదే విధముగ శ్రీ రామావతార ప్రయోజనమును సిద్ధింప జేయుటకు ప్రోడచేసినది, ఇంత స్వార్థరాహిత్యముతో ఇన్ని సత్కార్యములకు కారణ భూతురాలయిన మంథరకు దశరథుడు పరివారము లోకము నేటివరకు "కుటిల స్వభావురాలు" అను నిందా పూర్వకమైన ముద్ర వేసినది ఇది శ్రీరాముని యెడ వారి వారికిగల అభిమానమే కారణమైనను పాపము మంథర పాత్రను విశ్వనాథ వారు చాకచక్యముగా చిత్రించిరి

## విశ్వామిత్రుడు

పితృవాక్య పరిపాలకుడును, ఏక పత్నీవ్రతుడునై ఆదర్శ ప్రాయములైన ననేకములగు ఇతర గుణములను సంత

రించుకొని, పురుషోత్తమునిగ రూపొంది దుష్ట శిక్షణ, శిష్ట రక్షణా రూపమగు అవతార ప్రయోజనమును నెరవేరుట కనుకూలముగ బాల్యము నుండియు శ్రీరామ వ్యక్తిత్వమును తీర్చిదిద్దిన రెండవ వ్యక్తి విశ్వామిత్రుడు

విశ్వామిత్రుడు రామలక్ష్మణులను గొనిపోయి సమ స్తాస్త్ర శస్త్ర విద్యా పారంగతులను చేయవలెనను తలంపుతో, పిమ్మట దుష్ట శిక్షణ, శిష్ట రక్షణల నాతనితో నిర్వర్తింప జేయవలెనను నుద్దేశ్యముతో నతడు దశరథ మహారాజు గృహమున కేతెంచెను

అతని యాగమున మును దర్శించినంతనే దశరథ మహారాజు పరమానంద భరితుడై —

సిరి సైసేకుటు గృహంబులు త్రివేణి సంగమ స్నానపు
జ్ఞా విర్భావము గల్గె. నాయెడల గాయత్రి మహాదేవి శ్రీ
సావిత్రీశ్రుతి ద్రష్ట భేదముగ సాక్షాత్కార మిప్పించె నే
లా వేదమ్ములు నాల్గు నాలుగు యుగాలంబాడి నట్లయ్యెడిన్.

అని ప్రస్తుతించుచు అత్యంతానందానుభూతితో విశ్వామిత్రునికి స్వాగతము పల్కినాడు దశరథధరణీశుడు పైపద్యముతో "నాయెడ .. మిప్పించె అను వాక్యము పరిశీలింపదగినది

"నగాయత్ర్యాః పరం మంత్రం" అటువంటి ఉత్కృష్టమైన గాయత్రీ మంత్రమును తన అనంతమైన తపో బలంతో సాక్షాత్కరింప జేసికొనిన ద్రష్ట విశ్వామిత్రుడు కాబట్టి ఆయన సాక్షాత్తు గాయత్రీ స్వరూపుడే

దశరథుడు సూర్యవంశపు రాజు వారి కులదైవం సవితృడు ఇప్పుడు విశ్వామిత్రుని రూపంలో మహా చైతన్య మూర్తియైన సవితృ స్వరూపం గాయత్రి మూర్తి యైన విశ్వామిత్రునితో చేరి తనకు

సాక్షాత్కరించినట్లుగ నున్నదని దశరథుని అనుభూతి. ఇచ్చట గాయత్రీ స్వరూప సహిత యైన సావిత్ర్యాకృతిని దర్శించిన ద్రష్ట దశరథుడు "ద్రష్ట భేదముగ" అనుటలో సారస్యమిది

పై యనుభూతితో భక్త్యావేశానందాతిశయ పరవశుడైన దశరథుడు విశ్వామిత్రునితో నిట్లనెను మీ రెటువంటి కోరికయు లేకయే ఇచ్చటకు వచ్చియుందురు. అయినను నేదైన నొక కోరికను నన్ను గోరుడు నేను మీవంటి తీర్థమతుల కోరిక దీర్చి జన్మ సాఫల్య మొందుదునని పలుక చు _

ఇది యడుగ వచ్చు గాదని
మది నెంచకు డేదియైన మామక పుణ్యా —
స్పదము హారా త్వరితమ నీ
వదనంబున నుండి రానె వలయును స్వామీ

అని విశ్వామిత్రుని పరిపరి విధముల నేదైన కోరిక కోరు మని మనవి చేయగ, అతడును రాజు మాటలకు ఆనంద తరంగింత అంతరంగుడై రఘుకుల మర్యాదార్హమైనట్లు మాట్లాడితి వంచు, మహారాజును ప్రశంసించుచు తాను వచ్చిన కార్యమును గూర్చి చెప్పెను ఓ రాజా! పాపము నీవు చాల కాలమునకు లేక లేక రత్నపు దునక వంటి పుత్రుని పొందితివి, ఏ మున్యాశ్రమమున జూచినను నీ బాలుని గూర్చిన ప్రశంసా వాక్యములే విన వచ్చు చున్నవి పసి వానిని బొగడ రాదు కాని - నీభాగ్యమిదియని ఎట్లు చెప్పగలను? అని పలుకుచు -

"నాపని జెప్పెద నాపైని, ముందు నీ
సుతు రామభద్రుని జూడవలయు" ననగా

అంతట ధరణీశుడు రామభద్రుని పిలపించగా, అతని వెంట

సవినయుడై లక్ష్మణుడును వచ్చెను. పిమ్మట దశరథుడు రామలక్ష్మ ణులకు విశ్వామిత్రుని గొప్పతనమును వర్ణించుచు పరిచయముగావిం చెను విశ్వామిత్రుడు శ్రీరామ గుణ వర్ణనము గావించి పలు రీతుల శ్లాఘించుచు

'మొనసి భృశాశ్వ దత్తములు మూల్గుచునున్న వి నాకడన్ మహా
స్త్ర నిభృత విద్యలన్నె రఘురామునకై యది యెల్ల నిచ్చెదన్
మనుజ మహేంద్ర! పంపుము కుమారుని నా వెనువెంట"

అని పలుకగా దశరథుడును నిషణ్ణతతో ఆనవతశిర స్కుడై, లోనుత్తల మందుచు శ్రీరాముడు తన బ్రతుకంతయు వాచి కన్న పొత్తుల బిడ్డయనియు అతనిని విడిచి తాను నిముసంబైన నిలువ లేడనియు చెప్పుచు -

పసివాడే పసివాడు రాఘవుడు నా ప్రాణంబులో ప్రాణమా
నిసువుం గాంచగ పడ్డ కష్టములు తండ్రీ! విస్మృతిం గాంచలే
ననలీ నాటికి నేను. నీ కరుణ కట్టా! యెంత దూరమ్ము మ్మ
మసలు వచ్చెనొ లేదో రామునకు శంస్యముల్ పదాగార్వర్షముల్.

అని రాముని వియోగమును సహించలేని తన బలహీనతను వెల్లడి చేయుచునే తానే కాదనియు శ్రీరాముని కన్నతల్లి కౌసల్యయు యోర్వలేదని ఎవరెట్లున్నను కైకేయి శ్రీరామ వియోగమును ఓర్వ లేదని నిర్ధారణ పూర్వకముగా దశరథుడు చెప్పెను

"నీ కొడుకును గైకొని చని
మాకాకలి యంచు దిందుమా? పిచ్చి న్నపా!
మాకడ బ్రశస్త మస్త్ర
వ్యాకృతి కలదద్ది నేర్చి పంపెద మింతే!

ఇమ్మగు విద్య నేర్పెదము నింకను నాకొక చిన్న మెత్తు కా
ర్యమును జేసి పెట్టవలె నాపయి బూవులలోన బెట్టి కై
కొమ్మని నీ కుమారుడిడుగో నని నీకు యొసంగు వారి మా
పిమ్మట నీవుగా నతని విడవలెన్ మఱి మాకు నేటికిన్''

అని దశరథు ననునయించుచు, రామచంద్రుని తన వెంట బంపుమనుటలో తన ఉద్దేశ్యమును తెలుపుచునే భవిష్యములో జరుగబోవు విషయమును "నీవుగా నతని వీడవలెన్" అను పల్కుల ద్వారా సూచించినాడు విశ్వామిత్రుని యీ పల్కుల ద్వారా "కైక వరముల ప్రకారము దశరథుడే స్వయముగా రాము నరణ్యములకు బంపుట" అను కావ్యార్థము సూచింపబడినది

విశ్వామిత్రుడు ఇంతిగా జెప్పినను మమకారమును అపుకొనలేని అశక్తతతో దశరథుడు అతని కోరికను మన్నించలేక పోయినాడు ఇక విశ్వామిత్రునిలో నోరిమి నశించినది కోపము మితిమీరినది అటువంటి స్థితియందును కర్తవ్య నిర్వహణకై పర తంత్రుడైన కౌశికుడు కోపము నణచుకొనుచు దశరథు నుద్దేశించి

"అవునయ్యా! అవు నిత్తునంటి మొదలీ యంతంబునం దీయ నం
టివి, పోనీ! రఘువంశయోగ్య మగనో నీచేత! నీకున్ సుఖం
బవు నీబంధులు నీవునున్ సుఖము పెల్లె యుండుడు బోదు మా
నవ నాథా! సుఖమౌత నీకును ప్రతిజ్ఞాభంగ పుణ్యాబ్ధికిన్"

అని పల్కినాడు ఇందు విశ్వామిత్రుడు రాజును సంబోధించిన తీరు, పల్కుల పౌరుషము, అందలి నిష్ఠురతయు, గమనింపదగినవి అంతటితో విశ్వామిత్రు డూరుకొనలేదు కుపితి విధుర చలితాంగుడై సభాసదనంబు వదలిపోయినాడు విశ్వామిత్రుని చేష్టితము దశరథుని మనమున సంచలనమును రేకెత్తించినది ఒకవైపు విశ్వామిత్రు వంటి

ముని ఆగ్రహము, రెండవ వైపు వంశమర్యాదను కాపాడవలసిన బాధ్యత. ఈ రెండును మఱియు పుత్రవాత్సల్యము నణచుకొనలేని దైన్యస్థితి వీనిని ఎదుర్కొన గల మానసిక సంసిద్ధత లేని దశరథుడు కులగురువు వశిష్టుని ప్రాంజలియై, గాధిసుతుడు ప్రథమ కక్ష్యాంతరము గూడ దాటిపోవకముందే మార్గమును జూపుమని అభ్యర్థించినాడు. అంతట రఘువంశ రాజశ్రేయో కాముకుడగు వశిష్టుడు దశరథు నుద్దేశించి -

"..మనుజాధిప! నీవు తొలుత మాట యొసంగి తా
వెనుక వెనుకాడ నేటికి
నినకుల మర్యాద యగునటే! ఇది తాతా!
మొదటు నిత్తునంచు బిదప నీకుండుట
యశ్వమేధ యాగ హతము సేత
మొదటు బావిద్రవ్వి పిదప బూడ్పించుట
యీపు ధర్మమూర్తి విదియు దగునె"

అనుచు కుశనందనుని శక్తియుక్తులను, అతని మహాత్మ్యమును, కాంతిదర్శన శక్తిని గూర్చి వివరించి, 'నీ కుమారు ననుగ్రహింప గోరియే యతడిచటకు వచ్చెన' ను విషయమును విశదపఱచినాడు అంతట ముదితాంతరుదార సముజ్జలత్తనూతనుతర మూర్తియై భూమిపతి రాముని కబురంపెను రాముడును సలక్ష్మణుడై యరుదెంచగా వారిఱువురను రెండు చేతులతో గ్రహించి మోదవీచి మృదు కంపనుడై తొలియేన్గు గుమ్మమున దాకొనియున్న కౌశికునకు సమర్పించినాడు.

ఈ సన్నివేశమున గల విశేషమేమనగా సహజ కోపస్వభావుడైన విశ్వామిత్రు సెంతయో శాంతమూర్తిగా చిత్రించుట శ్రీరాముని తనతో పంపుమని విశ్వామిత్రుడడుగగా దశరథు

డంగీకరింపలేదు సరికదా, వివిధములగు అభ్యంతరములను వెలుబుచ్చినాడు తత్సమయమున విశ్వామిత్రుడాతనిని శపించు టయో అతని ఆగ్రహమున కోర్వజాలని దశరథుడు శ్రీరామునతని వెంట తప్పక పంపును, కాని అట్లు జరుగలేదు విశేషించి దశరథుని పలురీతుల ననునయించుచు తానేయుద్ధేశ్యముతో రాముని పంపు మనుచున్నాడో విశదపఱచినాడు

రామభద్రుని సకల భాధ్యతలను తాను స్వీకరించి శస్త్రాస్త్ర విద్యను ఉపదేశించి, రాముని వలన తనకుగల కార్యమును సిద్ధింప జేసుకొని తిరిగి భద్రముగ అప్పగింతునని దశరథునకు జెప్పి నాడు అయిన అతడు తన అంగీకారమును జూపలేదు. చివర కాగ్రహమధికమయినను విశ్వామిత్రుడు సభానదనంబును వీడి ప్రథమ కక్ష్యాంతరబున గూర్చుండెనేగాని పూర్తిగా తత్ప్రదేశము నుండి నిష్క్రమింపలేదు కారణము దశరథునిపై ఆగ్రహమును ప్రదర్శించుట, లేక అతనిని శపించుట విశ్వామిత్రుని ఉద్దేశ్యము గాదు కేవలము శ్రీరాముని తనతో గొనిపోవుటయే అతని ఉద్దే శ్యము తదుద్దేశ్యమును సిద్ధింపజేసికొనుట కొఱకే విశ్వామిత్రుడు దశరథుని యెడ సంతటి సహనమును ప్రదర్శించినాడు.

మఱియు నీ సన్నివేశమున మఱియొక విశేషమున్నది. విశ్వామిత్రుడు బ్రహ్మర్షి దశరథుడు చక్రవర్తి ఇఱువురు ఉన్నతులే అటువంటి వారి నడుమ ఒకరు అర్థియు, మఱియు ఒకరు దాతయు రుగుటుగాని, ఒకరు ఆదేశకులు మఱియొకరు తదనువర్తకులుగావి యగుట సముచితముగాదు అందువలననే విశ్వామిత్రుడు దశరథుల సంభాషణమును వారివారి పాత్రోచిత్తము లగునట్లుగనే పరికల్పించి నాడు కవి ఇట్లు పాత్రోచితము లగునట్లుగానే ఔచిత్యమును పోషిం చుచు ప్రధాన కథాగమనమునకు భంగముకాని విధముగ సంభాషణ ములను రచించుట కవి శిల్పజ్ఞతకు నిదర్శనము.

రఘునందనుని తనతో బంపుమని విశ్వామిత్రుడు దశరధుని గోరునపుడే రాముడెవరో దనకు దెలియొనను విషయమును దశరధాదుల కెఱింగించను _

"ఈ జులపాల జత్తుగల యీ పసిబాలుని నేనెఱుంగుదు
రాజ! యొసంగ గావలయు రాముని నాకయి దైత్యలోక ప్రా
ణాజిత బద్ద పీరుడయినట్టి యుముండితండా దితి ప్రమా
తాజిన మంత తానొలుచు సద్భుత శౌర్య నిధాన మీతండు"

"దైత్య తనూ విదారణ విదాన పటిష్టుండు రామమూర్తి దౌ
ర్గత్యము గల్గె దైత్యులకు గాలము చేరువ యయ్యె వారికి
సత్య పరాక్రముండు రఘుశాబకు డేను నెఱుంగుదు దప
స్సిత్య వృతాత్మ దీధితి వశిష్టు డెఱుంగును దక్కు మౌనులు"

అని, రామ స్వరూపమును విశదపరచి, వశిష్టాధి మహర్షులకు సీతడెవరో తెలియునని పల్కి, తాను రామభద్రునకు బహువిధ శ్రేయంబు గూర్తుననుచు, నాతనిని తనవెంట బంపుమని దశరధునకు హితమును భోదించుచు, రాముని భాధ్యతను తాను స్వీకరించి_

"క్షీరాస్యుండగు తండ్రికి బహువిధ శ్రేయంబు గూర్తు ద్రిలో
కీ రారాజ దుదారకీర్తి విభవ క్రీడా నిధిం జేయుదున్"

అని పలికినాడు దశరధున కిచ్చిన ఈ వాగ్దానమును నాతడు మునమున సుస్థిరముగ నిలిపి కొనివాడు అందువలననే రామ లక్ష్మణులను తన వెంటగొని పోవునపుడు వారి నతడు తల్లవలె లాలించుచు', తండ్రివలె హితము నుపదేశించుచు, శిశు మనస్తత్వ మును బాగుగా నెఱిగిన ఉత్తమ గురువుగా సమస్త శస్త్రాస్త్ర విద్య లను వారి కుపదేశించినాడు -

కులగురువగు వశిష్టు నాదేశము ననుసరించి దశరథుడు తన పుత్రులను విశ్వామిత్రుని వెంట బంప వారు విశ్వామిత్రు ననుసరించుచు పయనమును కొనసాగించిరి మార్గమధ్యమమున నొక్క మారును విశ్వామిత్రుడు వారిని వెనుకకు దిరిగి చూడలేదు అట్లు పయనించుచు వారు సరయూ నదితీరమునకు జేరిన తరువాత విశ్వామిత్రుడు రాముని సంభోదించుచు -

"కొనుము జలంబు మూర్తమును గొంచెములో నయిపోవు బ్రాస్తవేళను గ్రహియింప రమ్మతి బలా బలలన్ జను రెండు విద్యలన్"

అని పలుకుచు, ఆ విద్యల వలన ప్రయోజనమును, వాని మహాత్మ్యమను దెలిపి రామచంద్రుని వానిని గ్రహింపు మనగ, రాముడును శుద్ధాత్ముడై, ఆచమించి, ఆ విద్యలను పరిగ్రహించెను పిమ్మట పసివాండ్రగు రామలక్ష్మణుల నుద్దేశించి -

"మూర్తము దాటి పోవునని ముందుకు దూసుకు వచ్చినాడ మీ
కార్తియు గల్గెనేమొ? పథమందున వెన్కకు జూచివన్ శుభా
వర్తము కాదటంచు వెనువ్రాల నటుంచను"

వాత్సల్యముతో వారి ననునయించు విశ్వామిత్రుని పల్కులను విని తల్లివలె నాదరము చూపుచు లాలించు చుండిన నాతని పల్కు కాకృష్టులె నర్తిత చేతులై, మార్గాయానమున మఱచి విశ్రాంతి నొందిరి.

అంతట శర్వరి ప్రభాత ప్రాయమైన దుర్వానం స్తంశ యానులయిన, గాకుత్థ్సలను గాంచుచు విశ్వామిత్రుడు -

"తొలి వెలుగయ్యె నిదోయి యోయి యో కో
సల సుత సుప్రజ సాధు రామచంద్రా
తొలి వెలుగయ్యె నిదోయి కోసలేయా
మెలకువ వచ్చె నె మీాకు రామభద్రా"

అనుచు "లేచి దైవమైన యాహ్నికంబు దీర్చుండని" దల్లి పిలుపు కన్న ప్రేమార్ద్రము మృదువునైన ముని మాటకు మేల్కొని దాశరథుడు నవ్వుచు లేచి, సుస్నాతులై, " గృతోదకులు, నిర్వర్తిత జపులు గృతాహ్నికులు ముని పాద నమస్కారులు, సంహృష్టులునై గమనాభిముఖులైరి కేవల మిచటనే నీ సందర్భముననే గాక రామ లక్ష్మణులతో మౌని మిథిలానగరమునకు జేరునంతవఱకును, అటు పిమ్మటయు గూడ దాశరథుల యోగక్షేమములను తల్లి వలె విశ్వామిత్రుడాదరించుచునే యున్నాడు,

మహా పాతకురాలును, వికృతాకారియు, భయోత్పాదియు, దుష్ట బలాన్వితయు యగు తాటక కెదురు నిలిచి నామెను సంహరించి పరిభువుగా ప్రజారక్షణము చేయుట ద్వారా గురుఋణమును దీర్చుకొనిని శ్రీరాముని —

" కౌశికుడంత రాముని ముఖంబును మూర్ధము ముద్దులాడి యీ
దేశము తాటకా భయము దీరి తటంచును బొంగి పొంగి "

అనంద తరంగిత చేతనుడై రఘురాముని ప్రశంసించినాడు. తమ కీర్తి ప్రతిష్ఠలను పెంపొందించుచు కార్యముల నాచరించిన పుత్రునియందు తండ్రియు, సర్వవిధముల గురువును మించిన ఘనతను సంతరించుకొని తనకు ఖ్యాతి దెచ్చు శిష్యునియందు గురువును వాత్సల్యాదరముల నభివ్యక్తము గావించుచు, జేయు చేష్టితమిచట రాముని యెడ విశ్వామిత్రుడు చేసినాడు

## ఋ శ్య శృ ం గు డు

ఋశ్యశృంగుడు విభాండకుడను మునిపుత్రుడు. ఒకనాడు విభాండకుడు నదిలో స్నానమూచరించుచుండగా, ఇంద్రశాపముచే ఊర్వశి చిత్రరేఖయను నామాంతరముతో మృగిగా జన్మాంతరము నొంది, అదే నదియుందు జలపానము సేయుచుండ, దానిని గాంచి మోహాపరవశుడగుటచే నతనికి రేతఃస్ఖలనము జరిగినది మృగియు జలముతో పాటు విభాండకుని తేజస్సును గూడ సేవించెను. తత్ఫలితముగా ఋశ్యశృంగుని జననము సంభవించును.

ఈ ఋశ్యశృంగుని కథ రామాయణ భారతముల రెంటియందు నున్నది అయినను రామాయణమునకు ఋశ్యశృంగుని కథతో గల సాన్నిహిత్యము, అవినాభావ సంబంధము భారతమునకు లేదని చెప్పవచ్చును కారణము భారతమున ఋశ్యశృంగుని వృత్తాంతము ప్రాసంగిక కథనము, కాలకర్మ ప్రభావమునకు లోనైన ధర్మరాజు వనములందుండి, కాలమును వెళ్ళబుచ్చుకొనుటకు తనకు ప్రత్యక్షముగనున్న నారద, రోమశ, మార్కండాయాదుల నేవేని కథలు జెప్పవలసినదిగా ప్రార్థించగా, తత్సమయముననా ఋషులలో రోమశుడీ కథను వివరించును ఇంతవరకే భారతమున నీ కథకుగల స్థానము. దీనివలన ప్రధానేతివృత్తము మారుటగాని కొనసాగటుగాని జరుగలేదు కాని ఋశ్యశృంగ విరహితముగ రామాయణము లేదు అదెట్లనిన రామాయణమున ప్రధాన పాత్రధారుడు రామచంద్రుడు దశరథుడు పుత్రకామేష్టి చేయుటలో ప్రధానోద్దేశ్యము అతడు పుత్రవంతుడగుటయే ఈ విధమగు ఫలమును దశరథుడు పొందుటకు ఋశ్యశృంగుడే నిర్వహింపవలెను ఇది దేవ రహస్యము ఈ విధముగ రామాయణ కథకు ఋశ్యశృంగునకు అవినాభావ సంబంధమున్నది

అగ్నియు, తండ్రియు దప్ప నితరులను కనీసము స్త్రీ పురుష భేదము నెఱుంగక, కఠోర బ్రహ్మచర్యమును స్వీకరించిన ఋశ్యశృంగుని లౌకిక ప్రపంచములోనికి రప్పించినవాడు రోమ పాదుడు. లోకమన నేమియు తెలియ నతనిని జనపథమునకు రప్పిం చుట కొరక అనివార్యమగు హేతువును సృష్టించి ఆ హేతువును క్లిష్ట సమస్యా సమన్విత మొనరించి, తరువాత అత్యంతమైన నైపుణ్య ముతో నా సమస్యలను పరిష్కరించుచు, కథయొక్క ఆత్మ లక్షణ మును గ్రహించి, ప్రధాన కథకు అను సంధింపబడు నట్లుగ కథలను మలచుట కథాకథన శిల్పరీతి ఈ విషయమున బాగుగ నెఱిఁగిన విశ్వనాథ తన రచనలో ఈ పద్ధతిని స్వీకరించినాడు ఒక హేతువును కల్పించుట, దానిని సుస్పష్టము గావించుటకు పరిపోషకములగు కథాంశములను రచించుట ద్వారా కథ స్వయం సంపూర్ణ మగుటయే గాక కథకొరక పటుత్వమును విన్నూత్న మైన దీప్తియు సిద్ధింప జేసి నాడు విశ్వనాథ

తపోనిష్ఠయే ఆత్మ లక్షణముగా గల్గి, తన తండ్రీ, ఆశ్ర మపదము, అందలి మృగాదులేగాని లౌకిక ప్రపంచము నెఱుంగని ఋశ్యశృంగుని జనపదమున ప్రవేశ పెట్టుట కనావృష్టిని ఒక హేతువుగా సృష్టించి, తత్ఫలితమును వర్ణించి కథాంశమును రక్తి గట్టించుట, ఋశ్యశృంగుని రప్పించుటకు రాజు ఉపాయము నాలో చించు చుండగా వేశ్యలు, పణముబెట్టి తామా కార్యమును నిర్వర్తింప గలమని వచించునట్లు సన్నివేశము కల్పించుట.

వేశ్యలు ఋశ్యశృంగుని ఆశ్రమ సమీపమునందు ప్రవే శించి, అతనిని తమ నైపుణ్యము ద్వారా లౌకిక విషయాసక్తునిగ జేసి అంగదేశమునకు గొని వచ్చుట అనునవి లోకోత్తరములైన విషయ ములను జనానందము గావించుటకు కృషి సల్పిన శ్రీ విశ్వనాథ తెలుగు సాహితీ నందన వనమున చిరస్మరణీయుడు

*—*

# విశ్వనాథ చిత్రించిన తార

డాక్టరు పోచిరాజు శేషగిరిరావు

కాంచీపురంలోని వేయికాళ్ళ మండపంలోని ప్రతిస్తంభము కమనీయ శిల్పకళా శోభితమే అందులో ఒకదానిని పోలినది మరొ క్కటి కానరాదు దేని శిల్ప విన్యాసం - విశిష్టత లేఖా విన్యాసం దానిదే అట్లాగే శ్రీ మద్రామాయణంలోని పాత్రలూ ఉంటాయి అసంఖ్యాకమైన పాత్రలతో బృహత్కావ్య నిర్మాణం ఒక్క మహాకవి మాత్రమే చేయగలడు వాల్మీకి అట్టివాడు. మళ్ళీ విశ్వనాథ అట్టి వాడు ఇద్దరూ దర్శనానుభవం ఉన్నవారే అంతేకాదు మహా కావ్యం చదువుతూంటే మనమూ అదర్శనుభావం పొందుతాము "విశ్వనాథ బ్రాహ్మీమయమూర్తి" కావుననే సమ్యక్ దర్శనంతో రామాయణ కల్పవృక్షాన్ని సృష్టించినాడు ఈ మహాకావ్య నిర్మా ణంలో అనల్ప కల్పనా శిల్ప మొక్కటే కాదు పరితలలో ఒక అపూర్వ సంస్కారాన్ని సభ్యతనూ నెలకొల్పుతాడు మహాకవి వాల్మీకి రచన ఆధారపీఠంగా గైకొని ఆయన ఒక అనుసృష్టి చేసినాడు అందు చేతనే యథా వాల్మీకంగా కనుపట్టదు కావ్యసృష్టిలో శిల్ప గమనంలో తనను నన్నయ తిక్కన లావేశించినారని విశ్వనాథయే చెప్పుకొన్నాడు

కిష్కింధకాండ రమ్యభావ రస సామగ్రీ సముపేతమైంది సత్యనారాయణగారు మహాకవేకాదు, మహా మానవతా వాది కూడా మనిషికి గాంభీర్యమూ, దానంతటి పౌరుషం, పౌరుషమంత విజ్ఞానం, విజ్ఞానమంత మెత్తని గుండె కావాలంటాడు విశ్వనాథ [చూడు శ్రీ మందేశ్వరరావుగారి సమీక్ష] విశ్వనాథ ప్రతిభాక్షేత్రం సువిశా లమైనది దాని పరిధికి వశం కానిది లేదు ఆయిన 'సద్యో నిర్గతమైన సర్వ కవితా సంభారము' వన్నె వాసులు సముపార్జించుకొన్నది

తార రామాయణంలో నాలుగు మూడు చోట్ల తళుక్కుమని మెరుస్తుంది. అయితే ఆ మెరుపు మనలో భావుకతను విరియింప జేస్తుంది ఆలోచింప జేస్తుంది మనోఫలకంపై మూర్తి కట్టి నిల్చి పోతుంది, ఆమె రాజనీతిజ్ఞురాలుగా, జాణగా, విశ్వసనీయమైన పత్నిగా రాజ్యసంరక్షకురాలిగా, చమత్కార సంభాషణాశీలిగా జీవితపు లోతులను గుర్తించినదిగా మనకు దర్శనమిస్తుంది

## ఎవరీ తార ?

తత్ర క్షీరాబ్ధి మధన సమయోత్పన్నాం తారాం దృష్ట్వా సుషేణో నామం కర మగ్రహీత్, వాలీతు తారాయాః దక్షిణం కర మగ్రహీత్, తదాఽన్యోన్యం వివాదే సతి, దేవై స్సుషేణ దుహితృత్వం తారాయాః, వాలినో జాయాత్వం చ నిశ్చితం తదుక్తం స్కాందే 'దేవై స్సుషేణ కలహే పుత్రీతి ప్రతిపాదితా. సుషేణో దుహితుః తస్యా స్స్వయంవర మకల్పయత్' ఇత్థ మూఢా కపీంద్రేణ తారా సర్వాంగ సుందరీ - (చూడు గోవిందరాజీయి వ్యాఖ్య) కావున తార అయోనిజ అందుచేత ఆమె సీత, మండోదరి మున్నగు వారి శ్రేణిలో చేరినది సర్వాంగ సుందరి కూడా

తార తొలుత దర్శనం యవనిక వెనుకనుండే రంగం మీద కాదు. వాలి భోగపుష్కలుడై కాంతా మదమత్తతతో అంతఃపురంలో ఉండగా, క్రోధోద్రిక్తుడైన సుగ్రీవారావాన్ని తార వింటుంది అంతకు ముందు వాలిచే పరిక్షతుడై అవమానితుడై వెడలినాడు రెట్టించిన పట్టుదలతో క్రోధంతో సుగ్రీవుడు వాలి ఉన్న చోటికి వచ్చి పెద్దగా గర్జించాడు ఉన్మత్తుడైన వాలి కది పట్టలేదు తార విని భర్తతో 'కన్నుకొనలందు భీతిగా నిట్లనియెన్ మొన్న విఱిగి దిక్కటి తా జన్మ యతని నేటి రాక చను హాస్యంబై' అంటుంది ఆ మత్తులో నే వాలి సుగ్రీవునితో భాషింప వలసిందని తార నాదేశిస్తాడు

తార సమయోచితంగా వాలితో అంటుంది అంతఃపురంలో శయ్య మీద ఉండే.

ప్రకృత్యా నిపుణశ్చైవ బుద్ధిమాం శ్చైవ వానరః
అపరీక్షిత వీర్యేణ సుగ్రీవ స్సహా నైష్యతి

సహజంగా సుగ్రీవుడు నిపుణుడు, బుద్ధిమంతుడు. విశ్వనాథ మరింత స్ఫుటంగా తారచే ఇట్లా మాట్లాడించారు, రూపం బొమ్మకట్టేటట్టు.

ప్రాంచ స్నీతి పథ ప్రమాణ ధిషణా భావుండు తానై విచా
రించున్ జేయక మున్న సర్వమును, సుగ్రీవుండు నీముందుఁ దా
వంచున్ నిల్వఁగ లేఁడెటింగియును నేలా వచ్చెఁ గర్వించుచున్
గించిత్తైనను జేయఁడాతఁడు వృథా కృత్యమ్ము నత్యంబుగన్

నీల, నల, తారులాడిన తెరంగు అంగదుడు మొన్న చెప్పగా నీవును విన్నావు కదా! ఇటు రామ ప్రశంస వాల్మీకంలో మితంగా వుంది. 'రామః పర బలా మర్దీ' యుగాంతాగ్ని రిలోర్థితః 'జ్ఞ నవిజ్ఞాన సంపన్నో నిదేశే నిరతః పితుః' అంటూ మహాత్మనా దుర్జయేనఽప్రమేయేన రామేణ రణకర్మసు' ఇత్యాదిగా రేఖామాత్రం చెప్పబడింది. ఇక్కడ విశ్వనాథ విస్తృత పఱచి రూపచిత్రణ చేయటం రామకథానాయకమైన కావ్యంలో సముచిత మనిపిస్తుంది తార వ్యక్తుల అంతస్థ (eastimate) ఎట్లా అంచనా వేయగలదో ఋజువు పరచినట్లయింది. కవి ఒక చోట రామశబ్దా కర్ణన మాత్రంచేత తార సమాకర్షితురాలైందంటాడు. ఆ తీరిలా వుంది

మును విన్నాము భార్గవుండైన రాముస్ విన్న రామాహ్వయం
బునఁ దచ్ఛౌర్యము శైవభక్తియు మనంబున్ ముట్టిమెచ్చించు, నీ
తని పేర్విన్న హృదంతరంబున విచిత్రంబైన యా కర్షణం
బును దీపించెడుఁ దత్స్వభావము మనఃబున్ దాటు నూహింపఁగా

ఆకడ రామ శౌర్య మహిమాదుల మాట యటుండ నిమ్ము, యి
క్ష్వాకుల బిడ్డ యాతఁడు రసాతల సర్వ దిశాభిరక్షు లి
క్ష్వాకులు సూర్యదేధితి భవంబగు తేజము జీవలోక ధ
ర్మాకృతి పూర్వ కల్ప విభమై స్మరియించిన నాటి నుండియున్.

ఇట్లా సాగుతుంది మరికొంత విశ్వనాథ ధర్మ పరినిష్ఠ సముద్ధరింప బడాలని తపన పడ్డవాడు అవతార తత్వాన్నే 'తార' నోట పలికించి ఆమెను తారాపథంలో నిలబెట్టినాడు ఇది రూపచిత్ర ణలో విశ్వనాథ కల్పన,

ఇంకా తార యిట్లా అంటుంది వాలితో 'రాముడు నీదగ్గ రకు రాలేదే! నీకంటె శూరుడున్నాడని ఎవడు చెబుతాడు రామునికి? అని ఊరుకోక, భారతీయ కర్మ సిద్ధాంతాన్ని తారచేత ఉట్టంకింప జేసినాడు 'ఔరా! కర్మపథంబు లిట్టివని యే ర్పాటున్నదే యిద్దరన్ ఒక విచిత్రమైన సంగతిని తారచే ఊహింప జేసినాడు విశ్వనాథ. సుగ్రీవుల్ వందలు వచ్చినన్ భయపడన్, శ్రీరాము డచ్చోటు, నేదో వృక్షంబును చాటు చేసికొని దూయున్ బాణ మేవేళన్ (77పద్యం) ఇది వాల్మీ కంలో లేదు తార నోట చెప్పించటం అబ్బురంగానే కనిపిస్తుంది రాబోవు కథ మనకు తెలుసుకాని తారకు కాదుకదా! ఇట భవిష్యద్దర్శ నం చేయించటం విడ్డూరం!! విచిత్రం, ఇది తార రూపచిత్రణకు మెరుగును కూర్చేది కన్పట్టదు.

వాల్మీకంలో తార, యుద్ధం వద్దు సుగ్రీవుణ్ణి యువరాజును చెయ్యి అతనివంటి బంధువు మరొకణ్ణిలోకంలో చూడము దానమూనాది సత్కారాలతో అతణ్ణి సంతుష్టి పరచు సుగ్రీవో విపుల గ్రీవః తవ బంధుః సదామతః ఇట్లా హితమును పథ్యమును నైన మాటలన్ వాల్మీకి పలికించి నాడామె చేత, అయితే విశ్వనాథ చిత్రించిన తార వాలిని పొగడుతుంది. ఆ పొగడ్త ద్వారా వాలి సమచిత్తు డవుతాడని

భావించి యుండవచ్చు సప్త తాళభంజనం చేసినవాణ్ణి నిలువరింప గలవా? వందమంది సుగ్రీవు లొచ్చినా గెలుస్తావు, నిజమే. అందు కనే భయపడను మరే చెట్టు చాటు నుంచైనా బాణం వేస్తేనో! 'పౌరుష మాశ్రయించి చనగా మాను' అన్నది వివేకంతో ఇది విశ్వనాథ తీర్పు నేర్పైనది ఇంతకూ నీకూ రామునికీ వైరం లేదుకదా అం టుంది ఈ సన్నివేశంలో విశ్వనాథ ఇంకో అడుగు ముందుకు వేసి 'ఓసీ చారువేషా! నీవు ఈ మాటలే సుగ్రీవునితో మాట్లాడు' రాముడే మంటాడో చూద్దాం! "ఇది యుక్తి సహం" అవతలివాడు మాట్లాడడని తెలిసినా, లోక వ్యవహారంలో మాట్లాడి చూడవోయ్ అంటాం ఇదొక గడుసుతనం

కరణేషు మంత్రి -

వాలి వధ అయిపోయింది సుగ్రీవుడు తారా, రుమలతో భోగానుభవంలో మునిగి తేలుతుంటాడు రామకార్యం మాటమరచి రాముడు నిర్వేదంలో వుంటాడు లక్ష్మణుడు తీవ్ర కోపంతో సుగ్రీ వుని అంతఃపురం దాకావచ్చి పెద్ద గర్జనచేసి, ధనుష్టంకారంచేస్తాడు, ఇక్కడ తార దర్శన మిస్తుంది మనకు

సా ప్రస్ఖలంతీ మద విహ్వలాక్షీ ప్రలంబ కాంచీ గుణహేమ సూత్రా
సలక్షణా లక్ష్మణ సన్నిధానం జగామతారా నమితాంగ యష్టిః

ఆమె చలిస్తూ మద వివసయైన కన్నులు కలదై సలక్షణయగు తార వంగిన దేహము గలదై లక్ష్మణుణ్ణి సమీపిస్తుంది, సుగ్రీవుని ఆదేశంపై

విశ్వనాథ బంధుర వృత్తంలో సూక్ష్మ రేఖా విన్యాసాలతో మూర్తి కట్టించి పాత్రను కళ్ళయెదుట నిలబెట్టినాడు. పాత్ర చిత్ర ణంలో ఇదొక మెలకువ, పోకడ.

వడివడి తడబడు నడుగులు మదిరా బంధుర లోచన కాంతులతో
నడుమున గుదుసగు కనకపు రశనా నాద మనోహర కింకిణితో
నొడికపు మెలపున నొరగిన మెడలో నుజ్జ్వల హాస రదచ్ఛవితో
బడతుక చనియెను రఘుకులపతి యొప్పంగను నిల్చిన చోటునకున్.

విశ్వనాథ, కామకేళీ లోలుడైన సుగ్రీవుని రూప చిత్రణం చేశారు ముచ్చటగా

గేహాంత స్థిత డోలికా గతుడు సుగ్రీవుండు తారా రుమా
బాహాలగ్న శరీర యష్టి మదిరా బంధూక నేత్రుండు ని
ర్వ్యూహ శ్రేణిక జారుచుండగ శిరస్స్రాగించుచున్ నర్తకీ
సేహా గీతిక లాలించుచును బొల్చెన్గా మదేవాకృతిన్.

తార లక్ష్మణునితో

కిం కోప మూలం మనుజేంద్ర పుత్ర! కస్తే న సంతిష్ఠతి వాఙ్ని దేశే
కశ్చ్నుష్క వృక్షం వనమా పతంతం దవాగ్ని మాసీదతి నిర్విశంకః
న కోప కాలః క్షితి పాలపుత్ర నాచాతి కోపస్స్వజనే విధేయః
త్వదర్థ కామస్య జనస్య తస్య ప్రమాద మప్యర్హసి వీర సోఢుం
జానామి రోషం హరివీర బంధో ర్జానామి కార్యస్య చ కాలసంగః
జానామి కార్యం త్వయి యత్కృతం నస్తచ్చాపి జానామి
యదత్ర కార్యం

సుగ్రీవుడు ధర్మం తప్పా డన్నప్పుడు తార ఇట్లా అంటుంది.

తం కామవృత్తం మమసన్నికృష్టం కామఽభియోగాచ్చ నివృత్తలజ్జం
క్షమస్వ! తావత్ ప్రతి వీరహంత స్త్వ న్భ్రాతరం వానర వంశనాథం
మహర్షయో ధర్మ తపోభి కామాః కామానుకామాః ప్రతిబద్ధ మోహాః
అయం ప్రకృత్యా చపలః కపిస్తు కథం న సజ్జేత సుఖేషు రాజా"

ఇట్లా ప్రణయ ప్రగల్భముగా పరిస్వాంత పూర్వకంగా ధర్మహితంగా - సప్రశ్రయంగా తార మాట్లాడిందన్నాడు వాల్మీకి ఆమెను చూడగానే 'వీరుండంత మొగంబు వాల్చి కొని దీప్తాప్సరః కామినీ సారా భోగ మనోజ్ఞమూర్తి ని 'బురస్సన్ దారనుం గాంచుచున్'

అని మృదుల స్వభావుడైన లక్ష్మణుడు తలవంచుకున్నాడు లజ్జతో

విశ్వనాథ తీర్చిన తీర్పు ఆయన స్వకపోల కల్పితం, ఈ ధోరణి మూలంలో లేదు, జాణ, సంభాషణా చతురమైన తార ఇట్లా కూడా మాట్లాడి యుంటుందని అనుకోవాలా!

మీ మాట యెవరు కాదన
రేమి! వాగ్దాన భంగ మెవరాడిరి, నీ
వేమో! యంతః పూర్ద్వా
స్సామీప్యము నందు వచ్చి జ్యా మ్రోయింపన్

చెలికాడవును సమర్థుడ
వలఘుడవును నీవు వచ్చి యంతఃపురము ముం
గిలి నిలిచి నారి లాగితి
చెలికారమునం దె దైన చెల్లున గాదే

ఇట్లా పలుకు పనదనంతో లక్ష్మణుణ్ణి శాంత పరచింది చెలి కార మందెదైన చెల్లునని సర్ది చెప్పినట్లు పైకి కనిపిస్తున్న దే కాని, అంతఃపుర ద్వారం దగ్గర సభ్యత తెలిసిన పెద్దమనిషి ఎవడైనా ధనుష్టంకారం చేస్తాడటయ్యా అన్నది చురక వేస్తూ. తార సంభాషణా చతురత కిదొక తార్కాణ

విశ్వనాథ 'తార' సాదా సీదాగా లోకం పోకడ గుర్తెరిగి ఇట్లా అంటుంది.

ఇంత దవ్వ వచ్చి యేటికి నూరకే
పోవ, రాజుఁజూచి పోదు గాని
రమ్మటన్న, తార రాముని తమ్ముండు
తార తెలివి కద్భుతం పడుచును

తార చాలా తెలివైంది కనుకనే తానై ఆహ్వానించింది అందుచేతనే ఆమె 'కరణేషు మంత్రీ' అనిపించుకొన్నది

లక్ష్మణుడు సుగ్రీవుని అకృత్యాన్ని కడిగేస్తాడు. అప్పుడు తార ఎంతో ప్రౌఢంగా మాట్లాడింది

కట్టె విరచి పొయ్యిని బెట్టినట్టు ఆడవలెనె! విషయము విషయమువలె వచింపగను ధర్మము ధర్మము కాని దగునె-

ఇంతకీ సుగ్రీవుడు చేసిందేమిటి అంటుంది ఏమీ లేదన్నట్లు వాక్చాతుర్యాన్ని ఒలకబోస్తూ

తాను ప్రమత్తుడైన యది తప్ప మరేదియు లేదు దోస, మ
జ్ఞానుఁడు కాడు మూర్ఖుఁడును గాడు కృతఘ్నుఁడుగా డల్లఁడా
జ్ఞా నిరపేక్ష భావుడునుగాడు న మిత్రుఁడు గాడు నీకు
ఊహ వెంబడి పోయెవాణ్ణి కష్ట పెడతారటయ్యా

సుగ్రీవుడు కామ పర తంత్రుడన్నావు విశ్వామిత్రుని సంగతి యెరుగువా అన్నది చివర కంటుంది 'వృథా వ్యాకులు చేయబోకు బ్రధ్న తనూజున' కార్యం చెడగలదు విశ్వనాథ వారన్నట్లు 'పునః పాకం చేయవలసి వస్తుంది' అంతఃపురంలో ఇట్లాంటి మాటలంటావుటయ్యా అన్నది చివరకు ఏదీ! ఒక్కసారి నవ్వు అన్నది లక్ష్మణుణ్ణి తార ఒక మహారాణిగా వాక్చతురగా సమయమెఱిగి మాట్లాడే స్వభావం గలది ఇట్లా అనటం చులకనగా కనబడుతుంట సయ్యాటలాడటం కాదు కదా! ఇక్కడ.

ఆ ప్రభువువైన రాఘవుని హాసము సర్వ జగద్వి మోహనం
బ ప్రతిమాన మీ వతని కైన ప్రియానుజు డిద్ది వంశ శా
ఖా ప్రణుతంబు చిహ్నమును గావలె, నేడి! యొకింత నవ్వ మీ
మీ ప్రియమిత్త్రుఁడున్ హృదయ మేదుర మోద రసాకృతిం జనున్

వాల్మీకి తార చివర ఇట్లా అంటుంది.

రుమాం మాం కపి రాజ్యంచ ధనధాన్య వసూనిచ
రామ ప్రియార్థం సుగ్రీవస్త్య జేదితి మతి ర్మమ

కల్పవృక్షకర్త "యుష్మత్ ఘనకార్య లగ్న మతి" సుగ్రీవుడు అంటాడు. ఇప్పటికే పనులు ప్రారంభించాడు అంటుంది ఇట్లా తార మంచి గడుసరి, ప్రౌఢ, జాణ, వాక్చతురగా కనిపిస్తుంది విశ్వనాథ కూర్పులో

**శోకపరిప్లుతః తారః** వాలి సుగ్రీవుల యుద్ధం అయిపోయింది. వాలి మరణిస్తాడు. వీరపత్ని యైన తార శోక భీకరారంతో వాలి పడియున్న చోటికీ వస్తుంది నేలపైపడి రోదిస్తుంది

'రురోద సా పతిం దృష్ట్వా సందింతం మృత్యు దామభిః' 'క్రోశం తీం కురరీ మివ' విశ్వనాథ వాల్మీకి అడుగజాడల్లోనే ఇక్కడ కన్నె లేడివలె శోకిస్తున్న తారను, కష్టంతో వచ్చే అంగదుణ్ణి చూచి విషాద భరంతో క్రుంగి పోయింది అన్నాడు శోక పరిప్లుత తార విషాద శబలిత రూపాన్నిట్లా సాక్షాత్కరింప జేస్తారు విశ్వనాథ.

ఒక విసురైన తూలిపడున్ కసుగందెడు కాలి తమ్మియై
ఒక ముసురైన నొడ్డుకొనెన్ పయికెత్తిన కేలు జంటయై
ఒక తరగొత్తి యొడ్డిగిలున్ పెను దుఃఖపు టేటి నాపయై
సకియ విముక్త నూపుర విచార మనోహర తార వచ్చుచున్

వాల్మీకి తారా విలాపాన్నిట్లా వర్ణించినారు. "తార వాలిని చూచి 'నన్నెందుకు పలకరించవు. నీకు భూదేవే మహా యిష్టురాలా? ఎందుచేతనంటే ప్రాణాలు వదలినా ఆమెనే సేవిస్తున్నావు. అశా. ఆనందం నాకు నీవే నా హితవు వినలేదు నీవు సుకుమారుడు సుఖోచితుడు అంగదుడు ఎట్టి అవస్థ పాలవుతాడో! ఓయీ! సుగ్రీవా! నీవు ఇక రుమనేలుకో, నిర్విచారంగా రాజ్యాన్ని అనుభవించు. చారువేషా! నే నేదేనా తప్పు చేస్తే క్షమించు," ఇంత దుఃఖంలో ఉన్న తార కొడుకును వాలికి నమస్కరించ మంటుంది వివేకం జారిపోలేదు ఎంత విచార మగ్నురాలైనా పిమ్మట తార రాఘవునితో నీవు అప్రమేయుడవు దురాసదుడవు, జితేంద్రియుడవు, ఏ బాణంతో వాలిని చంపావో దానితో నన్నూ కడతేర్చు. విమల కమలలోచనుడైన వాలి స్వర్గంలో కూడా నన్ను చూడనిచో అప్సరనలతోకూడ క్రీడింపడు నన్ను విడిచి శోకాన్నే పొందుతాడు నన్నూ చంపు. స్త్రీ హత్యా దోషమని తలంపకు అంటుంది

విశ్వనాథ తారా విలాపంలో పతిని పోగొట్టుకొన్న అచ్చపు తెలుగు వనిత ఎట్లా శోకతప్తమయి వాపోతుందో స్వాభావికంగా చూపించారు, తెలుగుదనం తొణికిసలాడే నా మాట విన్నావు కావు. ఈ రకంగా నా కొంపకు నిప్పుపెట్టావు

నెత్తిన నోరు పెట్టుకొని నేనటు పోరగ, నాదు మాటలన్
చిత్తము నందునన్ గణన చేయవు కాలవశాత్మ బుద్ధివై
యత్తరి యేమి కావలయు నేనును నీ కొడుకిట్టి సాహసా
యత్తము జీవితాన కెపుడైన నిదిట్టిది యుండె నంచన్

సుగ్రీవునితో తార

'నడుమ కంబమ్ము నాటిన నల్లచెఱువు
బోలె పడియున్న వారిలో మునుక లిడును'

ఇట్లా సాగిపోతుంది. వాల్మీకి సంస్కృతంలో

'శూరాయ న ప్రదాతవ్యా కన్యా ఖలు విపశ్చితా
శూరభార్యాం హతాం పశ్య సద్యోమాం విధనాం కృతాం'

విశ్వనాథ అట్లానే యథాతథంగా చెప్పినారు

'ఆకాశం నుండి ఊడిపడిన తార'లా పడి ఉన్న తారను చూచి హనుమంతుడు సమాశ్వాసిస్తాడు "వేయి అంగదులైనా నా దుఃఖ మాపలేరు" అంటుంది తార

**వాలి,శ్రీరాములదృష్టిలోతార:** తార రూప చిత్రణానికి వీరిద్దరి మాటలు అద్దం పడతాయి వాల్మీకంలో 'సూక్ష్మార్థ నిర్ణయంలో సుషేణ పుత్రిక ఆరిదేరినది ఆమె యేది మంచి దంటుందో అది నిస్సంశయంగా చెయ్యొచ్చు తారకు సమ్మతమైన కార్యం విరుద్ధంగా జరగదు నాచే చేయబడిన దోషముగల పుణ్యవతి యగు తారను సుగ్రీవు డవమానింప కుండునట్లు చూడు అంటాడు శ్రీరామునితో వాలి తార ధర్మ నిర్ణయమును వాలి యుగ్గడించుట తార వివేక దీపాన్ని మనకు చూపుతున్నది

వాలికి ప్రత్యుత్తర మిస్తూ శ్రీరామచంద్రుడు తన ధర్మ నిర్ణయ ప్రవృత్తి విశదీకరిస్తున్న సన్నివేశంలో తార ప్రస్తావన చేయబడ్డది

తారను గూర్చి నే వినిన దానిని బట్టి వచింతుఁ దద్వి వే
కార భమాణమై జరగు నన్నియు మీ కపిరాజ్య మందునన్
తారను గూర్చి నీకు నెడదన్ భయ మింతకు పెట్టుకోకు, తా
తా! రుమ నీ కొకందుకును తార యొకందుకు సూర్య సూతికిన్

శ్రీరాముని తీర్పులో కూడా తార రాజ కార్య నిర్వహణ దక్షురాలిగా పేర్కొన బడుట తారా రూపచిత్రణము నకు మరింత

వన్నె తెచ్చింది. ఇదో వైశ్వనాథీయమే. కపులంతా విగత భర్తృక యైన తారను చూడటానికి వస్తూ ఇట్లా అనుకొన్నారని విశ్వనాథ ఎంతో గంభీరంగా చెప్పినాడు

"నీవున్నావు, సమస్త వానరచమూ నిర్వ్యాజ రక్షా కళా ప్రావీణ్యోజ్జ్వ ధీ ధురీణవని, మా ప్రాణంబులు స్నిపయింగా వర్తిల్లుచు నుంటిమి"

విశ్వనాథ తీర్పులో తార ధీధురీణ మనస్విని "సర్వాంగ సుందరి చతుర, ఔచిత్య మెరింగిన ప్రౌఢ" వాలి అన్నట్లు 'తపస్విని' తార ప్రస్తావన రామాయణంలో కిష్కింధ కాండలో ఈ నాలుగు మూడు చోటులందే ఉన్నది అయినా తారను సజీవంగా రామాయ ణంలో నిలబెట్టిన కీర్తి శ్రీ సత్యనారాయణగారిది ఏయే పాత్రల నెట్లెట్లు ఎంతెంత పరిధిలో దిద్దవలెనో సంభాషణవల్ల నేమూర్తి కట్టించవలెనో (తిక్కన తీర్చినట్లు) లెస్స యెరింగిన మేటి కవి. రస భావ సామగ్రికి దోహద కారియగునట్లు పాత్రలు దిద్దుట శ్లాఘ నీయమైనది ఆ పని విశ్వనాథ దక్షతతో నిర్వహించినాడు.

కుంతకుని 'వక్రోక్తి జీవితం'లోని వాక్యం స్ఫురణ కొస్తూన్నది.

నిరంతర రసోద్గార గర్భాః సౌందర్య నిర్భరాః
గిరః కవీనాం జీవంతి న కథా మాత్ర మాశ్రితాః

కథను మాత్రమే ఆశించిన కవుల వాక్కులన్నీ జీవించవు రసపుష్టినీ, సౌందర్యపుష్టినీ పొదువు కొన్న కవుల వాక్కులే జీవిస్తాయి



# విశ్వనాథ వారి విజ్ఞాన శబరి

డాక్టరు యస్. టి. వి. రాజగోపాలాచార్యులు

కామ్యార్థి ఫలదాయకమైన కల్పవృక్షమును భువికి అవత రింప జేసిన విశ్వకవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ భావ రూపమైన ఆ కల్పవృక్షమున ఒక రస భరితమ్మైన ఫలము శబరి వృత్తాంతము.

శబరి కథ: పంపాతీర నివాసిని, మతంగముని శిష్యు రాలు అయిన ముదుసలి శబరి ఆశ్రమమునకు రామలక్ష్మణులు వచ్చిరి శబరి వారికి వన్య ఫలములు సమర్పించి రామచంద్రుని దర్శనము వలన తన జన్మ సార్థకమైనట్లును, తన తపస్సు ఫలించి నట్లును భావించి రాముని దివ్యత్వమును స్తుతించుచు అగ్ని ప్రవే శము కావించి స్వర్గము చేరుటయే స్థూలముగ శబరి వృత్తాంతము ఇది అరణ్య కాండాంతము నందలిది

ఎందరో కవుల కలాలను పండించిన భక్త శబరి కథ విశ్వనాథ లేఖినిలో వినూత్న రీతిని ఉజ్జ్వలమై ప్రకాశించినది సూక్ష్మే క్షణమున పరిశీలించిన గాని విశ్వనాథ వైశిష్ట్యము వెల్లడి కాదు

ఎవరో 'రామా!' యని పిలచుచున్నారు అంతలో "పంపా తరంగిణీ తటు హంసీ నవ గరుదాహతి పుష్టమైన నవానిల తరంగము" వీచి రాముని స్పృశించెను నవానిల మనుటలోనే కథాంతర్గత నవత్వ స్ఫూర్తి కలదు ఈ నవానిలము కల్పవృక్ష సంబధి కూడా స్త్రీలిం గమైన 'హంసీ' శబ్దము స్త్రీకంఠమును ధ్వనింప జేయుచున్నది ఆ పిలిచినది మరెవరో కాదు శబరియే, 'ఆ-రామ' శబ్దాత్మకమైన అనిలస్ప ర్శమును అదనుగా తీసుకొని కుసుమ బాణుడు బాణము చివర తమ్మిపూవును సంధించి క్ష్మాసుతా విరహ జడుడైన రాముని మీద

విడిచెనట ఆ బాణము రాముని ఆత్మలో పడినది వెంటనే రామునకు శబరిని చూచు కోరిక కలిగెను ఇటు మన్మథు డెట్లున్నాడు? మెడలో తులసిపేర్లులు, మేనికి విభూతి ధరించి యుండెనట మన్మథు డట్లుండుట చిత్రము నందేదో దేవ రహస్యముండును

మెట్టు పళ్ళికలో పేర్చిన పూవులు పండ్లను శిరసుపై నిడుకొని మెల్లగా శబరి వచ్చినది అపుడామె ఎట్లున్నది?–"తుట్టతుద దాక నెండిన చెట్టు కొమ్మ శేఖరంబున యందు బుష్పించినట్లు" న్నదట ఆశబరి కనులలో స్వామి తన ప్రతి బింబమును చూచుకొని సీతా వియోగ బాధను విడిచెనట శబరి కనుల యందు నీరారగా కనుల తెరుకొన్నవి అనగా ఆమె ఆనందాశ్రు జలము నందు స్వామి తన ప్రతి బింబమును చూచినాడన్నమాట. జలధి శాయియైన నారాయణుడు రాముడు శబరి నేత్ర జలము లందు తన ప్రతి బింబమును చూచుట అనగా– "మమైవాంశో జీవలోకః జీవభూతస్సనాతనః" అనునట్లు భగవదంశ యైన జీవునిలో నున్నది భగవంతుని ప్రతి బింబమని సూచించుటయే జీవేశ్వరుల బింబప్రతిబింబ భావ సంబంధ మిట గమనింప దగినది

నట్టడవిలో నిలబెట్టి రామ రామ పండ్లు తిను మను చున్నావు. నేను కాళ్ళు కడిగి కోవలయును, కనులు తుడిచి కోవలయును, స్నానము చేయ వలెను కాదీ పాటుననే భుజింపు మన్నచో నేను కాదందునా? నీకు అమర్యాద చేయుట ఎందుకులే అనినాడు రాముడు, అపుడు శబరి ధర్మ స్పృష్ట దృక్పక్ష్మయై యిట్లన్నది "ఈ దేశంబున, జెట్టు చెట్టు గృహమెయీ నాకు నీ కేమొ స్నానాదుల్ నిత్య పవిత్ర మూర్తికిని మర్యాదా మూహాం భోధకిన్

కొందరు పెద్ద పెద్ద గృహము లందుండియు చెట్ల క్రింద కాపుర ముండుచున్నంత అసంతృప్తిని ప్రకటించు చుందురు శబరి

ప్రతి చెట్టు తన గృహమే యని భావించినది. తృప్తి నొందుటకు భావము ప్రధానము. రాముడు నిత్య పవిత్రమూర్తి యని, మర్యాదా పురుషోత్తముడని గ్రహించినది శబరి ఆమె ఇట్లనుచున్నది

సీ॥ నేఁబూాలు తేలేదు నేఁబండ్లు తేలేదు
లీలా మనోజ రాలేదు నేను
క్రొత్తగా నీవు మా కొండిక చోటికి
రాలేదు బుద్ధి ధారా ప్రసన్న
పరిచారకా స్వభావకు నాకు మరియాద
చేయ నక్కఱలేదు చిత్తజన్మ
అల యగస్త్యాది మహర్షుల వనముల
ఫలము లీ రుచికావు ప్రాణనాథ
నాదు ప్రాణములను నీకు మీఁదు కట్టి
నాను నీవయి యిటు వచ్చినావు స్వామి
మ్రొక్కు చెల్లింతు స్వీకరింపుము ప్రియాంగ
నా మహా యల్లకానల ధూమదేహ!

ఇందు శబరి రాముని లీలామనోజ! చిత్తజన్మ! ప్రాణ నాథా! అని పిలచినది. నీ యీాడేమిటి? నాయీాడేమిటి? అనుచునే రాముడామె పిలుపు నందలి తలపు నంగీకరించినాడు "అన్నదా నీత ముల్ పండ్లా రగింపవే ప్రాణనాథా!" అనుచు శబరి ఫలములను సమర్పించినది రాముడు స్వీకరించెను. ఫలాహార భుక్తి ముగిసిన పిదప శబరీ రామచంద్రుల చమత్కార సంభాషణ మారంభమగు చున్నది. ఇది శబరి ఖండమున ఆయువు పట్టున దగిన సన్నివేశము.

గీ॥ అవ్వ! నివ్వరి వెన్నుల యట్లు ముగ్గు
బుట్ట వలె నయ్యె నీ శిరంబును ననంగ
ప్రభువ! నీ యాత్మ వాఁకిటి రంగవల్లి
నినుచుటకు నింతగాఁగ బండిన దటంచు

గీ॥ అవ్వ! యెంతో తపించి నీ యాయు వెల్ల
నార్చి నీ విట్టు లెండి యేకైతి వనఁగ
ప్రభువ! స్నేహంబుచేత సార్ద్రంబు చేసి
యింత దివ్వెగా వెలిఁగించవే యటంచు

గీ॥ అవ్వ! నీకెట్లు తీవ్ర వ్రతాభిషంగ
మునను ప్రాణాలు గూళ్ళు పట్టిన వనం
ప్రభువ! నీయింత తీవ్ర దయాభిషంగ
మునను ప్రాణమ్ము గూటఁ జేరిన దటంచు

శబరి పలికినది 'తలముగ్గు బుట్టయినది,' 'ఎండి యేకైతివి' 'ప్రాణాలు గూళ్ళు పట్టినవి' ఇత్యాదు లచ్చమైన తెలుగు జాతీయములు కవితా వైభవ దృష్టితో ఇందు ప్రతిబింబించిన తెలుగు జీవితము తెలుగు పాఠకులకు ఆనంద దాయకము.

"కల్పవృక్ష రహస్యములు" అను గ్రంథమున విశ్వనాథ ఇట్లు చెప్పెను "ఒక ప్రౌఢుడైన కవి శబ్దములు భాషలోననే యుం డును గాని యాకవి తన యొక్క ఆత్మ ద్రవ్యమున కనుకూలమైన శబ్దములను తెచ్చికొని ప్రోవు పెట్టును. వాని యందొక వైలక్షణ్య ముండును అందరికిని తెలియదు శబ్దముల కూర్పుచేత నొక యేదో ధ్వని ఉదయించును ఈ ధ్వని కావ్యధ్వని కాదు మహాకవి అక్కడ నున్నాడు దానిని గ్రహించుటకు శబ్ద బ్రహ్మము సాక్షాత్కరింప వలయును" దీనిని బట్టి విశ్వనాథ వారి రామాయణమును సామా న్యార్థ దృష్టితో పరికించుట తగునా, శబ్దముల మాటున దాగిన వారి ఆత్మ ద్రవ్యమును పట్టుకొని వలెను ఈ చూపుతో ప్రకృత మీ సన్నివేశమును పరిశీలింతము

శబరి శిరోజములు ముగ్గుబట్టవలె నయ్యెనని రాముడు పలుకగా రాముని ఆత్మవాకిట రంగవల్లి నిను చూచుటకే అంతగా పండినదని

శబరి సమాధానము. పైకి చమత్కారముగ కనిపించినను, ఇది యొక చక్కని ఊహా కల్పనము ఊహ చేసినచో శబరి మాటలు 'సామా న్యార్థముల్ కావని నిర్భర దివ్యార్థములై కనబడునని రాముని చేతనే వాచ్యము చేయించినాడు కవి

వాల్మీకి మహర్షియు శబరిని సామాన్య పామరస్త్రీగా చిత్రింప లేదు ఆమె విజ్ఞాన వంతురాలనియే పేర్కొనెను

"ఏవ ముక్త స్సధర్మాత్మా శబర్యా శబరీ మిదం
రాఘవః ప్రాహ విజ్ఞానే తాం నిత్యమ బహిష్కృతాం
దనోస్స కాశా త్తత్త్వేన ప్రభావం తే మహాత్మనః"

"ఆ వాల్మీకి యేది చెప్పినను నూటికి కోటి కొక చోట చెప్పును నేనాయనతో చావనా? నేనా గుణములను బయటకు తీసి వ్యాఖ్యానము చేయుదును ఈ రహస్యము శ్రీరామ చంద్రుడు శబరి దగ్గర నెంతయో చూపించును"- అని కల్పవృక్ష రహస్యములందు విశ్వనాథయే చెప్పెను

మరి 'విజ్ఞానే తాం నిత్యమ బహిష్కృతాం' అన్న వాల్మీకి వాఖ్యానము నాధారముగ జేసికొని శబరి విజ్ఞానమును విశ్వనాథ యెట్లు వ్యాఖ్యానము చేయుచున్నాడో గమనింతము

ముగ్గు తెలుపు, శబరి శిరోజములు తెలుపు తెలుపు సాత్త్విక లక్షణము శిరోజము లనగా వెంట్రుకలని మాత్రమే కాదు శిరసునుండి 'జ' = పుట్టినవి భావము లనియు అర్థము శబరి భావములు సాత్త్వి కములు సత్త్వ భావ సంపదచే మాత్రమే తెలియదగినది ఆత్మ రాముడు ఆత్మ స్వరూపుడు ఆత్మారాముని తత్త్వమును తెలియగోరుచో పండిన సత్త్వభావములను ఆత్మతత్త్వ ప్రాంగణ రంగవల్లికను గావిం పవలెను పండబారిన సత్త్వభావమున రామ (ఆత్మ) తత్త్వము

గోచరించును శబరికి అట్లే గోచరించినది. "ఆ సమంతాత్ వ్యాప్నోతీ ఉతి ఆత్మా" అని ఆత్మ నిర్వచనము రాముని ఆకారమును చూచి నప్పుడామెకు ఆకాశము, సముద్రములు, వనములు చూచినట్లుండెనట. ఇది వ్యాపక శీలమైన ఆమె ఆత్మ దర్శనము నివ్వరి వెన్నుల యట్లు శిరము ముగ్గు బుట్ట వలె నయ్యెనని రాముడనగా నీ ఆత్మవాకిట రంగ వల్లి నిను చూచుటకే అంతగా పండినదని శబరి చెప్పుటలోని రహస్యార్థ మిదియే కేశములు పండిన మాత్రాన సరికాదు భావములు పండవలెను "నివ్వర వెన్నుల యట్లా" అనుచు నివ్వరి వెన్నులతో పోల్చుటలో- "నీ వార శూక వత్తన్వీ పీతా భాస్వత్యణూపమా" అనుచు ఆత్మ లక్షణమును దెలుపు శ్రుతివచనము ధ్వనితము ఇది దివ్యార్థము పైకి పండిన తలను వర్ణించుట సామాన్యార్థము

భావమున ఆత్మ తత్త్వమును జీర్ణించుకొన్న ఋషివంటి కవి తప్ప ఇట్టి పద్యములు వ్రాయలేదు

ఇక- 'ఆయువెల్ల నార్చి తపించి యెండి యేకైతివ'ని శబరితో స్వామి పలికినాడు. ఆ యేకును స్నేహము (చమురు)తో తడిపి దెవ్వెగా వెలిగించమని శబరి ప్రార్థనము ఇది సామాన్యార్థము

"రమణార్థమున రామ శబ్దమునకు బ్రహ్మానంద లక్షణము గలదు తాను అహం బ్రహ్మాస్మి అన్న స్థితిలో నున్నాడు రాముడు. కాని క్రియా వ్యాపార దృష్టితో మాయనే అను సరించు చున్నాడు ఆ మాయ చీకటి అందులో సీత యొక 'దివ్వె' సీతా వియోగాదు లనుభవించును కాని అవి తనకు పట్టవు మరియు నిం కొక రహస్య మున్నది ఆసీత తన వంటిదియే" అనుచు సీతారాముల అద్వైత స్థితిని కల్పవృక్ష రహస్యము లందు విశ్వనాథ వివరించిరి

ఇటు శబరి పిలుపు రాముని ఆత్మలో పడినపుడు ప్రథమ దర్శన మునసే 'శబరి కనుల [illegible]

విరహాబాధ యెల్ల విడిచెనటు అనగా సీతా తత్త్వము వంటిదే శబరి తత్త్వమన్న మాట కనుకనే శబరి తనను 'దివ్వె'గా వెలిగించ మని కోరుటయే కాదు ప్రాణనాయకా! ప్రాణనాథా! అనియు పిలచి భగవంతుని గూర్చిన నిరంతర మానసిక ప్రవృత్తిగల శబరి పిలుపును రాముడంగీకరించెను

శరీర భ్రాంతి 'ఎండి' ఏకత్వ సిద్ధి కలుగు నంతవరకు భగవంతుని కొరకు తపించవలెను తపించుట అనగా తపస్సు చేయవలెను "తప ఆలోచనే" అని నిర్వచనము 'ఆ_లోచనము' అనగా దివ్య లేదా జ్ఞాన లోచనముతో చూచి భగవత్తత్త్వమునకై ధ్యానము ద్వారా తపించవలెను అపుడు కలిగిన 'ఏక'త్వమున భగవంతుని స్నేహము లభించును భగవంతుని 'స్నేహముతో' గూడిన దివ్య జ్ఞానమె 'దివ్వె యగును స్నేహముతో ఆర్ద్రము చేసి దివ్వెగా వెలిగించమని శబరి శ్రీరాముని కోరుటలోని దివ్యార్థ మిదియే

తీవ్ర వ్రతాభిషంగము వలన ప్రాణాలు గూళ్ళు పట్టినవని ప్రభువనగా నీ యింత తీవ్ర దయాభిషంగము ననే ప్రాణము గూటు చేరినదని అవ్వ పలికెను ఇది సామాన్యార్థము ఒకానొక తీవ్ర నియమాను సారమే ప్రాణములు 'గూళ్ళు' అనగా 'శరీరము' లందు చేరుచున్నవని స్వామి పలుకగా, గూడుచేరిన ప్రాణము భగవానుని తీవ్ర దయాభిషంగమున మాత్రమే చేరవలసిన గూటు చేరినదని శబరి భావము ఇట 'దయ' అనునది ఆత్మ గుణములందు ప్రథమమైనది ప్రధానమైనది ప్రాణము ఆత్మయందు లీనమగుటకు ఆత్మ స్వరూపుడైన రాముని 'దయ' ప్రధానమని కవి భావము

ఇట్టి విజ్ఞాన ఫలానుభూతితో రాముని శ్రమలు వాసెను శబరి యిట్లు చెప్పుచున్నది రామ లక్ష్మణులకు స్వాగతి నెఱపిన పిమ్మట తన వెంట రమ్మని చెప్పి తన గురువైన మతంగముని

దివమున కేగెనటు ఆ ముని వియోగ క్లేశము రామ దర్శనమున బాసినదని చెప్పుచు 'ఆ మౌని నా దైవము ఆ పవిత్ర మూర్తియే నిన్ను నాకు తెలియజేసెను. వేదప్రతి పాదిత పరబ్రహ్మ తత్త్వమును ఆ మహర్షి ఉపదేశించెను అదియే భవన్మూర్తియై నేడేతెంచెను. అనుచు శబరి జ్ఞానవతియై ప్రసంగించి, ఆ మహాముని తన పరిచర్య తేకుండ టచే నచ్చుటు అటుమటించు ననియు, సిద్ధముగ నున్న అగ్నిలో మేను చేర్చి చనియెదనని రాముని అనుగ్రహమును కోరెను.

"నీకు మౌని మీఁద నీ మీఁద నాకును
వలపుఁ బొంతనములు పలు విధములు"

అనినాఁడు స్వామి

ఇచట కవి ఒక విశిష్టాద్వైత మహా రహస్యమును చెప్పు చున్నాడు, భగత్తత్త్వము గురువు ద్వారా మాత్రమే తెలియదగినది, పొంద దగినది శబరి అట్లే పొందినది.

"సృష్టిమార్గము 'సంచరము'. ముక్తిమార్గము 'ప్రతి సంచ రము సంచరము 'విజ్ఞాన' మార్గము ప్రతిసంచరము 'జ్ఞాన' మార్గము. 'బ్రహ్మైవేదం స్వరం' అన్నది సృష్టిరూప విజ్ఞాన మార్గము "సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్నది ముక్తిరూప జ్ఞానమార్గము రెంటి సమన్వ యము వలన బ్రహ్మజ్ఞానము పూర్ణమగును". - అని అనుశ్రుత వైజ్ఞా నిక బ్రహ్మశ్రీ చల్లా కృష్ణమూర్తి శాస్త్రిగారు తమ 'బ్రహ్మ విజ్ఞాన పరిచయ' మను గ్రంథమున తెల్పిరి

"జ్ఞానం విజ్ఞాన సహితమ్" - "జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా" అని భగవద్గీత జ్ఞాన విజ్ఞానములు సంచర ప్రతి సంచరములే కనుక వాని యందొకటి తెలిసిన మరొకటి వచ్చును. గురుకృపచే శబరి విజ్ఞాన మార్గము ననుసరించెను. ముక్తిరూప జ్ఞానదాతయై రాముడే స్వయముగ శబరి చెంతకు వచ్చెను

శబరిపేరు వినినంతనే మనకు రామచంద్రునకు ఎంగిలి పళ్ళు సమర్పించిన ఒక అమాయక అనాగరక శబర జాతికి చెందిన మూఢ భక్తురాలుగా మాత్రమే గోచరించును కొందరు కవులామె చర్యను భక్తికి పరాకాష్ఠగ కవితా శిల్పముతో వేనోళ్ళ ప్రశంసించిరి కాని ఆమెనొక జ్ఞానవతిగ, విజ్ఞాన వతిగ తెలిసిన వారరుదు "విజ్ఞానే తాం నిత్యమ బహిష్కృతాం" అన్నవాడు ఆదికవి వాల్మీకి మహర్షి ఒకడు - "నీ మాటలు నిర్భర దివ్యార్థము" లనుచు శబరి నొక 'దేవతా రూపమైన దీధి'తిగా గుర్తించినవాడు ఋషివంటి విశ్వనాథ ఒకడు విశ్వనాథ దృష్టిలో సృష్టిలో శబరి భక్తశబరి మాత్రమే కాదు జ్ఞానశబరి, విజ్ఞానశబరి

ఈ ఋషులెవ్వరు చెప్పిన
సార కథా కథన మొక్కచాయన నడచున్
వారంతర్ద్రష్టలు బహు
థా రూపిత సూక్ష్మతర కథాంశులు నమ్మా.

ఋషుల అంతర్ద్రష్టృత్వాఖ సూక్ష్మేత రేక్షణమున మాత్రమే సుసాధ్య మని విశ్వనాథవారి సూచనము

ఏ ముని పరిచర్యచే తనకు విజ్ఞానమార్గము భగవత్సాక్షాత్కారము లభించినదో ఆ ముని మార్గముననే తాను చరించి తరించుటకు ముని అనుజ్ఞ కోరినది శబరి 'సిద్ధముగ నున్న అగ్నిలో జేర్చి మేను చనియెద' నన్నది ఈ యగ్ని సామాన్యాగ్ని కాదు యోగాగ్ని ఈ యగ్నియందు 'దేహ' భ్రాంతిని దగ్ధము చేయవలెను. భగవదనుగ్రహము పొందవలె నన్నచో మనము కామించిన కర్మ ఫలములను స్వామికి సమర్పించవలెను కర్మను ఆచరించవలసినది, అనుభవించ వలసినది జీవుడు, వాని ఫలములను అర్పించవలసినది భగవంతునకు "కర్మణ్యేవాధి కారస్తే మాఫలేషు కదాచన" అని గీత. నీవు తిని చూచి యతి రుచ్యము లటంచు తెలియక నేనెట్లు తిన

'గలుగుదు'నని స్వామి పలుకగా 'ప్రతీవృక్ష మందున, ప్రథమ మందు నేను రుచి చూచియే తెచ్చినాను, ఫల ప్రకరము కుక్షి నిండినది రామ! విరామము లేదు ప్రాణనాయక! ఆ ఫలముల్ తినవే దయామతీ! అని శబరి పలుకులలో గల రహస్యము తన కర్మఫలములను రామచంద్రున కాత్మార్పణముగ నొసగుటయే విరామము లేక సాగిన జన్మ పరంపరలో ప్రతి జన్మము నందున జీవత్వ రుచి చూచియే వచ్చితి ననియు, ఆ యనుభూతి ఇక చాలు ననియు, దయతో తన జన్మకర్మల ఫలములను స్వీకరించి తనకు జన్మ రాహిత్యము ననుగ్రహింపుమని శబరి ప్రార్థనలోని భావము "జన్మ కర్మ చ మే దివ్యం" అనునట్లు శబరి తన జన్మ కర్మలను రామార్పణముతో దివ్యము గావించు కొనినది

శబరి రాముని ప్రాణనాయక! ప్రాణనాథా! అనిసంబోధించును- శబరికి రాముడు ప్రాణనాథు డెట్లగును? అంతేకాదు సతనవు లీలామనోజ! చిత్తజన్మ! అనియు పిలుచును నడుము వంగి, సీమంత ప్రదేశ మాత్ర మృదు శిరోజయు, శిత పక్ష్మాంత కేశ ధవళిత దృష్టి యునై యెండిన చెట్టు వలె నున్న ముదుతల శబరిని చూచినచో రామునకు సీతా వియోగ విస్మృతి కలుగుట ఏమి? రాముడే యిట్లను చున్నాడు

నీ యీడేమిటి నీదు మేను భుజగీ నిర్మోక మన్నట్లుగా
నా యీడేమిటి నా శరీరమును సంతాన ద్రుశాఖాకృతిన్
బోయెంచో నను( జిత్త జన్ము( డనుచుం బొల్లంబడన్ బ్రాణ ని
థాయుం చాడెదు నాకు నీయెడల( జిత్తం బట్లనే యున్నదిన్

శబరి 'ప్రాణనాథా' యనుటయు రాముడును నాకు నీయెడల చిత్తం బట్లనే యున్న దనుటయు చిత్రముగ నున్నది ఇట్లనుట రాముని పరిహాస శీలమను కొందనూ' ఇవి వృద్ధులతో పరాచకము కావచ్చును. కాని అంతమాత్రమే కాదు 'దేవ రహస్యములు చెప్పకూడ

దని విశ్వనాథవారి అభిప్రాయము కాని వారే కల్పవృక్ష రహస్య
ములు" రచించిరి ఇది తెలుగు వారియందు వారికిగల అనుగ్రహము.
కనుక మేమును పరిశీలింతము.

కారణ శరీరము నందుగల ఆత్మకు ప్రభవము సూర్యుడు "సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ" అని శ్రుతి కనక ఆత్మరూపుడైన రాముడు సూర్య వంశ సంజాతుడయ్యెను "స వా ఏష ఆత్మా వాఙ్మయః ప్రాణ మయో మనోమయః అని సోపాధికాత్మ లక్షణము దీనిని బట్టి ఆత్మకు ఉపాధి వాక్కు (శరీరము) ప్రాణము, మనస్సు అని తెలియుచున్నది కావుననే విశ్వనాథ 'సతనవు' 'ప్రాణనాథ' ప్రాణ నాయక", 'లీలామనోజ' 'చిత్తజన్మ'! వంటి సంబోధనలు శబరిచే పలికించినాడు ఈ సంబోధనలు సార్థకములేగాని నిరర్థకములు కావు పరోక్షమైన సోపాధిక ప్రాణాత్మల సంయోగ రహస్య తత్త్వమును శబరి రాముల ప్రసంగమున విశ్వనాథ విచిత్రముగ నిక్షిప్తము గావించెను

పూజ్యపాదులు మా నాయన గారైన స్వర్గీయ శ్రీమాన్ శ్రీ మత్తిగుమల వేంకట శ్రీనివాసాచార్యులవారు తమ "మహాభారత వైజ్ఞానిక సమీక్ష' గ్రంథమున రామాయణ రహస్యము నిట్లు వెల్లడించిరి -

"ఆత్మశక్తిని 'సత్' అందరు "మనః ప్రాణ వాచా సంఘాతం సత్తా" సత్ అనునది శక్తిబీజమగు 'ఇ' కారముతో గూడి 'సీత' యగును సృష్టిదశ యందు మన ఆత్మశక్తి యోగ మాయా ప్రభావముచే నాహరింపబడుటయె సీతాపహరణము ఇది మనకు హృదయ విదారకమగు విషాద ఘట్టము భౌతిక శరీరమందు మనము గోలు పోయిన ఆత్మయొక్క 'సత్' శక్త్యాన్వేషణము చేసి సాధించుటకు మర్యాదా పురుషోత్తముడగు శ్రీరాముని సచ్చరితము మనకు మార్గదర్శక మగును. రాముని అయనము రామాయణము

దీనిని బట్టి సీతా వియోగము ఆత్మశక్తి వియోగమన్న మాట

విశ్వనాథవారు రాముని "సీతా విరహ జడు" డనిరి. ఆత్మశక్తి వియోగముచే దేహమునకు కలుగుతుంది. జడత్వమని అభిప్రాయము. అట్టి జడీభూత భావము శబరిని చూచినపుడు రామునకు పోయిన ఆత్మశక్తి చేకూరి నట్లయ్యెనని భావింపవలెను

మరి వియోగుల విరహమును దీర్చువాడెవరు? మన్మథుడు. ఇటు శబరి రాముల సంధానకర్తయు మన్మథుడే మన్మథుడనగా మనసును మథించువాడని అర్థము ఇట శబరికి జరిగిన మథనము ఆత్మ సంబంధమైనట్టిది, "వ-బ యోర భేదః" అనుసూత్రముచే శబరి-శవరి అగును. "శేతే వరే ఇతి శవరీ" అను నిర్వచనము ప్రకారము సర్వశ్రేష్ఠుడైన భగవంతునియందు శయనించి యుండునది అనగా భగవంతుని గూర్చిన నిరంతర మానసిక వృత్తియే శబరి అని శ్రీ వేదులవారి వ్యాఖ్యానము

మనసా ఆత్మ తత్త్వము నెరిగిన ప్రాజ్ఞి శబరి. రాముని తాను చూచినపుడు ఆకాశంబు, సముద్రముల్, వనము చూచి నట్లుండె. నీ యాకారంబది విస్మృతింప బడితినయ్యా! అనుచు జీవ సహజమైన విస్మృతిని విడచి వ్యాపక శీలయైన, అనంతమైన, ప్రకృతి గతమైన పరమాత్మ తత్త్వము అని సంబోధించెను. ఆ ఆనందమునకు మూలము రాముడే కనుక శబరి రాముని ఆనందమాల! అని సంబోధించినది, ఆమెకు మతి అనగా బుద్ధి, రామ సందర్శనమున ప్రసన్న మైనట్లు గుర్తించినది కావుననే రాముని "బుద్ధిధారా ప్రసన్న" అన్నది శబరి. ఇందలి విశ్వనాథ వారి సంబోధనలు సాభిప్రాయములు, శక్తిమంతములు

"క్రొత్తగా నీవు మా కొండిక చోటికి
రాలేదు బుద్ధి ధారాప్రసన్న'

అనుటను శబరి జీవాత్మల బంధము క్రొత్తది కాదని అనాద్యనంతమని విన్నవించినది మతంగ ముని మహిమచే అడవి యంతయు బ్రహ్మ మయమైనది కావుననే ఆ ప్రదేశము నందు ప్రత్యక్షమైన మన్మథు డును మెడలో తులసిపేరు మేని విభూతి ధరించియున్నట్లు విశ్వనాథ వారి వర్ణనము ఇట్లు వర్ణించుటలోగల రహస్యము హరి హరాద్వైత తత్త్వము నావిష్కరించుటయే (తులసి హరిది విభూతి హరునిది) పరబ్రహ్మమును దూర్చిన నిరంతర మానసిక వృత్తిని మథించిననాడే మన్మథుడు సోకుకతే యతడు వేసిన బాణము రాముని ఆత్మలో పడి నది శృంగార మన్మథుడు బాణము వేసినచో మనసునకు తగులును కాని విశ్వనాథ చిత్రముగ వైరాగ్య మన్మథుని సృష్టించినారు ఆత్మ సంబంధమైన శబరి ఆర్తిని రాముని ఆత్మలో చేర్చి రాముని శబరి వద్దకు రప్పించినవాడు మన్మథుడే శబరి వృత్తాంతము నందీ మన్మథ సృష్టి అపూర్వము ఇట్టి వినూత్న ధోరణి ఇతర రామాయణము లందు కానరాదు

కావ్య కళా తత్త్వదృష్టితో చూస్తే ఆంధ్రభాషలో వెలు వడిన రామాయణా లన్నింటిలోను అగ్రతాంబూలం అందుకొనే మహాకావ్యం రామాయణ కల్పవృక్షం" అని డాక్టరు జి వి సుబ్ర హ్మణ్యం గారి అభిప్రాయము

తత్త్వ దృష్టితో పరిశీలింపగ శబరి పాత్రలో శ్రీ విశ్వనాథ లీనమయ్యెను శబరి వలె విశ్వనాథయు రామతత్త్వము నందు అద్వైత సిద్ధిని పొందిరాదనిపించును శబరిలోని మధురభక్తి విశ్వ నాథ వారిది శబరిలోని జ్ఞానార్తి విశ్వనాథ వారిది శబరిలోని వా సన విశ్వనాథ వారిది శబరిలోని నిగూఢ తత్త్వము ప్రతి జీవునిది



# అవతారిక విశ్లేషణ

ఆచార్య ఎస్వీ రామారావు

ఆధునిక యుగంలో జన్మించిన అమేయ ప్రతిభా సంపన్ను డైన సాహితీమూర్తి విశ్వనాథ సత్యనారాయణ అది పద్యమైనా, గద్య మైనా, మహాకావ్యమైనా, ఖండకావ్యమైనా - నవలైనా, నాటకమైనా తాను చేబట్టిన 'దానిని బంగారం చేయగల్గిన సిద్ధహస్తుడు ఆయన సంప్రదాయం పునాదిపై వెలిసిన నవ్యతాసౌధం ఆయన సాహిత్యం జ్ఞానపీఠ పురస్కృతిని పొందిన రామాయణ కల్పవృక్షమే దీనికి ప్రబల నిదర్శనం, కల్పవృక్ష అవతారికలో కూడా ఈ వైశిష్ట్యం ద్యోతక మవుతుంది

అనూచానంగా వస్తూన్న కావ్యావతారికా సంప్రదా యాన్ని అక్షరాలా పాటించినా దానిని అనిదం పూర్వంగా, విలక్ష ణంగా తీర్చి దిద్దాడు విశ్వనాథ అవతారికలో సర్వసాధారణంగా అగుపించే దైవస్తుతి, గురుస్తుతి, కవిస్తుతి, కావ్యోత్పత్తి, ఆశ్రయ దాత, వంశవర్ణన మొదలగు అంశాలు అన్నీ కల్పవృక్షంలో గోచరిస్తాయి, అయితే విశ్వనాథకు సహజమైన స్వప్రతిభోన్మేష విలసనంతో ప్రకాశిసాయి

కృత్యాది

శ్రీ మంజూషిక భక్త రక్షణ కళా శ్రీ చుంచు వానంద వ
ల్లీ మంజు ప్రసవంబు చిద్గగన ప్రాలేయాంశువున్ మోక్ష ల
క్ష్మీ మాణిక్య వినూత్న మేఖల కటాక్షీభూత నీహార రుక్
శ్రీ మంతంబయి పొల్చు వెల్గు నొకడే సేవింతు విశ్వేశ్వరా!

అని ప్రారంభమవుతుంది కల్ప వృక్షావతారిక శ్రీ మంజూషిక, భక్త రక్షణ కళా శ్రీ చుంచువు, ఆనందవల్లీ ప్రసవము, చిద్గగన ప్రాలే

యాంశువు, మోక్ష లక్ష్మీ మేఖల మొదలగునవి కావ్యనాయకుడైన శ్రీరామచంద్రునికి ప్రతీకలు. శ్రీ మంజూషిక చతుర్విధ పురు షార్థాల పేటిక, సీతాయాః చరితం అనువానిని సూచిస్తూ రామాయణ తత్త్వాన్ని స్ఫురింప జేస్తున్నది కటాక్షి భూత సేవింతు అన్నవి ఆశీస్సు నమస్సులను వెల్లడిస్తున్నాయి

ఈ విధంగా శ్రీ కారంతో, ఆశీర్నమ స్క్రియా వస్తు నిర్దే శంతో కావ్యాన్ని ప్రారంభించి అవిచ్ఛిన్నమైన సంప్రదాయాన్ని పాటించాడు కల్పవృక్షకవి విఘ్నరూపమైన, శివరూపమైన, త్రిమూర్త్యా త్మకమైన వెలుగులను ప్రస్తుతించి మూడు పద్యాలలో దైవస్తుతి కావిం చాడు,

అంకితం

సత్యనారాయణగారి పితృదేవులు శోభనాద్రి 1902 లో వారణాశి నుండి శివలింగంతెచ్చి నందమూరులో నెలకొల్పి ఆలయం కట్టించారు -వారి ఇలవేల్పయిన ఆ విశ్వేశ్వరునికే రామాయణ కల్ప వృక్షం అంకితం చేశారు విశ్వనాథ అయితే ముక్త్యాల ప్రభువులైన వాసిరెడ్డి వంశీయుల కోరిక మేరకు చంద్రమౌళీశ్వర ప్రసాద్‌ను కావ్య శ్రోతగా ఎన్నుకొన్నారు

కల్పవృక్ష అవతారికపై నన్నయ, తిక్కనల కావ్య అవతారికల ప్రభావం అంతర్లీనంగా పొడసూపుతుంది,

నన్నయ్యయు తిక్కన్నయు
నన్నా వేశించిరి పరిణాహ మనస్సం
ఛన్నత వారలు పోయిన
తెన్నున మెరుగులను తీర్చి దిద్దుచు బోదున్

అని వారిని తన కవితా మార్గ దర్శకులుగా పేర్కొన్నాడు విశ్వనాథ

నన్నయ రాజరాజనరేంద్రుని కథా శ్రోతగా భావించి మహా భారత రచన కావించాడు. తిక్కన తన ఇష్టదైవమైన హరిహరనాథుని కృతి పతిగా స్వీకరించాడు. వారి బాటలో నడిచిన విశ్వనాథ కృతి ప్రకాశకుని కావ్యశ్రోతగా నిలిపి, కులదైవమైన నందమూరు విశ్వేశ్వరునికి కావ్యాన్ని సమర్పించాడు.

ఆత్మీయం

సమాజం లేదా కుటుంబంలోని సభ్యుల మధ్య వుండే సంబంధాలు, అనుబంధాలు, మనస్తత్వాల విశ్లేషణలే సత్యనారాయణ గారి రచనలు. రామాయణ మహాభారత ఇతిహాసాలలో కూడా గోచరించేవి ఇవే. ప్రాచీనాంధ్ర కవులు కొందరు అవతారికల్లో తమ పూర్వుల, కులగోత్రాలు, బిరుదులు మొదలగు వివరాలు పేర్కొన్నారు. విశ్వనాథ తన సాహితీ వ్యక్తిత్వానికి దోహదం చేసిన తండ్రి, సోదరులు, మిత్రులు, గురువులను ఎంతో ఆత్మీయంగా స్మరించుకొంటూ వారి పట్ల తన భక్తి, ప్రీతి, శ్రద్ధలను వెల్లడించాడు. ముందుగా పితృదేవుని దానశీలతను 4 పద్యాలలో ఉగ్గడించాడు -

ఆ నా తండ్రి దగ నన్ దధీచి శిబి కర్ణాదుల్ పునారూప సం
స్థానం బందిన కర్మయోగి సితచంద్ర ప్రౌఢ కాంతిచ్ఛటా
స్నానం బాడిన స్వచ్ఛలింగ మయునిన్ సాధించి మానందమూర్
లోనన్ నిల్పిన భక్తరాజు సుజన శ్లోకుం డుదారుం డొగిన్

అర్తులు విశ్వనాథ వంశాబ్ధి శశి అయిన శోభనాద్రి యింట 'ఇరులు వదలి వెల్తురులు గొని' ఏగుతారట.

రామాయణ రచనాకాలంలో శోభనాద్రిగారు భౌతికంగా లేరు. 1927 లోనే శివైక్యం చెందారు. సతీవియోగంతో, నిరుద్యోగంతో విశ్వనాథ వెతజెందుతున్న కాలంలో - వేయిపడగలు వెలువడిన

తర్వాత _ 1934 లో కల్పవృక్ష రచన ప్రారంభమైంది. ఎపుడో తాను పద్యములు గిల్కువేళలో ఈ మహాకృతిని ఈశ్వరునకు అర్పణము చేసిన తండ్రికి, ఆ పరమశివునికి భేదము లేకయున్న నిశ్చల బుద్ధితో కృతి సమర్పణ జేశాడు

అట్టి తండ్రికి పుత్రులైన తమ్ములిద్దరినీ ఆప్యాయంగా తలచుకొన్నాడు వేంకటేశ్వర్లు, రామమూర్తి ఇద్దరూ విద్వన్మూర్తులే అన్న ఊహ ఎరిగి మెలిగేవారు శ్రీరాముని తమ్ములైతే, అన్న మాట జవదాటని వారు ధర్మజుని తమ్ములు విశ్వనాథ సోదరులు కూడా ఆ కోవకు చెందినవారే రామమూర్తి చిత్తములో అన్నను దైవముగా నిల్పితే, సత్యనారాయణ కవనం వేంకటేశ్వర్లు పరీక్షలో శంకువ బోసిన తీర్థమై, అతని ముత్యాల వ్రాతలో శిల్పమయింది అయితే వేంకటేశ్వర్లు వేయిపడగలు, మా బాబు మొదలగు వచన రచనలకు మాత్రమే లేఖకుడు కాని కల్పవృక్షం సత్యనారాయణగారు స్వయంగానే వ్రాసుకునేవారు.

విశ్వనాథ స్నేహశీలతకు అక్షర సాక్ష్యం కొడాలి ఆంజనేయులు ప్రశంసనం తొలిరోజుల్లో ఆయన కొడాలితో కలిసి 'సత్యాంజనేయులు' పేరుతో జంటకవిత్వం వ్రాశారు 'గిరికుమారుడు' అన్నది కూడా వారిద్దరికీ అన్వయించే నామం

ఆతడె తోడు కల్గినను నచ్చముగా గలకండ లచ్చులుం
బోతలు పోసి యుండెదము పోతనగారి విధాన ...

అంటూ తమ గాఢానుబంధాన్ని 3 పద్యాలలో వివరించారు

గు రు స్తు తి

అన్ని అంశాలకూ తలమానికమైంది విశ్వనాథ 4 పద్యాలలో చేసిన గురుస్తుతి

తనక్షీఎదఎల్ల మెత్తన కృత పత్రితిపద్యము నంత కంతె మె
త్తన తన శిష్యులన్న నెడదంగల ప్రేముడి చెప్ప లేని మె
త్తన యయి శత్రు పర్వత శతారము సత్కవి చెళ్ళపిళ్ళ
వేంకన గురువంచు జెప్పి కొనగా నది గొప్ప తెలుగు నాడుకన్

ఆయన క్రోధం శత్రువులకు పిడుగు వంటిది కాని శిష్యులపై గల ప్రేమ నిరుపమానమైనది

ఆ వ్యోమపేశల చాంద్ర మృదు కీర్తికి "అలఘు స్వాదు రసావతార ధిషణా హంకార సంభార దోహల బ్రాహ్మీమయమూర్తి" శిష్యుడు కావటం అన్నది అపూర్వ భోగం శిష్యుడు తన్ను గురించి గొప్పగా చాటుకొన్నా డనిపించినా, అంతటివాడు శిష్యుడు కావటం చెళ్ళ పిళ్ళ గురుత్వాన్నే చాటుతుంది. ఈ పద్యం వింటూ వుంటే "అమలోదాత్త మనీష నే నుభయ కావ్య ప్రౌఢి పాటించు శిల్పము నన్ పారగుడ కళావిదుడు" అన్న తిక్కన్న మాటలు గులప్తకు వస్తాయి గురుశిష్యు లిద్దరూ పుంభావ సరస్వతులు. విశ్వనాథ బందరులో నాల్గవ ఫారం చదువు తున్న రోజుల్లో వేంకట శాస్త్రిగారి సాన్నిధ్యం లభించింది. ఆ గురురాజ మౌళి సంగతిలో సత్కవియై మెలగినాడ

విశ్వనాథ సాహిత్య జీవితంలో ఆధ్యాత్మిక తత్త్వ వేత్తలయిన గురువులు కూడా ఉన్నారు బందరులో ఉన్న పుడు కానుకొలను త్రివిక్రమ రామారావు అంతే వాసిత్వం ప్రాప్తించింది వారే సన్యసించి కుర్తాళం సిద్ధేశ్వర పీఠాధిపతి విమలానంద భారతి అయినారు గుంటూరు ఏ సి కాలేజీలో పనిజేస్తున్న తరుణంలో కల్యాణానంద భారతీ స్వామి వద్ద వేదాంత శాస్త్ర అధ్యయనం జేశారు వారు శ్రీ శృంగేరి విరూపాక్ష పీఠాధిపతి అయినారు "చిత్తనత వేదాంత వాసనా పారిజాత ప్రసవములు" అయిన వీరి నిరువురినీ కల్పవృక్ష అవతారిక చివర సాక్షాత్ బ్రహ్మములుగా సంభావించాడు విశ్వనాథ

స్వీయం

అందరి గురించి అంతగా చెప్పిన సత్యనారాయణగారు అవతారికలో తన్ను గురించి చెప్పుకొన్నది చాలా స్వల్పం. అదయినా తన కవితా వ్యక్తిత్వాన్ని చాటేది మాత్రమే. జాగ్రత్, స్వప్న, సుషుప్తులలో కూడా తన మానస జిహ్వాలు రామ నామ గ్రహణమే చేయగా, తత్కరా ప్రగ్రహ కృష్టి సంశ్లథ దురావశమై సాగు తన మనోఽశ్వమును పగ్గములతో బిగ బట్టుమని 'ఉగ్రుడై'న సారథిని వేడు కొంటాడు

దీపితా, లాతమువోలె సుంతయు విలంబన మోర్వదు
నిత్యవేగినా, చేతము శబ్ద మేరుటకు జిన్నము నిల్వదు భావతీవ్రతన్

అని తన అంతరంగాన్ని మన ముందాంచుతాడు, ఈ 'భావ తీవ్రత'యే విశ్వనాథ విలక్షణ రచనా శైలికి హేతుభూతమై నిలచినది.

నేను మనస్సన్యాసిని
నేనిది యిమ్మంచు నడుగ నెవ్వరి నెపుడున్
దానెది యేనియు బ్రాప్త
మ్మైనన్ వలదంచు జెప్ప నంతియ గాకన్

విశ్వనాథ హృదయానికి ఈపద్యం నిద్దపు టద్దం.

కవిస్తుతి

నవరత్నాల వంటి తొమ్మిది మంది ఆంధ్ర కవిలోక మూర్ధమణులను గురు స్థానాలుగ నమస్కరించిన పద్యం సాహిత్యాభిమాను లందరూ ఫ్రేము కట్టించి పెట్టుకో దగింది

ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి
తిక్కన్న శిల్పపు తెనుగు దోట
ఎర్రన్న సర్వ మార్గేచ్ఛా విధాతృండు
పోతన్న తెలుగుల పుణ్యపేటి

శ్రీనాథుడు రస ప్రసిద్ధ ధారాధుని
కృష్ణరాయ డనన్య కృతి ప్రబంధ
పెద్దన్న వడపోత పెట్టి నిక్షు రసంబు
రామకృష్ణుడు సురా రామ గజము
ఒకడు నాచన సోమన్న యుక్కి వుండు
చెరిపి పదిసార్లు తిరుగ వ్రాసినను మొక్క
వోని యీ యాంధ్ర కవిలోక మూర్ధమణుల
ముద్గురు స్థానములుగ నమస్కరించి

ఇందులో ఆయా కవుల విశేషణాలు సార్థకంగా, వారి వైశిష్ట్య ప్రకాశకంగా, విశ్వనాథ విమర్శనా శేముషికి నిదర్శనంగా ఉన్నాయి ఈ కవులందరూ విశ్వనాథకే కాదు సాహితీ రసజ్ఞు లందరికీ అభిమాన కవులే పీరిలో నన్నయ, పెద్దన, నాచనలపై ప్రత్యేక గ్రంథాలు తిక్కన, రాయలు, రామకృష్ణులపై విమర్శ వ్యాసాలూ ఆయన వెలువరించారు ఎర్రన, పోతన, శ్రీనాథుల రచనా మాధుర్యాన్ని కూడా ఆయా సందర్భాలలో చవిచూపారు ఈ విమర్శ రచనలన్నీ కవి హృదయ ప్రకాశకములై, కావ్యతత్త్వ వివేచనములై విశ్వనాథ భావనా పరమావధికి, ఉత్తమాభిరుచికి నికషో ఫలంగా వున్నాయి "చెరిపి పదిసార్లు తిరుగ వ్రాసినను మొక్కవోని" అనటంలో ఆ తొమ్మిది మంది తర్వాత తాను పదవ వాడినన్న భావం చెప్పకుండానే, ద్యోతక మవుతుంది

రామకథా భాష్యకారులైన భాస కాళిదాస భవభూతి దిఙ్నాగులకు కూడా కల్ప వృక్ష కవి కైమోడ్పు ఘటించాడు. ప్రశస్త వాగ్వి లక్షణుడు మురారిభట్టు అనటంలో 'మురారేః తృతీయపంథా' అన్న ప్రసిద్ధోక్తి తలంపుకు వస్తుంది భాసుని ప్రతిమా, అభిషేకం, కాళిదాసు రఘువంశం, భవభూతి ఉత్తర రామచరిత్ర, దిఙ్నాగుడు కుందమాల, మురారి అనర్ఘ రాఘవం రచించిన విషయం సహృదయ వేద్యం.

రామాయణ సృష్టి కర్తయైన వాల్మీకిని స్తుతించిన నాలుగు పద్యాలూ విశ్వనాథ కవితాత్మను కమనీయంగా ఆవిష్కరిస్తాయి.

అచ్ఛమైన యమృత మమరులు త్రావినా
రోయి దానికి నే ననూయ పడను
పరమ మౌనిరాజైన వల్మీకి కృత రామ
సత్కథా సుధా రసంబు త్రావి

అంటూ 'సర్వ శిల్ప భూమి' ఆదికవి ప్రశస్త్యాన్ని హృదయంగమముగా ఉగ్గడించారు.

ఈ సంసార మిదెన్ని జన్మలకు నే నీ మౌని వాల్మీకి భా
షా సంక్రాంత ఋణంబు దీర్చగలదా, సత్కావ్య నిర్మాణ రే
ఖా సామగ్రి ఋణంబు దీర్చగలదా?...

అని "ముని ఋణము దీర్చ నీ కావ్యమును రచింతు"నని వచించారు.

"ఒక్క వాల్మీకి కాక వేరొక్కడెవడు
సుకవి శబ్ద వాచ్యుడు" అంటూ కుకవి నిందను పరిహరించాడు.

కావ్య ప్రేరణ

తండ్రి ఆనతి, జీవుని వేదన, ముని ఋణము ప్రేరేపించగా కల్పవృక్షకావ్యం ఆవిర్భవించింది మళ్ళీ రామాయణమేనా అనుకునే వాళ్ళకు ఎవరి అనుభూతి వారిదైనట్లుగా తన భక్తి రచనలు తనవి అని సమాధానం చెప్పారు. అంతేకాదు—

ప్రాగ్వి పశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవ కథా ధృతిని మించి

అని రస ప్రాధాన్యాన్ని ఉగ్గడించారు ఆనంద వర్ధనుడు

దృష్ట పూర్వాహ్యపి హ్యర్థాః కావ్యే రస పరి గ్రహాత్
సర్వే నవా ఇవా భ్రాంతి మధుమాశ ఇవ ద్రుమాః

అని కథ పాతదైనా రసం వల్ల కొత్తగా కనిపిస్తుంది, నవ నవంగా భాసిస్తుంది అని వక్కాణించాడు కవి ప్రతిభవల్ల కథకు నూత్న తేజస్సు కలుగుతుంది. అందుకే

"కవి ప్రతిభలోన నుండును కావ్యగత శ
తాంశముల యందు తొంబదియైన పాళ్ళు"

కల్ప వృక్ష అవతారికకు మకుటాయ మానమైనది ఈ క్రింది పద్యం-

వ్రాసిన రామచంద్రు కథ వ్రాసితి వంచనిపించుకో వృథా
యాసము గాక కట్టుకత లైహికమా పరమా యటంచు
తా జేసిన తండ్రి యాజ్ఞయును జీవుని వేదన రెండు నేకమై
నా నకలోహ వైభవ ననాధము నాథ కథన్ రచించెదన్

కావ్యప్రేరణ, కావ్యేతివృత్తం, కావ్యరచన - ఈ మూడూ ఈ పద్యములో సువ్యక్తము లైనాయి, తండ్రి ఆజ్ఞతోపాటు జీవుని వేదన తోడై కల్పవృక్ష కావ్యావతరణకు హేతువుగా నిలచింది క్రౌంచ పక్షి శోకము వలన కలిగిన ఆర్తి, బ్రహ్మదేవుని ఆజ్ఞ వాల్మీకి కావ్యావతరణకు హేతువులు కావటం ఇటు గమనార్హం

ఈ వేదన - కావ్యమునకు మౌలికమైన శక్తి అని ఆనంద వర్ధనుని కావ్యాత్మ, అభినవ గుప్తుని రసం, కాళిదాసు పర్యుత్సుకత ప్రతిభను విశ్వనాథ జీవునివేదన, ఒకటే అని విమర్శకులు వ్యాఖ్యానించారు. ఈ జీవుని వేదన లౌకికమైనది కాదు పరగతమైనది. సంసార బాధలకు పరిమితమైనదికాదు సామాజిక స్పందనతో కూడినట్టిది. ఆదికవి వాల్మీకి మునికాలం నుండీ జిజ్ఞాసువర్లో అంతర్నిహితంగా వున్న నిగూఢ తాపం ఇది. సత్యనారాయణగారి 'కృతార్థ్యవస్థ' వ్యాసంలో వివరింపబడిన వాల్మీకి శ్లోకానికి ప్రతిరూపమే కల్పవృక్షం లోని జీవుని వేదన

ఈ వేదన ఉన్ననాడు ఊరికే కూచోలేడు సమాజ శ్రేయస్సును లక్ష్యంగా భావించి రచనలు చేస్తాడు విశ్వనాథ సాహిత్యమంతటా ఈ 'లోకహిత నిష్ఠ' ప్రస్ఫుటంగా గోచరిస్తుంది ఆయన కావ్యాత్మను ఈ క్రింది పంచ సూత్రాలలో దర్శించవచ్చునని నా అభిప్రాయం

1. విజాతీయ నాగరికతా వ్యామోహంలో పడి స్వజాతి ధర్మాన్ని జీవ లక్షణాన్ని విస్మరించకూడదు
2. వ్యక్తి స్వేచ్ఛ పేరిట వ్యవస్థా ధర్మాన్ని అతిక్రమించి అవ్యవస్థకు దారి తీయకూడదు
3. ధర్మా ధర్మాలకు సంఘర్షణ సంభవించినప్పుడు వ్యక్తిలోని వివేకం, విచక్షణా జ్ఞానం జాగరూకం కావాలి
4 మనిషిలో కృతజ్ఞతా భావం అంతరించి పోరాదు
5 మానవ జీవితంలోని ఆత్మీయమైన అనుబంధాలు ఎంతో విలువైనవి

సమాజంలో పై సూత్రాలలోని విలువలు కనుమరుగు కాకుండా వాటిని కాపాడుకోవాలన్న ఆర్తియే విశ్వనాథచేత కలం పట్టించింది ఆ జీవుని వేదన 'సకలోహ వైభవ సనాథంగా ఆయన రచనల్లో అభివ్యక్తమైంది సకల భావవాశక్తినీ అది వెల్లువయ్యి సహృదయ లోకాన్ని రసప్లావితం చేసింది ఒక 'వేయిపడగలు'గా, ఒక 'రామాయణ కల్పవృక్షం'గా ప్రత్యక్షమై అశేష పాఠకులను అలరింపజేసింది

కల్పవృక్ష కథ నాథ కథ లోక విశ్వనాథుడు రఘునాథుని కథ. లేదా కథలలో కెల్ల ఉదాత్తమైనది- కథాకథము. అది ఇహలోక బంధరూపమైన 'కట్టుకథ' కాదు బంధవిమోచన కావించే ఆతర్మ

ప్రాయమైన, మార్గదర్శకమైన సత్కథ. ఈ సత్పదార్థం నిరూపించే సత్కావ్యం కల్పవృక్షం.

కా వ్య ప్ర కా శ ం

వాసిరెడ్డి ప్రభువుల ఉదారబుద్ధి చేత రామాయణ కల్పవృక్ష కావ్యం ప్రకాశితమైనది 1934 ప్రాంతంలో బాలకాండ రచన ప్రారంభమై 1939 లో ముగిసింది ఆ వెంటనే అయోధ్యకాండ ఆరంభమై మరో ఐదు సంవత్సరాలకు పూర్తయింది ఆ సమయంలోనే స్వభాను సంవత్సర విజయదశమి నాడు ముక్త్యాల యువరాజు రామగోపాల కృష్ణ మహేశ్వర ప్రసాద్ 'బాల రాఘవుని వలె' విశ్వనాథకు ఎదురైనాడు ఆ వంశీయుల కోరికపై వృద్ధభూపతి, చంద్రమౌళీశ్వర ప్రసాద్ కావ్యశ్రోతగా వైశంపాయనుడు జనమేజయునికి భారతం చెప్పినట్లుగా రామాయణ కల్పవృక్షం వినిపించారు కృతిరచనచే సమార్తమైన స్వర్గ సమాన కీర్తి తనకు ప్రాప్తించగా అచ్ఛమైన స్వర్గ ఫలప్రాప్తి, వాసిరెడ్డి వంశమణికి లభించాలన్న ఆకాంక్షతో వారి వంశవర్ణన విపులంగా 108 పద్యాలలో కావించారు

1945 లో ముద్రితమైన బాలకాండ అవతారిక బహుశా ఆకాలములోనే విరచితమై ఉంటుంది. ఈ అవతారికలోని కవితా రామణీయకత, భావనావైచిత్ర వివరణ ఒక ప్రత్యేక ప్రశంసయే కాగలదు ఒక మాటలో చెప్పాలంటే అటు కావ్యభాష, ఇటు వ్యవహారభాష రెంటిలోని సౌందర్యాలను సంతరించుకొని విశ్వనాథ దైన ముద్రను భద్రపరచుకొన్నది ఈ అవతారిక ప్రతిభా పూర్ణమైన సత్యనారాయణ సాహితీమూర్తికి నిలువుటద్దం రామాయణ కల్పవృక్షావతారిక

  

# విశ్వనాథ వారి కథౌచిత్యము

డాక్టరు కోటి సూర్యనారాయణమూర్తి

ఒక మహాకావ్యమును అనుశీలన చేయిడమన్న దానికి ఆరంభము ఉంటుంది గాని అంతమనేది ఉండదు. ఏ కాలమున కాలమున ఆ కావ్యమును అనుశీలన చేయగ క్రొత్త క్రొత్త అర్థములు స్ఫురించును, ఎప్పటికప్పుడు అది ప్రస్తుతమైనదిగా ఆవశ్యకమైనదిగా కనబడుతుంది అటువంటి ఉత్కృష్టమైన కావ్యరాజము రామాయణము రామాయణమును వాల్మీకి మహర్షి రచించిన తరువాత సాహిత్యరంగమున అనేకమందికవులు రామాయణమును పద్య, గద్య, చంపువులుగ రచించినారు మొల్ల, భాస్కర, రంగనాథ మొదలగువారు ఇంతమంది పూర్వకవులు రామాయణములను రచించిన తదుపరి మరల విశ్వనాథ వారు రామాయణ కల్పవృక్షమును రచించి ఆంధ్ర సాహిత్య లోకమునకు అందించిరి కరుణ రసాత్మకమైన సీతా చరితమ్ను శాంతరసాత్మకమైన కల్పవృక్షముగా మలచుటలో శ్రీ విశ్వనాథ వారు చూపిన కవితా నేర్పు అత్యంత రమణీయము శ్లాఘనీయము

రామాయణము కేవలము కావ్యమే గాదు, అది ప్రధానముగ శబ్దము మాధ మికముగా గలది శబ్దము మీద కవి చేసే పనితనములోనే కవిత్వము ఉంటుంది దాని నుంచే కవిత్వము ఆవిర్భవిస్తుంది కవికి శబ్దము మీద ఎంత అధికారముంటే అంత పటిష్ఠమైన కావ్యము రూపొందుతుంది

శ్రీ విశ్వనాథ వారు శబ్దము మీద, అర్థము మీద రెండింటి యందును సమర్థత కల్గియున్న వారు ఆయన భాషా శరధి అక్షయ శబ్ద శరద్రావాకమైనది రామబాణము ఎట్లా గురి తప్పకుండా గమ్యమును చేసునో, విశ్వనాథునిచే ప్రయోగించబడిన

శబ్దము, ప్రయోగము లోకోత్తరమైన ప్రయోజనము సాధించును ఈయన శబ్దమును అర్థము చేసుకోవాలన్న ఎల్లప్పుడు నిఘంటువు దగ్గర ఉండాలన్న అపప్రథ ఒకటి లోకములో ఉన్నప్పటికిని శబ్ద ప్రయోగము మాత్రము కోరిన ప్రయోజనమును పొంది తీరుతుంది. విశ్వనాథవారు శబ్దములను శ్రద్ధగా సమాజము నుండి ఏరుకుంటారు. వాటిని భద్రముగా మనస్సునందు దాచుకొని మహాసొగసుగా కావ్యమున వాడుకుంటారు. దేశము నలుమూలల నుండి వినవచ్చే శబ్దములను, జాతీయములను సేకరించి చక్కగ కావ్యమునందు సొగసుగ సందర్భోచితముగా చేర్చుతారు పద్య నిర్మాణములో విలక్షణతను చూపిస్తారు సన్నివేశములకు తగిన వృత్తములను, జాతులను ఉపజాతులను వాడతారు విశ్వనాథవారు తమ కల్పవృక్షము నందు వాడిన కొన్ని కొన్ని జాతులు లక్షణ గ్రంథముల యందు మాత్రమే కనబడును గాని మరే కావ్యముల నందును గానరావు కొన్ని ఎడల వర్ణించే సన్నివేశములకు వృత్తములకు సంబంధమును కలుగచేస్తారు. జటాయువు, సంపాతి పందెము వేసుకొని ఆకాశములోనికి ఎగిరిన సందర్భముల యందు వారు అశ్వగతి, శేని, జలధరమాల, చందవర్మ మొదలగు లక్షణ వృత్తములను వాడినారు ఇవి లక్షణ గ్రంథముల యందు మాత్రమే గాని ఇతర కావ్యముల యందు గానరావు

ఛందస్సు మీాద విశ్వనాథకు ఎంత అధికారమున్నదో, అలంకారము మీాద కూడ ఆయనకంతే అధికారమును చూపినారు. వస్తువు యొక్క నిజస్వరూపమును అంతస్సును వెల్లడించుటకు అలంకారము అవసరము గదా!

"భూమిలో మంద సంబున నేను దాచి
యుంచ బడి కానిపించిన దువెద మేని
పసిమి పాతర వేసిన వడ్ల పగిది
శాంత రమణీయ కాంతి ప్రసన్నమగు"

యజ్ఞార్థము జనకుడు భూమిని దున్నునపుడు సీత పెట్టిలో దొరికినది ఆ సీతాదేవి మేని పసిమి పాతర వేసిన వడ్లవోలె కాంతి శాంత రమణీయ ప్రసన్నముగ ఉందట క్రొత్త వడ్లను పాతర వేయడము లోకములో అలవాటు' అందువల్ల వడ్లు చెడవు పైగా చాలాకాలము బాగుంటాయి దీనిని ఆధారముగ సీత మేని పసిమిని పాతర వేసిన క్రొత్తవడ్లతో పోల్చినారు ధాన్యలక్ష్మి అనడము పరిపాటి సీత కూడ లక్ష్మి దేవే కదా, కష్టములను పొందనున్న సీత శాంత రమణీయ ప్రసన్నముగా ఉండడము ఆమెలోని దివ్యాంశ లక్షణముగా గ్రహింప వలసి యున్నది ఇదిలోకవృత్తమునకు అనుకూలము అయిన అనుగుణముగ వాడబడిన అలంకారము అసలు అలంకారికులు అలంకారమే కావ్యము అనికదా వక్కాణించి యున్నారు ఇంతటి ఉత్కృష్టమైన కావ్యము రామాయణ కల్పవృక్షము సమగ్రముగా పరిశీలన చేయడము ఈ కొద్దికాలములో సాధ్యము కాక పోయినప్పటికిని సంగ్రహముగ శ్రీ విశ్వనాథవారి బాలకాండము నందలి కథాకథన కౌశలతను సమీక్షించుట నా ప్రధాన ఉద్దేశ్యము

రామాయణ కల్పవృక్షము నందు బాలకాండ అత్యంత ఉత్కృష్టమైనది ఇందు విశ్వనాథ వారు అద్భుతమైన కథా కథన శిల్పమును పోషించిరి చక్కటి కథను కలిగి యున్నప్పుడు కవికి మంచి కావ్యమును సిద్ధించును బాలకాండ నందు ప్రధానముగా కానవచ్చు కథలు ఋష్యశృంగుని కథ, వామనావతార కథ, గంగావతరణ కథ, విశ్వామిత్రుని కథ, అహల్యకథ ఇవి అన్నియును మనకు ఇంతకు పూర్వము తెలిసినవే గాని విశ్వనాథవారు ఈ కథల యందు అనుస్యూతముగ వచ్చే సంప్రదాయములను మాత్రమేగాదు, వాటి వైశిష్ట్యమును గూడా చెప్పడమే విశ్వనాథ వారి విశిష్టత

ఋష్యశృంగుడు విభాండకుడను ముని పుత్రుడు ఒకనాడు విభాండకుడు నదిలో స్నానమాచరించుచుండగా, ఇంద్రుని శాపముచే

ఊర్వశి చిత్రరేఖ యను నామాంతరముతో మృగిగా జన్మాంతరము నొంది అదే నది యందు జలపానము చేయుచుండ దానిని గాంచి మోహ పరవశుడగుటచే అతనికి రేతః స్ఖలనము జరిగినది మృగము జలముతో బాటు విభాండకుని రేతస్సును గూడ సేవించెను తత్ఫలితముగ ఋష్యశృంగుని జననము సంభవించెను ఈఋష్యశృంగుని కథ రామాయణము నందును మహాభారతమున కలదు అయినప్పటికిని రామాయణమున ఋష్యశృంగని కథలో గల సాన్నిత్యము భారతము నందు లేదు ఋష్యశృంగుని కథ లేకుండా రామాయణమే లేదు రామాయణమున ప్రధాన పాత్రధారి శ్రీరామచంద్రుడు దశరథుడు పుత్రకామేష్టి యాగము చేయనిచో రామ జననము సంభవము గాదు గావున దశరథుడు పుత్రకామేష్టి యాగము చేయుటలో ప్రధాన ఉద్దేశ్యము అతడు పుత్రవంతుడగుటయే దశరథుడు పుత్రులను పొందుటకు యజ్ఞమును ఋష్యశృంగుడే నిర్వహించ వలయును ఇది దేవ రహస్యము అందువల్లన ఋష్యశృంగుని కథ చాల ప్రధానము. విశ్వనాథ వారి రామాయణ కల్పవృక్షము నందలి ఋష్యశృంగుని కథ యందు ప్రధానముగ గుర్తించ వలసినవి కొన్ని యున్నవి

"తపో నిష్ఠయే ఆత్మలక్షణముగా గల్గి తన తండ్రి ఆశ్రమము, అందలి మృగాదులే గాని లౌకిక ప్రపంచము నెఱుంగని ఋష్యశృంగని జనపదమున ప్రవేశ పెట్టుటకు అనావృష్టిని హేతువుగా గ్రహించిరి విశ్వనాథవారు ఋష్యశృంగుని రప్పించుటకు రాజు ఉపాయము ఆలోచించు చుండగ వేశ్యలు పణము పెట్టి తాము ఆ కార్యమును నిర్వహించ గలము అని ముందుకు వచ్చిరి వేశ్యలు ఋష్యశృంగుని ఆశ్రమము నందు ప్రవేశించి అతనిని తమ నైపుణ్యము ద్వారా లౌకిక విషయాశక్తునిగ జేసి అంగదేశమునకు గొనివచ్చుట, మొదలగునవి ఋష్యశృంగుని అంగదేశమునకు రప్పించుట అను సన్నివేశమును పూర్వాంధ్ర రామాయణ కర్తలు అనేక విధములుగ తెల్పియున్నారు గాని విశ్వనాథ వారు చెప్పిన తీరు

మాత్రము సహేతుకముగా నున్నది. అగ్నియును తండ్రియును దప్ప ఇతరులను కనీసము స్త్రీ పురుష భేదము నెఱుంగక కఠోర బ్రహ్మచర్యముతో నున్న ఋష్యశృంగుని లౌకిక ప్రపంచములోనికి రప్పించిన వాడు రోమపాదుడు లోకమున నేమియు తెలియని ఆతనిని జనపదమునకు రప్పించుట కొరకు అనివార్యమైన హేతువును సృష్టించి ఆ హేతువును క్లిష్ట సమస్యా సమన్విత మొనర్చి ఆ తరువాత అత్యంత నైపుణ్యముతో ఆ సమస్యలను పరిష్కరించి కథ యొక్క ఆత్మ లక్షణములను గ్రహించి దీనిని ప్రధాన కథకు అనుసంధానము చేయుటయే విశ్వనాథవారి శిల్పరచనా పారంగతత్వము అది అత్యంత అనిర్వచనీయమైనది, ఆనందానుభూతమైనది.

ఋష్యశృంగుని అంగదేశమునకు రప్పించుటలో ప్రధాన ఉద్దేశ్యము, ఆతడు పాదము మోపిన చాలును అచ్చట వర్షములు కురియును ఇది అతని ఆత్మలక్షణము అందువల్లన అనావృష్టిని తొలగించు కొనుటకు ఋష్యశృంగుని అంగదేశమునకు గొని రావలయును అని నిర్ణయించిరి పురోహితులు అనావృష్టి నివారణోపాయమును గురించి రాజు ఉపాయములను ఆలోచించి అది కాదని ఇది కాదని పెక్కింటిని త్రోసి పుచ్చి మార్గము దోపకయున్న సమయమున విరజా మరులు వీచు వేశ్యలు "ప్రభువులు తాంబూలము దయసేయించినచో నేను చెలిమి కత్తెలతో గూడి యిపుడే బయలుదేరి పోయి ఆ ఋష్యశృంగుని గెలుచునని ఇదే విశ్వనాథవారి కథౌచిత్యము ఈ కథా కథన ఔచిత్యము పూర్వాంధ్ర రామాయణ కర్తలయందు లేదు

ఋష్యశృంగుని వృత్తాంతమును పురోహితులు రాజునకు వివరించుచుండగ వారకాంతలు వినిరి ఆతడు స్త్రీ పురుష భేద మెరుంగని వాడని వారి మాటల వలన వ్యక్తమైనది అట్టి వారిని దర్శింప వలెననెడి ఉత్సుకత వారికి కలుగుట నైజగుణము వారకాంతలకు గూడ అదియే గల్గినది కేవలము ఆతనిని చూచివచ్చుట మాత్రమే

కాదు, అతనిని గొని తేవలయును స్త్రీ స్పర్శ లేకుండ ముక్కు మూసు కొని తపోనిష్టులై యున్న ఎందరును తమ జాతి వెంబడి తిరుగునట్లు చేసుకొన లేదు అట్టివారిని కైవసము చేసుకొనుట యనునది వార స్త్రీ జాతికి గౌరవాతిశయిమే రాజు వేశ్యలను పిలచి ఆజ్ఞాపించి పంపు టలో కంటే వారే స్వయిముగా ముందునకు వచ్చి తాము పోయి సానుకూల్యము చేయుదుము అనుటలోనే ఔచిత్యమున్నది అదే విశ్వనాథవారి చతురత ఋష్యశృంగుడు పుట్టింది అడవుల్లో అతనిని చూస్తే ప్రకృతి పులకరిస్తుంది వీడు వారిన నేల పచ్చికను పరచు కుంటుంది ఇంకి పోయిన నదులు గలగమని నవ్వుతు వెల్లువలై ఉర కలు వేస్తాయి. అటువంటి ఋష్యశృంగునకు వేశ్యలవల్ల మనో వైకృతి కలుగలేదు సరిగదా అపుడు మన్మథుడు తొంగి చూడలేదు. పైగా వారు శాంతనకు కాబోయె పెనిమిటి అని వాళ్ళు అతడ్ని తొంగి గూడ చూడలేదు. పురమునకు రావడముతోడనే అతనికి అన్నీ తెలిసినవి అయినప్పటికిని ఆధ్యాత్మ భావనకి లౌకిక స్పర్శ లేదు. లోకాన్ని తెలిసినా ఆధ్యాత్మ భావము పోలేదు లోకాన్ని ఎరిగిన ఆధ్యాత్మ సిద్ధుడు ఋష్యశృంగుడు కల్పవృక్షములో ఋష్యశృంగ నీ కథ ఇంకా చాలా ఉన్నది, అతనికి ఒక కొడుకు పుట్టాడు అది విశ్వ నాథ సృష్టించిన పాత్ర అతడు అచ్చముగా తెలుగుబిడ్డ ఋష్య శృంగని కథ రామాయణ కల్పవృక్షమున పూర్వాంధ్ర రామాయణ కర్త లందరి కంటే చాలా విపులముగా ఔచిత్యముగా వర్ణించాగు

ఇక విశ్వమిత్రుని కథ విశ్వామిత్రుడు శమదమాదులను ఎలా సాధించాడు, ఎలా జితేంద్రుడయ్యాడో అయన కథ గుండ విశ్వనాథవారు చక్కగ వివరించారు మానవుడు ఆధ్యాత్మిక ఔన్న త్యము కోసము చేసే నిరంతర యాత్రే విశ్వమిత్రుని కథ ఇందులో ఒక్కొక్క భాగము ఒక్కొక్క మజిలీ, విశ్వామిత్రునికథ ఒక్కొక్క మజిలీని దాటేసరికి ఒక్కొక్క అంతఃశత్రువును జయించడము, లోబ రుచుకోవడము ఇందు మనకు కనబడుచున్నది కొందరు యాత్రనే

ఆరంభించరు మరికొందరు మొదటి మజిలీ దగ్గరే ఆగిపోతారు ఏ కొద్దిమందో ఇంకొంచెము ముందునకు సాగిపోతారు విశ్వామిత్రుడు మాత్రము చివలి మజిగీ చేరేవరకు యాత్ర సాగించాడు చివరకు బ్రహ్మర్షి అనిపించుకొన్నాడు ఎవరిచేత వశిష్ఠుల వారిచే, విశ్వామిత్రునికి రాజర్షి అంటే తృప్తి కలుగలేదు మహర్షి అంటే తృప్తి లేదు బ్రహర్షి అనిపించుకోవడానికి భయంకరమైన తపస్సు చేసాడు కోపాన్ని దరి చేరనీయలేదు కామమును కంటి చూపుతో గెంటి వేసాడు మాత్సర్యమును దగ్గరికి దరి జేర నీయలేదు ఎవని పట్ల మాత్సర్యము వహించి తాను బ్రహర్షి అయితే చాలు ననుకున్నాడో ఆయనకు అత్యంత సన్నిహితుడై పోయాడు ఆయనే వచ్చి తన్ను బ్రహ్మర్షి అయ్యావు అని అనాలనుకున్నాడు చివరకు వశిష్ఠులవారు వచ్చి నీవు బ్రహ్మర్షి అని అంటే గాని అతడు తపస్సు నుండి లేవలేదు

విశ్వామిత్రుడు వశిష్ఠుని వంటివాడు కాదు ఆయన సరిగ్గా మనవంటివాడే పైగా అందరికన్న ఆయనకు కోపము వేయి రెట్లు ఎక్కువ, ఆయనలో కామముంది లోభముంది పుట్టుకచేత రాజగుట వలన సంక్రమించిన అధికారము వల్లన మదము ఉన్నది వీటి అన్నింటి వల్లన అతని దగ్గర మోహము చేరినది తాను ఆశించిన పని జరుగకపోతే అతనికి క్రోధము పెరగుతుంది తాను యాజ్ఞము చేస్తున్నాడని ఆ యజ్ఞమునకు అందరినీ రమ్మన్నాడు రానివాళ్ళను ఎందులకు రాలేదు, ఏమన్నారని, కనుగొన మంటాడు వశిష్ఠుడు రాలేదు, అతని పుత్రులు రాలేదు నరే తన్నేదో అన్నారని వారి మీద విశ్వామిత్రుల వారికి చెప్పలేని కోపము వచ్చినది వెంటనే వశిష్ఠుని వంద మంది పుత్రులు భస్మీ భూత మగునట్లుగా శపించాడు. కోపము తగ్గలేదు కోపము పట్టజాలక వీరు కాలపాశనీతులై ఏడు వంద దల జన్మములు కుణపభాణాదులు కావాలన్నాడు అంతటి మహాకోపి విశ్వామిత్రుడు అయితే ఆయనకు కోపము కలగడానికి కారణము

లేకపోలేదు విశ్వామిత్రుని కథ నన్నయ భారతము నందు గూడ గలదు కాని నన్నయ ఆకథను వశిష్ఠుని దృష్టితో చూచి కావ్యముని రచించగా విశ్వనాథవారు తన రామాయణ కల్పవృక్షమును విశ్వామిత్రుని దృష్టితో కథను రసవత్తరముగా మలచిరి ఆ మలుపే కావ్యము మంచి రసవత్తరముగా సాగటకు అవకాశము కలిగినది

విశ్వామిత్రుడు రాజుగా నున్న రోజులలో దేశాటనము చేయుచూ వశిష్ఠుని ఆశ్రమము నందలి కామధేనువు సహాయముతో ఆతిథ్యము పొందాడు ఇంతటి సైన్యమునకు విందును సమకూర్చిన కామధేనువును చూచిన విశ్వామిత్రుడు శబళ నీయ వేయి ఆవులిస్తానన్నాడు వేలకువేలు ఆవులిచ్చిన శబళ నిచ్చేది లేదన్నాడు శబళ నన్ను వదలి పోవునది గాదు ఇది నాకు హవ్యంబు ఇది నాకు ప్రాణయాత్ర చేసేదిలేక చివరకు రాజుగ అవును తోలుకొని పొమ్మని ఆజ్ఞ యిచ్చాడు వశిష్ఠులవారు నిశ్చేష్టులుకాగా అ తటి సైన్యము ను అడ్డగించే పెద్ద సైన్యమును సృష్టించింది శబళ వశిష్ఠుని అంత మొందించాలను కున్న విశ్వామిత్రుని వందమంది పుత్రులు భస్మమై పోయిరి నిర్వేదమును పొందినాడు విశ్వామిత్రుడు అప్పటి నుండి వశిష్ఠుల వారిని సాధించాలను కున్నాడు తపస్సు చేసి పరమశివుని మెప్పించాడు సర్వాస్త్ర విధుడయినాడు సరంజామాతో బయలుదేరి శస్త్రాస్త్రములతో వశిష్ఠుల వారి ఆశ్రమమును బుగ్గి చేసినాక! కోపోద్రిక్తులైన వశిష్ఠుల వారు నీ అస్త్ర గర్వమును గాల్చెదరా అని బ్రహ్మదండముతో ఎదుట నిలబడినాడు. రాజు విడిచిన ఆగ్నేయాస్త్రము సాగరము నందు పడ్డ నీటిబిందులా బ్రహ్మదండ నిపీతమయ్యెను వారుణ, రౌద్ర, ఇంద్ర యిట్లా ఎన్నింటినో అస్త్రములను ప్రయోగించెను అన్నింటిని మౌని దండము మ్రింగి వేసింది లోకము అంతా అల్లాడి పోయేటట్లు బ్రహ్మాస్త్రమును సంధించాడు నిఖిలాస్త్రము నొక్క కట్టయై తీర్చిన బ్రహ్మదండము నెదిర్చిడి రావె యంచునన్ వశిష్ఠులవారు ముందు విశ్వామిత్రుడు అతని అస్త్రములు

తలవంచ వలసివచ్చినది తాను ఎవరిని కోపించి బుగ్గి చేయాలను కున్నాడో వారిని ఏమీ చేయలేక పోయాడు వశిష్ఠుల వారితో వైరము పొందాడు చివరగ తపస్సు చేసి బ్రహ్మర్షి అయినాడు ఈ మధ్య కాలమున త్రిశంకుడ్ని స్వర్గమునకు పంపించ లేకపోయిన అతనికి ప్రత్యేకమైన స్వర్గమును సృష్టించాడు అంబరీషుని యజ్ఞ పశువుగా నున్న శునశ్శేపుని యజ్ఞపశుత్వము నుండి విడుదల చేసిరి మొదటిసారి తపస్సు త్రిశంకుని వలన భగ్నమైనది రెండవసారి యజ్ఞ పశువు శునశ్శేపుని వల్లన తపో విఘ్నమైనది మూడవసారి ఈసారి ఇంద్రుడే మరో మార్గమును వెదకవలసి వచ్చినది అందుకే మేనకను పంపాడు అప్పుడును తపో విఘ్నమైనది

మొదటి మలుపులో విశ్వామిత్రుని మదం నశించినది సిగ్గు పడ్డాడు క్రోధమును పెంచుకున్నాడు వశిష్ఠుని బుగ్గి చేయాలను కున్నాడు ఈ మలుపులో క్రోధానికి తావులేదు ఆనిపుడు మాత్సర్య గ్రస్తుడు వశిష్ఠుల వారితో వైరము పొందాడు ఆయన బ్రహ్మర్షి అయితే తాను బ్రహ్మర్షి అవగలనను కున్నాడు తపస్సు చేసాడు కోరిక సిద్ధించినది అతనికి బ్రహ్మత్వము సిద్ధించినది బ్రహ్మర్షిత్వము సిద్ధించగానే అతనికి కోపముగాని, మాత్సర్యముగాని లేదు అతనిలో సంస్కారము పెరిగినది విధి మనల్ని తరిమినట్లుగా విశ్వామిత్రుడ్ని గూడ విధి పట్టుకున్నది అంతటి తపో విజిత గూడ విధిని అను సరించి నడువవలసి వచ్చినది, ఆయన అంతరాంతరములలో ఎక్కడో వశిష్ఠుని కొడుకులకు అన్యాయము చేశానన్న పాపభీతి ఉంది తనకు కోపమూ వశిష్ఠులవారి మీదయితే ఆయన కుమారులను భస్మీభూతము చేయుడ మెందులకు. అందులకు తన్ను తానే శిక్షించు కున్నాడు వేలకు వేల ఏండ్లు తపస్సు చేసాడు. కోపమును, మదమును, కామమును ఎలా జయించి బ్రహ్మర్షిత్వమును పొందినాడో విశ్వనాథ వారు చూపించిరి

మేనకా విశ్వామిత్రుల ఘట్టమును ఎంతో రమ్యముగా నిర్వహించినారు విశ్వనాథవారు ఇందులో శృంగారము ఎంతైనా మనము చెప్పుకోవచ్చును. కాని దాని నిర్వహణలో విశ్వనాథవారు శృంగార రసపులోతులను ప్రత్యుతునే సంప్రదాయమును పాటిస్తూ ఔచిత్యమును పోషించిరి విశ్వామిత్రుడు ఉగ్రమైన తపస్సును ఆరంభించాడు వెయ్యి సంవత్సరముల తపస్సు సాగింది ఇంద్రుడు భయపడి రంభను రమ్మన్నాడు విశ్వామిత్రుని తపస్సునకు భంగం కలిగించాలని రంభ భయపడినది నేను తనరిని వేడుకుంటాను అతడు మహాకోపిష్టి నన్ను పంపవద్దని ఇంద్రుని ప్రాధేయ పడినది భయపడకు నువ్వు ఒక్కర్తెవే గాదు, నేను, తోడుగ మన్మథుడు గూడ నుందును పద పద అంటూ ఆయన ఆశ్రమమునకు తీసుకొని వెళ్ళగ విశ్వామిత్రుని ఆశ్రమమునకు రంభ వెళ్ళక తప్పలేదు, శపించబడక తప్పలేదు అతడు కామమును జయించిన, క్రోధమును జయించలేదు ఆమెను శిలను చేసినాడు ఇంద్రుడు, మన్మథుడు పారిపోయిరి మరల మరొక వేయి సంవత్సరములు తపస్సు, తిరిగి బ్రహ్మ ప్రత్యక్షమై నీవు బ్రహ్మర్షి అనగానే వశిష్ఠుడు కమండలపాణియై గాధేయా! నీవు బ్రహ్మర్షివైతివి అంటేనే గాని తృప్తి లేదు అన్నాడ. చివరకు వశిష్ఠులవారు వచ్చి నీవు బ్రహ్మర్షివైతివి అంటేనేగాని ఆయనకు తృప్తి లేదు చివరకు వశిష్ఠులవారు రావడము, శివుడు, శ్రీపతిని, శ్రీపతి శివుడు పోలె ఒకరినొకరు కౌగిలించుకున్నారు

కవిత్వము ఒక తపస్సు అయితే కవితా రూపమైన తపస్సు సాధ్యమైతే విశ్వామిత్రుని కథను ఎలా అలంబనముగా చేసుకొని అతడు శమదమాదులను ఎలా సాధించాడో, ఎలా జితేంద్రియుడు అయినాడో, విశ్వనాథవారు తమ రామాయణ కల్పవృక్షమ్మునందు చూపించిరి

విశ్వామిత్రుల వారు రామచంద్రుల వారిని తనతో తీసుకొని

వెడుతూ ఇర వుదు స్త్రీ మూర్తులను వేర్వేరు గుణములను వాటి ప్రతీకగా కల్పించినారు మొదటి స్త్రీ తాటక ఈమె తమో గుణమునకు ప్రతీక

తాటకి సుందుని భార్య భయంకరమైన రాక్షసి ఆ మీద అగస్త్యుల వారిచే శపించబడినది క్షుత్తు తప్పితే ఆమెను నడిపే మరొక చోదక శక్తి కనబడదు వేయి ఏనుగుల బలమున్నది ఎంత తిండి తింటే వేయి ఏనుగుల బలము వస్తుంది ఆమె తిండికి దేశాల దేశాలు ఎండపోయాయి అందులకే ఆమె చావునకు పక్షులు రెక్కలు అల్లార్చి చప్పట్లు కొట్టాయి ఆమె గుర్రు లేకపోవడము వలన జంతు సంతతులు రాత్రి హాయిగా నిదురపోయాయి జనము వచ్చి ఆమెను సంహరించిన రామునితోను, ఆమె చావునకు సాధనమైన రాముని వింటిని, అమ్ముల పొదిని బెరుకుగ చూశారు తాటక చావునకు ఇంద్రుడే స్వయముగా వచ్చి మంచిపని చేయించావన్నాడు విశ్వామిత్రునితో ఇన్ని రకముల ప్రాణులకు మహోపద్రవకారిణి, గడ్డ కట్టిన తమో గుణమునకు లక్ష్యము తాటకను సంహారింప చేశారు అటువంటి తమో గుణమును మొదటుగా విశ్వామిత్రుడు మథింప జేశాడు.

ఇక అహల్య అహల్య శప్తురాలు అవడానికి ముందు ఆమెకు గౌతముని తోడి దాంపత్యములో ఒక వెలితి కనబడి ఉండాలి తాను లతాంగి. ఆయన అఖండ తపస్వి తానేమో తరళాక్షి కనువేదురు ఇంకను తీరిపో లేదు గౌతముడు ధర్మమూర్తి ఆయన అలాగ తపస్సు చేసుకుంటూనే ఉన్నాడు ఈ తపస్సునకు ఎక్కడైనా అంతం ఉంటుందా అనిపించి ఉండాలి ఆమెకు స్వభావము చేత రజోగుణ ప్రధానురాలు, సత్త్వగుణ సమీపవర్తి అవడమువల్ల రజోగుణము సత్త్వగుణముగా మారిపోదు. పైగా అవకాశము రాగానే మోహము కల్పిమ్ముతుంది ఆ ఆకర్షణ అసాధారణమైన ఆకర్షణ అట్టి ఆకర్షణ కల్గిన తరుణమున గౌతముని తపస్సు ఒక కొలికికి రావడము అనేది లేదని

ఆమెకు తోచినప్పుడు సంభవించినది ఆమె మతి బిగ పట్టినది. వేల యేండ్లు అంతవరకు ఆమె సాధ్వివతే, ఇల్లాలే, అయినా ఆమెలోని రజోగుణము వల్ల మోహము కల్గిన్నక తప్పలేదు. తత్కారణముగ అమెను శిలవు కమ్మని గౌతముడు శపించగా ఆమె శిల అయినది. అంత అహల్య గౌతముని ప్రార్థించగా ఎపుడు నీ మోహము అంతయు వీడిపోవునో, అపుడు శ్రీరామ చంద్రుల వారి దర్శనము కల్గును అంత నీ శాపము తీరిపోవును అని గౌతముల వారు సెల విచ్చిరి. అప్పటినుంచి ఆమె శిలై తపస్వినియై ఉండిపోయినది ఆమె తపస్సు వల్ల మోహము విచ్చిపోయినది రజోగుణము క్షాళితమైనది రాముని రాకతో శాప విమోచనము పొందింది

ఇపుడు అహల్య పరమ సత్త్వమూర్తి ఆమె అన్నపూర్ణలా ఉంది రాముని కంటికి కౌసల్యలా, అరుంధతి వలె కనబడినది. శ్రీరామచంద్రుడు ఆమె పాదాలకు నమస్కరించగా ఆమె అతని నుదిటిన కళ్యాణతిలకము దిద్దినది

రాముడు తాటక వధతో భృశాశ్వ దత్తములైన అస్త్రములను స్వీకరించుటకు అర్హత పొందినాడు విశ్వామిత్రుని యజ్ఞరక్షణతో పాటు లోక రక్షణకు కూడ అవసరమైన అస్త్ర సంతతిని సమకూర్చుకున్నాడు ఆ రాముడే అహల్యను ఉద్ధరించడముతో సాధు జనోద్ధరణమునకు నాందీ వాక్యము పలికినాడు గూడు కట్టిన తామసమూర్తి తాటకను సంహరించి రజోగుణము నిండి యున్న అహల్యను ఉద్ధరించినారు శ్రీరాములవారు ఇపుడు రాశీ భూతగణ సత్త్వగుణమైన మైథిలిని స్వీకరించుటకు అన్ని అర్హతలను గణించుకున్నాడు తరువాత కళ్యాణ రాముడైనాడు.

విశ్వనాథ చెప్పిన కథల్లో మరొకటి గంగావతరణ కథ విశ్వనాథ మంచి కథకుడు ఆయనకు ప్రాచ్య పాశ్చాత్య సంప్రదాయ

దాయాలు రెండూ తెలుసు. ఆయన పైకి పాశ్చాత్య నాగరికతకు విరోధిలాగ కనబడతాడు కాని కథాకథన పద్ధతిలో వారి పద్దతి అంతే ఎంత ముఖ్యమో కథాకథన పద్ధతిలో ఆయనకు పాత్రలే ప్రధానము. పాత్రల మనః ప్రవృత్తులను ఆవిష్కరించుటకు విశ్లేషణ చేయుటకు మాత్రము ఇతి వృత్తము అవసరము

కొడుకులు లేరన్న బెంగ ఒకటి తాతలు సగర పుత్రులు అరువది వేలమంది కపిల మహాముని కోపాగ్నికి భస్మీభూతలైన వారి మీదకు గంగను మళ్ళించాలన్న కోర్కెతో గోకర్ణతీరములో భగీరథుడు తీవ్రతరమైన తపస్సు చేశాడు దేవతలు ఉడుకెత్తి పోయినారు. బ్రహ్మతో మొరపెట్టగా ఆయన అగవయ్యా! భగీరథ! నీ తపో వహ్ని ఎగదట్టి సొరగంగ కూడ ఇగిరిపోతుంది నీకోర్కెలను బయట పెట్టు అన్నాడు కోర్కె బయట పెట్టినాడు ఫలితము లేకపో యినది భగీరథునికి మరల ఇంత తపస్సు తప్పలేదు. చివరకు గంగ యేమో గణగణ లాడుతూ తొణికిసలాడుతూ రానే వచ్చుచున్నది "చంపా సహస్రాభ చండకాంతిచ్ఛటామేయ ఘారావర్త మొఱసి" అంటూ గంగ వెనక వచ్చుచున్నది అమ్మయ్య అని సంబర పడ్డాడు భగీరథుడు 'కాని శివుని జటాజూటం నుంచి ఒక్క బిందువు కూడా బయట పడలేదు ఏమినా దురదృష్టము అనుకున్నాడు మరలా తపస్సునకు దిగాడు శివుని ప్రసన్నము చేసుకున్నాడు' శివుడు జటను సడలించాడు' గంగ ఏడు నదుల నుంచి ఏడుపా యలుగ బయట పడినవి అందులో ఏడవ పాయ భగీరథుని అనుస రించినది బంగరు గంటలు గల్లుగల్లు మంటుండగా సితపతాకాచ్ఛాలి ఆకాశాన్ని చీలనగ్గంధ్యగా జాతిగుఱ్ఱములు పూన్చిన రథము మీద భగీరథుడు సాగిపోతుండగా వెనక నుంచి గంగ వస్తుంది' ఆవెనుక పెద్దవాహిని వస్తుంది' దేవర్షులు, గంధర్వులు, యక్షులు, సిద్ధులు. మణిభూషణాంగులు, విమానస్థులు వస్తున్నారు భూమి మీద గం గలో మొసళ్ళు కనబడు తుంటే ఆకసములో గుర్తులు గల జలదాలు

కనబడుతున్నాయి, తెల్లటి హంసలు భూమిమీద, ఆకాశములో వాళ్ళ ప్రతిబింబాలులా శారదాభ్రములు, ఇక్కడ గుంపులుగా ఉన్న పద్మాల కాంతులు ఆకాశములో సౌరంగనా ముఖాబ్జములు పెండ్లి కూతూరిని అత్తవారింటికీ పంపేటప్పుడు ఎంత సందడిగా నుండునో అంత సందడిగా నున్నదట ఇక్కడ ఈసందడి భూనభోనాంత రాళాలు నిండి పోయినది

భగీరధుడు అద్భుతపడ్డాడు. అతని ఆనందానికి అవధిలేక పోయినది ఎంతోగా సురలును ఋషులు హాహారవంబులు చేసిన భగీరధుండు వనుదరిగి చూసాడు తన కన్నులను తానే నమ్మలేక పోయాడు. అసలు తనతో వచ్చిందా గంగమ్మ. వెనుబడి వచ్చే ఏరు ఏమయినట్లు, కనిపించదే అని ఆశ్చర్యపోయాడు. అంతలో సురలు భగీరధునికి జాహ్నవి సంగతి తెలియ చేసారు.

జాహ్నవి ఆయన ఒక మహాఋషి ఆయన యజ్ఞం చేసుకుంటున్నాడు మరి గంగ ఆయన తప్పించుకొని పోవచ్చును గదా, కాని ఆమె దూకుడు మానదు గదా! ఉరవళ్ళు త్రొక్కుతున్న సురవాహిని ఆపోశన పట్టేశాడు అంత భగీరధుడు

"ఇంకొక వేయి యేండ్లు ప్రభు యే నిను గూర్చి తపింతుగొని నీ వింకను సౌరవారి విడులే యదియెంత ప్రయాసమయ్యో"

అంటూ భగీరధుడు జాహ్నవిని ప్రార్థించగా, ముని గుండె కరిగి ఇక ముందు జాహ్నతనయ ఈమె అని తనచెవినుండి గంగను వదిలెను గంగ ఇపుడు కాస్త తెలివి తెచ్చుకొని ఆయనకు ప్రదక్షిణము చేసి సురగంగ జాహ్నవి అయినది కథా కథన కౌశలమున జాహ్నమహర్షికి గొప్ప మూర్తిమత్వమును కల్పించినారు, విశ్వనాథ వారు. ఆయన చాలా సౌమ్యుడు, అయితే నేమి ఆయన జోలికిపోయిన సురగంగను మ్రింగి చివరకు చెవిద్వారా వదిలారు ఒక్క షరతుమీద జాహ్నతనయ సుమ్మి అంటూ తన కూతురుగ గంగను చెప్పుకోవాలి కథను చెప్పిన తీరు విశ్వనాథవారు తీర్చిదిద్దిన సరణి లోకాగ్ర గస్సై

నది భగీరథ ప్రయత్నమునకు వ్యాఖ్యానముగ ఈ పాత్రను తీర్చి దిద్దిరి అంత అపూర్వముగ కథాకథన కౌశలమును తన కావ్యము నందు చూపినప్పటికిని విశ్వనాథ ఇంటారు-

"ఇది మెచ్చెదరో మెచ్చరో
యిదియును జదివెదరు జదువరేలా నా క
య్యది? నా యెద నీతో రా
చెద నాద్దానికి ఫలంబు జెందించు శివా!

విశ్వనాథ వారే శబ్దములు, ఆతని శబ్ద చిత్రములు, ఆలంకార సామాగ్రి, వర్ణనలు, కథాకథన కౌశలము, ఆయన వ్యక్తిత్వమును నిరూపిస్తాయి ఈ వ్యక్తిత్వములో ఒకటి ఆయన కవితలో పుంభావ లక్షణము ఉండును సంగీత సాహిత్యాలు సరస్వతీ వరప్రసాదము అయి పాఠకుల మనస్సులను ఆహ్లాదకరము చేసినవి

రామాయణ కథ కరుణ రస ప్రధానమైనదే అయినా విశ్వనాథ దానిని శాంతరస ప్రధానముగా మలచడము వల్ల కావ్యములో కన్నీళ్ళ కన్న నిర్వేదము ఎక్కువ చోటు చేసుకున్నది ఆలోచనను రేకెత్తిస్తుంది. మనిషి ఆలోచనా విధానమును తీర్చిదిద్దుతుంది తాత్త్విక చింతనకు దారి తీస్తుంది. దానికి కవి తన ఆత్త్విక చింతనను కూడ జోడిస్తే కావ్యము బలాన్ని, తేజాన్ని పుంజుకుంటుంది అట్టి కావ్యము కేవలము మనోరంజకమంగా ఉండడముతో ఆగిపోక, మనిషికి జీవితాన్ని ఎదుర్కొనే ధైర్యము నిస్తుంది విషయ లోలత్వముతో మగ్గి పోయేవానిని తమస్సులో నుంచి సత్వంలోనికి ప్రయణము చేసేటట్టు చేస్తుంది. చీకటిలో కొట్టుకొనే ప్రాణికి వెలుగును చూపుతుంది కల్పవృక్షము అవతరించే వరకు ఇంతటి మనోధైర్యము ఇవ్వగల్గిన జగద్ధితమైన కావ్యం తెలుగులో మహాభారతము మినహా మరొకటి కనబడుదు ఇటువంటి మహాద్భుత మైన రామాయణ కల్పవృక్ష కావ్యమును రచించిన శ్రీ విశ్వనాథవారు ఆంధ్రుల హృదయాలలో ఎల్లవేళల చిరస్మరణీయుడు

# కల్పవృక్ష ఋతు రామణీయకము

డాక్టరు కాపూరి స్వరాజ్యలక్ష్మి

ఋతువు అనేది ఒక ప్రధానమైన కాలవిభాగం. కాలంలో లిప్తలు, క్షణాలు, గంటలు, రోజులు, పక్షాలు, మాసాలు, సంవత్సారాలు గడవడాన్ని గడియారాల్లో, కేలండర్లలో లెక్కించుకోవాలి గాని ఋతువుని అలా కొలవవలసిన అవసరం లేదు, ఋతువు ఈ లోకములోనికి తాను వచ్చానని అదే చెప్పుకుంటుంది దాని ప్రత్యేకత అదే మానవుడు తన శరీరాను భవంతో మార్పుల్ని బట్టే ఋతువుని గుర్తించగలడు ఎంత నాగరిక వాతవరణంలో ఉన్నా, ఎక్కడినుండో కోకిల వసంతం వచ్చింది అని పాడిన పాట చెవులలో ప్రతిధ్వనించక మానదు ఒడలు మండించే తాపం గ్రీష్మం వచ్చింది అని అడగాకుండానే చెప్తుంది, ఆకులు రాల్చిన చెట్టు శిశిరానికి సంకేత ధ్వజంలా నిలుస్తుంది, ప్రకృతిలో ఋతువుల వికాసం స్పష్టంగా కాల పరిణామాన్ని చెప్తుంది, అంతేకాదు. ఇవి మానవుని జీవితాను భూతుల్లో, కోరికల్లో కూడా మార్పుల్ని తెస్తాయి, వసంతం వచ్చిందంటే మానవుని మనసు ఆహ్లాదకరమైన వాతావరణంలో అందమైన అనుభవాల్ని కోరుతుంది, శిశిరశైత్యం సహించడానికి ఏదో ఒక రకమైన వెచ్చదనాన్ని తెచ్చుకుంటుంది, ఇలా మానవ జీవితం అంతా ఋతువుల అధీనంగా సాగుతోంది అందుకే కావ్యాలలో ఋతువులకు అంత ప్రాధాన్యం వచ్చింది, లోకంలోని మానవులే కావ్యంలో నాయికానాయకులు. కావ్యం అనుభూతి ప్రధానం, కాబట్టి వారిని గురించి వర్ణించే టప్పుడు ఋతువుల్ని, వాటి ప్రభావాన్ని చెప్పడం కవులకు తప్పనిసరి అయింది (ఆధునిక సాహిత్యం దీనికి అపవాదం కావచ్చు ఈ కాలంలో ఋతువులూ సక్రమంగా నడవడం లేదు ఆరు ఋతువులూ లెక్క పెట్టుకోవడమే గాని మొత్తం మీద మనకు మిగులుతుంది రెండో మూడో అనుభవంలో అలాగే అవి మనసుపై వేసే

ప్రభావాన్ని పట్టించుకొనే తీరిక గాని, ఆకోరికలు తీర్చుకునే వ్యవధికాని, అవకాశాలు కాని ఈనాటి యాంత్రిక జీవితాలలో కుదిరేవి కావు?

ఆదికావ్యమైన రామాయణంలో వాల్మీకి ఈ ఋతువర్ణనలకు అందులకే అంతటి ప్రాధాన్యం ఇచ్చాడు ఋతువర్ణనలు కావ్యములో ఉన్న రసానికి పరిపోషకాలుగా తీర్చాలని ఆలంకారికులు అన్నారు, 'అంగ ప్రత్యంగములు యథోచితమైన, సుస్నిగ్ధ సంధిబంధమైన సన్నివేశమే కావ్యంలో సౌందర్యం అనుబడుతుందని భరతుని రస సూత్రం, అదే శిల్పం ఆలంకారికులు ఈలక్షణం చెప్పడానికి ముందే వాల్మీకి లక్ష్య ప్రాయంగా ఋతువర్ణనలను సృష్టించాడు వాల్మీకి వలెనే విశ్వనాథ కూడ ఈ రస రహస్యం ఎరిగినవాడే. ప్రాగ్వపశ్చిన్మతంబున రసము వేయిరెట్లు గొప్పది అనే సిద్ధాంతానికి ఆచరణంలో ప్రాణపోసిన ఈకవి 'మానవ శరీర సంధి బంధముల దార్ఢ్యమున శరీర గత ప్రాణము తేజోవంతమై యెట్లుండునో, కావ్యములోని వివిధ భావముల పరిపుష్టి కావ్యరసమున కట్టి దార్ఢ్యము నొసంగును, అని తానే చెప్పిన లక్షణానికి అనుగుణంగా, లక్ష్యభూతంగా కల్పవృక్ష ఋతువుల్ని తీర్చారు

ఐతే వాల్మీకి చేసిన విశేషమేమంటే ఋతు వర్ణనలలో ఈ రసదర్శనంతో పాటు తత్వదర్శనం కూడా తెలియ కుండా, పైకి కనబడకుండా మిళితం చేయడం, వాల్మీకి ఆర్షకవి, ఋషి లక్షణమైన తత్వదర్శనం, కవిలక్షణమైన రస దర్శనం ఆయన రచనలో ప్రతిఫలించక మానవు. అంతమాత్రమే కాదు, ఆయన కావ్యానికి నాయకుడు మానవరూపంలో ఉన్న పరమాత్మ, ధర్మ రక్షణార్థం అవతరించిన వేదవేద్యుడు, ఈ దేశ కాలాలకు లొంగి వర్తిస్తున్న అఖండకాల స్వరూపుడు, స్త్రీ పుం రూపంగా ద్విధాకరించుకొని అవతరించిన వెలుగు ఋషికి కావ్యరచన చేస్తున్నప్పుడు ఈ రెండు స్వరూపాలు

దర్శన మిస్తూనే ఉన్నవి, అందువల్ల తత్వం, రసం మిళితం కాక తప్పలేదు. సీతారాములు మానవులుగా ఈ కాలంలోని ఋతువుల అనుభవాలు చవి చూచిన వారే వాల్మీకి ప్రధానంగా వర్ణించిన వసంత వర్షా శరత్తులు మూడూ సీతా వియోగంలో ఉన్న శ్రీరామునికి ఉద్దీపకాలుగానే, కావ్యధర్మంలో అతడు విప్రలంభ శృంగారానికి ఆలంబనం, సంయోగ వియోగాలు, ఉద్దీపనాలు, ఈ దుఃఖము మానవ పరిధిలోనివి. వసంతమునకు అదురుట, వర్షమునకు బెదరుట, శరత్తునకు క్రుంగుట కాంతా వియుక్తుడైన మానవ లక్షణము. తత్వ పరిధిలో వారి వియోగమొక నాటకము. కాలమును శాసింపగలిగి వర్తించుట అవతార ధర్మము,

విశ్వనాథ ఈ లౌకికాలౌకికములను రెంటిని తన కావ్యములో మిళిత మొనర్చుటలోనే నిజమునకు వాల్మీకి ఋణమును పూర్తిగా తీర్చగలిగినాడు.

"ఒక్కఁడే కార్యమెు సేయు దివ్యమతి, నేదోమాట వాక్రుచ్చుఁదా
నొక్కఁడా చేసిన చెప్పినట్టి జనుఁడే యూహాం బ్రవర్తిల్లె దా
నికి నిష్కృష్టము గాఁగఁ జూడవలెఁగానీ, యథేచ్ఛాను వా
దక సిద్ధాంతము లందుఁ జొన్పిన యథార్థం బందుఁ గన్పించునే"

వాల్మీకి రామాయణమునకు తన అనువాద సరణిని విశ్వనాథ ఈ పద్యమున వ్యాఖ్యానించె నన్పించును దివ్యమతిని రామకథను వాక్రుచ్చినవాడు వాల్మీకి ఆ ఋషిమతిని రామకథను దర్శించిన వాడు విశ్వనాథ. కనుకనే విశ్వనాథ రామాయణము వాల్మీకి రామాయణమునకు అనువాదముకాదు వాల్మీకి హృదయమునకు అద్దము. ఈ నేపథ్యంలో విశ్వనాథవారు ఋతువర్ణనలలో చేసిన రస, తత్వ దర్శనం చేయడానికి ప్రయత్నిద్దాం

వాల్మీకి బాలకాండలో రామావతరణ సందర్భంగా

వసంతాన్ని పదేపదే ప్రస్తావిస్తారు రామజననం, వివాహం, పట్టాభి షేక యత్నం, రావణుని జయించడం, పట్టాభిషేకం అన్నీ వసంతం లోనే వసంతాన్ని, రాముని జీవితాభ్యుదయ ఘట్టాలను ముహుర్ము హురను సంధాన మొనర్చడం రాముని పరమాత్మ తత్త్వా విష్కా రానికే. ఇది 'ఋతునాం కుసుమాకరః' అని చెప్పుకొన్న పరమాత్మ అవతరణ సూచన విశ్వనాథ ఈ శిల్పం యథాతథంగా అనుసరిం చారు. దీనితోపాటు కథాను బంధియైన వర్ణన శిల్పం పాటించారు

అశ్వమేధ యాగ సందర్భములో వసంతం వర్ణించారు. వసంతంలోని ప్రత్యణువూ యజ్ఞంలో పాలు పంచు కొన్నదట. కోకిల, తాను కూడా యజ్ఞధూమం కళ్ళల్లో నింపుకొని, భోజనం మాని ఆకులు మాత్రం భుజిస్తూ యజ్ఞదీక్ష వహించినట్లుందట

సీ॥ ఎఱ్ఱనౌ నేత్రమ్ములిష్టి వేళానల ధూమ సంతానమ్ము దూఱినట్లు
ఆకులు తినుట దీక్షాకాల భోజన నియమ తీవ్రతచేత నెగడినట్లు
చివురాకు ముక్కున జిమ్ముట జుహూవుచే పాత్రాదికమ్ములు పట్టినట్లు
పంచమస్వరము స్తోభలు చక్కగా సాచి సామ గానమ్ములు సదివినట్లు

గీ॥ రేకలీకల నలుపు ధరించినట్టి
నియమ వస్త్రమాలిన్యంబు నెఱయునట్లు
సప్తతంతు మహాకార్య సమయ మందుఁ
గర్తవోలిక కోకిల కానుపించె

యజ్ఞకర్త దశరథుడు ఈ కోకిల వర్ణనలో సాక్షాత్కరిస్తున్నాడు. అశ్వమేధ నిర్వహణలో ప్రకృతిని భాగస్వామిని చేయడం కావ్యరస పరిపుష్టికి దోహదకారియైన వర్ణన శిల్పం

సీతారాముల వివాహానంతరం శ్రీరాముడు సీతతో కలసి అనేక ఋతువులు విహరించాడని వాల్మీకి వారి ప్రణయ విహారాన్ని

సూచించి వదలివేస్తాడు విశ్వనాథ ఈ ఘట్టంలో షడృతు పరిభ్రమణం వర్ణిస్తాడు. ఈ ఆరు ఋతువులు ఆరు సంవత్సరాల కాలగమనానికి ప్రతీకలు 'రాముని జీవితమున వైరాగ్య సంసార భావంబులు సమ ప్రసార రమ్యబంగుటు' విశ్వనాధ కల్పవృక్ష విశేషం. ఆ వైవిధ్యాన్ని ఈ ఆరుఋతువుల వర్ణనలతో స్ఫురింప జేయడం పాత్రమనస్తత్వ చిత్రతోన్ముఖమైన విశ్వనాథ వర్ణన వైలక్షణ్యానికి మచ్చుతునక

వసంతలో వారి అన్యోన్యానుబంధం ఉదాత్త శృంగార రసశిఖరాల నధిరోహిస్తుంది గ్రీష్మం శ్రీరాముని హృదయంలోని ప్రణయ కుసుమ పరాగాన్ని దూరీకృతం చేస్తుంది, ఈ వైరాగ్యం మూడేళ్ళు కొనసాగడం మూడు ఋతువులలో ప్రతిఫలిస్తుంది, గ్రీష్మంలో సంపూర్ణ విరాగం, వర్ష ఋతువులో సామీప్యం ఉంది కాని అభిముఖ్యం లేదు. శరత్తులో ప్రకృతిలో వలెనే శ్రీరాముని మనసులోని కలక తేరుకుంటోంది, హేమంతంలో సీతపై ఆదృతి, శిశిరంలో సంపూర్ణ సమాగమ సౌఖ్యం, అన్ని ఋతువులలో భావ చాంచల్యం శ్రీరామచంద్రునిదే. సీత విరహిణి. రామచంద్రుడు శాంతానికి, సీత విప్రలంభ శృంగారానికి ఆలంబనాలు సీతా రాముల చిత్త వృత్తుల్ని ఋతువర్ణనలలో ప్రతిఫలించిన విశ్వనాథ శాంత శృంగార రస పరిపోషకాలుగా ఈ వర్ణనల్ని కల్పించి విరుద్ధాలైన ఆ రెండు రసాలకు ఏక వాక్యత కల్పించి తనరస నిర్వహణ చతురతను ప్రదర్శించారు

ఈ ఋతుషట్క వర్ణనా త్రివేణిలో వారి వైరాగ్య సంసార భావాలు గంగా యమునలు కాగా, వారి అఖండ కాల స్వరూపం ఇందులో అంతర్వాహిని యైన సరస్వతి సీతా రాముల ఆంతర ప్రవృత్తులు ఋతువులలో ప్రతిబింబింపజేయడం వారి కాలస్వరూప ద్యోతనార్థమే ఈ ఘట్టం సోదాహరణంగా చూస్తేగాని అందులో అందం అవగతం కాదు.

వసంత వర్ణనమును అనుశీలించిన ఇందు మూడు లక్షణ ములు కన్పడును. ఒక లక్షణము చేష్టా ప్రతిరూపిక రెండవది అను భూతి స్పందనము మూడవది అతిలోకమైన లక్షణము

వివాహమైన తొలి రోజులలో సీతారాముల ముగ్ధ ప్రణయ మును వర్ణించి, వారిలో 'పుష్పధనుర్దోష నిష్కాపన హేతూత్సవ ములు' దశరథుడు జరిపించెనని కవి ౘప్పెను వానితో సీతారాముల ప్రణయ వ్యవహారం క్రమక్రమముగ మౌగ్ధ్యమును వీడి ప్రౌఢా వస్థను చేరికొన్నది

"కనరాకన్ జివురాకు జొంపముల ఱెక్కల్ ఱెక్కలన్ రాచి ము
క్కున ముక్కున్ గదియించి యెఱ్ఱని కనుల్ కోసల్ పిసాళింపు త్రి
తనుకౌ చొక్కున మన్మధాగమ శిఖా తాత్పర్య మీమాంస లే
లిన కోడింద్రగు జంట కోకిలలు పాలించెన్ వనీ వీధులన్"

సనాతనము, అనాదియు అనంతమునైన ప్రకృతి పురుషుల ప్రణయమును ప్రకృతిలోనే ప్రతిబింబించినాడు కవి

ఈ ప్రణయమునకు నేపధ్యమున నున్న వాడెవడు? మన్మ ధుడు అతనిని వర్ణించిన ఈ పద్యములో రెండవ లక్షణమైన సీతా రాముల ప్రణయాను భూతిలోని వైశిష్ట్యమును ధ్వనించినాడు కవి

సీ॥ "తొలకరి సంజవేళలఁ బశ్చిమా కాశ
మావరించిన మేఘునట్టివాఁడు
గిర్యుపత్యకల సాగించు సన్నని యేళ్ళ
యాషాఢ మాసంబు నట్టివాఁడు
వైజయంతీ పుష్ప వాసనా భరితమౌ
వైకుంఠు వక్షంబు వంటివాడు
మఱల సృష్టిని జేయు మహిత ప్రాతర్వేళ
బ్రహ్మదేవుని యూహ వంటిఁవాడు"

గీ॥ మహిఁతు డొక్కఁడు పంగనామాల చెఱకు
విల్లుగాఁ దుమ్మెదల వారి పెల్లుగాఁ బ్ర
సూనములు నంప జల్లుగా సురభి మాస
పుష్పవన వీథుల విహారముం బొనర్చె.

మన్మథుని స్వభావమునకు కవి నాలుగు ఉపమలు చెప్పెను. ఇవి అన్నియు మన్మథభావ అంకుర దశలు సహజ శోభావహములు సద్యస్స్యంజాత సౌకుమార్యము, ముగ్ధ మనోహరత్వము వీని వైశిష్ట్యము, సీతారాముల హృదయములందు భావజుఁడట్టి ముగ్ధ మనోహర భావనా విలసితుడై యుండెనని ధ్వని ఆ మన్మథ భావాంకుర మాధుర్యమునకే విశ్వనాధ ఈ ఆకృతి కల్పన.

ఇక మూడవ లక్షణం సీతారాముల ప్రణయంలోని అతిలోక స్వభావ వర్ణనము కోకిల కొదమ జంట యొక్క పాటను వర్ణించడంలో ఇది ధ్వనితం

"శారద వల్లకి జంట తంత్రులు మీటి
కేవలామృతము లొల్కించినట్లు
కడకొక్క వాగుగాఁ గాఁబోవు సెలయేళ్ళు
రెండు జోడుగఁ బ్రసరించినట్లు
మనసిజు రథము పోయిన మేరఁ గ్రొత్త రో
జాల కిట్టు వివాది సాగినట్లు
ప్రణయచర ద్విజిహ్వా కులాంగనా కాకు
కాకలీ గీతిక కదలినట్లు

చారు చూత కిసాల కషాయగంధ
బంధురము జీరసాగిన పాటపాడె
గున్న జొంపంబులం దాగియున్న యెఱ్ఱ
మదిర కన్నుల కోకిల కొదమజంట.

శారద వల్లకి జంట తంత్రులు మ్రోగాయి కాని విన వచ్చింది ఒకే అమృత ప్రవాహధ్వని రెండు సెలయేళ్ళు జోడుగా ప్రవహిస్తున్నాయి. కాని అవి ఒకే వాగుగా కలిసిపోయే లక్షణం కనిపిస్తూనే ఉంది. మన్మథుని రథం రెండు చక్రాలపై పరుగిడుతుంది కాని వినబడుతున్నది ఒకటే శబ్దం. నాగకాంత రెండు నాలుకలు సాచి పాడినా చెవిని పడుతున్న గీతి మాధుర్యం ఒక్కటే

వైవిధ్యంలోనే ఏకత్వం ఈ వర్ణనలో విశేషం ఇది సీతా రాముల దాంపత్య రహస్యం ఇది ఏక రూపుడైన పరమాత్మ ద్విధా విభక్తమై దంపతీ భావమున అవతరించిన లక్షణం సీతారాముల అద్వైత ప్రణయ తత్త్వానికి రసమయ రూపకల్పనం

సీతారాముల దాంపత్యంలో సంయోగ రేఖ వియోగ రేఖ లోనికి త్రోవ తీయడాన్ని విశ్వనాథ గ్రీష్మ వర్ణనలో నిరూపిస్తారు, గ్రీష్మావనిలో చరాచర ప్రకృతిలోని ప్రతివస్తువూ రామునికి తత్త్వం ప్రబోధించినట్లు ఉంది. సరయూ జలాలు సైతం అంతః పుర సౌధ సోపాన పరంపరకీ, తమకీ మధ్య ఇసుక తిన్నెలను అడ్డు పెట్టుకుని అయోధ్యా సంపర్కానికి విముఖంగా ఉన్నాయట సీతాసౌధ ప్రవేశ భావనకి సైతం విముఖంగా ఉన్న శ్రీరాముని అంత రంగ స్థితి ఈ సరయూ జలాల్లో సాక్షాత్కరిస్తోంది,

రాముని ఈ అంతర్వైరాగ్యం రామాయణ కల్పవృక్షంలోని రస ప్రతిపాదనకు బీజం శాంతరస ప్రధానంగా కల్పవృక్షాని మల చిన విశ్వనాథ తద్రసాలంబనమైన నాయకుడి ఆత్మ సంసూచనార్థం వేసిన ప్రాతిపదిక గ్రీష్మవర్ణన

వర్షఋతు వర్ణనలో మూడు విభాగాలు కనబడతాయి మొదటి భాగం వర్షర్తు విజృంభణ రెండవ భాగం తన అంతరంగ స్థితికి, వర్షర్తు వాతావరణానికి కలిగిన సంఘర్షణలో చిత్రంగా

కనబడే శ్రీరాముని ప్రవర్తన మూడవ భాగం ఈ రెండిటి మధ్య నలిగిపోయిన సీత దైన్యస్థితి తలచుకొన్న కొద్దీ హృదయం చెరు వయ్యే సంఘటన ఇది

'సర్వవిధ నాయికా సమాస్వాద సాధుమూర్తి'యైన వర్షాధి పతి శ్రీరాముని మనసును కదిలించి సీతామందిరానికి సాగనంపుతాడు రాముడు శారీరకంగా ఆమెను సమీపించాడు, కాని మానసికంగా దగ్గర కాలేకపోతున్నాడు ఈ స్థితిలో శ్రీరాముడి ప్రవర్తనా వైచి త్రికి వర్షర్తు సామగ్రితోనే రూపు కట్టించడం కవి ప్రతిభ

సీ॥ "ఒక నైగనిగ్యంబు నురలు పచ్ఛదనంబు
లేని సౌదామని వోని కనుల
నార్ద్రతలేని నీలాంబుదాంచల యుగ
ప్రసరణంబును వోని బాహు లతల
గుమియైన తడి దమ్ముకొను గాలియుండలఁ
ద్రెవ్వు వెన్నెల వోని నవ్వు పెఱల
యుగపదాత్త నిమీలనోన్మీలకము నల్ల
కలువను బోని మొగంబు జిగుల

గీ॥ జానకీ రహస్సంయోగ సమయ వివృత
సంవృతాత్ముఁడు శ్రీరామచంద్రు నందు
ఔక్కచాచిన యంజనాద్రివలెనైన
వర్షఋతు వందు భేదమర్సఁఋపరాక"

శ్రీరాముడు సౌదామని వంటి కళ్ళతో సీతను చూస్తాడు కాని ఆ చూపుల్లో చురుకు లేదు నీలాఁబుదా లాటి బాహువులు ఆమె వైపు చాచినా ఏంలాభం? ఆ స్పర్శలో ఆర్ద్రతలేదు వెన్నెలలు ఒలక బోసినట్లు నవ్వులలో అందమే లేదు వర్షాకాలపు కలువలా అతని ముఖం ఈ క్షణంలో వికసిస్తుంది మరుక్షణంలో ముడుచుకుపోతోంది

సంయోగ సమయంలో శ్రీరాముడు వివృతాత్ముడైనపుడు చేష్టారూపంగా అనుభూతిని ప్రకటిద్దా మనుకుంటాడు ఆ భావన చేష్టగా మారే లోపలే సంవృతాత్ముడవడంతో చేష్ట మాత్రం మిగులుతుంది కాని అందులో అనుభూతి శూన్యమైపోతుంది ఇది శ్రీరాముని అవస్థ పాపం సీత అవస్థ ఎలా ఉంది!

"స్త్రీ స్వభావంబుతో పాటు వెలఁగు సంస్కృ
తి ప్రథమ దశా మందాక్ష తీవ్రరేఖ
ననుభవింపంగ; బడ నిగ్గుకొనెడు సీత
యనుభవ ప్రార్థనామూర్తి యయ్యెఁగనుల"

ఆమెకు కోరిక ఉంది కాని స్త్రీ స్వభావ సహజంగా ఆ నవవధువు యొక్క సిగ్గు ఆ కోరికని వ్యక్తం చెయనివ్వడం లేదు 'అనుభవింప బడ నిగ్గుకొనెడు సీత' కళ్ళలోనే తన కోరికను కనబరచి ప్రార్థించిందట ఆ అభ్యర్థన కూడా రాముడి పట్ల వ్యర్థమే అయింది

"ఉఱుమఁడు, చాన క్రొమ్మెఱుఁగిలు నొత్తగసీఁడు వియత్పథా వృతిన్
దఱుగఁడు, వర్ష తీవ్రతను దాల్పఁడు చిన్కుటు మానఁడా సతిన్
మెఱఁగడు, సుంత సంజ యెఱుపుం జొరనీయడు నాశలందునన్
జెఱగఁడు తత్తథాగత విశేషగుణండభిరామ మేఘుడున్"

ఈ రీతిగా నున్న రాముని ఆత్మతత్త్వం ఎదకు అందీ అందక జానకి అటుమంచినది ఇంతలో శరదృతువు అరుదెంచింది

"సాగర సమాగమము లేని శైవలినియు
అవనిభృత్స్పర్శ లేని మేఘాంగనయును
వలపుమై నెత్తు వాగైన నలుపు విటిగి
పతి వియోగ వ్యథా వ్రతల్ పాలిపోరె"

శ్రీరామ వియోగ దుఃఖిత, పాండురీ భూత శరీర సీత ఆకృతికి ఈ శారదిక ప్రకృతి అవధి

శిశిరఋతువు నాటికి సీతారాముల సంసారం సవ్యమార్గాన పడింది

"నవనవ ప్రౌఢతర యౌవన ప్రఘూణ
రత్న మాణిక్య కలిత నీరాజనంబు
చెలువ అధరంబు పగిలించి శిశిరరాజు
కృపణమౌ రతి సర్వస్వ మపహరించె"

శ్రీరాముని రతి ప్రవణత శిశిర ఋతురాజు శృంగార చేష్టలో ధ్వని శిశిరాన్తానికి సీతారాములు ఉదాత్త ప్రణయ సామ్రాజ్యానికి అధిపతులై వర్తించారు

"సీత శ్రీరామచంద్రుని చిత్తపదము
రామచంద్రుడు జానకీ ప్రాణ పదము
రామసర్ప ఫణామణి రమణి సీత
ధరణిజా జీవితా తప తరణిస్వామి"

సీతారాముల దాంపత్య భావం విడదీయ వీలులేనిది. వారి అవినాభావస్థితి వర్ణనతో బాలకాండలోని ఈ ఋతువర్ణనం ఉప సంహృతమయింది.

ఈ విధంగా విశ్వనాథ సీతారాముల దాంపత్య రహస్యములకు వ్యాఖ్యాన ప్రాయంగా, వారి జీవిత తత్వానికి దర్పణ ప్రాయంగా, రామాయణ కల్ప వృక్షానికి బీజభూతంగా ఆరంభంలోని ఈ ఋతుషట్క వర్ణనలోనే నాందీ వాచకం పల్కి అనల్ప కవితా శిల్పం చూపారు

కిష్కింధకాండలో సీతావియోగ సంతప్తుడైన శ్రీరాముని విప్రలంభ శృంగారాని కుద్దీపకాలుగా వాల్మీకి వసంత వర్షా శరత్తుల్ని సుదీర్ఘంగా వర్ణిస్తాడు ఇందులో వసంత శరద్వర్ణనలలో ప్రకృతి అంతా సీతా సౌందర్యాన్ని ప్రతిబింబించడం, అది శ్రీరామునికి సీతా సంస్మరణ హేతువై బాధావహం కావడం వాల్మీకి చేసిన చమత్కారం.

విశ్వనాథ దీనిని గ్రహించారు వసంత వికాస సంశోభితమైన పంపా సరోవర ప్రకృతి సీతా స్వరూప సామ్యం చేత ఒక వంక హర్షాన్ని, సీతను గుర్తు చేయడానికి మరొక వంక శోకాన్ని కలిగించి, రాముడు ఈ రెండు భావాల మధ్య నలిగి 'దైన్య ధైర్య రమణీయ మూర్తియై' విప్రలంభ శృంగార నాయకుడుగా ఉన్మత్త ప్రలాపాలు చేయడం రసవంతంగా, రమణీయంగా దిద్ది తీర్చారు

ఇలాగ శరత్తులో రాజహంసలను, వరివెన్నులను, కాశ సూనములను, తేటికాంతను, విశేషించి అగస్త్య నక్షత్రాన్ని శ్రీరామ చంద్ర విరహోద్దీపక వస్తు సంచయంగా వర్ణించారు ఈ ఉద్దీపన విభావ వర్ణనకు ఒక పద్యం, తద్దర్శన జనితమైన సీతా సంస్మరణ సంబంధమైన శ్రీరాముని బాధా వ్యక్తీకరణకు ఒక పద్యం చొప్పున జంట జంటలుగ పద్యాలువ్రాసి విశ్వనాథ ఒక కొత్తపోకడ పోయారు రాజహంసలను కాంచగానే 'మదమరాళ గమన' సీత, కలమ వెన్ను లను కనినంతనే 'కలమ జంఘు' యైన సీత, కాశసూనాలు కళ్ళ పడ గానే 'కాశ సుమాబ దృగంచల' యైన జానకి, అగస్త్య నక్షత్రం ఆకా శాన మెరసి నంతనే 'కుంభవోద్యన్మునీంద్ర వ్యాసక్తచిత్త' యైన తన సతి రాముడి మదిలో మెదిలిందట సీతా శరత్తుల సరస సమ్మేళ నం విశ్వనాథ రచన, తత్త్వ మేళనా శిల్పం

వర్షఋతువు సీతావియోగ ఖిన్నుడైన శ్రీరాముని విప్రలంభ శృంగారోద్దీప్తి కెంత ప్రోది చేసిందో, 'దార పునర్లాభ నవరాజ్య రమా రూఢు' డైన సుగ్రీవుని సంయోగ శృంగారోద్దీప్తికి అంత దోహదం చేసింది. వాల్మీకి వర్ణనలోని ప్రధాన ప్రయోజనమిది విశ్వనాథ వర్షఋతు వాతావరణ చిత్రణం చేతనేకాక, ఒక చిన్న ఆటవెలదిలోనో తేటగీతిలోనో ఇట్టి మహార్థాన్ని ధ్వనింపజేసి ఆ సన్నివేశ మంతటినీ, అప్పటి పాత్రల స్థితి గతుల్ని కళ్ళకు కట్టించే శిల్పాన్ని ఈ ఋతు వర్ణనలో పాటించారు

'ఎంతటి మబ్బులు క్రమ్మినఁ
గొంత యెవటొ మిన్ను తెలుచుకొనియే యుండున్
వింత వెలుఁగైన కిష్కిం
ధాంతః పురి దీపకాంతులైనను జిమ్మున్'

అగుట కిది వర్షాకాలాకాశ వర్ణనమే, కాని సుగ్రీవుని స్థితి ఇందులో ధ్వని మేఘావృతమైన నీలాకాశంలో కిష్కింధాంతఃపుర దీపకాంతులైనా కొంత వెలుగులు చిమ్ముతాయనడం దివారాత్రి భేదం లేక అంతఃపురంలో భోగాల్లో మునిగి తేలుతున్న సుగ్రీవుడి స్థితిని చెప్పడమే.

సుగ్రీవుడెంత ప్రమత్తుడో లక్ష్మణుడంత అప్రమత్తుడు.

"అంత శబ్ద రహిత మర్ధ రాత్రంబుల
రెండు సత్వడులు చరించు చుండ
నుర్వియందు మేఘు నుఱుముల మ్రోతయు
మింటు రాము ననుజు వింటి మ్రోత"

మింటి నుండి మంటికి వ్యాపించిన మేఘ గర్జా నిర్ఘోషం రాముని విప్రలంభ శృంగారోద్దీప్తికి, సుగ్రీవుని సంభోగ శృంగారోద్దీప్తికి సూచకాలు కాగా, మంటి నుండి మింటి దాకా వ్యాపించిన లక్ష్మణ జ్యా నిస్వానం లక్ష్మణుని నిత్య జాగ్రత్ స్థితికి చిహ్నం

ఇదే విధంగా అరణ్యకాండలో హేమంత లక్ష్మి సౌందర్య చిత్రణంతో పాటు లక్ష్మణుని ద్వారా ఆ సమయంలో ఆ వర్ణన చేయించడంలోని పరమార్థాన్ని కూడా ధ్వనింప జేశారు విశ్వనాథ

ఇలా విశ్వనాథ ఒక్కొక్క ఋతువర్ణనలో ఒక్కొక్క విశేష శిల్పం చూపుతూ వచ్చారు అన్నింటి పరమార్థం రసావిష్కారం కథా తత్త్వ విష్కారం కల్పవృక్షం ఊర్ధ్వమూలం అధశ్శాఖం.

పైపైన రసాలు, తేనెలు చిలుకుతుంది లోతుకు పోయిన కొద్దీ బీజ భూతమైన మూలతత్వం చూపుతుంది

ఇది కథతో ముడివడిన ఋతు వర్ణనల పరమార్థం 'జాగ్ర దవస్థనేమి యన స్వప్న సుషుప్తుల కూడ' తన జిహ్వాలు రామ నామ గ్రహణమే చేస్తాయని చెప్పిన ఈ కవి గుండెల నిండా రామకథే. అతని చుట్టూ రామకథే వలయాలు తిరుగుతూ ఉంటుంది అందుకే ఆ రామలక్ష్మణుల్ని గూర్చి అత్యంత ఉదాత్తమైన కల్పనలు వాటికవే దొర్లినట్టున్నాయి

ఋతు వర్ణనలలో శ్రీరాముని విరహ విహ్వలతతో పాటు లక్ష్మణుని భ్రాతృసేవా ప్రవృత్తిని గూడ చిత్రించడం అన్య రామా యణ కర్తలలో అరుదైన ఉదాత్త లక్షణం

"అల హరిణీ వశానుగములై చను రోహిత వారణంబులన్
చలిత నతోన్నతాధర ల సత్కర కామ్రుఘ ఘూన వృత్తులన్
మెలఁగ గుహాని వాసపు సమీప ధరాస్థలిఁ బారఁ ద్రోలు ద
వ్వులకును లక్ష్మణుండు రఘు పుంగవు డుం గను నన్న భీతిచే"

గుహా సమీపాన ఆడలేడి వెనక మగలేడి, ఆడ ఏనుగు అడుగుల్లోనే మగ ఏనుగు పరస్పర అధర స్పందనతో, కరగ్రహణంతో కామచారు లవుతుండగా రాముడు వానిని చూసి విరహ వివశుడౌ తాడేమో అనే భయంతో లక్ష్మణుడు వాటిని దూరంగా పార ద్రోలుతాడట

వాల్మీకి పశుపక్ష్యాదుల రతిని శ్రీరామునికి ఉద్దీపనంగా వర్ణిస్తాడు కాని ఆ జంటలను లక్ష్మణుడు దూరానికి తోలు భావనను జోడించడంలో ఆ భావానికి కలిగిన దీప్తి హృదయ స్పృశం

ఋతువర్ణనలలో జ్యోతిషాది శాస్త్ర సరిజ్ఞానం ప్రదర్శిం చడం రాయల వారిలో అధికం విశ్వనాథ కూడ తన బహుముఖ

పాండిత్యాన్ని కావ్యముఖాన ప్రసరించే నైజం కలవారు వర్షర్తు వర్ణనలో ఉపనిషద్విజ్ఞానమును ప్రదర్శించిన విధం చూద్దాం

"గాలికి గంధవత్త్వమును క్ష్మాకును జల్లని స్పర్శ నీటి నే
ఘూలకుఁ దేజమా మెఱపుగా నగు నగ్నిని శైత్యభావ ము
న్మీలిత సృష్టి భూత గుణ మిశ్రత కీ ఋతురాజె గౌరవో
ద్వేలుఁడు వీనిలో మొదలు పెట్టియు యుండును కల్ప కల్పముస్"

సృష్టికి ఆదికారణముగ పంచభూతముల గుణ సమ్మిశ్రణమును ఉపనిషత్తులు పేర్కొన్నవి దీనిని 'పంచీకరణ' మంటారు. వర్షర్తు ధర్మముల యందీ లక్షణ నిరూపణ చేసి దానికి సృష్ట్యాది గౌరవం కట్టబెట్టారు విశ్వనాథ

వర్ణనకి అలంకారం ప్రాణం ఉపమానాలు స్వీకరించడంలో కవి సమయ ప్రసిద్ధాలనే కాక స్వీయంగా కల్పించడం, తాను చెప్పదలచుకున్న భావానికి అనుగుణమైన ఉపమలను తన ఊహాలో నుండే రూపొందించు కోవడం వీరిలో ఎక్కువ కవి భావనని బట్టి, సందర్భాన్ని బట్టి ఆ ఉపమలు అప్రసిద్ధాలైనా వానికి భావబోధక శక్తి కలుగుతుంది బాలకాండలో మన్మథ వర్ణనం ఇందుకు సాక్ష్యం

ఇలాగే ఋతువర్ణనలలో ఉపమలు, ఉత్ప్రేక్షలు ఆ యా కాలాల్లోని సహజ లక్షణాలతో రూపొందించడం కూడ వీరిలో విశేష గుణం.

'నడుము విడలని మొగ్గకు విడలన వెలి
పసుపు రేకులకున్ మధ్య వాన బినుకు
నిలుచు తమ్మినా గ్రుడ్డు ఱెప్పలకు నడుమ
కనుల నీర్నిించు నతివ యేకాంతముఁగని"

వర్ష ఋతువున శ్రీరామ విరహ దుఃఖితయైన సీత కన్నీటిని వర్ణించిన ఈ ఉపమానం ఆంధ్ర సాహిత్యంలోనే అపూర్వంగా, అద్భుతంగా తోస్తుంది

ఋతువర్ణన నారంభించడంలో, అంతం చేయడంలో వర్ణించే దృశ్య పరంపర క్రమంలో విశ్వనాథ ఆ పాత్రల గమనాన్ని స్ఫురింపజేస్తారు ఆ వర్ణన వర్ణనగా ఉండిపోదు వర్ణనతో పాటు కథ నడుస్తుంది కథలో వర్ణన కలిసిపోతుంది అరణ్యకాండలో హేమంతం, కిష్కింధలో వసంతం ఈ శిల్పంతో కూడినవి ఇంతేకాక నాటకంలో నాందీ ప్రస్తావనలో సూత్రధారునిలా కవి ఇటు వర్ణించే పాత్ర చిత్త స్థితిని పరిచయం చేసి, ఆ పిమ్మట తాను నిష్క్రమించి పాత్రలను రంగంపైకి రప్పించి వర్ణన చేయిస్తాడు, ఈ చిత్తవృత్తి పరిచయం వర్ణనలో విశేషాంశాల అవగాహనలో పాఠకుడికి సహకరిస్తుంది ఇది వీరి ఋతువర్ణనలలో నాటకీయ శిల్పం

ఇటువంటి వన్నీ విశ్వనాథ ఋతువర్ణనలలో కనిపించే ఆత్మీయతా ముద్రలు

"ఈ పరిశీలనా మతియు, ఈదృశ సూక్ష్మ తమాభి దర్శన వ్యాపృత బుద్ధి, యిట్టి విషయాభి ముఖీనము హేతుకల్పనంబు" ఏకవులలో నైనా అరుదుగా కనిపించే అద్భుత లక్షణాలు క్షణే క్షణే యన్నవతా ముపైతి తదేవ రూపం రమణీయతాయాః అన్న మాఘ మహాకవి లక్షణానికి లక్ష్యభూతాలు కల్పవృక్ష ఋతు వర్ణనలు

"ఉర్వి ఋతువులలో సీతారామ లక్ష్మణుల సర్వానుభవాన్ని భావ చక్షువుతో దర్శించిన త్రినేత్రుడు విశ్వనాథుడు

"ఉర్విలోన మహాకవి యోగి వంటి వాడు
సర్వమ్ము భావనా వధిగం జూచు"



# కల్పవృక్ష అనువాద, వ్యాఖ్యాన శిల్ప సామంజస్యము

శ్రీ కాజ లక్ష్మీనరసింహారావు

"వేద వేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేత సాదా సీత్ సాక్షాద్రామాయణాత్మనా"

వేద వేద్యుడైన పురుషుడు దశరథాత్మజుడైన శ్రీరామచంద్రుడై అవతరించగా, వేదము ప్రాచేతసుని వలన రామయణముగా అవత రించనది.

శ్రీ మద్రామాయణ కల్పవృక్షమున అవాల్మీకములున్న వాయని ప్రశ్నించినపుడు, అవాల్మీకమునగా నేమి అన్న ప్రశ్న ఉత్పన్నమగుచున్నది. వాల్మీకము వేదమయినచో దద్వేద విరుద్ధము లైన విషయములను మహర్షి యెట్లంగీకరింపడో, వాల్మీకి విరుద్ధము లైన విషయములను గూడ శ్రీ విశ్వనాథ కూడ అట్లే అంగీ కరింపడు అదే అవాల్మీకము.

రామాయణ కల్పవృక్ష కవి దృష్టిలో అవాల్మీకమును, అవైదిక మును ఒక్కటే విశ్వనాధ అవిచ్ఛిన్న సంప్రదాయార్థి వేద విహిత నాగరికత యందు పరి పూర్తిమగు విశ్వాసము గలవాడు.

అవాల్మీకమనఁగా వాల్మీకి రామాయణమున లేని అంశ ములను, నూత్న కల్పనలను జేసి తన రామాయణమున జొప్పించుట అని అర్థము ఏకవి యే భాషలో రామాయణము వ్రాసినను, వాల్మీకమునకు భిన్నముగా వ్రాసినచో అది అవైదిక మని చెప్పుటలో విప్రతి పత్తి లేదు.

రామాయణ కల్పవృక్షమున కథ వాల్మీకి రామాయణ కథ అనుసరించియే యుఁడును. కాని ఆ కథను కల్పవృక్షకవి చెప్పెడి

తీరు వేఱు తన అను వాద విధానమును గూర్చి శ్రీ విశ్వనాథ యిట్లు చెప్పిరి

పూర్వ కవులెన్ని పోకడలు పోయినారో నేనూ అన్ని పోకడలు పోయినాను, ఏదయినా అంతర్దృష్టి ఉంటేగాని అర్థం కాదు. వ్రాసే వాడు ఎవరికీ అర్థం కాకూడదని వ్రాయడు. నేను వాల్మీకి రామాయణానికి భాష్యం వ్రాశాను. నారామాయణం అను వాదం కాదు" "ఈ కథలు పూర్వ కవులందఱు వ్రాసినవే గాని వీనిదే అగ్రతాంబూలం" అని శ్రీ చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు రామా యణ కల్పవృక్ష ప్రాశస్త్యమును ప్రశంసించిరి

వాల్మీకము నందలి సమస్యలు, సమాధానములు మిక్కిలి లోతయినవి ఆలోచనమీద గాని ప్రశ్న పుట్టదు ప్రశ్న పుట్టిన గాని సమాధానము దొరకదు ఎన్ని పర్యాయములు చదివినను అవి మనకు దోచవు విశ్వనాథ వాల్మీకి హృదయమును శిల్పమయముగా వ్యాఖ్యానించుదురు కథా రహస్యమును తేట పఱచుదురు. ఇట్లు కానిచో వాల్మీకము అర్థము కాదు వాల్మీకమునకు భాష్యముండ వలయును

"భాస కాళిదాస భవభూతి ది జ్ఞ్నాగు
లకును ప్రశస్త వాగ్వి లక్షణుడు ము
రారి భట్టునకును రామకథా భాష్య
కారులకును మోద్పుకై ఘటించి"

ఈ పద్యమున జెప్పబడిన మహాకవులు వారి వారి త్రోవలో వారు వారు తీసికొన్న కథా ఘట్టములకు భాష్యము చెప్పిరి. వారికి విశ్వ నాథకును భేదమున్నది

వారిది భాష్యము విశ్వనాథ వారిది మహాభాష్యము ఆయా మహాకవులు వాల్మీకి వ్రాసిన కథను మార్చి వేయుదురు, తాము

మార్చినది సమంజమని వారి ఊహ. వాల్మీకి వ్రాసిన దానిని విశ్వ నాథ మార్చరు వాల్మీకి అట్టేల చెప్పెనో, అందలి సామంజస్య యేమిటో విచారించి సమర్థించుదురు.

తండ్రి దశరథుని అబ్దికమునకై బంగారు లేడి మాంసమును దెమ్మని ప్రబోధింపబడిన శ్రీరాముడు మాయలేడి వెంట వెళ్ళెనని ప్రతిమా నాటకమున భాసుని కల్పన సీత పొమ్మనుటయేమి? లక్ష్మ ణుడెఱుగడా యని భాసుని ఆశంక అసలు కథ వాల్మీకి చెప్పినట్లు జరిగినది అది యట్లు జరుగుట అసంభవమని భాసుని తలంపు. అది అట్లు జరిగినది కాబట్టి సంభవమేయని కల్పవృక్ష కవి తలంపు. ఈ దృష్టితో వాల్మీకమును విశ్వనాథ భాష్యప్రాయముగా రచించిరి.

వాల్మీకి తన రామాయణమును సంగ్రహ రామాయణముగా ప్రారంభించెను. క్రౌంచ ద్వంద్వ వియోగముతో కథ ప్రారంభించెను. నారదుడు వచ్చెను వాల్మీకి ఆయనను ప్రశ్నించెను. బ్రహ్మ వచ్చి అనుజ్ఞ యిచ్చెను. వీని యన్నింటితో వాల్మీకి రామాయణము ప్రారంభమగును. కల్పవృక్షమున నివి యేమియు లేవు దశరథుడు పుత్రులు లేరని దుఃఖముతో బాధపడుటతో గథ యారంభమగును. పుత్రులు లేక దుఃఖపడు దశరథుని శోకమును మహర్షి యేకారణము ననో స్పష్టీకరించివాడు.

"సుతార్థం తప్య మానస్య పుత్రార్థం నాస్తి వైసుఖః"

విశ్వనాథ యీ అవకాశమును తీసికొని దశరథుని సాంసారిక వేద నను కరుణ రసోల్బణముగాఁ జిత్రించెను.

"అని వాక్రుచు ధారణీపతి యయోధ్యా వీధి నే వర్ణపున్
శిశువైనన్ గనిపించినన్ నిలిచి వీక్షించున్ హాసించున్ గృపా
వశుడై వానిని దీసి యెత్తికొని యే భక్ష్యమ్ములో తెచ్చి యి
చ్చు సమాశ్వాసన సేయు నంతటన పుచ్చున్ దీర్ఘ నిశ్వాసమున్

దశరథుడు తన్ను "అజధారణీపతి కన్న కొడుకు" గా భావించుకొని పుత్ర మమకారమును త్రవ్వుకొనెను. ఈ దశరథుని పుత్రవాంచా తీవ్రతను వర్ణించుటలో విశ్వనాథ మనోభావ విశ్లేషణాశక్తి కవకాశము వచ్చినది.

వాల్మీకి అయోధ్యాపుర వర్ణన చేసెను ఈపనిని గల్ప వృక్ష కవియు జేసెను కాని యీయన పద్ధతి వేరుగా నున్నది. సంతానము లేక దశరథుడు దుఃఖపడుచు రాజ్య వ్యవహారములు చూడకుండెను. మంత్రులందఱు సమావేశమై ఆ రాజు దుఃఖమును మాన్పుమని సుమంత్రుని గోరుదురు. ఆ సుమంత్రున కొక రహస్యము తెలియును తక్కిన వారికి దెలియదు. దశరథునకు బుుత్ర సంతతి కలుగునని, అతడు పుత్ర కామేష్టిని జేయునని కృత యుగములో సుమంత్రుడు వినియున్నాడు ఈ సంగతిని సుమంత్రుడు రాజుతో ప్రత్యక్షముగా జెప్పడు చెప్పక యిట్లన్నాడు. "రాజా! నీ రాజ్యంబున ధర్మపుంగొఱత లేదు" నీకు దప్పక పుత్రులు కలుగుదురు. నీవు యజ్ఞ దీక్షి తుడవు గమ్ము "సుమంత్రుడే చివరి మాటలో దన యభిప్రాయమును పెట్టినను రాజు దానిని వెంటనే గ్రహించలేదు సుమంత్రుండు దశరథుని దీసికొని అధ్యానగర మంతయు త్రిప్పెను, ఈ త్రిప్పుటలో భిన్న వర్ణనలు చేసినారు ఏనుగులు, గుఱ్ఱాలు, పరిఖ, కోట మొదలగు వానిని వర్ణించెను ఇది కల్పవృక్ష కవి చమత్కారము పూర్వకవులును కావ్యము మొదట నీ వర్ణనలు చేయుదురు. ఊరక చేయుదురు. కల్పవృక్ష కారుడిది యొక నెపముగా చేయించెను. పాఠకుని మనస్సు నట్టి వర్ణనము మీద గాక సంతానము లేదని దుఃఖించు రాజు మీద కేంద్రీకరింపబడి కథా వస్తువు ననుసరించి యుండును పాఠకుఁడు మొదటి నుండి గథా వస్తువునందు బద్ధ చిత్తుడై యుండుటకు 'గవి యీ శిల్పమును బ్రదర్శించెను తరువాత సుమంత్రుడు రాజుతో నివియే మాటలు చెప్పెను "నీ రాజ్యంబున ధర్మపున్ గొఱత లేదు"

నీకు బుత్రి సంతతి కలుగును యిజ్ఞదౌక్షి తుడవు కమ్ము" అని, అపుడు రాజు యజ్ఞదీక్ష తుడగును.

సుమంత్రుడు ఋశ్యశృంగుని కథ చెప్పెను ఋశ్యశృంగుని కథ వాల్మీకమున నున్నది. విశ్వనాథయు జెప్పెను. ఈయన చెప్పిన కథ క్రొత్తగా నున్నది తెలుగు దేశమును వర్ణించి నటు లున్నది. ఋశ్యశృంగునికథ భిన్న స్థలములలో భిన్నముగా నున్నది. కథలోని అనేకాంశములు విలక్షణముగా నుండును వాల్మీకమున వారకాంతలు మనసుపడి విభాండకుని ఆశ్రమమునకు పోవుదురు. ఆ సమయమున అందరి అదృష్టము మంచిదై, విభాండకు డాశ్రమమున లేడు భయముతో గడ గడ లాడుచు దమకడ నున్న మోదకములను వారవనితలు ఋశ్యశృంగున కిచ్చి పోవుదురు ఆ రోజంతయును ఋశ్యశృంగుడు విచిత్ర మనస్తత్వమున నుండును మఱునాడు వారకాంతయున్న యెడకే ఋశ్యశృంగుడు వెళ్ళును

కల్పవృక్షమున విశ్వనాథ ప్రవేశ పెట్టిన వార వనితలు గడుసువాండ్రు. వారు విభాండకుని ఆశ్రమమునకే పోవరు. ఇది చేయబడిన యొక మార్పు. వారకాంతలు ఋశ్యశృంగుని భూవశ్రేష్ఠుని కూతు పెన్మిటనుచున్ బూజింతురు వారకాంతలతో మాటలాడుచునే తన తండ్రి వచ్చు వేళ అయినదని ఋశ్యశృంగుడు వారితో బలుకును ఇది వాల్మీకమున గల కథ

విశ్వనాథ వార వనితలు పాడిరి. ఆ పాటవైఖరి తెలుగు దేశములో బూర్వపు గాయకులు పాడినట్లుండెను. ఈ కవి క్రొత్తదన మిక్కడలేదు వీరు పాడుచుండగా అదివర కేమియు సంగీతజ్ఞానము లేని ఋష్యశృంగనకు అన్నియుఁ దెలియును. ఆ వేశ్యలు ఋష్యశృంగుని తమ యింటికి దెచ్చుదురు వాన కురియును, ఆ ఋశ్యశృంగుడు పూర్వము స్త్రీ పురుష భేదము నెఱుగడు. పల్లెలు, పట్టణములు, వానలు, పంటలు నివి యేమియు దెలియవు. ఇపుడివి అన్నీ దెలిసినవి

"నిశ్చల తత్త్వ మానసుల్ సహజ బోద్ధలు" అని యీ కవి చెప్పిన విషయము క్రొత్తగా నున్నది. ఆశ్చర్యముగా నున్నది. కాని యిది సాంప్రదాయికమైన వ్యాఖ్యానమే

ఇట్లే కవి కథలోని ప్రత్యంశమును తన అనుభవముతో తన క్రొత్త పద్ధతితో జెప్పును

దశరథుని యజ్ఞవేళ జనక మహారాజును, జటాయువును వచ్చినారని కల్పవృక్ష కవి వ్రాసెను ఈ విషయము వాల్మీకమున లేదు భవిష్యత్కథా బీజములుగా ఈ అంశములను నిక్షేపించెను. ఇది కల్పవృక్ష కారుని కల్పనయే

యజ్ఞము జరుగుచున్నది ఈ కవి యిచ్చట యజ్ఞముల యొక్క భిన్నాంగములను, హోమములు పెక్కింటిని వర్ణించెను. విశ్వనాథ వేదాధ్యయన పరుడు. వేదమును జదివినవాడు. వేదములోని పలు రహస్యములు తెలిసినవాడు కనుక ప్రాచేతసుని వలన వేదము రామాయణాకృతిగా వచ్చినదన్న మాటకు పై యజ్ఞ విశేష వర్ణనము వ్యాఖ్యానము

అగ్నిహోత్రునిలో నుండి ప్రజాపతి యుద్భవిల్లి రాజునకు పాయస మిచ్చెను ఆ పాయసమున భగవంతుడు ప్రవేశించెను. అపుడు జనుల కనులు మూత పడెను ఇది క్రొత్తదయిన కల్పన ఆ విష్ణువు పాయసమున ప్రవేశించినపుడు రెండు సీస పద్యములున్నవి. మొదటిది నారాయణమూర్తి వర్ణన. రెండవది రాముడుగా జన్మించి ఆయన చేయబోవు కార్యముల సూచన ఈ రెండు విషయములను వాల్మీకమున లేవు. కల్పవృక్ష కవి యొక్క కల్పనములే ఆ యీ కల్పన వల్ల ప్రయోజనమేమి?

యజ్ఞ సమయమున దేవతలు వచ్చిరి నారాయణుడును వచ్చెను. శార్ఙ్గధనువుతో వచ్చెను. దానిని భుజాన వేసుకొని

వచ్చెను. నిత్యఋషివలె వచ్చెను ఇది నూతన మయిన కల్పన. రాముడు భవిష్యత్తులో అడవికి బోవుననియు, అచట ఋషివలె నుండుననియు, ధనువు చేగొని వెళ్ళుననియు, రాక్షస సంహారమును చేయుననియు తెలియ జేయ సూచితము గానవచ్చుచున్నవి.

దేవతలు తమ కష్టములను భగవంతునితో విన్నవింతురు. ఇది అవతార ఖండము ఇంద్రుడు తమ కష్టములను భగవంతునితో జెప్పుకొనుట ప్రభావతీ ప్రద్యుమ్నమున ఇంద్రుడు తమ కష్టములను భగవంతునితో విన్నవించు వైఖరి కన్పించును ఈ దేవతలు తమ తమ దుఃఖమును జెప్పుకొనుట కూడ భవిష్యత్కథ యంతయు చమత్కారముగా జెప్పుదురు. వాలి సుగ్రీవులు, అంజనేయుడు, వారి వారి జన్మలు, భగవంతుడు శ్రీరాముడై అవతరించినచో వారెట్లు సాయపడుదురో, యీ సంగతు లన్నింటిని, వారు తమ తమ దుఃఖములో జెప్పుచున్నట్లు కవి ప్రసంగించెను.

భగవంతుడు శ్రీరాముడై యవతరించి నపుడు ఆంజనేయుడు ఏమి చేయగలడో, ఆయన పరాక్రమ మెంతటిదో శోచిష్కేశుడు బృహస్పతితో అనుచున్నాడు

"ఆక లేకయు యపాంపతి నైనను దాటుస్
దోక చిచ్చనగ రక్కసి తుంగ దహించుస్"

ఆంజనేయుడు నిరాటంకముగా సముద్రము దాటు గల వాడని, తోక చిచ్చువలె రాక్షసుల దహింప గలవాడని అను చున్నాడు. ఇది హనుమ పరాక్రమ వర్ణనమా? లేక భవిష్యత్తులో జరుగగల దానిని ద్రష్టయై చెప్పుటయా? మఱియు ఆ అంజనేయుడు "మోక్షా శోకాన్వేషణుడని" కల్పవృక్ష కథనము. మోక్షము యొక్క అశోకస్థితిని గను గొన్నాడట. అశోక మనగా నేమి? శోకము లేకుండుట

అనఁగా ఆనందైక రసానుభూతిని పొందుట అంజనేయుండు అశోక వనములో మోక్ష స్వరూపిణియగు సీతను, కవి తపోఽగ్ని చే గ్రాగి రసమును సాధించినట్లు కనుగొన్నాడు సీతారాములు "అనంద వల్లీ నిర్ముక్త లతాంతములని, రసవనీ లీలా లతాంతములని విశ్వనాథ అభి వర్ణించిరి,

మొత్తము మీద వాల్మీకి తన రామాయణమున మొదట సంగ్రహ రామాయణము వ్రాసినట్లయినది కాని అయా విషయము లను చెప్పుటకు కవి భిన్న పరిస్థితులు కల్పించెను. అందుచేత కల్ప వృక్షము వాల్మీకమును అనుసరించ నట్లు హఠాత్తుగా స్ఫురించును,

కల్పవృక్షమున తెలుగు దేశపు టాచారములు సమృద్ధిగా నున్నవి. బంధువులు వచ్చుట, వారికి మర్యాదలు నేడు కాదు, రేపు వెళ్ళుదువుగాని అని బంధువులను పోనీయకుండుట, యిటువంటి తెలుగుదనము కల్పవృక్షమున విస్తారముగా గలదు. వాల్మీకమున ఇవి యుండవు కదా!

దశరథ జటాయువుల బాల్యస్నేహము, అ జటాయువు యజ్ఞాగతుడగుట, కల్పవృక్షమున గావింపబడిన సముచితమగు కల్పన వాల్మీకమున జటాయువు అరణ్యకాండమున గన్పడును. కల్పవృక్షమున జటాయువు బాలకాండమున యజ్ఞవేళ ప్రవేశించును

శాంత కౌసల్యకు కూతురన్న విషయమును కల్పవృక్షము స్పష్టపరచినది. అడపడుచైన శాంత పాత్ర సజీవముగా, కల్పవృక్ష మున చిత్రింపబడినది "తల్లీ నీ సుఖమే మొదట, అపైని నాసుఖము" అని కౌసల్య శాంతను అదరముతో జూచుట కల్పవృక్షమున జూప బడిన క్రొత్త విషయము

రామాదుల జననము, నెలపురుడు, వారికి నామకరణ మహోత్సవము, జోలపాటలు, బాల్యక్రీడలు, ఏతాదృశముల మూల కములు కౌసల్యాది రాణులు సుఖప్రసవము కావలయునని చెప్పుటకై కవి తెలుగుదేశపు ఆచారములను వర్ణించెను "చెంబెడి నీళ్ళు సుఖం బున నా యింత గడిచి గట్టెక్కినచో అనును మంత్రసాని చేసన్న చేసి బాలుడైన శ్రీరాముని గిచ్చును. ఆ శిశువేడ్చుట, శిశువును చేటలో బరుండ బెట్టుట, ఆ సమయమున చిటపట జల్లుల వాన కురి యుట, పురిటింట సాగనారమట్టులు, పాత చెప్పులు కట్టుట యీ తెలుగుదనము కల్పవృక్ష రామాయణమున రమ్యముగా గూర్పబడి నవి. స్వామిని దొట్టిలో బెట్టిరి ముత్తయిదువలు ఒకళ్ల నొకళ్ల హెచ్చరించుకొని వేడుకలు చేసిరి ఒకామె యిట్లన్నది

"నోరు పెగలదటే నీకు నూరక తెగరాలి పోవుదువు కూన రాగాలతోడ, ఆనరమ్మ యొక్క పాటను ఇట వాయనములకై చనుదెంచిరో తాళాములువడెనటే నోటికిన్"

కల్పవృక్షమున శ్రీరామచంద్రుని బాల్యవర్ణనము భాగవత మున శ్రీకృష్ణుని 'బాల్య వర్ణనమును స్ఫురింప జేయుచున్నది

"జోజో కమల దళేక్షణ జోజో మృగరాజ మధ్య జోజో కృష్ణా।
జోజో పల్లవ కరపద జోజో పూర్ణేందు వదన జోజో యనుచున్"
జోజో కమల దళేక్షణ జోజో మృగరాజ మధ్య జోజో కృష్ణా।
శ్రీ జోత్స్న దిలీపాన్వయ భూజాని లతాగ్రభాసి పూవా జోజో॥

పోతన్న గారనినచో నీ కవికింత గౌరవము "పోతలు పోసి యుండెదము పోతనగారి విధాన" అని తన చిన్ననాటి నేస్తము తనకు దోడై యుండినచో పరిస్థితి యెట్లుండెడిదో వివరించిరి. పోతన అనగా కల్పవృక్ష కవి దృష్టిలో తెలుగుల పుణ్యపేటి "పోతన్న తెలుగుల పుణ్యపేటి" అని అంతరకవి ప్రశంస

రామాదులకు దృష్టి తీయుదురు దృగ్దోషయు తగులకుండ తల్లులిట్లు చేయుదురు రాముని యొక్క విద్యాభ్యాసాదులను కల్పవృక్షమున ప్రపంచీకరింపబడినవి. భాగవతమున శ్రీకృష్ణుని విద్యాభ్యాసాదు లిట్లే ప్రపంచీకరింప బడియున్నది శ్రీరామునకు కైక అస్త్ర విద్యా గురుత్వము వహించినది శ్రీరాముని ఉపనయన వేళ భిక్షగా, ఆయనకు కైక "వజ్ర పుంఖింతమ్ము వాలుటమ్ము" ను ఇచ్చినది రామునకు "కైకేయి శాసనమే శాసనమా మహా ప్రభునకున్" అని చెప్పుట వాల్మీకమున లేదనరాదు వాల్మీకమున రహస్యముగా నుండును. కల్పవృక్షమున ప్రకాశముగా నున్నది. భవిష్యత్కథా సూచకముగా నున్నది

శ్రీరాముని వివాహమునకు శాంతాదేవి వచ్చినది ఆమె రాముని అప్పగారైన ఆడపడుచు ఆమెకు అఖండ గౌరవము జరిగినది ఈ సన్నివేశము వాల్మీకమున లేదు వివాహవేళ కౌసల్య శాంతను జూచి "తల్లీ! నీవు వచ్చితివి నా బరువు తీరినది మాదు పట్టున నింత చమురు పెట్టుటకు మంగళహారతి పళ్లెమును బట్టుటకు తమ్ముని దిద్దుటకు ఆడపడుచువు వచ్చితివి" అన్నది పూర్వాంధ్ర రామాయణ కర్తలు శాంత కింతటి ప్రాముఖ్య మిచ్చినట్లు కనపడదు

"నుంత తగవు లేకుండ పెండ్లికి శోభలేదు. అలుక గుడ్డకునై జనక దశరథ గృహ పరిచారకులకు జగడము" కల్గినట్లు కల్ప వృక్ష కవి కల్పించినాడు.

రామాయణము తెలుగుదేశమున జరిగినదా అనిపించినట్లు, తెలుగుల ఆచార వ్యవహారములను, కల్పవృక్ష కవి రామాయణమున గుప్పించి వదలెను "ఆంధ్రావళి మోదముం బొరయ" తిక్కన్న గారు భారతమెల్ల వ్రాసిరి ఈ వ్రాయుట యందొక సహజత్వమును గూడ తెచ్చిరి

తెలుగు సంప్రదాయము ననుసరించి యీ కవి శ్రీ సీతా రామచంద్రుల కళ్యాణ మహోత్సవవేళ విఘ్నేశ్వర పూజాదికములు నడిపించిరి. ఇది వాల్మీకమున లేదు సేతుబంధన వేళ విఘ్నేశ్వర పూజ చేయబడినదని భాస్కర రామాయణ కథనము. వివాహ వర్ణనలో ఔపనిష ద్వైదిక ధర్మములు బహుధా వర్ణితము లయినవి కవి శ్రోత ధర్మ కర్మ రహస్య వేత్తయన్న అంశము పలుమారులు స్థాపింప బడినది

అహల్యా ఖండమన్నది వాల్మీకి రామాయణములో ఇందుృడు మేషాండడు అయిన కథ యున్నది అది వైదికమయిన కథ. కల్పవృక్షమున నీ కథ యుండదు లోకమునకు ధర్మోపదేశము చేయుటకై ఇంద్రుడు సహస్రాక్షు డైనాడని కల్పవృక్షమున చెప్పబడినది కల్పవృక్షమున ఇంద్రుడు కోడియై కూయడు ఏ చిన్నకథలో అయినను కల్పవృక్ష కవి వాల్మీకి ననుసరించినను తన కల్పనలు తాను చేయును అహల్య ఱాయి అయినదో అప్పయయినదో రాముని కాలు తగిలి ఱాయి స్త్రీ యైనదని పూర్వరామాయణ కర్తలు వ్రాసిరి. రాముని మీది గాలి, రాముని కాలినవ్వడి, రాముని శరీర దర్శనము జరిగినంతనే అహల్యయందు క్రమశః పంచేంద్రియములు మేల్కొనినట్లు కల్పవృక్ష కవి వ్రాసెను ఇది ఆశ్చర్యకరమయిన మార్పు పూర్వ కవులెవ్వరుగాని ఇట్లు చేయలేదు అహల్యఱాయి యయినదని యెవ్వరు చెప్పిరి? వాల్మీకి చెప్పలేదు భాస్కర రంగనాథులు చెప్పిరి ప్రజా బాహళ్యమున ప్రచారము నందున్న అహల్య ఱాయి అయినదన్న వృత్తాంతమును వారు చెప్పి యుందురు ఇది యిట్లుంచి గోవిందరాజ, మహేశ్వర తీర్థు లిరువురును అహల్యయొక్క పాషాణావస్థను గూర్చి ప్రస్తావించిరి పద్మపురాణములో అహల్య ఱాయి అయిన వృత్తాంతమున్నది

అహల్యా శాప విషయమున కల్పవృక్షము వాల్మీకమునే అనుసరించినది అహల్య బ్రహ్మ యొక్క విలక్షణ సృష్టియెట్లో వివ

౦డి. ఇంద్రుడు మునివేషమున ప్రవేశించెనని చెప్పుట యందు ౦్ృక్షము వాల్మీకము ననుసరించినది "మునితపము నందు గని మునియవోలె" ఇంద్రుడు అహల్యను గామించుటకై వచ్చెను.

"స చేహాతప సతిష్ఠత్ అహల్యా సహితః పురా
వర్ష పూగానవే కాంశ్చ రాజ పుత్ర మహా యశః
తస్యాంతరం విదిల్వాతు సహస్రాక్ష శ్చ చేపతిః
ముని వేష ధరోఽహల్యా మిదం వచన మబ్రవీత్"

్రుడు పద్మ పురాణ కథను కొంత, వాల్మీకమును కొంత ,నాడు గౌతముడహల్యను "ఎవ్వరికిం గానరాక పాషాణంబవై ౦డుమని శపించెను. తన రూపము ధరించి వచ్చిన ఇంద్రుని, ౦ కుటిల వర్తనమును నిందించి "నీ యండంబులు దునిసి దర్ప గు దురాచారుండ యనగ నా ఖండలును డంబులు దునిసి ౦ు నప్పుడ బడియెన్" అండములు తునిసి ఇంద్రుడు మేషాండు ౦ును వాల్మీకి చెప్పగా భాస్కరాదు లనుకరించిరి.

వికృతపు జేత దేని గని వెక్కలి పట్టిదొ దాని రూపముల్
వికృతము గాగ దేహమున వేయి ధరింపుము నిత్యదర్శివై

గౌతము డిందు౦ని సహస్రాక్షు డగనట్లు శపించి నాడని కల్ప . కథనము ఈయన లోకజ్ఞత, ఈయన ధర్మమును స్థాపించెడి అద్భుతముగా నుండును. "లోకాద్భుత దివ్య దర్శనమటే" ౦్లుండును

శ్రీరాముని వలన అహల్య శాపము తీరినది

"పాద్య మర్ఘ్యం చ తథాతిథ్యం కార సు సమాహితా।
ప్రతి జ గ్రాహ కాకుత్స్థో విధి దృష్టేన కర్మణా"

౦ల్యాకృత పూజనమును శ్రీరాముడు గ్రహించెనని వాల్మీకము. ౦ల్యయు రాముడును గలియుట ఆ అహల్యకు శ్రీరాముని యందు

క్షేమ, రాముడా అహల్యను తన తల్లియగు కౌసల్యతో సమానముగా జూచుట, తన కొడుకగు శతానందుడు, మిథిలా రాజు నాస్థానమున ఉన్నాడని అహల్య రామున కెఱింగించుట, ఇవి యన్నియు గల్ప వృక్షమున క్రొత్తగా జెప్పబడిన విషయములు.

"రామ రఘురామ దశరథరామ అయోధ్య రామ! జానకీ రామ! యసుర సంహార రామ! పట్టాభిరామ! ఇది అహల్యా కృత రామస్తవము కల్పవృక్షముననూతనముగా చేయబడిన విశేష వర్ణనము అహల్యకు రామావతార రహస్య మంతయు దెలిసి నట్లున్నది. రాముడింకను జానకిని బెండ్లాడ లేదు. శివధనుర్భంగమే జరుగలేదు. అయినను అహల్య వాక్కు ననుసరించి ఆ రాముడెల్లపుడు జానకీ రాముడే గౌతముడు ఋషి, అహల్య ఋషిపత్ని, వారివాక్కు నందు ఋష్యాత్మ యున్నది మఱియు అహల్య రామ చంద్రుని ముఖమున విజయతిలకము దిద్దినది వివాహమైన తరువాత, దిరుగు ప్రయాణములో, అహల్య కోరిక ననుసరించి రాముడు గౌతమాశ్రమమునకు వచ్చెనని కల్పవృక్ష కల్పనము

మధు పర్కములతో దిరిగి వచ్చుచున్న సీతారాములకు అహల్య నార చీరలు బహుకరించినదని, ఆ దంపతులు మధుపర్కములపై వానిని ధరించినారని కల్పవృక్షము ఒక క్రొత్త కల్పన చేసినది. రాముడు చిరకాలమున ధర్మసంస్థాపనార్థము ఎట్లు ప్రవర్తింపవలసి యున్నదో యీ నార చీరల కల్పన సూచించుచున్నది మఱియు అహల్య రాముని జూచి" మాటను పితృప్రామాణ్యంబుగ చరింతు పరిపాలమున్ "అన్నది. రాముడు పితృవాక్య పాలనము చేయుట, నారచీరలతో అడవులకు వెళ్లుట యనుకథ యంతయు నిందు సూచింపబడినది ఈ రీతిగా అహల్య కథయంతయు విశ్వనాథ స్వోపజ్ఞకము కల్పనా, సామర్థ్య నిరూపకము

కళ్యాణ ఖండమున, సీతా కళ్యాణము జరుగుచుండగా వానచినుకులు పడినవి. ఇది తెలుగు దేశపు భద్రాద్రి రాముని కళ్యాణ విశేషము. ఈ యంశము కల్పవృక్షమున జొప్పింపబడినది. వాల్మీక మున నిది యుండదు,

"ప్రతి చైత్రశుద్ధ నవమికి, వితంతంబుగ దెలుగు నేల విరిసెడు జల్లుల్
సిత ముక్తా సదృశంబులు ప్రతనులు తలంబ్రాల వేళ వచ్చె జిటపటల్"

దశరథుని కొడుకులు కోడండ్రు అయోధ్యకు వచ్చి వివాహోచిత కలాపము నిర్వర్తించుకొని శృంగార జీవితములు గడిపినారని కవి అతి మనోజ్ఞముగా వర్ణించెను వాల్మీకమున వివాహ సందర్భమున మాత్రమే ప్రస్తావింప బడిన మాండవి శ్రుతకీర్తులను కల్ప వృక్షము పదేపదే స్మరించుచుండును.

పరశురాముని కథలో ఒక మార్పు చేయబడినది. వాల్మీక ములో, సీతా కళ్యాణము తరువాత రాము డయోధ్యకురి దిగి పోవుచుండగా దారిలో పరశురాము డెదురయినట్లు వర్ణింపబడి యున్నది. కల్పవృక్ష కారుడే పరశురామ సమాగమ ఘట్టమును రాముని వివాహమునకు ముం దేకూర్చి పెట్టెను పరశురాముని యందు ష్ణ్వంశ కొంత మిగిలి యున్నది ఆ యంశ రాముని యందు ప్రవేశించిన గాని రాముని యవతారము పరిపూర్ణము కాదు అపుడు గాని లక్ష్మీదేవి యగు సీతకు రాముడు భర్త కాడన్న యొక యూహ కల్పవృక్ష కవి కున్నది

ఇక రాముని వైరాగ్యస్థితి వసిష్ఠుని రాముడు సేవించి యద్వైతమును నేర్చెను ఇది యంతయు వాల్మీకమున లేదు కల్పవృక్షకవి ఈ యంశమును జ్ఞాన వాశిష్ఠము నుండి పొందిన స్ఫూర్తితో రచించి యుండవచ్చును శ్రీరాముడు అడవులకు వెళ్ళ

టుకు కైక కోరిన వరము లట్లుంచి రామునియందు ఉదయించిన యీ వైరాగ్య రేఖ యొకటి ప్రబల కారణము కైక యింటికి రాముడు వెళ్ళెను "నేను రాజ్యమ్ము సేయుట నిక్కువముగ వేల్పుల కిష్టమ్ము లేదు" అని చెప్పినాడు

రామునియందు వైరాగ్యమును స్థాపించి కవి కల్పవృక్ష ములో శాంతరసమును స్థాపించెను. రాముడు వైరాగ్యం మాని యద్వైతి యగుటకు వశిష్ఠులవారు గురువులైరి.

దశరథుడు శ్రీరామచంద్రుని యౌవ రాజ్యమున ప్రతి ష్ఠించుటకై తలపెట్టెను పైబడుచున్న వార్ధక్యము, అందువల్లన జీర్ణ మగుచున్న తన దేహమునకు విశ్రాంతి నీయవలయునన్న తపన హేతువులుగా దశరథుడు రామునకు పట్టము గట్టదలచెను. మరియు దివి అంతరిక్ష భౌములయిన యుల్పాతములు గూడ దశరథుని తొందర పెట్టెను సామంత జానపద పౌర వృద్ధామాత్యులను సమా వేశపరచి వారి సమ్మతిని బొందెను. ఇది అంతయు వాల్మీకి కథనము. రామ పట్టాభిషేక విషయమున కల్పవృక్షము ప్రతిపాదించిన హేతు వులు వేరు అవి యేవనగా

> "రాముని కాత్మలో నొక విరాగము కల్గిన మాట యా విరా
> గామిత తీవ్రతల్ చెడి తనంతన శాంతి వహించు పిమ్మటన్
> రాముడి చేసికిన్ దశరథ క్షితి జాని కెరుంగ నయ్యె లో
> భ్రామిన నీతియున్ దరతరై మనుజేశుడు సందడించుచున్.

"అని లోకతంత్ర మెంచుచు, నసఘుమతిని యౌవ రాజ్యమందున నభిషిక్తుని జేయ రామచంద్రుని, మనమున స్ఫురియించి నంత మానవ పతియున్"

తనకు వార్ధక్యము కలుగుచున్నదన్న ఆలోచనము కంటె, రామునకు వైరాగ్యము కలుగుచున్నదన్న తహతహ దశరథున కెక్కువయినది. ఇది రామ పట్టాభిషేకమునకు త్వరపెట్టినది. కల్పవృక్షమున ప్రతిపాదింపబడిన యీ హేతువు వినూతన మయినది

కల్పవృక్షము రామునకు సమాధి భంగస్థితిని గ్రొత్తగా దెచ్చినది రాముడా రాత్రి సమాధిలో నుండగా దేవతలు వచ్చిరి. శ్రీ రామునకు దొలిసారి సమాధి భంగమయినది

"అంత నుపవాసి రాముండు ప్రాణాయామమ్మొని త్రియామ శేష రాత్రంబున" నుండగా

''దేవతలై రమా మద వతే వ్రతతీ మధు భృత్కుమారకా
దైవతలోక కార్య చరిత వ్రత! నిత్యదశావతార ధా
తా విదితాఖిలోత్తమ! పురాణ కథా కమనీయ మూర్తిదే
వావలి కంటు తాపనయనా యని పిల్చిన యట్లు తోచివన్

సామీ! నీవు యౌవ రాజ్య పట్టాభిషిక్తుడ వైనచో మాకు జేసిన వాగ్దాన మేమి యగును? నీవు నారాయణుడవు రావణుడేమి యగును? అనియిట్లు దేవతలు రామునితో మొఱ వెట్టుకొనిరి అంతట శ్రీరామునకు సమాధి భంగమైనది. ఇది కల్పవృక్షమున అయోధ్యా కాండమున గలదు. ఈ సమాధి భంగ వృత్తాంతము అవాల్మీకము.

మొత్తము మీద రామునకు రెండుసార్లు సమాధి భంగము కల్గినదని కల్పవృక్షము పేర్కొన్నది

రాముని పట్టాభిషేక వార్తవిని మంధర కోపము పూనినదని వాల్మీకము ఆమె కోపమునకు గారణ మేమియో వాల్మీకము చెప్పదు. శైశవమాదిగా శ్రీ రాముడన్నచో మంధరకు వైమనస్యమున్నదని రంగనాథ భాస్కర రామాయణములు పేర్కొన్నవి. కల్పవృక్షము వీరి మార్గము ననుసరించినది రామ పట్టాభిషేక వృత్తాంతము మంధర కర్ణవీధి బడగా దానికి ఘుజగి విషమెక్కినట్లయినదనియు, అందుకు గారణము మంధరలో గల దైత్య గుణమే కారణమనియు గల్పవృక్ష కవి వ్యాఖ్యానించెను,

శ్రీ రామ చంద్రునితో గలసి పదునాలు గేండ్లు అరణ్యవాసము చేయుటకు లక్ష్మణుడుద్యుక్తుడైనాడు. ఆ లక్ష్మణుడు తన భార్యయగు ఊర్మిళతో జెప్పి వెళ్లెను? ఈ విషయమున వాల్మీకము మౌనము వహించును కల్పవృక్షము తనొ్కన వ్యాఖ్యను గావించినది.

"శ్రీరామచంద్రుండు తమ్ముని ప్రేమకన్నులతో కౌగలించుకొని, అమ్మతోజెప్పి నీభార్య ననుమతింపజేసి రావోయి సౌమిత్రి! సీతవోలె నూర్మిళయు వత్తునన్న నేనొప్పుకొను" అని రాముడు లక్ష్మణుతో అన్నాడని కల్పవృక్ష కథనము.

లక్షణుడు ఊర్మిళా భవనమునకు వెళ్ళెను. ఆమెను లక్ష్మణస్వామి "యోగిని" అని సంబోధించెను రామునితో తాను అడవికి పోవుచునని ఊర్మిళాదేవితో లక్ష్మణుడనెను. ఆమె అంగీకరించినదా? "యోగి జనౌఘ సంసదుదితోజ్జ్వల సత్ప్రథమావతార!" నేను నీకు చెప్పెడిదాననా! అని యున్నది. ఆమె అంగీకరించినదని అర్థము ఆమెయు లక్షణుడును కౌగలించుకొనిరి. నవ్వుకొనిరి ఈ రీతిగా లక్షణుడూర్మిళను గలసినాడు ఆమె యనుమతితో రాముని వెంటవెళ్ళినాడు. ఊర్మిళ లక్ష్మణుల సమావేశ విశేషములు వాల్మీకమున లేవు.

కాకాసుర వృత్తాంతము

వాల్మీకమున సుందరకాండ యందు సీతాదేవి హనుమంతునితో ప్రసంగించు ఘట్టమున కలదు. కల్పవృక్ష సుందరకాండమున ఉషఃఖండమునసే కాకాసుర వృత్తాంతము వాల్మీకమున నున్నట్లే యున్నది కాని కల్పవృక్షమున అయోధ్య యందు అననూయా ఖండమున కూడ ప్రస్తావింపబడినది.

కల్పవృక్షములోని కాకాసురుడు దేవీభక్తుడు ఈ విషయమును స్థాపించుటకై అయోధ్యకాండలో కాకాసురుని వృత్తాంతము కూర్పబడినది "శ్రీరామచంద్రుడు సీత తొడపై తలచేర్చి నిద్రించు చుండెను అప్పుడు "కాకాసురుడు" ముక్కుచాచుక తల్లిపై మొనసి దూకి" నాడు. ఈఘట్టమున కాకాసురుని చేత ప్రస్తావింపబడిన సీత సాక్షాత్ మాతృస్వరూపిణియె.

యుద్ధ కాండము సంశయ ఖండమున దొలిపద్య మిట్లున్నది శ్రీ కనక కాంతి వక్షా! ప్రాకట రాజత శుభాంగ! బ్రహ్మపదార్థ వ్యాకృత భూమతనూ! హంసాకారా పరమహంస! హర! విశ్వేశా! హంసయు, శివుడు అభిన్నులను భావన యిందున్నది వాల్మీకమున యందు లేని హంస యొకటి కల్పవృక్షమునందు గలదు. శివుడు రామునకు హంసగా గన్పడును ఆ హంసతో రాముడు సీతా దేవికి వార్త సంపును ఊరందఱు జూచుచుందురు. ఆహంస యెట్లున్నదనగా రావణుడు తన పూజామందిరములో ఒక హంసను వెండి దానిని బెట్టి దానిని శివుడుగా ఆరాధించుచుండెను. ఆ హంసయే యీ హంసయా యన్నట్లు భాసించి రావణునకు గోపము వచ్చి శివుని నిందించు చుండెను అప్పటికి ఆంజనేయుండు యుద్ధములో అక్షయకుమారుని వధించెను ఆ అక్షయకుమారున

కొక్క కొడుకుగలడు వాడు తాతగారి పూజా మందిరములో హం సను దానాడుటకై తెచ్చినటుల కల్పింపబడినది, ఈరీతిగా రావణుని మాయకప్పినది ఇది మహానాటక యోగ్యమయిన కల్పన చూచిటకి నవల వలె నున్నది. నాటకమువలె నున్నది సామాన్యముగ బూర్వక వుల రచనలు నాటకములవలె నున్నవనుట యందలి ప్రసంగ నైపు ణిని బట్టియే

కల్పవృక్షమున బ్రసంగనైపుణితో బాటు నాటకాంగముల న్నియు గలవు

"రఘుకుల రాజహంసయగు శ్రీ రామచంద్రునకు ఈకన్పించు రాజహంసము తన వియోగ భావనా జనిత వాంఛాస్వరూపమో, తనకన్ను చెదిరుటయో, యదార్థమైన హంసయో, బహిరాకృతి గలదియో యేమియు దెలియక తెలియమి యందొక విలక్షణాను భవలాలస కలిమి నిట్లనియె"

కల్పవృక్షము వాల్మీకమును అనుసరించినను చాల స్వల్ప విషయములలో భేదించినట్లుండును అచ్చట కథ వేఱు ఇచ్చట కథ వేఱు అన్నట్లుండును.

రామునకు రెండవసారి సమాధి భంగము యుద్ధకాండమున జరిగినది ఇంద్రజిత్తు నాగ బాణములతో రాముడు మూర్ఛితుడు కాగా గరుత్మంతుడా నాగ పాశములను దొలగించును. వాల్మీకమున నిదిలేదు. కల్పవృక్షమున క్రొత్తగా జెప్పబడినది

ఇక ఆదిత్య హృదయము రామరావణ యుద్ధమున రావణుని సంహరింప జాలక, రాముడు బాధ పడుచుండగా అగస్త్య మహాముని వచ్చి రామునకు ఆదిత్య హృదయమును జపింపుమని ప్రబోధించును

ఈ ఆదిత్య హృదయము కల్పవృక్షమున యుద్ధకాండము మొదటనే యున్నది వాల్మీకి ఆదిత్య హృదయము, కల్పవృక్ష కవి ఆదిత్య హృదయము వేర్వేరు కల్పవృక్షమున ఆదిత్య హృదయమున వేద శాస్త్రములలోని రహస్యములున్నవి ఆ శాస్త్రరహస్య రహస్యములు తెలసినగాని కల్పవృక్షము నందలి ఆదిత్య హృదయ రహస్యము తెలియదు

వేదోపనిషచ్ఛాస్త్ర ప్రతిపాదితాంశములను కాళిదాస ప్రభృతి మహాకవులు రసస్ఫూర్తితో ఎట్లు కావ్య మార్గమున వెలయించినారో, వాల్మీకమునందలి వైదికము లయిన రహస్యార్థములను ఆధ్యాత్మిక విషయములను కల్పవృక్ష కవి యట్లే కావ్యమున వెలయించెను విశ్వనాథకు ఇతరాంధ్ర రామాయణ కవులకు బోలిక లేదు వాల్మీకమునకు నకలు దింపు పనిసి విశ్వనాథ చేయలేదు. కథాక్రమ పద్ధతిని మార్చుట, నూతనాంశములను జేర్చుట మున్నగునవి వాల్మీకికి భాష్యప్రాయమయినవే

వాల్మీకి రహస్యమేమనగా అందిపి యుండును, ఇది యుండదనుటకు వీలులేదు రామాయణ కల్పవృక్షము వాల్మీకమునకు అనుసరణ మనుటకు గాని, కాదనుటకు గాని వీలులేదు, కల్పవృక్షము యథా వాల్మీకమే



# కల్పవృక్షము - సుందరకాండ వైభవము

డాక్టరు కొర్రపాటి శ్రీరామమూర్తి

"వ్రాసిన రామచంద్రు కథ వ్రాసితి వంచనిపించుకో వృథా
యాసము గాక ఇట్టికత లైహికమా? పరమా? యటంచు దా
జేసిన తండ్రి యాజ్ఞయును జీవునివేదన రెండు నేకమై'
"నా సకలోహ వైభవ సనాథము నాథ కథన్ రచించెదన్"

విశ్వేశ్వరార్పితముగా రచింపబడిన కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి "సకలోహ వైభవ సనాథ" మగు రామకథ శ్రీమద్రామాయణ కల్పవృక్షము.

'అచ్చమయిన యమృతమమరులు త్రాగ' అద్దానికొఱకు అసూయపడక తన కమ్మని కవనమును, తియ్యని తెలుగు దనమున పొదిగి 'పరమ మౌనియయిన వాల్మీకి కృత రామ సత్కథా సుధా రసంబు' నను మేళవించి తాను 'త్రావి' మనచేత 'త్రావించినాడు.'

వాల్మీకి రామాయణమును ప్రణవ గాయత్ర్యష్టాక్షరి మంత్ర పూరితము గావించి, పఠన, మనన, శ్రవణాదులచే ఎట్లు ఎక్కువ ఫలము గూర్చ ప్రయత్నించెనో అంతకంటె ఎక్కువగ విశ్వనాథ తన రామాయణము నందలి సుందరకాండమును పారాయణ యోగ్యము గావించుటకై ఎంతగానో కృషి సల్పినాడు. రామాయణమును మహామంత్రముగ, తారక సర్వస్వముగ భావించు భారతీయ సంప్రదాయ ధారను తన సుందర కాండమునందు అత్యంత సుందరముగ సమన్వయించినారు విశ్వనాథవారు. కనుకనే హనుమత్స్తుతి యందు విశ్వనాథవారు హనుమ మూలమంత్రమును నిక్షేపించియు, త్రిజటా స్వప్నమును గాయత్రీ మంత్ర రాజముగ తీర్చిదిద్దియు "రాఘవు పట్టంబు సర్వథా వృత్తంబుగా" అంజనేయునిచే పొందించియు, అద్దాని పఠనము వలన

ఎక్కువ ఫలితమును సమకూర్చినారు సీతమ్మ గావించి
స్తవము సుందరకాండ భక్తి పారవశ్య గంభీరతకు ని
"మీనాక్షీం ప్రణతోఽస్మి సన్తత మహం కారుణ్య వా
అను మీనాక్షి పంచరత్నములు జానకీపతి స్తవముగ విశ
చేతిలో రూపు దిద్దుకొనినవి "నన్నున్ క్షమింపవే రఘుప
వారాన్నిధే" అను మకుటముతో శ్రీరామ సంకీర్తనము
సుందర హనుమ కాండను అత్యంత సౌందర్య కాండగ తీరి

కల్పవృక్షము నందలి పాత్ర చిత్రణ నిరుప
అశ్వపోత్రి ఖగరాట్ పంచాస్య శాఖామృగేశా నాంస
మరుత్తనయ భాస్వన్మూర్తులన్" పాఠకులకు సా
జేసినారు కర్మ, జ్ఞాన, భక్తి యోగములకు సమన్వయ
హనుమంతుని తీర్చిదిద్దుటయే గాక రాజయోగ పద్ధ
చిత్రించినారు యోగ విద్యా రహస్యములనెల్ల వా
యందు నిక్షేపించి హనుమంతుని పరమ యోగారూఢునిగ
ద్వైతిగ నిరూపించినారు

"తతో రావణ నీతయాః సీతాయాః శత్రుకర్శనః
ఇయేష పదమన్వేష్టుం చారణా చరితే పథి॥

అను శ్లోకముతో మహర్షి సుందరకాండమును ప్రారంభి
'యమిడవశి' అను అర్థమున హనుమంతుని శత్రుకర్శనుః
పేర్కొనినాడు అతడు వెదుకబోవు మార్గము చారణా చరి
అనగ కుండలిని చేత అంతట సంచరింపబడు మార్గము
ఆ మహాకావ్యమున ధ్వని రూపమునగల హనుమంతుని
యోగమును భాష్యకారకవి యగు విశ్వనాథ తన సుందర
మున సవిస్తరముగ వ్యాఖ్యానించినారు పలుచోట్ల తన క
హనుమ యోగి అని కంఠోక్తి గావించి, మూలాధారమందు

పైయున్న కుండలిని శక్తిని సహస్రారము వరకు ఉత్థాపన చేసిన విధమును, ఆతని పయనములో షట్చక్రములను అధిగమించిన విధమున, అతని చర్యలలో ఆత్మావలోకన పరుడైన యోగి లక్షణములను తెల్పయున్నారు.

'మూలాధారము నుండి ఉత్థాపన చేయబడిన కుండలినీ శక్తి సుషుమ్నా నాడిని ప్రవేశించి ఉత్తరోత్తర క్రమముగ స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధి, అజ్ఞాచక్రములను బ్రహ్మ విష్ణు రుద్ర గ్రంథులను ఛేధించుకొనుచు పోయి సహస్రార పద్మమును చేరి అందు పరబ్రహ్మముతో సంయోగమును పొందును. సంగ్రహముగ యిదియె కుండలినీ యోగము

హనుమంతుడు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారములను బహిరంగములందు బాల్యమునందే నిష్ణాతుడై నాడు పుట్టుకచే శౌచము, సంతోషము, బ్రహ్మవరప్రసాదియై తపశ్శక్తిని సంపాదించి సూర్యునివద్ద సమస్తవిద్యలు అభ్యసించి స్వాధ్యాయపరుడై శ్రీరామ సందర్శనానంతరము ప్రణిధానమాచరించి ప్రత్యాహారము సిద్ధింప జితేంద్రియుడై యోగభ్యాసనవేళ ధారణ, ధ్యాన, సమాధులను సిద్ధింప జేసికొనినాడు

రామాయణమున, అందును ముఖ్యముగ సుందర కాండమున "హనుమంతుడు"ను శబ్దము ఎక్కువగ వాడుట, ఈతడు కుండలిని యోగానుష్ఠాన పరుడని ధ్వనింప జేయుటయే. 'హనుమత్' 'సుషుమ్నా' శబ్దములు పర్యాయ పదములు గాన ఆంజనేయుని 'హనుమ' యనుట యోగికి అది సార్థక నామధేయము.

వేదవేద్యుడు శ్రీరాముడు వేదపతి, పరాశక్తిస్వరూపిణి సీత ఆమెను దర్శించుట జీవైక్యము పొందుటయే హనుమంతుని

అన్వేషణ పర్యవసానము అట్టి సీతాసందర్శనము కావున యోగసాధన యందు సీతా సందర్శనము సహస్రారము తేజస్వరూపిణి 'మూడు మూడు గంభములు గాల్పులూలల ' 'కంబములు వైడూర్య సంకలితములుగ మాణిక్య లింగితములుగ వజ్రములు గాగ' సహస్ర స్తంభ మంటపమును హనుమ గాంచినాడట అశోకవని యందలి ఆ మండపము సహస్ర స్తంభయుతముగ దేదీప్యమానముగ ప్రకాశించుచున్నట్లు వర్ణించుటచే సీతను వహించుచున్న ఆ మంటపమందలి స్తంభములు వేయి ఆకులుగను, ఆ అశోకవని శోకరహిత మగు సచ్చిదానంద స్వరూపమగు సత్యలోకముగను, అంతటి 'సూర్యాగ్ని తేజోవిలాసదేహ' 'జగన్నాయక సాయక యశస్సనాధ జ్యోత్స్న' సీతమ్మ సహస్రార బిందువుగను భావింపనగును ఆమె "పంజరశుకి' యుటు 'శివమూర్తి' యుటు అల్లు సంభోధించుటతో తృప్తిచెందని విశ్వనాథవారు "అర్ధనారీశ్వరివోలె బరమ శివాకారమై" యున్నట్లు ప్రదర్శించినారు 'కోరి లక్ష్మి నడుమ గూర్చున్న య్యల్లగా శోభితాల్చెనట నశోకవనము' అని ఆ వనమును వర్ణించుటచే శ్రీచక్రస్ఫురణయు గావింపబడినది

అట్టి సీతా సందర్శనమునకు మూలహేతువు హనుమంతుని శ్రీరామ సందర్శనము ప్రథమ సందర్శనముననే రాముని పరాత్పరునిగ దర్శించినాడు ఆ జగన్నాథుని తన నాథునిగ, గురువుగ భావించి తన భావి యోగాభ్యాసమునకు పూనుకొనినాడు కావున శ్రీరామ సందర్శనము నందు మూలాధార చక్రము గోచరించుచున్నది

శ్రీరామ సుగ్రీవుల సఖ్యము కుదిరిననే గాని సీతాన్వేషణము జరుగదు కావున హనుమ రామ సుగ్రీవులకు సఖ్యము గూర్చుట రెండవ ఘట్టమగు స్వాధిష్ఠాన చక్రము మూలాధార స్వాధిష్ఠానములు దేహమున వహ్నిఖండ మనబడును "సాధకుడు

స్వాధిష్ఠాను ప్రజ్వలింపజేసి తద్ద్వారమున విజృంభించిన వాయువుచే కుండలినుత్థాపన చేయవలెను. 'హనుమత్కృత సర్వసంభార సామాగ్రికం బగ్నియందు పేల్చి, యనుట "అగ్ని స్వాదిష్ఠాన గతోజ్వలమ్' అనుటయే ఇట్లు రామ సుగ్రీవులకు సఖ్యము గూర్చి సీతాన్వేషణకు గ్రంథిగ నున్న వాలిని వధింపజేసి మూలాధార స్వాధిష్ఠానముల ననుసరించి యుండు 'బ్రహ్మగ్రంథి' ని అధిగమించినాడు

హనుమంతుడు దక్షిణాభి ముఖుడగ పయనించుటయు కుండలినియోగమే 'సుషుమ్నా నాడి మూలాధారమునుండి బయలుదేరి దక్షిణకోలువు చేరి అచ్చటనుండి అంబిక, అంతట సహస్రారము చేరును కనుక సుషుమ్నా మార్గము దక్షిణ మార్గము కనుక దక్షిణముగ పోవుట

ఇట్లు కపి వీరులందరు దక్షిణాభిముఖులై పయనించి స్వయంప్రభ గుహను జేరిరి 'అవ్వా! యీ మణిసౌధము నెవ్వరిది' అని మణినికరాయ మానము, సూర్యచంద్రము తళతళలాగు ఆ గుహను గాంచిన కపివీరులచే అట్లు కవి పల్కించుట స్వయంప్రభమగు ఈ మణిసౌధమును మణిపూరమని సూచించుటరో

మణిపూరము బీజాక్షరము 'రం' అగ్ని తత్త్వముగాన కపివీరులు మణిపూరము చేరునరికి 'కడువడి నాలకల్ పిడుచకట్టగ నీరెచటున్ లభింపద' తలచిరినారు మూలాధారమున సర్పాకారమున నిద్రావస్థ యుండున్న కుండలినీశక్తి మేల్కొని తన క్షుదాగ్నితో అచటి పృథివీ భూతాంశములను భజించి స్వాధిష్ఠానము చేరి ఆకలి తీరక అచటి జలమును పానముచేసి అంతటితో తృప్తి చెందక మణిపూరమున ప్రవేశించి అగ్నిని భక్షించును. ఈ స్థితియందలి బాహ్యచిహ్నమే వారి ఆకలిదప్పులు 'ప్రొ నూపె ప్రొప్పవి సా

నివృత్తిః అని పతంజలి యోగ సూత్రము కుండలినీశక్తి కంఠమూల నందుండు విశుద్ధిచక్రము చేరునంతవరకు యోగికి అకలి దప్పులుండు ననియే పతంజలి చెప్పినాడు

శతయోజన విస్తీర్ణసాగరము ఎదురగుటచే వారి ప్రయత్నమునకు అవరోధము కల్గినది సంపాతి పల్కులచే వారిలో నూతనోత్సాహము వెల్లి విరిసినది అనగా ఆత్మ సాక్షాత్కారము నొందిన పెద్దల వలనను, శృతుల వలనను ప్రేరేపింపబడి యోగసాధన కొనసాగింప వలయునని ఇట గోచరించుచున్నది వారందరిలో హనుమంతు డొక్కడే సంపాతి పల్కులను గురుబోధగ స్వీకరించి మణిపూరము నుండి అనాహత చక్రమునకు దృష్టి మరల్చినాడు.

అహంకార త్యాగముతో దైవశక్తిని నమ్మిననేగాని యోగసిద్ధి వంటి దుష్కర కార్యము నెరవేరదు కావుననే తన గమ్యమును సునాయాసముగ చేయుటకై రామలక్ష్మణులకు, దేహాధిష్ఠిత దేవతలకు నమస్కరించినాడు

సముద్రలంఘనమునకు హనుమంతుడు మహేంద్రగిరిపై నుండి-

నడుమున్ మూపులు వంచి గ్రీవము సమున్నత్యుజ్జ్వలంబై మొగం
బుడు దాజోడయిమట్లు కన్పడగ జానూరుల్ పరిశ్లిష్టి యే
ర్పడ బాహు ద్వితీయంబు పార్శ్వ ఘటనాపశ్చాత్రసారంబు చొ
ప్పడఁ జక్రాకృతి వాయుసూనుడు మహా వార్ధ్యున్ముఖి కృన్మతిన్

ఉద్యమించినాడు "జానూరుల్ పరిశ్లిష్టి యేర్పడ" "గ్రీవము సమున్నత్యుజ్జ్వలంబై చ నన్" 'చక్రాకృతి' అనుటచే ఇదొక సిద్ధాసనముగ భావింపనగును 'సర్వేషా మేవ బన్ధానా ముత్త మోహ్యుడ్డియానకః' కుండలిని ఉత్థాపనకు చెప్పబడిన బంధము లన్నిటిలో ఉడ్డీయాన

బంధము ఉత్తమోత్తమైనది 'ఉడ్డీయాన బంధము వలన ప్రాణము సుషుమ్నా నాడి ద్వార పైకిపోవును మొండెమును ముందుకు వంచినయెడల ఈ సాధకము సులభ సాధ్యమగును' ఇట నడుమున్ మూపులు వంచి అనుటచే శ్రేష్ఠతరమగు ఉడ్డీయాన బంధమును హనుమంతుడు అనుష్ఠించినట్లు తెలియుచున్నది అతడు ఆకాశమునకు లేచుటయందు అతని ఖేచరీశక్తి వ్యక్తము కుండలినీశక్తి అనాహతము చేరినప్పుడు ఆకాశ గమనము సిద్ధించును

యోగమార్గ సంచరిష్ణువునకు స్థైర్యము దృఢముగ నుండవలయును ఇట్టివానికి మొదటి విఘ్నము తన మిత్రుల వలననే కలుగును సాధకుని ప్రేమానురాగములచే అతని దృఢదీక్షకు సహాయరూపక విఘ్నము విఘ్నమే కాన అభ్యాసి అద్దానికి లోబడక మంచి మాటలతో సమాధానపరిచి యోగసాధన కుపక్రమింపవలయును. ఆ మిత్రుడే మైనాకుడు సముద్రునిచే ప్రేరితుడై హనుమంతుని శ్రమ తీర్చుటకై అతిథ్య మీయ దలంచినాడు మైనాకుడు. మైనాకుని పార్థనకు లోబడక అద్దానిని తన కార్య నిర్వహణమునకు అవరోధముగ భావించి ముందుకు సాగిన ఘనుడు హనుమ

తరువాత సాధకుని చిత్తస్థైర్యమును ధృఢనిశ్చయమును పరీక్షింప దేవతలే విఘ్నములు కలిగింతురు సాధకుడు వానికి లోబడక భక్తిచేతనే తప్పించుకొనవలయును అట్లే హనుమంతుడు సురస యను నాగమాతను అతిక్రమించినాడు

పిమ్మట సాధకునకు భూతగ్రహముల చేతను దుష్టజనుల చేతను అవరోధములు ఏర్పడును ఇట్టి విరోధ భావము గలవారిని వధించి ముందుకు సాగవలయును. అట్టి దుష్టగ్రహమే సింహిక కనుకనే అమెను వధించి ముందుకు సాగినాడు. ఇట్లు కల్పితయోగ మార్గ అవరోధము లన్నింటిని హనుమ అధిగమించి సముద్రావతరణ మను అనాహతమును దాటి విశుద్ధ చక్రముపై దృష్టి మరల్చినాడు.

భక్తియోగము ఉద్యానవన సంచారము వలె మనోహర మైన మార్గమనియు, యోగమార్గము నిరాలంబముగ సముద్రము దాటుట వంటి దుస్సాధ్య ఘోర కార్య మనియు ఈ కాండము వలన తెలియదగియున్నది

శ్రేయాంసి బహు విఘ్నాని, - యోగాభ్యాస నిరతులకు కొన్ని విఘ్నములు సంభవింపకమానవు వ్యాధి, యోగకర్మా ర్హత, సందేహము, అజాగరూకత, మత్తత, అతృప్తి, భ్రమ, ఇత్యాది చిత్త వికారములు యోగవిఘ్నములు అని పతంజలి చెప్పియున్నారు. వీని నధిగమించిననేగాని సాధకుని ప్రయాణము సాగదు. ఇట్టి ప్రతిబంధకమే లంక రక్కసి దీనిని జయింపక సిద్ధి చేకూరదు 'లం' పృధివీ బీజము అది కలది 'లంక' అనగా దేహము లంకను జయింపవలె ననగ యోగాభ్యాసి శరీరమును జయింప వలెననుట ఇట్లు దేహమును జయించి విశుద్ధిని పొందవలెను హనుమంతుడు 'లంక' రక్కసిని జయించినాడు.

"అసురి మొగమున నరచేత నప్పళించె" అనుటచే నిర్బంధముగ నైనను శరీరమును గెలువవలయు నని అర్ధము అనగా యోగి హఠ యోగాధులచే సాధన చేసి తన పాంచ భౌతిక శరీరమును, తద్ద్వార మున మనస్సును వశపరచు కొనవలయును ఇట్లు హనుమ లంక రక్కసిని వధించి విశుద్ధి చక్రము నధిగమించి అంతః ప్రాకారము దూకి ఆజ్ఞ చక్రాధిష్ఠిత రుద్రగ్రంధిని అధిగమించిన వాడై ముందుకు సాగినాడు

హనుమ సీతమ్మకై లంక యందు గాలించుచు అంతఃపుర స్త్రీల శృంగార చేష్టలను చూచియు చలింపక మహానుభావుండయిన ఆ అంజనేయుండు తనలో దాను చూచికొని తన యాత్మ మహా ప్రసన్నతాభావంబు పొందుట యెఱింగినాడు అంతటి జితేంద్రి యుడును ఆత్మ పరిశీలనము చేసికొనుట గమనింపదగిన విషయము.

కనుక యోగాభ్యాస నిరతులకు ఆత్మ పరిశీలనము, ఆత్మ విచారము ఎంతేని ఆవశ్యకము

హనుమంతుడు లంకయందు సీతమ్మకై అన్వేషించుచు మాయాబద్ధులగు రాక్షసులను గాంచి "ఇంతటి ఇంద్రియ జ్ఞానము మాలిన సుషుప్త భావమునకును నిత్య జాగ్రదవస్థాం భూతమైన జానకి దేవికిని సంబంధము లేదని" అచ్చోటు పరిహరించినాడట జానకీదేవి "నిత్య జాగ్రదవస్థా భూతమైనది" అనగా విద్యామాయ సుషుప్తి భావము ఇంద్రియ జ్ఞాన మూలమగు అజ్ఞానము. ఇదియే త్రిగుణాత్మకమగు అపర ప్రకృతి. ఇట్టి త్రిగుణాత్మక మగు మాయికును విద్యా మాయికును సంబంధ ముండదు, గాన ఆచ్చోటు పరిహరించి నాడు అనగా పరాపర ప్రకృతి వివేచన చేసినాడు అచటి త్రిగుణాత్మకమగు ప్రకృతిని గాంచిన హనుమకు "జగదయాథార్థ్య సరణి యొక్క పెట్టున దోచెనట" ఇట్లు "జగదయాథార్థ్య సరణి తోచుటయే" అద్వైతమగు బ్రహ్మ మొక్కటియే సత్యమని తోచుట జగన్మిథ్య కావున బ్రహ్మ సత్యము అని నిరూపించినాడు

కపిమహేశ్వరునకుఁ గానంగ రాదెంత
వఱకు సీత యంతవఱకుఁ గాఁగ
నంతకంతకాఁగ శాంతభావంబును
బూనుచుండె హృదయమున సతండు

ఇది మహాయోగి లక్షణము ఎంతవరకును సీత కానరాకుండుట అలస్యము, అలబ్ధభూమికత్వము అను యోగవిఘ్నములు సంప్రాప్త మైనను శాంతచిత్తుడై సత్త్వసంపన్నుడగువాడు మాత్రమే యోగసిద్ధికర్హుడు అట్టిఎడ సాధకుడు పునః పునః ధారణ, ధ్యాన, సమాధులచే సంయమసిద్ధిని పొందవలయును

సీతాసందర్శనము సహస్రార బిందు దర్శనముగ భావించిన పరమయోగి ప్లవంగపుడగు హనుమ సీతాన్వేషణమందే మనసు లగ్నము జేసి లంక యందు అన్వేషించుట 'ధారణ' స్థితి. సీతా సందర్శనార్థియై 'జానకీదేవి ప్రతీక్షా భావం బొక్కటే తన యాత్మలో నారసి దివ్వెగా వెలుగుచున్న యక్కపిరాజు' సీతా సందర్శనమే పరమావధిగ భావించి అందులకు వ్యతిరిక్తమైన దానిని రానీయక తాను ధ్యానించు సీతాదేవిని మాత్రమే భావించుట 'ధ్యాన' మగును సీతమ్మను ఊహించి కనులు మూసికొనగ 'దేవిరూప మెంచుచుండ రూక్ష రూపంబుగ నొక్కమెఱపు మెఱసె నూర్జితముగ' - తన ప్రయత్నము లేకయే అతని ధ్యానము, ధ్యానించు వస్తువు యొక్క స్వరూపమగ నొక మెఱుపు మెఱసి తనను మైమరపించిన ఆ మధురక్షణము అతని సమాధిస్థితి

'త్రయమేకత్ర సంయమః' - ధారణ, ధ్యాన, సమాధులను కూడియుండుట 'సంయమము'. హనుమ అశోకవనమున తపోయోగ్య స్థలమున తపము చేయ సంకల్పించి -

చిక్కనగు తోకపైకెత్తి చివర మడచి
శిరసు పైని బతాకగాఁ జెంగలింప
నాపద ద్వారకుఁ డయినట్టి స్వామి
పంచభూత మనోహర ప్రతిభు డగుచు

ప్రకాశించినాడు ఇది అతని సంయమస్థితి ఇట్లాతడు మరల మరల సంయమ స్థితిని పొందుచు సహస్రారబిందువును చేరనున్నాడు

పుష్పకమున మండోదరిని గాంచి సీతమ్మగ భ్రమించినాడు ఇది యోగవిఘ్నము ఆజ్ఞచక్ర మందు ఆత్మ జ్యోతి వంటి తేజస్సు కానరావచ్చును మండోదరిని గాంచి సీతమ్మ యనుకొనినట్లు ఆ తేజస్సును ఆత్మయని భ్రమింపరాదు ఇట్లు భ్రమించుటను

'భ్రాంతిదర్శనము' ని పతంజలి యోగ విఘ్నముగ పేర్కొని యున్నాడు సీతమ్మ ఎట్లుండునో సంభావించి ఆత్మ స్వరూపమును భావించి తను కన్నది భ్రాంతిదర్శనమని తెలిసికొని సకారణముగ దానిని పరిహరించి మిక్కిలి హెచ్చరికతో తన అన్వేషణను కొన సాగించినాడు

ఎందును సీతమ్మను గానక చింతాక్రాంతుడైనాడు తన ప్రయత్న మంతయు వ్యర్ధమైనదని భావించినాడు విషయము రామ లక్ష్మణులతో చెప్పుట ఎట్లనియు మధనపడినాడు మరల 'వైరాగ్య వంతుండు తన విషాద భావంబు చిత్ర విచిత్రంబు లయిన యూహ లచే ననునయించు కొనుం గావున నమ్మహో వానరుండు కవి శిల్పి ఋషి భావనా పరమేశ్వరుండు విషాద భావంబు మరలించుకొని ప్రయత్న నైష్ఫల్యం బంగీకరింపక' సీతాన్వేషణను సాగించినాడు. ఆజ్ఞాచక్రమునకు సంకల్ప వికల్పము లనునవి రెండు తత్త్వములు రెండు రేకలుగ నుండునని 'అద్భుతకుండలిని' అను గ్రంథము తెలు పుచున్నది వాని ఫలితముగనే హనుమంతుడు ఒకింతసేపు మానసిక సంఘర్షణకు లోనైనాడు హనుమ ఉత్తమ సాధకుడు గనుక ఇట్టి విఘ్నమునకు లోనుగాక సీతా సందర్శన మగువరకు అన్వేషించి ఆజ్ఞాచక్రము నధిగమించి సహస్రారమున పరిపూర్ణ యోగ సిద్ధిని పొందినాడు

హనుమ సీతా స్వరూపమును ఇట్లు భావించినాడు

గుణవిభావనాత్మాకృతి క్షోణిజాత
మనసులోన నవ్యక్తమై మలయుచుండె
అట్టి యవ్యక్త రూపంబు వ్యక్తరూప
ముగను జేయుఁగ (బటు రూక్షముగఁదలచి నాడు.

"గుణవిభావనాత్మాకృతి" అనగా త్రిగుణాత్మకమైన మాయ.

అదిఅవ్యక్తమై మలయి చుండెనట అనగా అట్టి త్రిగుణాత్మకమాయ అవ్యక్త ప్రకృతి. వ్యక్తరూపము చేయుట అనగా స్పష్టము చేయుట. అనగా త్రిగుణాత్మకమగు ప్రకృతి సృష్టికి పూర్వము కారణ రూపమున అవ్యక్తము సృష్టి యనంతరము కార్యరూపమున వ్యక్తము. అట్లు తలంచినవాడై -

కనులు మూసి యెడమ కంటి ముందర రామ
భద్రు నిలిపి యతని ప్రక్క దేవి
రూప మెంచు చుండ రూక్ష రూక్షంబుగ
నొక్క మెఱపు మెఱసె నూర్జితముగ
అంతలోన దేవి యంతర్హితం బైన
నిలిచె రామమూర్తి నీరజాక్షుఁ
డంత హనుమ యెరిగె నాత్మలోపలి తన
రామమూర్తి కాదు రామమూర్తి

రామ నిష్ఠమైన శక్తి సీతమ్మ కావున వారి అభిన్నరూపమును సందర్శింప ప్రయత్నించినాడు సీతను సందర్శింపగనే రాముడు మాయమైనాడు దృష్టి ప్రకృతిపై పడిన పరమాత్మ గోచరింపడు. అది ఛేదించినగాని నిర్గుణ పరమాత్మ సాక్షాత్కారము గలుగదు కనుక దేవి అంతర్హితమైనంత అనగ విద్యామాయ తొలిగిన వెంటనే నిర్గుణ పరబ్రహ్మ సాక్షాత్కారము గలిగినది ఇపుడు తాను దర్శించిన రామమూర్తి ఆత్మలోపలి తన రామమూర్తి కాడు ఇంతవరకు తన ఆత్మయందున్న రామమూర్తి ఉపాసనకై సగుణ రూపకల్పన చేయబడిన మాయకల్పిత శరీరుడు విద్యామాయ ఉపసంహారముతో నిర్గుణ పరబ్రహ్మము ద్యోతక మయినదని విశ్వనాథవారి భావన

సహస్రారబిందు దర్శనమును 'అగ్నిసోమీయ' విద్యగ యోగశాస్త్రము తెలుపుచున్నది

తన గర్భంబున నున్న యగ్ని సముద్రాస్త్రంబై శిఖాసంతతిన్
వినుపీథన్ బరపంగ జంద్రుని సుధావిర్భావతి యారెన్ మహా
వనధి ప్రోద్గత శైశిరత్వ మడగెన్ వాయ్వధ్వమాధ్వి సుధా
వనిలో జాలులు వచ్చి వెచ్చగ జలింపన్ సన్నబీట్లిచ్చుచున్

అగ్ని గర్భుడగు హనుమంతుని 'స్వాధిష్ఠానాగ్ని ఆజ్ఞాచక్రము నుండి సహస్రారము చేరినపుడు సమశీతోష్ణస్థితిని పొందును అదియే 'అగ్ని సోమీయవిద్య' "అగ్ని సోమాత్మకం చక్రమగ్ని సోమాత్మకం జగదితి" ఇట్లు సమశీతోష్ణస్థితిని పొంది ప్రపంచ సంబంధము వదలక పరతత్త్వము నుండి శ్రమించు అమృతమును అస్వాధింతురు. యోగులు ఆ స్థితిని గూడ దాటి "వాయ్వధ్వమాధ్వి సుధావనిలో జాలులు వచ్చి పెచ్చగ జలింపన్ సన్నబిట్లిచ్చుచున్" - వాయ్వధ్వ మగు చిదాకాశమున బ్రహ్మ రంధ్రమును ఛేదించి తాము పరతత్త్వ స్థితిని పొందుదురు ఇదియే యోగాద్వైతము సీతా సందర్శన మను సహస్రారవిందు దర్శనమున హనుమంతుడు అట్టి పరతత్త్వ స్థితిని పొందనున్నాడు

ద్విగుణీకృత నూతనోత్సాహముతో హనుమ అశోకమున సీత కలదేమో అని పరిశీలించి సీతమ్మను గాంచినాడు ప్రత్యక్షమును అనుమాన ప్రమాణముచే బలపరచుకొనినాడు ఆమె సీతమ్మ యని నిర్ధారణ చేసినాడు భ్రాంతి దర్శనాదులు కల్గుచుండును గాన సాధకుడు, ఇట్టివేళ ప్రత్యక్షమును అనుమాన ప్రమాణములతో జోడించి స్వబుద్ధి బలముచే తర్కించి ఊహించి నిశ్చయించు కొనవలెను ఇట్లు నిశ్చయించు కొనినవాడై హనుమ 'సహస్ర స్తంభ మంటప మున' సీతమ్మను గాంచినాడు

"తక్కిన వేయికంబముల తావులు చీకటిలో మునింగి యా
యొక్కడు ధారుణీ తనయ యుండిన కంబమొకందు మాత్రమే"

దర్శించినాడు సహస్రారము నందలి మిగిలిన రేకులు శూన్యముగ తోపగ సహస్రార బింధువును చేరినాడు. ఇదే అమృతసిద్ధి

'సంసార మూలకందంబయిన సీతాతత్త్వంబులో లీనభావం పొంది బ్రహ్మనిష్ఠుండయిన యా జగత్ప్రాణ నందనుండు ద్యాన చిత్తవృత్తియై శ్రీరామచంద్ర సమైక్యంబు భావించినాడు

ఇటు మూలకందంబైన సీతా తత్త్వంబులో లీనభావంబది బ్రహ్మ నిష్ఠుడగుట యనగ కుండలినీ శక్తి సహస్రారమునకు చేరుట యని అర్థము ఇటు 'మూల' అనగా మూలాధారము కందంబైనది కందము నధిష్ఠించిన కుండలనీశక్తి 'కందోర్ధ్వం కుండలీనీశక్తిః సుప్తా మోక్షాయ యోగినామ్' అని యోగదర్శనము యోగులకు మోక్ష హేతువగు కుండలినీశక్తి మూలాధారమున పైన నిద్రించు చుండును కావున మూలకందంబైన కుండలినీశక్తి 'సీతా తత్త్వంబులో లీనభావం బందుటనగ' సహస్రారమున లయమగుట అట్టి యోగ బలముచే బ్రహ్మనిష్ఠు డగును 'శ్రీరామచంద్ర సమైక్యంబు భావించి' అనగా సహస్రారమున బ్రహ్మైక్యము పొందెనని అర్థము. అనగా హనుమంతునకు పరిపూర్ణ యోగసిద్ధి చేకూరినదని యర్థము

"తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః ఆకాశా ద్వాయుః వాయోర్వారగ్నిః అగ్నేరాపః అద్భ్యః పృథివీ పృథివ్యాం ఓషధయః ఓషధీ భ్యోన్నమ్ అన్నాత్పురుషః అని తైత్తిరియోప నిషత్తు సృష్టి క్రమమును వర్ణించినది ఇవియే షట్చక్రములుగ మానవుని దేహమున వెలిసినవి సహస్రారము పరమాత్మ 'అజ్ఞ' ప్రత్యగాత్మ విశుద్ధ అకాశము అనాహతము వాయువు మణిపూరము అగ్ని స్వాధిష్ఠానము జలము మూలాధారము భూమి ఈ షట్చక్ర ములు వరుసగ 'ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓం సత్యం అని భూలోక, భువర్లోక, జన లోక తపోలోక, సత్యలోకములుగ వెలిసినవి ఇట్లు పిండాండమున

ఇమిడియున్న బ్రహ్మాండమును దర్శించుటకు చేయు సాధనయే కుండలినీ యోగము

కుండలినీశక్తి షట్చక్రములను దాటి సహస్రారమును జేరుట యనగ జీవి వరుసగ ఆయాలోకములను దాటి సత్యలోకమున బ్రహ్మైక్యము పొందుట అని అర్థము షట్చక్రము లందలి భీజాకరములు (లం, వం, రం, యం, హం, జం, రాం) వాని తత్త్వములు (పృథివి, వరుణ, అగ్ని, వాయు, ఆకాశ, మనస్సు, పరమాత్మ) వాని పంచవర్ణములు (పీత, ధవళ, అరుణ, ధూమ్ర, నీలి) సర్వము 'పృధి వ్యాపస్తేజోవాయు రాకాశాత్' అను పంచభూతములే ఆ పాంచభౌతికమే మానవుని శరిరము మానవుని శరీరమున "ప్రాణాపానవ్యానోదాన సమానము" లనెడు పంచ ప్రాణములు వాని ఆధీనమున "పంచవాయువులు" ఉన్నవి మూలాధారమున అపానము, స్వాధిష్ఠానమున ధ్యానము, మణిపూరమున సమానము, అనాహతమున ప్రాణము, విశుద్ధి యందు ఉదానము గలవు ఈ పంచప్రాణముల పంచవర్ణములు, మూలాదార, స్వాదిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధి చక్రముల పంచవర్ణములు ఒకటే ఆ పంచవర్ణములే "ముక్తా విద్రుమ హేమ నీల ధవళచ్ఛాయలు" అట్టి ముక్తా విద్రుమ హేమ నీల ధవళ ఛాయా ముఖి పంచేంద్రియాధిష్ఠాన దేవతయు గాయత్రీ చంధో రూపిణి యగు పరాశక్తి - ఆమెయే విద్యామాయ. ఆ శక్తి స్వరూపిణి సీతాదేవి కనుకనే విశ్వనాథయు "పరమ యాజ్ఞికులు నిర్భర మహాచ్ఛంధోఽవతారంబు గాయత్రి దత్త్వమూర్తి గనుగొన్నయట్లుగా " "కసిమహర్షి తపోఽగ్నిచే కాగి క్రాగి సర్వతేజఃఫలంబు రసంబు తుదకు జూచినయట్లుగా" దర్శించి, తన సుందరకాండమున ప్రదర్శించినాడు

"సాంఖ్యాయనస గాయత్రీ చతుర్విగ్ం శత్యక్షరా త్రిపదా షట్కుక్షిః పంచశీర్షోపనయనే వినియోగః" అని గాయత్ర్యావాహనము.

గాయత్రీ మంత్రమగు చతుర్వింశత్యక్షరములే మూలప్రకృతి ఇరువదినాలుగు తత్త్వములు ప్రణవము శ్రీరాముడు సవితృ మంత్రము సీత పంచేంద్రియములు పంచ శీర్షములు ఆమె 'త్రిపదా' మూడువేదముల నుండి పిదుకబడిన త్రిపదా గాయత్రీ మంత్రము ప్రణవముతో కూడి యుండుట వేదవేద్యుని అనపాయిని యగు వేదవతి స్వరూపము. మూలాధారణి షట్చక్రములకు అధిష్ఠాన దేవతలను కనినది గాన 'షట్కోణిః' అయినది అట్టి పరాశక్తి అనుగ్రహముచే విద్యామాయ పొరయు తొలగిననేగాని పరబ్రహ్మ సాక్షాత్కారము కలుగదు కావున ఇటు హనుమంతుడు అట్టి పరాశక్తి యగు సీతాసందర్శనముచే ఆమె అనుగ్రహమును పొంది ఆ పొరయు తొలగగ, 'శ్రీరామచంద్ర సన్మాహాత్మ్యంబు భావించినాడు' అనగా పరబ్రహ్మమైనాడు

హనుమంతుడు సీతమ్మను గాంచి "ఈమె దేహమున్న యట్లుగ లేనట్లు" నుజ్జ్వలించు అని మాయా స్వరూపమును వివరించినాడు మాయను గురించి శ్రీ శంకర సూత్ర భాష్యమందలి అధ్యాన భాష్య మిట్లు చెప్పుచున్నది జ్ఞానదృష్టికి గోచరింపనందున మాయను సత్తు అనుటకు వీలులేదు కావున "వైదేహి దేహమున్న యట్లుగ లేనట్లు ఉజ్జ్వలించినది" కావున సద సద్విలక్షణమై అనిర్వాచ్యమై పరగటయే మాయా లక్షణము దీని నెరిగిన వాడు గావుననే హనుమంతుడు ఇట్లు తలపోసినాడు

చేతము నందు బూర్వమున శ్రీరఘురాము నెఱింగి నట్లుగా
నే తలపోసినాడ నిపుడీ యమగాంచిన యంత సర్వ మ
జ్ఞాతము గాగ నుండె నను నంగతి నాకెఱుగంగ నయ్యెడున్
సీత నెఱుగంగ కుండ రఘుశేఖరు దర్థము కాడు పూర్తిగా

సగుణ రామోపాసన చేసి అదియే పరతత్త్వమని మొదట ఉపాసకుడు తలపోయును నిర్గుణమైన పరతత్త్వమునకు సగుణ రూపము మాయా

కల్పితమేగాని, యథార్థము గాదు. మాయ నెరుంగకుండ మాయా కల్పితరూపము యథార్థముగ నర్థముగాదు. ఈ విషయమునే హనుమంతుడు 'సీతనెఱుంగకుండ రఘుశేఖరు డర్థముకాడు పూర్తిగా' అనినాడు.

షట్చక్రములు వరుసగ డాకిని, రాకిని, లాకిని, కాకిని శాకిని,హాకిని అను శక్తుల అధీనము నందుండును ఆ చక్రములను అధిగమించిన సిద్ధుడు ఆయా శక్తులను వశపరచుకొనును కనుకనే మనము 'శాకిని డాకిన్యాది శక్తులను గాలి దయ్యములగ భావించి వాని నివృత్తికై హనుమంతుని ఉపాసించుచున్నాము కనుకనే భక్త తులసీదాసు 'హనుమంతుని పేరు వినినంతనే భూతపిశాచములు దరిచేరవని కీర్తించి యున్నాడు

ఇట్టి సిద్ధ పురుషునకు అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశత్వము అను అష్టసిద్ధులు చేకూరును కనుకనే హనుమంతుడు 'అష్టసిద్ధి నవనిధ కేదాతా'అనియు స్తుతింప బడుచున్నాడు అష్టసిద్ధ్యుపేతుడు గనుకనే హనుమ పుష్పక విమానమున సీతమ్మ నన్వేషించుచు తన ఉనికిని వారు 'గ్రహింప రామికి బూనె నణిమ లఘిమ వాయుపుత్రుడ లఘుడై' తన సిద్ధులను వ్యక్తపరచినాడు రాక్షసవధ వేళ ఎంతెంతై వటుడింతయై మఱియు దానంతై నభోవీధిపై నంతై ." విశ్వరూపమును పొందినాడు. ఇట్లు సముద్రావతరణ, సీతాన్వేషణ, సీతా సందర్శన, రాక్షస సంహారవేళ తన అష్టసిద్ధులను భగవత్కార్యమునకై వినియోగించిన నిష్కామ కర్మయోగి ఈ సిద్ధుడు

షట్చక్రములను అధిగమించిన సిద్ధునకు వాని తత్త్వము లగు పృథివి వరుణ, అగ్ని, వాయు, ఆకాశాదుల వలన ఎట్టి భయము గలుగదు "ఏ అగ్ని దాహకత్వము నీ యెడలన్ లేకయుండు" అను సీతమ్మ వరప్రదాన మందలి పరమార్థ మిదియే

హనుమ దింద్రజిత్తుల యుద్ధమున ఇంద్రజిత్తు హనుమపై దివ్యాస్త్రముల నెన్నింటినో ప్రయోగించి నిష్ఫలుడై 'అతడవధ్యు డంచెటి గినంత' ఇంద్రజిత్తు దుఃఖించినాడట. ఇట్టి అవధ్యత్వము అతని యోగశక్తి చే చేకూరినది 'అవధ్యః సర్వశస్త్రాణామశక్యః . ... . యోగి యుక్తస్సమాధినా' అని యోగి అవధ్యుడని హఠ యోగ ప్రదీపిక ఘోషించుచున్నది కనుకనే హనుమ 'నన్నిటుం జావను నేను వేనికయి చావను నేనటుగాన వచ్చితిన్' అని రావణసభయందు ప్రకటించినాడు రావణుడు, విభీషణుడు, అక్షయకుమారుడు హనుమంతుని యోగసిద్ధునిగనే దర్శించినారు

అందుకనే కవి ఈ మహాయోగిపుంగవుని మహాద్భుత విక్రమములను గాంచినపుడెల్ల మానసికపూజ యొనర్చె శ్రీశచీ పురందరఋషిని గాంచి సర్వ ఋషినాథులు సిద్ధులు సాధ్యులు ఇట్లని స్తుతించిరి

మంగళరూప! యార్య! హరి మర్కట మర్కట! పంచవక్త్ర! ఖ
ట్వాంగ మహాసి ఖేట కుధరామృత కుంభసృణి ప్రదీప తో
త్తుంగ కరాంబుజాత! నవతోదయమూర్తి! త్రిపంచనేత్ర! స
ర్వాంగద కంఠహార! యసురావళి మర్దనబాహా! మారుతీ!

ప్రాసంగోత్థ కకుద్భుజావనత! సర్వజ్ఞా! సమీచీన బా
హా సంపాదిత రామకార్య! దిటసూహా! నిత్యతృప్తా! స్వతం
త్రా! సింహాసన! క్రోడపక్త! తురగాస్యా! యగ్నిగర్భా! మహా
త్మా! సర్వగ్రహభీ నివారణ! సముద్రాంభోమహాపత్తరీ!

విశ్వనాథవారి సుందరకాండము యోగదర్శనము హనుమంతుని అనుభవ పరమార్థము



# కల్పవృక్ష కవితా వైభవము

డాక్టరు చెఱువు సత్యనారాయణశాస్త్రి

విశ్వనాథ కవి విశ్వనాథుడు శ్రీమద్రామాయణ కల్పవృక్షమును రచించెను ఇది కావ్యము మహా కావ్యమనియు బిలువ వచ్చును. పరిమితముగ, కనీసమరగొరగా నైన పదునెమ్మిది వర్ణనములున్నది మహాకావ్యమనిరి అలంకారికులు. ఇందో పరశ్శతముగ వర్ణనలు కలువు కాదన్న, నారు కాండములు ప్రపంచితమైన ప్రబంధము గావున మహాకావ్యమగును ఐనను నిప్పట్టున నిది కావ్యమా- మహా కావ్యమా యను మీమాంస అప్రస్తుతము మొట్టమొదటి పద్యము మొదలు చిట్ట చివరి పద్యము దాక పట్టుదల వీడక తలస్పర్శి గానీ యారు కాండములు చదువగల యోపికకు నోచికొనిన సత్యవ్రతు డిందలి యదార్థమునకు ప్రమాణము కాదగును

ఈకవి నైకవిధ గ్రంథ పదార్థ నిర్మాణ శక్తి గలవాడు నైకవిధ రచనా ప్రక్రియా త్రివిక్రముడు. ఈ రెండు విశేషణములీకవి యెడ నన్వర్థములనుటకు సహృదయుడైన ప్రతి యొక్కడు ప్రమాణమే అన్నట్లు-సహృదయుడననేమి! హృదయముతో కూడిన వాడు సహృదయుడని యర్థము చెప్పవచ్చు. ఇది సామాన్యముగా నందరకు దెలియనైన యర్థము కానీ యాలంకారకులట్లు కాదు వారీ యర్థమును మెచ్చరు లౌకికములైన యర్థముల లౌకికత్వము. అపాదించి మసి పూసి మారెడు కాయ జేసిననే కాని వారికి నచ్చదు వారిట్లందురు. నిరంతరము కావ్యము పఠించుచు యుండుటచే మనస్సునందు సత్వ రజ స్తమో గుణమును తారతమ్యావస్థతో నియతములు, అందు కావ్యమృతా స్వాదానుభూత్యతిరేకము చేత రజస్తమములు సాదావస్థ నొంది సత్వము సమభి వ్యక్త ప్రసాదమై చిత్త నైర్మల్యము సంపాదించును. అట్టి మనస్సుకు కావ్యగత వర్ణనీయ రస భావాద్యం

శములతో తాదాత్మ్యము జెందునట్టి యోగ్యత కల్గును దీనిని హృదయ సంవాద మందురు. అనగా-కవి యొక్క హృదయముతో సంవాదము కల్గియుండుట కవి హృదయ స్థితి సమాన హృదయము కలవాడు సహృదయుడు ఇది అభినవ గుప్తుని యుదార్థము

ఆ సహృదయున కేమి కావలయును హృదయ సంవాదము కావలయును దానివలన తన్మయీ భావము కల్గును కావ్యగత విభావానుభావాది సామగ్రి సామరస్య సముల్లాసము వలన ఆస్వాద్యమైన భావము స్థాయిత్వము నంది రసాపర పర్యాయమై ఆతని హృదయము నాని కొనును ఆతడు రసానందమగును కానీ యీ రసానందము బ్రహ్మానందము వలె శాశ్వతము కాదు సహకారి కారణ విరళీ భావమున విక్షేపము నందును, అక్షణమునందు, భావము స్థాయిత్వమును వీడి భావమాత్రమై, తత్కారిణములైన విభావాదుల యందు పరిక్షిప్తమై మనః ప్రత్య క్షీకృతి తత్తదనుభూతి సాధారణీకరణము వలన నశ్రు శైత్య స్వర్య రోమాంచాదుల కలిగించును సహృదయుని యవస్థ అట్టిది ఇట్టి సహృదయు లెందరో యీ ప్రబంధము నాస్వాదించి రసత్వము గాంచిరి కావున నిది మహాకావ్యము ఈకవి విశ్వనాథ మహాకవి

ఈయన యెన్నో గ్రంథములు రచించెను ఎన్నో కథలు వ్రాసెను నవలలు వ్రాసెను ఈతని సాహిత్యోద్యాన మనంతము ఈ సాహిత్య నందనమున కల్పవృక్షమీ కల్పవృక్షము. దీనికి కల్పవృక్షమని యేల పేరు పెట్టెను ఇది యొక విలక్షణమైన యూహ. సాహిత్య ఉద్యానమైన గ్రంథములు వృక్షములు, లతలు, గుల్మము అనుటలో నాశ్చర్యమేమున్నది? యని కొందరన వచ్చును కాని యాపాటి సాధారణీ భావమునకు సరి పుచ్చుకొను వాడు కాడీ కవి లేకున్న-కావ్య ప్రయోజనములలో నేది కావలయు నన్న నద్దాని నీ పొత్త మొసంగ గలదందుమా. అంతమాత్రమునకి

పేరు పెట్టువాడు కాడీ కవి. పోనీ-యందలి విషయము రామచంద్రుని చారిత్రము పాపనాశనము గావున నేతత్సుస్తకాను శీలనమున నితు కావ్యానందముతో పాటు గ్రుక్కెడు పుణ్యముకూడ దక్కి స్వర్గమో వైకుంఠమో లభించును గావున నైహికాముష్మిక ఫలముల నొసంగుటచే దీని కీపేరు సముచితమందుమా - ఈకల్పనము కూడ నల్పముగనే యనిపించును కావుననే దీనిని విలక్షణమైన యూహ యంటిమి

అసలీ కవి రామాయణమునే యేల నిబంధింప నెంచెనో యించుక పరిశీలింపవలసి యున్నది అదేసీత, అదేరాముడు అదే కథ ఎందరు వ్రాసినను అవియే సన్నివేశములు ఎంతటి పౌనరుక్త్యము ఐననేమి కవులందరు నటే పోవుచున్నారు.

"యది క్షుణ్ణం పూర్వై రితి జహాతి రామస్య చరితం
గుణై రేతావ ద్భిర్జగతి పునరన్యో త జయతి కః"

అని జయదేవుడు నిష్కర్షగా చెప్పినాడు కొందరు విమర్శకు ఈ సందర్భమున నిట్లనిరి.

కవిత్వమున వర్ణనీయాంశములు సాధారణ రూపముతో వాచ్యములగునే కాని, విశేషరూపముతో కాదు సాధారణ రూపమనగా లోకమున మన మనుభవించునట్టి స్థితి విశేష రూపమనగా మన మనస్సున నూహారూపమున సృష్టించుకొన్న అలౌకిక స్థితి. అనగా నెంతమంది రామచంద్రాదులను వర్ణించినను, తత్సాధారణ రూపానుభవమే పాఠకునకు కల్గును. అట్లే కవులు తమ జీవితమున తాము ప్రత్యక్షముగా ననుభవించిన సుఖములుగాని, దుఃఖములుగాని, తన్నిమిత్తములుకాని, భావ సాధారణ్యమున గ్రహించి - తదనుభూత సుఖ దుఃఖ తన్నిమిత్తముల యెడ నాయా స్వరూపముల నారోపించి-

యా సామాన్యమునే కావ్యములలో నిబంధించుచున్నారు. అంతేకాని కవులకు నతీతానాగత విశేషములు, పరలోకాది వృత్తాంతములు, పర చిత్తగత విషయములు మొదలగునవి గోచరములు కావు కదా. కావున లోకమున నెప్పటి నుండియో ఈశ్వర సృష్టియందొకానొక సంకేతము కలదు. ఈ వస్తు విట్లుండును ఈ పదార్థమిట్లు ఈ భావ మిట్టిది, దీని యనుభూతి యిట్టిది. ఇట్టి విషయిజ్ఞానము సర్వ సాధారణము సర్వప్రతిపత్తి సమానము. కావున అనుభవింపబడు వస్తు ధర్మము, అనుభవించు మనో ధర్మము ఈ రెంటి సంబంధము— అను నీ మూడంశములు సాధారణములై — ఏనాడో పూర్వులచే వర్ణింప బడినవి అందువలన నేడు ఎవనికైన నట్టిది క్రొత్తగా తోచి నట్లున్నచో నది భ్రాంతియేకాని వేరొండుకాదు, అని వీరి వాదము. అయితే రచనా విన్యాసముల నందలి భిన్నత్వమును మాత్రము వీరు కాదనలేదు వీరి యాయువు పట్టిక్కడ దొరికినది.

మరియు వీరొకే వస్తువును పదిమంది కవులు దేశకాల దశోపాధి భేదోల్లేఖమున పది విధముల-గా పదిరకముల వాక్య విన్యాసములతో వర్ణించినను, పునరుక్త మనియే యందురా? అయిన కాదందు ఈ ప్రపంచమున నందరు రోజూ తినుచున్న యన్నమునే తినుట కదా— అంశ మొక్కటే అయినను— దీని పౌనరుక్త్యము పోరక గతమున నొకవైపు. కవి గతమున వేరొక వైపు దూసుకొని పోవుచున్నది మనము ప్రతిరోజు తిన్న అన్నమునే తినుచున్నాము ఇచట అన్నము తినుట ప్రతంరోజూ జరుగుచున్నను, ఆహార విధమొకటియే యైనను వస్తువు మాత్ర మెప్పటిదప్పటిదే అట్లే—యొకరి రామాయణము చదివినను, మరల వేరొకరి రామాయణమును కూడ చదవ వచ్చునట్లు అట్లే— ఈ కవియు వ్రాసిన రామాయణముతో మరల వ్రాయుచున్నాడు ఇచ్చటనొక విప్రతిపత్తి వచ్చును, కవులలో కొందరు రామాయణములను రచించిరి తదనంతర నికవియు రచించను ఈ కవి యీ కావ్యము నింతకు పూర్వము రచింపలేదు ఈ కవి రచనా వ్యాసర

గమున ఈ రామాయణమే మొదటిది, చివరదియు. కావున యిక రోజూ తినుచున్న అన్నమే తినుట లేదా — అనునది కవి పరముగా కుదురదు. పాఠక పరముగా సమన్వయము చేసికొనవలసి యున్నది.

ఎవరిరుచివారిది రుచికోసము కాకున్నను బ్రతుకుట కోసమైనను, అన్నము తినవలసినదే కాని, బ్రతుకుటకోసము కావ్యము చదువనవసరము లేదుకదా కావ్యము నేల చదువ వలయును, రసానందానుభూతి కొరకు అయిన వాల్మీకి రామాయణము వలననే రసానందానుభూతి కవి పాఠకులకు కల్గుచుండగా — మరల నిదేల రామాయణంబన్నచో ఈ లోకమున నెదుటివాడు పెండ్లిచేసి కొనెను చాలు పొమ్మని, తాను పెండ్లిచేసికొనుట నవసరమైన మాను చుండెనా. చేసికొనెనుగాక ఒకడు రెండు మార్గగ నామొవద్ద సుఖిం చిన పిదప నిదురయే శరీర మిదియే సుఖముగదా — పునరుక్తము కాదా యని ఆ జోలికి పోకపోవుచుండెనా లేదే — పదేపదే చేసిన సంసా రమే చేయుచుండెను తన మనస్సునకొక అనుభవము కలగ వల యును దానికి కారణము కూడ తానే కావలయును. ఆ అనుభవము యథాతథముగ భావకాశముగ తనచే ననుభూతము కావలయును. అట్లే యొకటి నదె రామాయణములు వ్రాసినను, తత్తదంశ స్వయం భావనమున గల్గు రసానుభూతి కొరకై ఈకవి ఈ కావ్యమును రచిం చెను కాని పాఠక పరముగా నింకొక పేచీ యున్నది ఎవరి సంసా రము వారిది ఎవరి అనుభూతి వారిది. ఒకరి సంసారము గురించి మరొకరాలోచింప పనిలేదు కాని యిచట నందరు నొకే విషయమున నొకే అనుభూతి సామాన్యమును పొందవలసి యున్నది. కావున నిందు పౌనరుక్త్యము తప్పదు గావున — మరల నిదేల రామాయణం అన్నచో — తలచిన రామునే తలచెద నేనును అందరకు నొకే విధ మయిన మనస్సంస్కారము కల్గుట అబ్బురము. ఎవరి ప్రతిపత్తి వారిది ఒకరు రామసాంప్రసి జపింతురు ఒకరు శ్రీరామ భజన చేయుదురు. ఒకరు రామలీలలను గానము చేయుదురు ఒకరు

మనస్సులోనే స్మరింతురు అట్లే ఈ కవియు నీ కవికి తోచిన రీతిన రాముని దలచును గాక ఈతని భక్తి యీతనిది కానీ యీ తలచుట మనస్సుతో నాగిపోలేదు. వాగ్వ్యాపారమున పర్యవసించినది కావు ననే - నాభక్తి రచనలు నావిగాన - అనుట జరిగినది వస్తు వొక్కటే అయినను, రచనా విన్యాసమున భేదమున్నది గావున నిందు పౌన లేదనవచ్చును

అసలు పునరుక్తి యనగేమి? చెప్పినదే మరల చెప్పుట. ఇది శబ్ద గతముగనో అర్థగతముగనో యుండును. వస్తు గతముగ నుండదు అట్లు కానిచో - సామాన్యవస్తువు వాల్మీకిచే నుప వర్ణితమైనది కావున నా ఆసెకవి తరువాత రామాయణము లన్నియు ఉపాదేయములగును ఉక్తి వైచిత్ర్యము వలన నుపాదేయములు కావచ్చునందురా? - ఉక్తి యనగా - వాచ్య విశేషమును ప్రతిపాదించు వాక్యము - ఇందు వైచిత్రి కల్గినచో - వాచ్యమున వైచిత్రి కల్గకుండునా వాచ్యవాచకములు కవినాభావసంబధము కదా. కావ్యము నందు వాచ్యములగు విషయములు లౌకిక భేద ప్రతి పత్తిచే పాఠకునిచే నాస్వాదింప బడుటలో నెట్టి ఆయాసము నుండబోదు కావున ఉక్తి వైచిత్ర్యము నంగీకరించినచో వాచ్య విశేషాంగీకారము కాదన్నను. అంగీకరించి నట్లే యగును అంతియ కాదు ఈ ఉక్తి వైచిత్ర్యము వలననే కావ్యము క్రొత్త క్రొత్త రూపములను సంతరించు కొనును. అనగా పునరుక్తము కానే కాదన్న మాట అందులకే ఈ విషయ మంతయు నెత్తు గీతిలో పరామర్శింపబడినది ఏతద్వైచిత్రీ కారణములైన కావ్య గతములగు పెక్కు అంశములలో తొంబదివంతులు కవి ప్రతిభ నాశ్రయించి యుండును. వ్యుత్పత్త్యభ్యాస పురస్కృతయగు ప్రతిభ నవ నవోన్మేషయై కావ్యగత సర్వాంశములను నిత్య నూతనముల నొనర్చి తీర్చిదిద్దును గాన ఎన్ని రామాయణములున్నను, నీ రామాయణము నందలి ప్రత్న విశేషానుసంధానము కొరకిది యవశ్యము ఉపాదేయమైయున్నది పోనీ కథాంశము సాధారణమేకదా యందురా

యందును తత్తత్సన్నివేశ సంధానమున నవత్వము కూర్పబడును ఐనను, వాచ్యమగు కథకంటె యభివ్యజ్యమానమగు రసము సహస్ర గుణము లధికమని ప్రాగ్విపశ్చిన్మతము ఈ రసధ్వని యీ కావ్యమున ప్రధానము. ధ్వని ప్రస్థాన కర్తియగు ఆనంద వర్ధనుడు తన ధ్వన్యాలోకమనకు మూక్తాయింపు నిచ్చుచు,-

"కావ్యాఖ్యేఽఖిల సౌఖ్య ధామ్ని విబుధో ధ్యానే ధ్వనిర్దర్శితః
సోఽయం కల్ప తరూపమాన మహిమా భోగ్యోస్తు భవ్యాత్మనాం"

అని ధ్వనిని కల్పవృక్షముతో పోల్చెను. ఇంతలో తరచి చూడ నీ కవి తన కావ్యము ధ్వని ప్రధానమని ధ్వనింప జేయుటకే కల్ప వృక్షమని నామకరణ మొనర్చెననిపించును అనుకరరణ నాత్మకము ధ్వని యని అభిప్రాయము. దీని ప్రాధాన్యమును సూచించుటకే నేమో- ధనుర్ధ్వని వర్ణన మంతగా చేయబడినది. అందులకే యిది యొక విలక్షణమైన యూహ యంటిమి

గ్రంథ రచనా సముద్దేశమున నీ కవి "వ్రాసిన రామచంద్రు కథ వ్రాసితి నంచపించుకో వ్యథాయానము కాక కట్టుకత లైహికమా యటంచు దాజేసిన తండ్రి యాజ్ఞయును, జీవుని వేదన రెండు నేకమై నా సకలేహ వైభవ సనాథముగా రఘునాథ కథ రచింతునని ప్రకటించెను ఇందు జీవుని వేదన యించుక యావిష్కృతమైనది. గ్రంథావతారికలోని యిష్టదేవతా ప్రార్థనమున గల మూడు పద్యములలో విశేష్యస్థానము నలంకరించిన వెలుంగు అను పద మీకవి మనః పరిపాకమును, పరమేశ్వర పరిగత నిరంతర ధ్యాన ధారను సూచించును. మూడవ పద్యమునందలి పూర్వ పాద మిట్లున్నది

"కెరలి నన్నేమి మిగిల్చితి సంసామి, బిట్టునేనన్న దభిజ్ఞ కాక" ఇందు నన్ను, నేను - అను ద్వితీయా ప్రథమలకర్థము చెప్ప

వలసి వచ్చినచో నుపనిషత్తు లన్నియు జుట్టి రావలయును. ఇక్క డనే యెత్తు గీతిలో - "స్వామి నీదు పారమ్యంబు బడయజాల దఖిల విశ్వంబు దాను నీవయ్యు గూడ స్వసంవేదనని జీవవేదనయు వ్యక్తమగుచున్నది. కథా ప్రారంభమున గల సీసము వేదాంతసార సంవాద మనదగును ఇవి యన్నియు నెందుల కనగా - నీ కవి యేతత్కావ్య రచనానుసంధానమున బ్రహ్మ భూయము నెనసి, పున ర్జన్మ రహితముగా శాశ్వత కైవల్య పద ప్రాప్తి రూప పరమ ప్రయో జనము నుద్దేశించెనని చూపుటకే.

కవి తన కభిమతమగు విషయమును, తన ఆవేదనను, తన గ్రంథమున నచ్చటచట యుల్లేఖించును ఈ కవియు నీ రామా యణ కల్పవృక్షమున అవకాశము కల్గిన పట్టులనెల్ల సగుణ నిర్గుణ తత్త్వముల నుప బృంహణము చేయుట చూడవచ్చును

మీాదు మిక్కిల - ఖండాంత -ద్యము లలో -

"నిశ్చల తమమైన నీదు పదసారస భక్తి నొసంగవే శివా"
"పూర్వపు పున్నెమాగువో। స్ఫురణఘటిల్లు భావన విశుద్ధము
త్వద్గత భావమీశ్వరా"
"మోహ కోప కామాదులచేత గట్టుపడు నట్టుల చేయకువే మనః పతీ"

"హాళి జరించు గావ్య రచనాత్త యశః కృత నాక సౌఖ్య వాం
ఛలు నిత్యంపుటాత్మయె పొసంగదు నాదెస - బొందుగాక ము
క్త్యాల ధరాధి నాయకుడదంతయు - నా తపమెల్ల బడి యు
ద్వేల జనూరు జాలితలి విచ్చెదు నట్టు లనుగ్రహింపవే"

మొదలుగా నెన్నియో పద్యములలో నీ కవి జీవునివేదన పరిపాక స్ఫుటమైనది పరమ శివ భక్తాగ్రగణి, విశ్వనాథ వంశాబ్ధి శశియనగు శోభనాద్రి తపః ఫలముగా జన్మించి పరమ భక్తాగ్ర

గణ్యుడైన యీ కవి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి శిష్యుడైన కతమున సత్కవినై మెలంగితినని గురుభక్తిని వెల్లడించెను ఈ గురుప్రశంసలో మొదటి రెండు పద్యముల తీరు వేరు. కడమ రెండు పద్యముల యొడుపు వేరు అందును రెండవ పద్యము సరేసరి మదుపజ్ఞము, మాదృశుడనక - యస్మదుపజ్ఞ మస్మాదృశు డనుటలో తాను సామగ్రీ పురస్కృత కవితా ప్రతానమున గురుసు నంతటి వాడనన్న యాత్మ విశ్వాసము, ధీమా - కొట్టు వచ్చినట్లున్నవి సీసము నందలి విశేషణములలోని గుణ విశేషములను తానే పుణికి పుచ్చుకొంటినన్న అహంకారము స్పష్టము అలఘు స్వాదురసావతార ధిషణా అహంకార సంభారములు, సమధి గమ్యత్వ - అప్రధృష్యత్వ కారణములై యీ బ్రాహ్మీమయుని బ్రాహ్మీమాలను మూర్ధి నొనర్చినవి

పాలితానోన్నత్య లంఘన స్పర్ధనములు, చాలితా నోన్నత సౌందర్య సరసములునగు పలుకుల కులుకులతో పులకరించిన ఈకవిని నన్నయ తిక్కన లావేశించిరట ఆకవుల యెడ నాత్మీయత అట్టిది. కాదుకాదు వారలు పోయిన తెన్నున. మెరుగులను తీర్చి దిద్దు కొన్నదు గోపనట్లు-ఇట్టిది "దీపి తాలాతము వోలె సుతయు విలంబన మోర్వదు సత్యదేగి నాచేతము శబ్దమేగటుకు చిన్నము నోర్వదు భావ తీవ్రతన్" - ఈమాట "ఋషీణాం పునరాద్యానం వాచ మర్థోనుధావతి" ని తలపించుచున్నది "అతడు వేన్ కాదిది", "మరియా తనితో నాతో సాగిన కావ్యము, వంటి వాక్య విన్యాసవైఖరీ ప్రక్రియలు ఇక చెల్లవనిపించును. ఈతని మనస్సంస్కార స్వభావములు, వ్యక్తిత్వ వైఖరులు నీతని కావ్యమున దర్శన మిచ్చుచున్నవి ఈ కావ్యము నందలి రసాలంకారాదులు పరిశీలించుట గాని, పాత్ర సన్నివేశాదులు పరామర్శించుటగాని ప్రస్తుతమున నప్రస్తుతమగుట చేసి ఈ కవిత్వమును కవితా తత్త్వము నందందు స్థాలీపులాకముగ నొత్తిచూపిన ప్రకృతాంశము చరితార్థమగును,

ఈ కవి తెనుగు కవి తెనుగు మీద నెంతో యిష్టముగల కవి. తెనుగు నుడికారపు శిల్పమునకు తోటయగు తిక్కన నభిమానించి యావేశింప జేసికొనెను తెనుగు తీయందనములను. తెనుగు నుడి కారపు నింపు సొంపులను చేతకు వచ్చినట్లు వెదజల్లెను సంస్కృతమున లేదనికాదు. సంస్కృత మెత్తుకొనిన దానికదే-భాషా నుభవ పరిపాక స్వరూపంబు, కరిన స్తనోపరి గ్రైవేయ మణికాంతి -గానుండును.

భాష యనగా ప్రధానముగా రెండు రూపములు కల్గియుం డును. జనసామాన్య వ్యవహార సమాదృతమగు రూపము ప్రబంధ రచనా సమను గృహీతమగురూపము. ఇందు రెండువది భాషా సూక్ష్మరూపము సాధారణముగా కవులీ రెండవ దాని నాశ్రయించు డయే సులభము, సుకరము. మొదటిది స్థూలరూపము ఈ భాషా రూప మున, దేశ్యములు, జాతీయములు, మాండలికములు, నానుడులు, సామెతలు, ఆయాప్రజల ఆయాజాతుల జీవ లక్షణములు పట్టి యిచ్చు గొప్ప లక్షణములు కలవు. ఇట్టి భాషను_సంప్రదాయ భం గము లేకుండ, గ్రామ్యదోషము రాకుండ, ఔచిత్యము సెడకుండ, కథాగతి కుంటుపడకుండ, మీదు మిక్కిలి పాఠకున కిదేదో పాషాణ పాకము గాకాక, ఇది మన భాష, మన తెనుగుభాష, మన తెనుగు వారిట్లు పలకరించుకొనినభాష మన జానపదుల వాడుకలో పొడిమి గొన్న భాష - అనిపించి గుండెల లోతులలోనికి ప్రవహించి ఆహా యనిపించునట్లు ప్రబంధమున నిబంధించుట సామాన్యమైన విష యము కాదు తెలుగువారి ఆచారములు వ్యవహారములు, మర్యా దలు మన్ననలు, పెండ్లిండ్లు పేరంటములు, పురుళ్ళు పుణ్యములు, భోజనములు వాయనములు, పంతములు పట్టింపులు, పరిహాసములు, సందర్భములు సంప్రదాయములు నొకటేమిటి-యడుగడుగున దెను గుదనము హృదయంగమముగ బోషింపబడినది శాంతవచ్చిన చోటు లనెల్ల నొక్క తెనుగు అడపడుచు మన కనుల ముందుండును.

ముఖ్యముగ నింకొక విశేష మేమనగా — గ్రంథ రచనా ప్రయోగము నందు కూడ నెంతో వైశిష్ట్యము కలదు. సగరుని పుత్రులు భూమిని త్రవ్విన సందర్భమున-నాల్గు దిక్కుల యెడ నవే పద్యములు అనువదించుట, ధనుర్భంగ పద్యములను మరల అను గుణముగా నందందు గూర్చుట, మేనకా విశ్వామిత్ర సంభాషణములోని పద్య ములను సీతారాముల ముచ్చటలలో గరుతుకు దెచ్చుట- మొదలగు నల్లికలు ఈ కవి స్వైర కవితా విహార ధీరతకు సిరాజన మిచ్చును. ఊహా వైభవము ప్రతి వర్ణనమున నున్నది. ఇది భట్టు బాణుని దలపిం చును, ధారయు నట్టిదే సాధారణముగ కవులు నిఘంటువులలో నున్న పదములను, అందును ప్రసిద్ధములైన వానిని, కవి బాహుళ్య ప్రయుక్తములగు వానిని ప్రయోగింతురు. అప్రసిద్ధములనియో అప్ర యుక్తము లనియో కొన్ని పదములను ఆలంకారికులు అధిక్షేపింతురు. కానీ ఈ కవి భారవి వంటి పదముల నెన్నిటినో వెలుగులోనికి దెచ్చెను. సుషీమ, వివాదము, బాణధి, స్థండిలశాయి, దయప్రోతసి, క్షత్రబంధువు, షష్టిక్యము వంటి వెన్నెన్నో పదములు కల్పవృక్షమున వింత చివురుల సొగున చెలంగినవి

అంతియే కాక గరళము, గోవు, అగ్ని, సూర్యుడు-ఒక్కొక్క దానికి గొన్ని పర్యాయ పదములు కలవు ఈ కవి ఆయా సందర్భ ములలో నా పర్యాయ పదములన్నింటిని యథావకాశముగ ప్రయో గించును తలంటి పోసికొని - వంటి జాతీయములు జాను తెనుగులు నెన్నియో కలవు ఈ మహా కవయిత సాహితి విశ్వరూప మీ మహా దర్పణమున స్పష్టముగా సమభివ్యక్తము ఈ కవి తత్వమిట్టిది ఈ కవిత్వమిట్టిది దీని వైభవమిట్టిది. ఇది స్థాలీపులాకము మాత్రమే.

"జయన్తి తే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరాః"

○ ★ ○

# కల్పవృక్షము ద్వైతా ద్వైతోపనిషత్తు

మొవ్వ వృషాద్రిపతి

ధర్మార్థకామ మోక్షాలలో భారతీయులు తురీయ పురుషార్థానికిచ్చిన ప్రాముఖ్యం మిగిలిన వానికీయలే జీవితం ఏవిధంగా సాగినా చివరకు మోక్షాన్ని సాధించాలనేది భారతీయ లక్ష్యం ఈ లక్ష్య సాధనకు ఎన్నెన్నో మార్గాలు నిర్దేశింపబడినాయి వైదిక ధర్మ ప్రచారమే మన భారతీయ సాహిత్య లక్ష్యం అనటం సత్య దూరం కాదు సాహిత్యంతో భారతీయతత్త్వం, భారతీయ తత్త్వంతో సాహిత్యం అవినాభావ సంబంధంతో పరస్పరం అభివృద్ధిని సాధించాయి భారతీయులు, తమకు గర్వహేతువులుగా చెప్పుకొనే రామాయణ, భారత, భాగవతాలు తత్త్వపరంగానే సాగినాయి అయితే తద్గ్రంథ కర్తలైన మహర్షులు జీవిత మార్గాన్ని-ధ్యేయాన్ని-గమ్యాన్ని ధర్మ మార్గమిళితం చేశారు అందుకే భారతం పంచమ వేదమైంది వ్యాస ముని ప్రణీత భారతం ఇతిహాసం కాగా, ఆది గ్రంథం రామాయణం మహాకావ్యం వాల్మీకి రాముని ఆదర్శ ప్రాయుడైన మానవ శ్రేష్ఠునిగా దీర్చిదిద్దినా, అందులో పరతత్త్వాన్ని చూపించాడు ఇందులో ఆదర్శ ప్రాయమైన మానవ జీవిత పథాన్ని ధ్వనితం చేశాడు వ్యాస భగవానుడు

"మోక్షోహి పరమ శ్రేయః పురుషార్థ చతుష్టయే" చతుర్విధ పురుషార్థాలలో మోక్షం శ్రేష్ఠమైంది అని భీమునచే చెప్పించాడు

భగవంతుడు ధర్మశబ్ద వాచ్యుడు, "ఆచార ప్రభవో ధర్మః- ధర్మస్య ప్రభు రచ్యుతః" అని విష్ణు సహస్రనామ పీఠిక సాయిస్తున్నది ఇక్కడ ధర్మానికి కర్మరూప ఆచార లక్షణం ప్రవేశ పెట్టబడింది ధర్మం అచ్యుతాధీన, చ్యుతి రహితుడ చ్యుతుడు. కాబట్టి

ధర్మం చ్యుతి రహితం. అలాంటి ధర్మం తురీయ పురుషార్థమైన మోక్ష ప్రాప్తికి సాధనం "అథాతో ధర్మం వ్యాఖ్యాస్యే" అని సాయిస్తున్నది కణాద దర్శనం జ్ఞాన, కర్మయోగ మార్గాలు, ధర్మ శబ్ద వాచ్య భగవద్రూప మోక్షలబ్ధికి హేతువులు. ఇందులో భక్తి నవవిధాలుగా పేర్కొనబడింది

ధర్మం ప్రవృత్తి-నివృత్తి మార్గాలచే రెండు విధాలౌతున్నది ప్రవత్తి ధర్మం స్వర్గాది ఫల ప్రాప్తిని కలుగ జేస్తుంది అల్ప సుఖ సంధాయకాలైన ఐహికా ముష్మిక కర్మకాండను పరిత్యజించి, నివృత్తి పరమాత్మను సంధానం కలిగిస్తుంది.

"ప్రవృత్తి సంజ్ఞికే ధర్మే ఫల మభ్యుదయో మతః
నివృత్తి సంజ్ఞికే ధర్మే ఫలం నిశ్శ్రేయ సం మతమ్"

అనే శ్లోకం ఈ విషయాన్నే స్పష్టం చేస్తున్నది

ధర్మాన్ని పూర్తిగా బోధించేది - వేదం

"ప్రత్యక్షేణాను మిత్యావా యస్తూపాయోన బుధ్యతే
ఏతం విదన్తి వేదేన తస్మాద్వేదస్య వేదతా"

ప్రత్యక్షం చేత అనుమాన ప్రమాణం చేత బోధింపబడని ఉపాయం దేనిచేత ప్రవ్యక్తమౌతుందో అది వేదమని పైశ్లోకం తెలుపు తున్నది వేదాలపౌరుషేయాలని భారతీయుల విశ్వాసం "అస్య మహతో భూతస్య నిశ్వసిత మేతదృగ్వేదో మజుర్వేద స్సామవేదః" అనే వేద వాక్యాన్ని వారు తమ వాదానికి ఉపబలకంగా చూపిస్తున్నారు

వేదం కర్మభాగం- బ్రహ్మభాగమని రెండు విధాలు ఈ బ్రహ్మభాగమే జ్ఞానభాగం, దీనినే ఉపనిషత్తులు వేద శిఖలు

"ఇతిహాస పురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశ్యతే" వేదం యొక్క ఉత్తర భాగార్థం ఇతిహాస పురాణాలచే ప్రవ్యక్త మౌతున్నది.

వాల్మీకి మహర్షి వేదార్థాలను నిక్షేపించినా రామాయణాని కావ్యంగానే రూపు దిద్దారు.

"వేదవేద్యే పరో పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీద్ సాక్షాద్రామాయణాత్మనా"

వేద వీధీ విహారుడైన పరతత్త్వ పురుషుడు రాముడుగా ఉద్భవిస్తే, వేదం రామాయణ రూపాన్ని, సంతరించు కొన్నదట. తర్వాత ఎందరో కవులు రామాయణాన్ని తమ తమ భాషల్లోకి అనువదించు కొన్నారు అన్ని సాహితీ ప్రక్రియలలోకి ఒంచుకొన్నారు రాముని విష్ణు స్వరూపునిగా వాచ్యం చేశారు వాల్మీకి మహర్షి "రామోవిగ్రహవాన్ ధర్మః" అని ఘోషించిన శ్లోకపాదం కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ హృదయ సాగరంలో సుడులు తిరిగింది ఝుంఝూమారుతాన్ని రేపింది అల్లకల్లోలం చేసింది సమగ్ర విశ్వదర్శనం చేయించింది. విశ్వనాథ వైదిక ధర్మానికి ప్రతీక దానికి దెబ్బ తగిలితే బాణం ములికి సోకిన గువ్వలా ఆయన హృదయం విల విల లాడుతుంది విడిచి ఘోషిస్తుంది

మహాకవు లెందరో తమ సాహిత్యాన్ని సంస్కరణాయుధంగా మలచుకొన్నారు అస్తమిస్తున్న వైదిక ధర్మాన్ని నిలువరించాలి. భారతీయులకు వేదాలమీద, ఉపనిషత్తులమీద ఉన్న దృఢవిశ్వాసం కావ్య వాఙ్మయంలో లేదు. ప్రస్థానత్రయం భారతీయుల ఆధ్యాత్మిక భావనగా ఆధ్యాత్మిక జీవనంలో ప్రధాన భాగమైంది ప్రస్థాన త్రయంలో ఉపనిషత్తులు ప్రముఖ స్థాన మాక్రమిస్తున్నాయి ఉపనిషత్తులు తత్త్వ ప్రబోధకాలు రామాయణం, విశ్వనాథకు ద్వైతా ద్వైతోప నిషత్తుగా దర్శనమిచ్చింది 'రామ ఏవ పరబ్రహ్మ' అనే

సత్యం అనుభూతమైంది సర్వం రామమయం జగత్తుగా గోచరించింది. రాముడొక వ్యక్తి కాడు పురాణ పురుషుడు కాడు అది ఒక తత్త్వం. "యోగినాం హృదయేషు రమత ఇతి రామః" సమాధి కాలములో యోగుల హృదయాలలో ఏ తత్త్వం రమిస్తుందో అదే రామతత్త్వం.

'రమంతే యోగినో నంతే నిత్యానంద చిదాత్మని
ఇతి రామా పదేనా సౌ_పరంబ్రహ్మాభి ధీయతే"

యోగుల హృదయంలో ఏ సచ్చిదానంద స్వరూపం రమిస్తున్నదో ఆ తత్త్వం రామశబ్దంతో పరబ్రహ్మగా చెప్పబడుతుంది అనే భావం ఆయన మనోనేత్రం ముందు తాండవించింది

అందుకే విశ్వనాథ "సర్వ ధర్మమూల బీజంబుగ నవిచ్ఛిన్న సంప్రదాయార్థినై' రామాయణ రచనకు పూనుకొన్నానని చెప్పు కొన్నాడు

"కలిలో దైవము లేడు భూసురు లనంగా ద్వేషమై పోయె, నీ
తెలుగున్నాటు మరీ విచిత్రమయి పొందెన్"

అని చెప్పుకొన్నాడు ధర్మ శబ్దవాచ్య దైవాస్తిత్వానికి ఈ కలి కాలంలో విఘాతం కలిగింది

"పుడమిని ధర్మవుం గౌఅత షట్టని ఎన్ని దినాలు మోదువం
గడమున జేటులేదు" అని సుమంత్రునితో అనిపిస్తాడు విశ్వనాథ

ఈ పద్యం కేవలం దశరథునికే కాదు ఈ వాక్యం సార్వ కాలికం, సార్వ జనీనంగా మలచుకొన్నాడు దశరథుడు తన రాజ్యంలో 'ధర్మికాడెవ్వడ దాత యెవ్వడో'? వానిని శిక్షించాలని భావించాడట. అవకాశం వచ్చిన చోటల్లా, విశ్వనాథ ఈ విధముగా ధర్మ సంరక్షా పథంలో పయనిస్తాడు 'ధర్మోరక్షతి రక్షితః' అని ఎలుగెత్తి ఘోషిస్తాడు.

నన్నయ తిక్కనలు భారతాను వాదం చేశారు అది పంచమ వేదం వేదాలు ఎక్కువ భాగం కర్మ ప్రధానాలు తాను భక్తి జ్ఞాన

ప్రదమైన ద్వైతా ద్వైతోప నిషత్తు సృష్టించటానికి పూనుకొన్నాడు. అందుకే

'నన్నయ్యయు తిక్కన్నయు-నన్నావేశించిరి పరిణాహ మనస్సం „
ఛన్నత వారలుపోయిన-తెన్నున మెఱుగులను దీర్చి దిద్దుచు బోదున్'

అని చెప్పుకొన్నాడు ఆయన దృష్టిలో నన్నయ్య మహర్షి తిక్కన్న కవితాశిల్ప ఉపనిషదృషులు తమ శ్లోకాలను తొలుత కవులై తరువాత తత్త్వవేత్తలై సాయించారో, లేక తొలుత తత్త్వవేత్తలై తరువాత కవులై ప్రవచించారో చెప్పటం దుర్లభం వారి తత్త్వ ప్రదర్శనలో కవితాభావం - వేదాంత తత్త్వం నేనంటే నేనని అహమహమికతో మున్ముందుకు త్రో త్రోపులాడు కొంటాయి ఆ రెండు శక్తులూ తన నావేశించాయని విశ్వనాథ సాయించాడు 'మెఱుగు' అనే శబ్దం కాంతికి పర్యాయ పదం ఆ తేజస్సు భగవత్స్వరూపం నేను దర్శించిన తేజోరూపాన్ని తీర్చి దిద్దుతానని, విశ్వనాథ అభిప్రాయం వారిద్దరూ వేదం వ్రాశారు. దానిపై మెఱుగు ఉపనిషత్తు తానది వ్రాయబోతున్నానని ధ్వనితం చేశాడు

ఎందరో రామాయణం వ్రాశారు 'పాడిందే పాటరా పాచి పళ్ళదాసుడా!' అని మళ్ళీ ఎందుకీ రామాయణమంటే "నా భక్తి రచనలు నావి కాన" అని సామాన్య సమాధానం చెప్పాడు కాని అది కారణం కాదు

జాగ్రదవస్థ నేమియన స్వప్న సుషుప్తుల గూడ రామ నా
మ గ్రహణం బెనావయిన మానస జివ్వాలు సేయు, తత్కథా
ప్రగ్రహ కృష్టి సంశ్ల థధురా వశమై చను మన్మనోఽశ్వమెం
యుగుౠడ! నీవ సారథివి యూనుమ పగ్గములన్ గరంబులన్.

మోనవునకు జాగ్రిత్-సుషుప్తి-స్వప్నం అదే పరమాత్మ. అదే రామ తత్త్వమని కవి స్పష్టం చేస్తున్నారు

"ఆత్మానం రథినం విద్ధి – శరీరం రథమేవచ
బుద్ధింతు సారథిం విద్ధి – మనః ప్రగ్రహమేవచ"

మానవ శరీరం రథం. ఇంద్రియాలు గుఱ్ఱాలు మనస్సు పగ్గం బుద్ధి సారథి సారథి సరిగ్గా లేకపోతే గుఱ్ఱాలు బండెనే గోతిలో పడవేస్తాయి సారథి మరీ పగ్గాలను బిగించి పడితే బండి ముందుకు సాగదు కాబట్టి సారథిగా శివుని ఆహ్వానిస్తున్నాడు అంటే బుద్ధి శివస్వరూపం ఆ శివుడే రామతత్త్వం. అదే అద్వైతసిద్ధి ఆ సిద్ధి తేలికగా సిద్ధించేదికాదు ఎంతో వేదన-సంయమనం కావాలి

వ్రాసిన రామచంద్రు కథ వ్రాసితి నంచనిపించుకో వృథా
యానము గాక కట్టుకత వైహికమా? పరమా యటంచు దా
జేసిన తండ్రి యాజ్ఞయును, జీవునివేదన రెండు నేకమై
నా సకలోహ వైభవ సనాథము నాకు కథన్ రచించెదన్

ఇహ పరాలకు దూరమైన కవిత్వం వ్యర్థమని తండ్రి శాసనం తండ్రి అంటే విశ్వనాథ శివునితో "నీకు దండ్రికి భేదంబు లేకయున్న-పరమ నిశ్చల బుద్ధి నర్పణము సేత" అని అంటాడు నీకు అంటే విశ్వనాథుడైన శివునకు శివునకు తన తండ్రికి అభేదం అది పరతత్త్వం అదే నిశ్చలాభిప్రాయం ఆబుద్ధితోనే కావ్యం వ్రాస్తున్నాడు కాబట్టి తండ్రి ఆజ్ఞ అంటే విశ్వనాథ దృష్టితో పరతత్త్వ ఆజ్ఞ మరిమధ్యలో తానెవ్వడు? "ఆత్మావైపుత్ర నామాసి" అని వేదం చెబుతున్నది ఆ పరతత్త్వ స్వరూపమే తాను ఐనా మాయావరణం చేత తాను జీవుడు జీవత్వం తొలగటానికి వేదన అవసరం అందుకే తండ్రి ఆజ్ఞ జీవుని వేదన రెండూ ఏకమైనాయి ఇక్కడ, జీవు-నివేదన అనీ, జీవుని వేదన అనీ రెండు విధాల అన్వయం ఎంతో కాలంగా జనన మరణ రూప సంసారచక్రంలో భ్రమించిన జీవతత్త్వం, మాయాప్రవృత్తిని ఛేదించటానికి పొందేఘర్షణ వేదన పర

తత్త్వానికి విన్నవించి కోవటం నివేదన మొదటిది జ్ఞానం. రెండవది భక్తి మొదటిది నిర్గుణోపాసన రెండవది సగుణోపాసన ఏ మార్గం ద్వారా ఐనా సిద్ధిని పొందవచ్చు అందుకే, నా సకలోహ వైభవ సనాథము నాథ కథన్ రచించెదన్ అంటాడు. ఇక్కడ 'నా' అనేది 'నేను' అనే ప్రథమషష్ఠి నేను అనేదే అసలైన తత్త్వం నేను అనే దాని యొక ఊహ సనాథం అంటే రక్షకుడు కలిగినది అని అర్థం అంటే 'నేను' అనేది అపరిమితం అది వైయుక్తిక మైనప్పుడు రక్షకత్వం అవశ్యకం అది పోవటానికి అంటే పరిమితి తొలగి అనం తత్వం వ్యాపించటానికి నాథ కథ వ్రాస్తా నంటాడు న + అథ = 'నాథ' అథ అంటే అటుపిమ్మట 'న' అంటే అదిలేనిది నాథ అంటే అటుపిమ్మట కానిది అంటే అనాదియైనది అంటే రాముని అనంత తత్త్వం చెప్పబోతున్నానని విశ్వనాథ వివరించాడు

"వేద నీత్యుపని షత్స కలాగమ పారవేది భూ
పాలుని గుండియన్ నిలువ బట్టు దతృప్తి యొకండు దట్టమై"

వేద నీతుల కాలవాలమైన ఉపనిషత్తు తెలిసిన వానికి అతృప్తి యుండదని కవి భావన అందుకే యీ ఉపనిషత్తు పరిపూర్ణంగా తెలిసికొంటే మానవునకు అతృప్తి యుండదు అతృప్తిరాహిత్యం ఆనంద సంకేతం లోకమానందరూపంగా భాసించటానికే ఈ ఉపనిషద్రచన

ఉపనిషత్తు లెక్కువ భాగం జ్ఞాన ప్రబోధకాలు శ్వేతాశ్వతర-కలి సంతారణ వంటివి భక్తి ప్రబోధకాలు కూడా ఉన్నాయి ఏ విధంగానైనా తత్త్వ సిద్ధి లభిస్తుంది అందుకే అంటున్నారు విశ్వనాథ

"కాకుత్థ్సుడౌ స్వామి గా
థా సంపన్నము భక్తి దీర్చినను ద్వైతా ద్వైత మార్గంబునన్"

ఇందులో ద్వైతం భక్తి ప్రధానం అద్వైతం జ్ఞాన ప్రముఖం. ఏ విధముగానైనా ఒకటే అని విశ్వనాథ ముక్తాయింపు శైవంలో ద్వైతా

ద్వైత సిద్ధాంతం ఉంది. దీనినే భేదా భేదమని కూడా అంటారు. ఇది లౌకికంలో ద్వైతం. పారమార్థికంలో అద్వైతం ప్రబోధిస్తుంది ఈ భావం కూడా విశ్వనాథ సూచించాడు. ఈ గ్రంథాన్ని కూడా ద్వైతా ద్వైతంగా మలచుకొన్నాడు

కవులు తమ రచనా ప్రారంభంలో చేసే దైవ ప్రార్థనలో కావ్యేతి వృత్తాన్ని, సూచ్యం చేస్తారు రామాయణ కల్పవృక్ష రచనా ప్రారంభంలో విశ్వనాథ చేసిన ఇష్ట దేవతాస్తుతి, ఇది ఉపనిషత్తనే విషయం పట్టి యిస్తుంది

"శ్రీమంజూషిక భక్త రక్షణ కళాశ్రీ చుంచు, వానంద వ
ల్లీ మంజు ప్రసవంబు చిద్గగన ప్రాలేయాంశువున్ మోక్ష ల
క్ష్మీ మాణిక్య వినూత్న మేఖల కటాక్షీభూత నీహార రుక్
శ్రీమంతంబయి పొల్చు వెల్గు నొకడే సేవింతు విశ్వేశ్వరా"

సత్తు-చిత్తు-ఆనందము అనే మూడు తత్త్వాలు ఉపనిషద్విషయి గర్భితాలు సత్తు త్రికాలా బాధితం 'ఉన్నాడు' అనే వాక్యం మరణిస్తాడు అనే వాక్యార్థాన్ని అపేక్షిస్తుంది అంటే అది పరిమితాస్తిత్వం. 'వెలుగుచున్నాడు' అనే వాక్యంలోని వెలుగు నిత్యత్వం సూచిస్తుంది. అది అపరిమితాస్తిత్వం వెల్గునొకడే అన్న వాక్యానికి సత్తు సూచకం. చిద్గగనంలోని చిత్తు చైతన్యం అది అనంతం అందుకే అది గగనం. 'ఆకాశం గగనం శూన్యం' అది అపరిమితం గగనం విభూత్వ సూచకం చైతన్యం గగనం వలే అనంతం ప్రాలేయాంశువు చంద్రుడు. చంద్రుడు తేజస్సునకు, వృద్ధి క్షయాలకు సంకేతం ఇక్కడ చైతన్యాకాశంలో ప్రకాశించే తేజస్సు అనంతమైన రామతత్త్వం వృద్ధి క్షయాలు జీవలక్షణం అనంత గగనంలో వైయక్తిక తేజోరూపం చంద్రుడు. అనంతత్వంలోని అభివ్యక్త స్వరూపం జీవుడు జీవుడు చిదాభాసుడు చంద్రునకు స్వయం ప్రకాశంలేదు అలాగే జీవునకూలేదు

అంటే ఇక్కడ కవి రెండు రామతత్త్వాలను ప్రతిపాదిస్తున్నాడు. రాముని చిద్గగనంగా భావిస్తే అనంత పరిమాణత్వం - అనంతశక్తి మత్వంకల రామతత్త్వం అలా కాకుండా, గగనంలో చంద్రుని వలె రాముని ఒక పురాణ పురుషునిగా భావిస్తే జీవలక్షణం పొందిన రామ తత్త్వం అభివ్యక్తమౌతుంది అంటే అల్ప పరిమాణత్వం, అల్ప శక్తి మత్వం సిద్ధిస్తున్నాయి ఇక మూడవదియైన ఆనందం సుఖ దుఃఖా తీతం సుఖదుఃఖాలు విషయాధీనాలు ఆనందం విషయాతీతం 'ఆనందో బ్రహ్మ' అని వేదం ప్రకటిస్తున్నది ఆనంద స్వరూపం భగ వత్తత్త్వం అది నిత్యం ఆనందం లత దాని చివఉన్న మంజుల పుష్పం దివ్య పరమాత్మ తేజం అంటే ఈ పద్యం సత్యం-జ్ఞానమనం తం బ్రహ్మ అనే వేద వాక్యానికి వివరణ ప్రాయం

అద్వైతంలో భక్తి ఉన్నా అది జ్ఞాన ప్రధానం అలాగే ద్వైతంలో జ్ఞానమార్గం ఉన్నా అది భక్తి ప్రధానం 'భక్త రక్షణ కళా శ్రీచుంచు' వనటంలో నిరాకారునకు రూపకల్పన-గుణాతీతునకు గుణ కల్పన చేయబడింది కేవలం జ్ఞానమార్గంతోనే కాకుండ భక్తిమార్గంతో కూడా మోక్షం పొందవచ్చునని కవి ఆశయం. ఈ పద్యంలోనే విశ్వనాథ ఉపనిషద్భావాలను విశ్వనాథ బీజప్రాయంగా నాటాడు రాముని ద్వైతా ద్వైత రూపం ప్రదర్శింప బడింది

"ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిష స్వజాతే
తయోరేకం పిప్పలం స్వాద్వత్తి — అనశ్నన్నన్యో అభిచాకశీతి"

అనే ఉపనిషద్భావం ఇందులో గోచరిస్తుంది అసలు సచ్చిదానంద స్వరూపం రామతత్త్వం ఈ కావ్య గత రాముడు జీవత్వం పొందిన జీవలక్షణ ప్రతీక

వాల్మీకి రామాయణం "తపస్స్వాధ్యాయ నిరతం - తపస్వీ వాగ్విదాం వరం" అనే శ్లోకంతో ప్రారంభ మౌతుంది తరువాత

ఎందఱు కవులు దాని ననుసరించినా-కావ్యత్వం చెడకుండా జాగ్రత్త పడ్డారు అలాగే ప్రారంభించారు

కాని విశ్వనాథ తొలిపద్యాన్ని తత్త్వభావంతో ప్రారంభించాడు ఈ పద్యమే విశ్వనాథ ఈ కావ్యాన్ని ఉపనిషత్తుగా మలచటానికి ప్రయత్నించాడనే భావాన్ని పట్టిస్తుంది

ఆత్మ నిత్య మ్మకాలాద్యవచ్ఛిన్నమ్ము
సచ్చిదానంద సంపచ్ఛ్రయమ్ము
అద్వితీయ మ్మేక మపరిణామ ప్రాప్త
మపరిమేయమ్మది యచ్ఛ తెలివి
అట్టి జ్ఞానముతోడ నైక కాలికముగా
ఆది మునుల్ గలరా ప్రభుపులు
యోగనిద్రా ముద్ర నూని తామేయ దై
యదియతాన్మై యుందు రమృతకళలు

ఆత్మతో నాది ముసు లెట్టు లవనితోడ
నాది నృపులైక కాలికులై చరింత్రు
ఆ నృపులయందు నిక్ష్వాకువంబు జాప్తు
మనుమడొప్పు నైవ స్వత మనువు కొడుకు

ఆత్మ నిత్యం అది పరమాత్మ సంజ్ఞకం ఉపాధి సహితమైనపు డది పరిమితాత్మ ఉపాధి రాహిత్యం అపరిమితాత్మత్వం అంటే అది అపరిమిత-పరిమితరూప-లక్షణ సహితమై ఉంటుందేకాని, దానికి వినాశంలేదు ఆత్మ 'అకాలాద్యవచ్ఛిన్న'మని విశ్వనాథ అంటే కాలాదులు కాని వానితో కూడింది అనే భావం వస్తుంది ఆత్మకాలాద్యనవచ్ఛిన్నమని పూర్వఋషుల అభిభాషణ

దిక్కాలాద్యనవచ్ఛిన్న అనంత చిన్మాత్ర మూర్తయే
స్వానుభూత్యైక మానాయ నమశ్శాంతాయ తేజసే

కాలాద్యనవచ్ఛిన్న మంటే కాలాదులు దేనితోను కూడనిదని భావం.

పర్యుదాస స్సవిజ్ఞేయ యత్ర ఉత్తర పదేన నఞ్
ప్రసజ్య ప్రతిషేధోఽసౌక్రియయా సహయత్ర నఞ్

ఉత్తరపదంతో నఞ్ అన్వయిస్తే అది పర్యుదాసం క్రియతో అన్వయిస్తే అది ప్రసజ్య ప్రతిషేధం "న బ్రాహ్మణ మానయ"-'అబ్రాహ్మణ మానయి' అనే వాక్యాలలో 'బ్రాహ్మణం వ ఆనయ' బ్రాహ్మణుని పిలువవద్దు ఇందులో మరి యొకరిని పిలువు మనే నిర్దేశం లేదు రెండవ దానిలో బ్రాహ్మణుడు కాని వానిని పిలువు అనే అర్థం వుంది అవచ్ఛేదకం ధర్మనాచకం అవచ్ఛిన్నం ధర్మివాచకం అంటే ఇతర వస్తువుల నుండి దానిని వేరు చేయు ధర్మం అవచ్ఛేదకం, ఘటత్వం ఇతర వస్తువుల నుండి ఘటాని వేరుచేస్తుంది కాబట్టి ఘటాత్వా వచ్ఛినం ఘటం కాబట్టి అకాలాద్య వచ్ఛిన్నంబు, అనే వాక్యానికి కాలాదులు కాని వాటితో కూడిదని అర్థం వస్తుంది అంటే పరమాత్మకు పరిమి తత్త్వం కలిగింది

దిక్కాలా ద్యవచ్ఛిన్నంగా పరమాత్మ చెప్పబడింది మరి విశ్వనాథ విశేషణం పరమాత్మ లక్షణానికి వ్యతిరేకంగా భాసించటం లేదా? అని ప్రశ్న కాని ఇక్కడ విశ్వనాథ ఉద్దేశ్యం వేరు, పై ప్రార్థనా పద్యంలోనే అవిషయం మనవి చేశాను ఇందు మొదటి నిత్యం అనే విశేషణంతో విశ్వనాథ అనంత పరమాత్మ తత్త్వం వ్యక్తం చేశాడు రెండవ విశేషణంలో ఉపాధి సహిత పరమాత్మను ప్రస్తావిస్తున్నాడు. ఒక భక్తుడు "శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం సీతాపతిం రఘుకులాన్వయ రత్న దీపం" అని కీర్తిస్తే గుణ సహిత జీవలక్షణం పొందిన రాముడు వ్యక్తమౌతున్నాడు. అనగా తొలుతటిది నిర్గుణ స్వరూపం కాగా, రెండవది గుణ స్వరూపం ఇందులో ముందు అద్వైతం, తర్వాత ద్వైతం మనస్సులో అద్వైతం ఉండాలి కర్మ ద్వైత రూపంలో సాగాలని విశ్వనాథ నిర్ణయం అదే శంకరుడు

"కర్మాద్వైతం న కర్తవ్యం - భావాద్వైతం సదాకురు" అనే వాక్యంలో ప్రతిపాదించారు.

ఆత్మ సచ్చిదానంద లక్షణ సహితం "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్' ఈ జగత్తు సృష్టియందు సత్తుగా ఉన్నది అంటే బ్రహ్మ తత్త్వం ఒక్కటే ఉన్నదని అర్థం. "అసద్వా ఇదమేక ఏవాగ్రఆసీత్" ఈ జగత్తు సృష్టికి ఆదియందు అసత్తుగా ఉన్నది. అంటే నామం - రూపం భోగం అనే వాటికి అనర్హమైన బ్రహ్మవ్యాప్తమై ఉన్నది "బ్రహ్మవా ఇదమేక ఏవాగ్ర అసీత్" ఈ జగత్తు సృష్ట్యాదిలో బ్రహ్మం మాత్రం ఉన్నది ఈ శ్రుతివాక్యాలు, సత్ లోనే చిత్తు - ఆనందం ఇమిడి ఉన్నాయనే విషయం వ్యక్తం చేస్తున్నాయి జగత్సం బంధ విషయాతీత మానందం అదే బ్రహ్మ స్వరూపం అది కేవలం స్వానుభవైకవేద్యం, దీనినే శ్రుతి "యత్తత్కారణ మవ్యక్తం నిత్యం- సద సదాత్మకం, తద్విసృష్ట స్స పురుషో ల కే బ్రహ్మేతి కీర్త్యతే" అని వ్యక్తం చేస్తున్నది

'అద్వితీయం' రెండవది లేనిది 'ఏకం సద్విప్రా బహు దా వదంతి' 'ఏకమేవ సత్ విప్రాః బహు ధా వదంతి' అనే శృతి వాక్యానుసారం ఒకే సత్తును విప్రులనేక విధాలుగా చెబుతున్నారు "ఏకోహవై నారాయణ ఆసీత్ న బ్రహ్మనే శానః" అని శృతి వచి స్తున్నది దీనినే కృష్ణదేవరాయలా ముక్తంలో మనోజ్ఞంగా వర్ణించాడు

ఆదినారాయణుం డాయె నొక్కడ బ్రహ్మ
లేడు మహేశుండు లేడు, లేడు
రోదసి వేడు సూర్యుడులేడు చంద్రుండు
లేపు నక్షత్రముల్ లేవు నీళ్ళు
లేదగ్ని యట్లుండ లిల నేకాకిత
చనదు పెక్కయ్యెద ననుచు నయ్యె
చిద చిద్ద్వయంబు నొచ్చియని ఛాందోగ్యంబు
తెలిపెడు నంతరాదిత్య విద్య

ఇదే భావం విష్ణు సహస్రనామస్తోత్రం "ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః అని ప్రవచిస్తున్నది.

'ఏకం' అనేది ఆత్మకు విలక్షణ విశేషణంగా విశ్వనాథ వాడాడు అద్వైతంలో పరమాత్మ కేకత్వం చెప్పకూడదు చెబితే పరమాత్మ సంఖ్యాధీను డౌతాడు అందుకే శంకరుడు 'అద్వైతం' అని పేర్కొన్నది బ్రహ్మ సాక్షాత్కారాన్ని బ్రహ్మ ప్రత్యక్షమవడు. ప్రత్యక్షానికి వ్యతిరేకం పరోక్షం దానికి వ్యతిరేకం అపరోక్షం ప్రత్యక్షమంటే 'చూచువాడు చూడబడువాడు' రెండు వస్తువులుంటాయి అందుకే శంకరుడు 'అపరోక్షానుభూతి' అన్నాడు

జ్ఞాత - జ్ఞేయము - జ్ఞానము - ద్రష్ట - దృశ్యము - దర్శనము - సాక్షాత్కారంలో ఈ త్రిపుటి అంతరించి అద్వైత భావ మేర్పడుతుంది ప్రత్యక్షంలో ఇవన్నీ వేరు వేరుగా ఉంటాయి. మరి 'ఏకం' అనటంలో రహస్యమేమిటని ఆలోచిస్తే రాముని జీవత్వ సూచకంగా చెప్పుకోవాలి 'అద్వితీయం' అనే విశేషణంతో అనంత రామ తత్త్వాన్ని — 'ఏకం'తో మానవుడై పుట్టిన రామతత్త్వాన్ని పేర్కొనట్లు భావించవచ్చు అయితే ఈ అనంతంలోనే అపరిమితత్వం అణగి పోతుంది. ఈ అద్వితీయ మనే విశేషణంలో, 'ఏకం' అణగిపోతుంది

'అపరిణామ ప్రాప్తము' ఇది పరబ్రహ్మ కింకొక లక్షణం లోకంలో సాకార వస్తువుకు ఆరువిధాలైన వికారాలుంటాయి 1 అస్తిత్వం 2 ఉత్పత్తి 3 వృద్ధి 4 పరిణామం 5 అపక్షయం 6 వినాశం ఈ ఆరు లక్షణాలకు ఉపలక్షణాలు లేనిది అపరిణామ ప్రాప్తం అంటే నిరంజన నిరాకార సచ్చిదానంద స్వరూపమని పిండితార్థం అసలు వస్తువు ఉంటేనే ఉత్పత్తి సాధ్యమౌతుంది. అసలు లేనిదానికి ఉత్పత్తి ఉండదు దీనినే సత్కార్య వాదమంటారు లేనిది పుట్టుతుం దనటం అసత్కార్యవాదం.

అపరి మేయత్వం పరబ్రహ్మ లక్షణం భగవంతుడు సర్వ వ్యాప్తి భగవచ్ఛబ్దం ఆత్మకు పర్యాయం. విష్ణుశబ్దానికి సర్వ వ్యాపకత్వం భావం. ప్రపంచ మంతా నిండి ఉన్నదొకే తత్త్వం "అంత ర్విష్ణు ర్బహిర్విష్ణు స్సర్వం విష్ణుమయం జగత్" అనేదే అప్రమేయత్వం

ఈశావాస్యోపనిషత్తులోని "ఈశావాస్యమిదం సర్వమ్" "యస్తు సర్వాణి భూతాని – ఆత్మన్యేవాను పశ్యతి" అనే వాక్యాలు అప్రమేయత్వాన్ని ఋజువు చేస్తున్నాయి. "సహస్ర శీర్షా పురుష స్సహస్రాక్ష స్సహస్రపాత్ – సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులం" అనే పురుష సూక్త సారమిదే ఇందులో 'దశాంగులం' అనేది ఉపలక్షణం అన్ని చోట్ల నిండి ఉన్నవాడని భావం ఇది రామతత్త్వానికి అన్వయమౌతుంది రామలక్షణం అప్రమేయత్వంగా కవిసూచన

'అది అచ్చ తెలివి' పరమాత్మ జ్యోతీరూపం నారాయణ పరోజ్యోతి ఆత్మానారాయణః అని మంత్ర పుష్పం ప్రతి పాదిస్తున్నది. పరమాత్మ జ్ఞాన స్వరూప మీందు ప్రతి పాదితం అజ్ఞానమను భూతమైనవాడు బ్రహ్మ. "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి" అనే వాక్యానుసారం ఆ ప్రభువులు బ్రహ్మత్వం పొందారు. శంకరుడు 'దేహం బ్రహ్మాసి' నే పరబ్రహ్మను అని సాయించాడు 'తత్త్వమసి'లో తత్–త్వం–అసి–అది నీవుతున్నావు జ్ఞానాన్ని అనుభవ పూర్వకంగా పొందినవారు ముక్తులు ఆ పైని నేను–ఇతరులు అనే భావం ఉండదు సర్వం తత్త్వమయ మౌతుంది అందుకే ఆ ప్రభువులు యోగ నిద్రను పొంది తాము 'అది' యైనారట అంటే ఆదే తత్త్వమని అది అంటే పరబ్రహ్మ తత్త్వం మళ్ళీ అది తాము ఐనారట.అదే అద్వైతసిద్ధి ఖండాత్మ అనంతాత్మతో లీనం కావటము అటువంటి ప్రభువుల పాలనలో లోకమెంత సుఖశాంతులతో విరాజిల్లిందో వేరుగా వివరించ నక్కరలేదు ఈ పద్యం విశ్వనాథ తాత్త్వికునిగా

ప్రాశాడా లేక కవిగా ప్రాశాడా అంటే ఆ రెండింటి సమాహార స్వరూపంగా ప్రాశాడని సద్య స్సమాధానం

విశ్వనాథ దశరథుని భార్యలను పాఠకునకు పరిచయం చేస్తున్నాడు సామాన్యంగా కవులు స్త్రీ వర్ణనలో శృంగార ప్రకటన చేస్తారు అది కావ్య లక్షణం కూడా ధర్మార్థ కామాలలో కామానికి చాలా ప్రాముఖ్యం ఉంది కామానికి మూలం శృంగారం కాని విశ్వనాథ విలక్షణంగా వర్ణించటం గమనించ తగిన అంశం

కౌసల్య ముక్తికాంతా సమానాకార
నలి సుమిత్ర ఉపాసనా స్వరూప
విజయ రమాకార వినయాంబుధి సుమిత్ర
కైకేయి మధుసామ గాన మూర్తి
కౌసల్య నవశరత్కాల మందాకిని
సితపుండరికంబు శ్రీ సుమిత్ర
మందార పుష్పంబు మహిళామణి సుమిత్ర
కైకేయి సునునల్ల కల్వపూవు

ధర్మ కామంబు లిరెంటు దశరథుండు
ముగ్గురు భార్యలందును రసమూర్తులందు
నమృత సౌఖ్యాను భూతి నధ్యయన సుఖము
తీర్థ భోగ సుఖంబు సిద్ధింప గనియె

కౌసల్యా ముక్తికాంతా సమానాకార ముక్తి జ్ఞాన గమ్యం కాబట్టి ఆమె జ్ఞానాకార సుమిత్ర ఉపాసనా స్వరూప ఉపాసన భక్తికి సంకేతం భక్తితో కూడా పరతత్త్వాన్ని పొందవచ్చు కైకేయి మధుసామగాన మూర్తి సామగానం యజ్ఞనిష్ఠం

యజ్ఞం కర్మ ప్రధానం కాబట్టి కవి జ్ఞాన భక్తి కర్మ మార్గాలు మూడింటినీ ప్రతిపాదిస్తున్నాడు మళ్ళీ కౌసల్య నవ శరత్కాల

మందాకినిగా వర్ణించడం గమనార్హం. శరత్కాల స్వచ్ఛ సుందరం. మందాకిని కలుషహారిణి జ్ఞానం స్వచ్ఛ స్వరూప స్వభావమని పిండితార్థం. సుమిత్ర సితపుండరీకం పుండరీకం తెల్లతామర అంటే కాపట్యరహిత సుమిత్ర భక్తికి కాపట్యం లేదు నల్ల కల్వపూవు కైకేయి నల్లదనం మాలిన్యానికి గుర్తు కైకేయి మనో మాలిన్య సహిత అని కావ్యవ్యంగ్యం కాని కర్మ స్వరూపంలో మాలిన్యం తప్ప దని కవి ప్రబోధం ఈ క్రమంలో తొలుత జ్ఞానానికి, తర్వాత భక్తికి ఆ పైని కర్మకు కవి ప్రాధాన్య మిచ్చినట్లు వెల్లడి ఔతుంది. అన్నీ మోక్ష మార్గాలైనా, శ్రేష్ఠత్వాన్ని వరుసగా నిర్ణయించాడు

ముక్తి పరమాత్మ స్వరూపం రామతత్త్వం పరమాత్మ ఆ పరమాత్మ రామ రూపాంభి వ్యక్తికి మూలభూతం కౌసల్య అందుకే ఆమెను జ్ఞానమూర్తిగా చిత్రించాడు సుమిత్రా సంతానంలో లక్ష్మ ణుగు శేషుడు విష్ణుభక్తుడు రామునకు పరమభక్తుడు దాస్యభక్తి కాతడు పరమ ఉదహారణ శత్రుఘ్నుడు భరత భక్తుడు కాబట్టి సుమిత్రను భక్తికి ప్రతీకగా భావించటం సముచితం

కైకేయి కర్మస్వరూప రామునకు చిన్నతనంలో విలు విద్య ఆమె నేర్పినట్లు విశ్వనాథ అభివర్ణించాడు విలువిద్య రాముని కర్మకు మూలం. కైకేయి లేకపోతే రామకథలేదు భరతుడు సుదర్శ నావతారం సుదర్శనం కేవల కర్మ సాధనం అతని తల్లి కనుక ఆమెను కర్మ స్వరూపిణినిగా కవి చెప్పాడు. వెరసి ఈ మూడు మార్గాలు మోక్ష సాధకాలనే ఆధ్యాత్మిక భావాన్ని పాలలో వెన్నలా ద్యోతకం చేశాడు

ధారుణి యెల్లయుం దిరుగు దాను సతారము సూర్యమండలా
ధారము గాగ జక్రదరధారి సకుండలమూర్తి జ్యోతియౌ
సూర్యుడు వొల్చు నక్షి పురుషుండు తదంతర వర్తి మీ కలా
ధార మతండు సూర్యకుల ధాముము వెల్గురు లేక క్రమ్గునే?

ఈ పద్యం దశరథునితో సుమంత్రుడు చెప్పింది మీాది సూర్యవంశం. సూర్యవంశం వెలుతురు లేక ప్రసంగదట. ఇక్కడ వెలుతురంటే సంతానమని కావ్యగతార్థం. సంతానం లేక సూర్యవంశం అస్తమించదని నిశ్చయం. కాని సూర్యుడు ఆత్మశక్తి చేతనే ప్రకాశిస్తున్నాడు. ఆ సూర్యునిలో మూలపురుషుడే పరమాత్మ అని ఛాందోగ్యం చెబుతున్నది

అర్కులో పుండరీకాక్షు డతడె యనుట
కక్షిణీ యని యష్ట ద్పృక్ త్ర్యక్ష దశ శ
తాక్ష విధిరుద్ర శక్రాదులందు నొకడు"

అని ఆముక్తంలో రాయలు వర్ణించాడు. ఉదయం బ్రహ్మస్వరూపం మధ్యాహ్నం మహేశ్వరుడు. సాయంకాలము విష్ణువు సూర్యుడ త్రిమూర్త్యాత్మక స్వరూపం

బ్రహ్మ స్వరూపముదయే - మధ్యాహ్నేతు మహేశ్వరః
సాయం ధ్యాయేత్ సదా విష్ణుః - త్రిమూర్తి శ్చదివాకరః

ఈ పద్యంలో విశ్వనాథ

"ధ్యేయస్సదా సవితృ మండల మధ్యవర్తీ
నారాయణస్సరసి జాసన సన్నివిష్టః
కేయూరవాన్ మకర కుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయ వపుర్ధృత శంఖ చక్రః

అనే భావార్థం వాడుకొన్నాడు.

'బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి' బ్రహ్మజ్ఞాన తత్పరుడు బ్రాహ్మణుడ వైష్ణవం సారూప్య-సామీప్య-సాయుజ్యాలను నిర్దేశించింది. అద్వైతం పరమాత్మ తత్త్వంలో లీనం కావడం. అది మరణం తర్వాత కాదు. అహం బ్రహ్మాస్మి అనే భావం అనుభూతమైన వెంటనే ఆ స్థితి కలుగుతుంది ద్వైతంలో కేవలం సారూప్యం సంభవిస్తుంది వశి

వర్ణన విశ్వనాథ పరతత్త్వ వర్ణనగానే భావించాడు. వశిష్ఠుడు బ్రహ్మ విదుగు కనుక

> చేతో రాజిత నిశ్చలాత్మమయ సచ్చిద్వ్యగ్ర నిష్ఠా పరం
> జ్యోతీరూపుడు, భ్రూ విలగ్న పటుతేజో గాఢ లజ్జావమత్
> స్ఫీతాంభోజ వియోని కేశవ పదాక్షీణ ప్రభావుండు, వి
> ద్యా తత్త్వాఖిల పుం స్వరూపుడు సరద్దార్పిష్ఠ రోచిష్కుడున్.

భగవంతుడు లేదా పరమాత్మ జీవుల బుద్ధిగుహలో ఉంటాడు. దహరాకాశ సంవర్తి అదే మనస్సులో నిశ్చలంగా ప్రకాశించే జ్యోతి. ఆ వసిష్ఠుడు మనస్సులో ప్రకాశించే నిశ్చల ఆత్మమయ సత్ - చిత్ నిష్ఠ పరంజ్యోతి స్వరూపుడట. అంటే ఇక్కడ వశిష్ఠుడే కానవసరం లేదు. బ్రహ్మవేత్తలంతా అలాంటివారే. తత్త్వం స్త్రీ పుంసా తీతం కాన వశిష్ఠుడు పురుషుడు. ఈ భేదం ఉపాధికే గాని తత్త్వానికి కాదు. వశిష్ఠుడనే ఉపాధి పురుషుడు కాబట్టి ఆ తత్త్వం పుం స్వరూపం ధరించి స్వగ్ని ఉన్నదట.

ఇంతవరకు జ్ఞాన భక్తి కర్మ మార్గాలే చెప్పబడినాయి. భ్రూవిలగ్న ప్రయోగం చేత యోగమార్గం వ్యక్తం చేయబడింది.

> "పెఱ తలపేది కర్మకృతి బేర్చెడు వారలు వేదపాఠకుల్
> గుఱి చెడకుండ నేత్రములకున్ నడుమన్ దిలకింతు వారలున్"

ఇందులో ముందు కర్మ చెప్పబడింది. మనం పూజాదికాలు నిర్వహిస్తాం కాని చేతులు పూలు విసరతూనే ఉంటాయి. నోరు మాత్రం మంత్ర పఠనం చేస్తుంది. మనస్సెక్కడెక్కడో సంచరిస్తుంది దాని వలన ఫలం పూజ్యం. అందుకే పెర తలపేది కర్మ చేయుమని నిర్దేశిస్తున్నాడు కవి. అంటే అనన్య మనస్కుడై ఏకాగ్ర చిత్తంతో కర్మ కాండ నిర్వర్తించవమని కవి శాసనం. గురి చెడకుండ నేత్రములకున్

నడుమన్ తిలకించుట ప్రాణాయామం ప్రాణాయామం యోగం. ఇది కూడా మోక్ష సాధనమని వ్యంగ్యం

> "దిలీపునకు నిచ్చిన నందిని వోని యీ మహా
> కృతుఫల మిచ్చి నాకు బ్రసరన్మను వంశముగాగ జూడవే"

అనటంలో ఆధ్యాత్మిక భావం తొంగి చూస్తూంది వశిష్ఠుడు దిలీపునితో కామధేను సుత యైన నందినీ ధేనువునకు పరిచర్య చేయిస్తాడు అపుడాయనకు సంతానం కలిగింది ధేనువు ధర్మప్రతీక ఆ ధర్మఫలం క్రతుఫలంగా ఇమ్మని దశరథుడు వశిష్ఠుని అర్థించాడు

> "శ్రీ వికుంఠ మహా నగరీ మరకత
> నిభృత కుడ్యాం శువులదన నీడజూచి
> యిప్పడీ స్వామి తన్ను దానెఱుగుగలడొ
> యెఱుగ జాలడొ యను రూప మోసక మోసగె

ఈ పద్యం అవతార ఖండంలోనిది తన్ను తానెఱుంగ గలడొ? అనేది వేదాంతార్థ గర్భితం "తన్ను తానెఱుంగ తానె పో బ్రహ్మంబు" అంటాడు వేమన్న మానవుడు పుడుతున్నాడు జీవించి మరణిస్తున్నాడు తానెక్కడ నుండి వచ్చాడో, ఎక్కడికి పోతున్నాడో తెలియదు దానిని గురించి తెలుసుకొనే ప్రయిత్నం కూడా చేయటం లేదు ఎవరైనా రమణ మహర్షి దగ్గఱకు వెళితే నిన్ను నీవు తెలుసుకొన్నావా? అని ప్రశ్నించేవారట ఈ దేహం తాను కాదు. తాను ఆత్మ మాయా ఛన్నుడైన కారణంచేత కర్మ ఫల మనుభవిస్తున్నాడు నేనే పరమాత్మనని తెలుసుకోగనే జీవత్వం నశించి, అనంతత్వం సంక్రమిస్తుంది.

స్వామి వైకుంఠ నగరంలో మరకతాలు తాపించిన గోడలలో తన రూపు చూచుకొని తానెవ్వడో తెలియగలడా? అని సంశయం

ఇక్కడ నారాయణుడనంత పరమాత్మ తత్వం గోడల యందున్న మరకత కాంతి మాయ. అందులో ప్రతిఫలించటమంటే అవ్యక్త ప్రకృతి నుంచి, పరమాత్మ జీవరూపంతో అభివ్యక్తం కావటం ఇక్కడ కూడా విశ్వనాథ అనంత రామతత్త్వం నుంచి రావణసంహార్థం లోకములో అవతరించిన రాముని, అభివ్యక్తమైన జీవరూపంగా విశ్వనాథ అభిభాషిస్తున్నాడు జీవేశ్వరులను బింబ ప్రతిబింబ ప్రాయంగా విశ్వనాథ ప్రతిపాదించాడు

ప్రాణాయామము బూని యంతట నమో వాకంబు లర్పించి గి
ర్వాణుల్ జోతలు వెట్టుచున్ నిలువ నోపద్మాక్ష! యోశౌరి! యో
వేణీ భూత సమస్త బుద్ధి విభవా! విష్ణూ! స్వయంభూ! జగ
ద్ఛ్రేణీభూత నవాంకురాది నవతా శ్రీమంజు బీజాకృతీ!

అనే పద్యంలో యోగం మోక్షమార్గంగా పునః ప్రతిపాదితమైంది ప్రాణాయామంతో నమో వాకాలర్పించారట నమో వాకాలర్పించటం భక్తి. ఇందులో ఒక రహస్యం ఉంది జ్ఞానమార్గంలో భక్తి ఉంది భక్తిలో జ్ఞానం ఉంది. అలాగే యోగంలో భక్తి ఉం భక్తిలో యోగం ఉన్నది ఇవన్నీ అన్యోన్యాశ్రయాలు, తర్వాగ జోతలు పెట్టటం, స్తుతించటం భక్తిలో భేదాలు ఇందులో విష్ణు శబ్దం సర్వవ్యాపకత్వానికీ, స్వయం భూ పదం అనాదిత్వానికీ సూచకం ప్రపంచంలో లేనిది పుట్టదు. ఉన్నది నశించదు కాబట్టి ఈదృశ్యమానమైన ప్రపంచం క్రొత్తది కాదు తొలుత సూక్ష్మ రూపంలో ఉండి తరువాత స్థూల రూపం పొందింది మఱ్ఱిచెట్టు స్థూలరూపం. ఆ స్వరూపమంతా మట్టి విత్తనంలో దాగి ఉన్నది తొలుత బీజరూపంగా ఉండి అంకురించి, శాఖోపశాఖలై ఈ వృక్ష రూపం ధరించింది ఈ విశ్వ రహస్యం కూడా అదే తొలుత పరమాత్మ తత్త్వం బీజరూపంలో ఉన్నది అది శ్రీమంజు వైంది అంటే శుభప్రద కాంతి మత్వంతో ఉన్నదని భావం ఈలోక సమూహాలను క్రొత్త మొలకల రూపంతో

పైకి వ్యక్తం చేస్తున్న బీజం పరమాత్మ అక్కడి నుండి ఈ విశ్వమభి వ్యక్త మైందని ఈపద్యంలో విశ్వనాథ ద్యోతకం చేస్తున్నాడు.

"ఇల్లు వైకుంఠ మందొ మౌనీంద్ర హృదయ
మందొ తన దహరాకాశ మందొ యైన
చిత్తు నానందమును మించు సత్తొకండు
జనపతి కరస్థమగు పాయసమున జొచ్చె

పరమాత్మనివాస స్థానం జీవుల హృదయ గహలని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి ఆత్మ పదార్థాన్ని గురించి చర్చించేదే ఉపనిషత్తు. ఉప—సమీపము నందు, నిషత్తు—ఉన్నదని అర్థం పరమాత్మ ఎక్కడో లేడు ఏ జీవి కా జీవి హృదయ గుహనే ఉన్నాడు "అణో రణీయాన్-మహతో మహీమాన్ ఆత్మస్యజం తో ర్నిహతోర్గహా యాం" అని కఠోపనిషత్తు చెబుతున్నది మానవునికి హృదయంకంటే సమీపస్థం లేదు సమీపంలో కూర్చుండ బెట్టుకొని గురవులు శిష్యులకు బోధించటం వల్ల నిది ఉపనిషత్తు ఒకనాటికిది గ్రంథగతం కాదు కాబట్టి గురువు దగ్గర ఉండి మాత్రమే అభ్యసించాలి

ఒకనాడు విష్ణువు నారదునితో "నారదా! నేనెచ్చట నున్నానో తెలియునా?" అన్నారట 'వైకుంఠంలో' అని నారదుని సమాధానం "నాహం వసామి వైకుంఠే" అన్నాడు విష్ణువు "యోగుల హృదయంలో ఉన్నా"వన్నాడు నారదుడు 'నయోగి హృదయే' అన్నాడు విష్ణువు అలా ఐతే నాకు తెలియదన్నాడు నారదుడు "యత్ర గాయంతి మద్భక్తాః తత్ర తిష్ఠామి నారద!"అని సాయించాడు విష్ణువు అంటే పరమాత్మ "ఇందు గలడందులేడను సందేహము వలదు" అనే భావానికిది ఉపబలకం

అన్నీ పరమాత్మ మందిరాలే అని సూచన వైకుంఠం మౌనీంద్ర హృదయం - దహరాకాశం అనేవి అనంత విశ్వానికి ఉప

లక్షణాలు. చిత్తు చైతన్యం, ఆనందం వీటిని మించిన సత్తు జ్ఞానరూప పరమాత్మ ఆ సత్తు దశరథుని చేతిలోని పాయసపాత్రలో ప్రవేశించిందట ఆ భావం అజం-శాశ్వతం-ఆది మధ్యాంత రహితమని కవి కంఠోక్తి. ఆ సత్తు రామునిగా రాబోతున్నది ఈ ప్రపంచ జీవులన్నీ సత్తుయొక్క రూపాలే అని కవి ఆశయం

"ఋక్సామా కృతిని యజుర్మూర్తిని
మహాథర్వవాసున్ గృత తురంగ పతంగున్
వాక్సమ్యక్చర దుదాత్త స్వరితమార్గ
ప్రవిష్టున్ బటుహావిః ప్రియచిత్తున్
దిక్సీమాంత నిబిడ జ్యోతి నిహ్యాషీకేశు
విష్ణున్ ధృత ధనుశ్శర హస్తున్
ద్రాక్సంతుష్ట హృదయాబ్జాతకనె
గౌసల్యాశౌరిన్ దళిత దైత్య మహౌఘున్"

ఈ పద్యములో విశ్వనాథ వైదిక సంస్కృతి నంతా ఇమిడించాడు. భారతీయులకిది వైదికతత్త్వం వేదాంతవీధీ విహారతత్త్వం పరమాత్మ పై పాదంలో పరమాత్మను వేదస్వరూపునిగా కవి దర్శిస్తున్నాడు పతంగ శబ్దానికి పక్షిఅని, సూర్యుడని అర్థద్వయం ఉన్నది పక్షివాహనుడని కావ్యార్థం. సూర్యమండల గతుడై విహరించే మూల తత్త్వమని ధ్వని జ్ఞానులు సూర్యమండలం ఛేదించికొని పరమాత్మ యందు లీనమౌతున్నారు అనేది సూచన ఉదాత్తానుదాత్త స్వరితాలు వేదస్వరాలు. వాని నుంచి ప్రవేశిస్తాడట పరమాత్మ అంటే పరమాత్మ నాదస్వరూపుడని భావం దాని ద్వారా పరమాత్మను చేరవచ్చు అనటం నాద బ్రహ్మోపాసనను ధ్వనితంచేయటం ఆంగ్లంలో కూడా "Music is the Royal Road for Solvation" అనే సూక్తి ఉన్నది.

హవిస్సు యజ్ఞభాగం పరమాత్మ యజ్ఞ స్వరూపడని విశ్వాసం ఇవన్నీ చెప్పి అనంత విశ్వం నిండిన జ్యోతిరూపం పరతత్త్వంగా విశ్వనాథ నిర్ధారిస్తున్నాడు ముందు సగణోపాసన-క్రమంగా నాదోపాసన-చివరకు నిర్గుణోపాసనకు దారితీస్తున్నాడు తొలిదశలో సగుణోపాసన అవసరమైనా, క్రమంగా ఆ రూపాలన్నీ మహా జ్యోతిరూపంలో అంతర్లీన మౌతాయని సూచించాడు

తాటకావధ ఘట్టంలో పరమాత్మ మాయా, జీవ స్వరూపాలు వ్యంగ్యంగా తీర్చిదిద్దాడు. విశ్వామిత్ర యాగ సంరక్షణార్థం రామలక్ష్మణులను తీసికొని వెళుతున్నాడు తాటక వచ్చింది లక్ష్మణుడామె ముక్కు చెవులు కోసివేశాడు

గాధి సుతుడు భూమి కాంతుని తనయులు
నుపల వర్షమునకు నొదిగి యొదిగి
మునిగి మునిగి వృక్షమూలముల్ సేరిరి
యీగి యీగి పొదరు టిండ్లు సనిరి

ఒక తరు మూల మందొదిగి యుండిన రాముని గాంచి కౌశికుం
డకటు భవద్భుజా ఫలమునందితి మయ్య! రఘూద్వహా! యడన్
బ్రకటిత శాంబరీ కుటిల వచ్చెడు సంధ్యయు రాక్షసుల్ నిశా
ధిక బలులింక దీనిని వధింపక తప్పదు యజ్ఞహంత్రినిన్

ఈ కథలో కౌశికుడు ఆచార్యుడు రాముడు పరమాత్మ తాటక మాయా స్వరూప. ఆమె శాంబరీ కుటిల కూడా! మాయతో కన్పించకుండా రాళ్ళ వర్షం కురిపించింది మాయలేక ప్రకృతి జ్ఞాన రూపాన్ని కప్పివేస్తుంది, రాళ్ళవర్షమంటే జీవుడు పొందే కర్మఫలరూపం, అంటే జీవత్వం పొందిన తర్వాత మాయను తెలియలేక,

దాటు లేక ఎన్నో అకృత్యాలు ఆచరిస్తుంటాడు గాధి సుతుడు రామ లక్ష్మణులు కూడా తరుమూలం చేరి దాక్కున్నారు మాయ పరమాత్మను సైతం భ్రమింప చేస్తుంది విశ్వామిత్రుని ఉపదేశంతో రాముడు శబ్దవేధి ప్రయోగించాడు జీవుడు గురూపదేశంతో జ్ఞానం పొందాలి శబ్దవేదితో మాయ తొలిగింది అంటే జ్ఞానోదయమైతే జీవుని ఆవరించిన మాయావరణం తొలగిపోతుంది రాముడు తాటకను సంహరించాడు మాయపూర్తిగా నాశనం చేయబడింది ఆత్మ స్వచ్ఛందంగా భాసించదని భావం

రాత్రి అజ్ఞానానికి తమోగుణానికి ప్రతీక తమోగుణమే అజ్ఞాన ప్రదాత్రి అజ్ఞానమనే అంధకారాన్ని చీల్చక పోతే యజ్ఞరూప పరమాత్మ భాసించదు ఈ వైదిక భావాన్ని మనస్సులో ఉంచుకొని, విశ్వనాథ ఈ భాగాన్ని తీర్చిదిద్దినట్లు గోచరిస్తుంది

"వెలుగు మరొక్క పేరఖిల విద్యలకున్ బరమాత్మ భూతమై
వెలుగులు తన్ను మించి మరి విశ్వము నందున వేఱు చోటు వే
వలఘుడు శిష్యవత్సలుడు నంబుధి శోషణ దాహమూర్తి వె
ల్గుల నిధికిన్ గరూత్మునకున్ జగదక్షు నకున్న మస్కృతుల్"

సుందర కాండ ప్రారంభంలో హనుమంతుడు సముద్రం దాటుతూ, తన గురువు లోక చక్షువైన సూర్యుని స్తుతించిన పద్యమిది ఇందులో కూడా జ్ఞాన తేజస్సే విద్యా స్వరూపమనీ, అదే పరమార్థ తత్త్వమనీ, తేజో మూర్తి లేని ప్రదేశం విశ్వంలో ఎక్కడా లేదనీ పరబ్రహ్మ తత్త్వాన్ని పేర్కొన్నాడు ఈ విషయాన్ని విశ్వనాథ,

"ఐహికమున్ విరక్తిగొని యాత్మ పదార్థ పరార్థనైచికీ
దోహన శీల మౌ నెడద దూగిన తూకువ నీవు క్రొత్తరూ
పై హవణించుటో హృదయ మందిన మేలిమి యైన తీరవో
ఓ హర! రెంట భేదమని మొవ్వని నీదు ననుగ్రహం బొకో!

ఈపద్యం రామాయణాన్ని ద్వైతా ద్వైతోపనిషత్తుగా భావించాడనటానికి సాక్ష్యం ఆత్మ పదార్థ పరార్థ తెలుసు కోవటానికే నేనిది వ్రాస్తున్నానంటున్నాడు. ఆత్మ పదార్థ పరమార్థాలను చర్చించినవి ఉపని షత్తులే అందుకే ఆదృష్టితో వ్రాశాడన్నాను

స్వామీ! నీ క్రొత్తరూపం ధ్యానించనా? హృదయ గతమైన మేలిమిని భావించనా? అంటున్నాడు పైది సగుణారాధన. పైది ద్వైతభావం క్రిందిది అద్వైతభావం క్రొత్తరూపాన్ని ఆరాధించట మంటే ఆ రూపం వేరు నీవు వేరు అని భావించటం ద్వైతం. హృదయ గుహాకాంతి దర్శన మద్వైత దర్శనం

"ఋగ్యజు స్సామా థర్వాచ భారతం పాంచరాత్రకమ్
మూల రామాయణం చైవ శాస్త్ర మిత్యభి ధీయతే
యచ్చానుకూల మేతచ్చ తచ్చ శాస్త్రం పరికీర్తితమ్"

ఇది స్కాంద పురాణ వచనం భారతం పంచమ వేదమనీ, రామాయణం సమస్త శాస్త్ర గ్రంథితమైన శాస్త్రమనీ లోకం ప్రశంసిస్తున్నది రామాయణాన్ని కొందరు శాస్త్రంగా దర్శించారు రామాయణం మహాకావ్యమని లోకప్రశస్తి కాని విశ్వనాథ దానిని ద్వైతా ద్వైత సమన్వయ స్వరూపోనిషత్తుగా దర్శించాడు తీర్చి దిద్దాడు.

ఉదాహరణలన్నీ ఎత్తి చూపాలంటే మళ్ళీ అంత గ్రంథమౌతుంది ఈ చిన్ని వ్యాసంలో అది సాధ్యంకాదు. అందుకే దిఙ్మాత్రంగా పరిదర్శిస్తున్నందుకు విజ్ఞులు మన్నిస్తారని ఆశిస్తున్నాను



# విశ్వనాథ వారి వైచిత్రి

ఆచార్య ఎం కులశేఖరరావు

విశ్వనాథవారు బహుముఖమైన ప్రతిభ కలవారు ఆంధ్రసాహిత్యము నందలి విభిన్న ప్రక్రియలను చేపట్టి, వానిని సర్వోత్తమముగా రూపొందించుట యందు వారికి గల యీ ప్రతిభ ద్యోతమాన మగుచున్నది ఉత్తమ కావ్యము, ఉత్తమ నవల, ఉత్తమ నాటకము, ఉత్తమ విమర్శనము, వారు వెలువరించి యన్నారు. ఆధునిక సాహిత్య యుగమున సంప్రదాయ సాహితీశాఖలో వారు అగ్రేసరు లనుటలో సందేహము లేదు

విశ్వనాథవారి కావ్యగతమైన ప్రతిభను ప్రదర్శించునది, వారు రచించిన రామాయణ కల్పవృక్షము. ఆది కవి వాల్మీకి మొదలుకొని, అజ్ఞాతులైన జానపద కవుల వరకు రామాయణ రచనమునకు పూనుకొని నిర్వహించుటను మనము చూడవచ్చును సంస్కృతంలోనేమి, యితర భాషలలో నేమి, రామకథను చేపట్టిన కవులు ఏదో ఒక విధమైన నవ్యతను ప్రదర్శించుచు వచ్చిరి రంగనాథ రామాయణకర్త, ఊర్మిళ నిద్రవంటి కథలను అపూర్వమైన వానిని, గ్రహించి తన కావ్యమునకు మెరుగులు దిద్దెను భాస్కర రామాయణ కర్తలు కథానాయకుడగు శ్రీరాముని సర్వసద్గుణ సంపన్నుడగు ఆదర్శమూర్తిగా సృష్టించి చదువరుల దృష్టిని ఆకట్టుకొనిరి. సీతమ్మవారిని తమలో ఒక సామాన్య స్త్రీ స్వరూపుణిగా రూపొందించి, జానపదులు శ్రోతలను పరవశులను చేసిరి అట్లే ప్రతిభాన్వితుడైన విశ్వనాథ, తన రామాయణ కల్పవృక్షమున వైచిత్రిని ప్రదర్శించి తన కావ్యమునకు మహోన్నతత్వమును ఆపాదించెను విశ్వనాథ, ఈ వైచిత్రిని నెట్లు ప్రదర్శించెనో చూపించుటయే ఈ వ్యాస ప్రధానాశయము

వైచిత్రి యన నేమియో ముందుగా వివరించి, తరువాత నది కావ్యమున ప్రయుక్తమైన పద్ధతిని పరిశీలింతము వైచిత్రి, వైచిత్ర్యం అను పథములకు రూపాంతరము వైచిత్రి మోనియర్ విలియమ్స్ పండితుడు ఈ పదమునకు Wonderfulnes,Marvellous Beautyఅను నర్థములను వ్రాసియున్నాడు Sanskrit - English Dictonaryలో వి. ఎస్ ఆప్టే మహాశయుడు ఇవే అర్థములతో ఏకీభవించెను దిగ్భ్రాంతిని కలిగించునది, అపురూపమైనది, పరమ సుందరముగా భాసించునది, వైవిధ్యమును ప్రదర్శించునది యగునట్టిది వైచిత్రి యని స్థూలముగా చెప్పవచ్చును.

కావ్యమును చదువునప్పుడు పఠితల కీభావమును కవులనేక విధములుగా కల్పించవచ్చును కథాకథన శిల్పమున, ఛందో రీతులందు, సమాసఘటన సందర్భమున, శాబ్దిక విన్యాసమున, ఉపమాన గ్రహణమున, అలంకార ప్రయోగమున, ఇంకను ఇతర సందర్భములందీ వైచిత్రి కాన్పించ వచ్చును. బహుముఖ ప్రజ్ఞావంతుడైన విశ్వనాథవంటి కవి అనేక సందర్భములలో వైచిత్రిని ప్రయోగించినను మనమాశ్చర్యపడ నవసరములేదు ఇచట విశ్వనాథవారి కావ్యములోని బహుముఖ వైచిత్రిని చూపించుటకు అవకాశము లేదు కాబట్టి ఆయన శాబ్దికవిన్యాసమున, ఉపమాన గ్రహమున మనకెట్లు దిగ్భ్రాంతిని కలిగించి కావ్యమును సౌందర్యపూరితము చేయునో చూడవలసి యున్నది

రామాయణ కల్పవృక్ష ప్రారంభమునందు, మహారాజగు, దశరథుని, అతని ముగ్గురు రాణులను పరిచయము చేయవలసి వచ్చినది ఆరాజు 'ఇక్ష్వాకు ధరణీ పతులలోన దన పూర్వు లందరలోన మిగిలి యొప్పు'నని చెప్పినాడు ఆ తరువాత రాణుల ప్రశంస వచ్చినది కౌసల్యను గురించి, ఆమె ముక్తికాంతా సమానాకారా, నవశరత్కాల మందాకిని, అనిచెప్పి యామె లోకోత్తర వ్యక్తిత్వమును

వ్యక్తము చేసినాడు సుమిత్ర 'ఉపాసనా స్వరూప, సితపుండరీకము' అని చెప్పుట చూడగా, ఆమెకు గల సౌందర్యమును వర్ణించినట్లయి నది ఇక కైకేయిని గురించి, 'కైకేయి మధుసామగానమూర్తి-కైకే యను నల్ల కల్వపూవు' అని వర్ణించినాడు ఈ రెండు సమాసము లను వైచిత్రిని ప్రదర్శించునట్టివే కైకేయి, పారవశ్యమును గలి గించు సామగానానుభవము రూపు వహించెనేమో యన్నట్లున్నది అను నర్థములు చెప్పవలెను గానము విని యానందించ దగినదే కాని, దానికి రూపము లేదు అట్టి ఉపమానమును గ్రహించి కైకేయి రూప మును చెప్పుటయందే కవి వైచిత్రిని ప్రదర్శించెను ఆ కైకేయి 'నల్ల కల్వపూవు' అన్నాడు కలువ సౌకుమార్యమునకు ప్రతీక అయిన నల్లనిదగుట యేమి? కైక తనూద్యుతి నల్లనిదా? లేక ఆ నల్లదనము ఆమె స్వభావమని చెప్పుటయా? ఏమో? ఈ విషయమును కవి పాఠ కుల ఊహకే వదలి వారికి దిగ్భ్రాంతిని కలిగించుచున్నాడు

అయోధ్యా నగరమును పరిపాలించెడి దశరథ మహారాజు నకు, అతని రాణులకు సర్వసంపద లున్నను, ఒకటే విచార కార ణము వారికి సంతానము లేకపోవుటయే ఆ భావముచే వారి ముఖములు చిన్నబోయి యున్నవి. ముఖ్యముగా రాణుల ముఖము లలో ఆ విచారభావము దశరథునకు స్పష్టముగా కనిపించుచున్నది అది 'వికసిత సితాంబుజ ముఖంబున శైవల వల్లిసోలికన్' ఉన్నదట సామాన్యముగా కవులు, నాయికా ముఖమును సుందరమైన శిరోజము లతో గూడిన దానిని, చెప్పుటకు శైవల వల్లియుత సితాంబుజముతో పోల్చుదురు కాని యీ యుపమానమును, కల్పవృక్షకవి, స్వరూప మునను, స్వభావమును, భిన్నముగా గ్రహించినాడు పద్మము పరి సరములలో నీటియందు నాచుతీవ లున్నంత వరకు, అవి ఆ పద్మ సౌందర్యము నధికము చేయు ననుటలో సందేహములేదు కాని ఆ నల్లని నాచుపీనలు తెల్లని పద్మముపై పడెనా, ఆ పుష్ప సౌందర్యము

పోయినట్లే దానికి వికారాకారము కలిగినదన్న మాటే 'విచారభావము రాణుల సుందర ముఖముల కిట్టి విఘాతమునే కలిగించినది ఇదియే కవి ప్రదర్శింప బూనిన ఉపమాన వైవిధ్యము.

సంతానము లేదని దుఃఖభావముతో నున్న దశరథ మహారాజును సుమంత్రుండు ఓదార్చుటకు పూనుకొనెను పూర్వము రాజ్యము చేసిన ఇక్ష్వాకు భూపతుల గొప్పతనమును. వారి ధార్మికత్వమును కొనియాడును అట్టి వంశము అనపత్యమగుట సంభవించదనియు. 'సూర్య కులధామము వెల్తురు లేక మగ్గునే'? అనియు సమాశ్వాసము చేయును. 'పుడమిని ధర్మపుం గాఱత పుట్టని యన్ని దినాలు మీదు ధర్మపుం గొఱతగానీ. యోవృథాశోకి, పృథ్వీరాజ్య ప్రియకేకిః వేయి దివిటీల్ వేయించినన్ లేదు' అని తనకు తెలిసిన విషయమును రాజునకు నివేదించును ఇచటనే యొక విశేషము కాన్పించుచున్నది సుమంత్రుడు దశరథ మహారాజునకు అమాత్యుడు అతడు మహారాజును సార్వభౌమా, రాజా, అని యేదో ఒక విధముగా సంబోధించవలె గాని, 'వృథాశోకీ'యని పిలువచ్చునా? ఇట్లు పలుకుట న్యూనతాద్యోతకము కాదా? అనునదే యీ విశేషము చూచినచో పైకి అట్లే యనిపించును కూడ కాని సూక్ష్మదృష్టితో పరిశీలించి చూడగా, ఈ సందేహము విడిపోవును సుమంత్ర దశరథుల సంబంధము కేవలము మంత్రి సార్వభౌముల సంబంధము కాదు ఒకవేళ అట్టిదే యైనచో విచారగ్రస్తుడైన రాజును ఓదార్చ వలసిన యావశ్యకము మంత్రికి లేదు వ్యక్తిగత విషయముల యందతనికి జోక్యము ఉండెడిది కాదు. నిజమునకు వారి సంబంధము ఆప్తుల మధ్యన నుండునట్టిది ఎట్టి మనోవైకల్యము దశరథునకు సంభవించినను, అప్తుడగు సుమంత్రుడు కలుగ జేసుకొన వలసినదే అందుచెతనే యీ ఓదార్పు ఇది కాక, సందర్భమును బట్టి చూడగా సుమంత్రుడు దశరథుని కంటె వయస్సులో పెద్దవాడనిపించును, ఒకచోట నాతడే పలికినట్లుగా నిట్లున్నది

"రఘువుల నాటనుండియు నరః పత్రిదవాప్తుని వంశభూపతుల్
మఘవుని యుద్ధముల్ పనగ మాంరథ మెక్కిరి బాహుదర్ప సా
రఘువులు మీా కహో తరతరంబుల బంటుల మేము మీారు దా
న ఘువులు నేది కావలసినన్ జనుదెంతుము మిమ్ము జూడగన్"

ఈతని మంత్రిత్వము వంశపారంపర్యముగా వచ్చుటయే కాదు దశరథుడు మహారాజు కాక పూర్వమే అతడు మంత్రియైనట్లున్నాడు. అందుచేతనే, అంతటి స్వాతంత్ర్యము, అందుచే కవి నీతనిచే 'వృథాశోకి' అని సంబోధింప జేసినను, న్యూనతా భావముగా కాక, ఆత్మీయతా భావముతోనే యని చెప్పవలసి యుండును ఇంకొక విధముగా కూడ దీనిని సమర్థించవచ్చు. దశరథుని అనపత్యత శాశ్వతము కాదు ఆ వనజాక్షుడే ఆతని కుమారుడుగా అవతరించ నుండగా ఈ వృథాశోక మెందులకు? అను ధ్వనిని ఈ శబ్దగతమైన వైచిత్రితో కవి సాధించి యుండును

ఉపమానగత సౌందర్యమును మరొక దానిని చూపింతును, దశరథుడు నగర సందర్శనమునకు బయలుదేరినాడు అనేక విశేషములను చూచినాడు. ఏనుగుల కొట్టములను దరిసినాడు ఆ ఏనుగులు మహావైభవోపేతముగా, అసంఖ్యాకముగానున్నవి దిగ్గజములు విచ్చేసెనో యనునట్లున్నవి ఇంద్రుడు తన మణుల రాశులను నిచట న్యాసముంచెనో యనునట్లున్నవి ఇట్లు చెప్పుచు సూతుడు "మీాకంటి బొమముళ్ళు సాకారముగ వచ్చి_కదుములు గట్టి ఈ కరణిజనునా" అని పల్కుటలో కవి ప్రదర్శించిన ఉపమాన గత సౌందర్యమును ఏమని చెప్పవలెను? రాజుగారి కనుగొమల నీలత్వమునకు, ఏనుగుల నైర్మల్యమునకు సాదృశ్యమును చెప్పుచు, ఈ అపూర్వ ఉపమానమును గ్రహించుటలో కవికి గల అనన్య ప్రతిభ గోచరమై పాఠకుల నాశ్చర్యచకితుల చేయుచున్నది. కావ్యమునకు అనన్య సౌందర్యమును గూర్చుచున్నది

దశరథునకు అశ్వమేధము చేయవలెనను భావము కలిగి నది. దానివలన సంతానమును పొందవచ్చునని అతని ఆశయము అతని మనస్సు అనంతమైన ఉత్సాహముతో నురక తెత్తినది ఆ ఉద్వే గముతోనే అంతఃపురమునకు వెడలి 'గల్లంబు హల్లకపాణి నూది భాష్పంబు లురల గూర్చున్న కౌసల్యాదేవిని జబ్బలుపూని లేపి నిలు ఘుండబెట్టి కన్నులం గన్నులుంచి' ఇంక నామె విచారింప బనిలేదని ఫలుకుచు "హరిణాక్షి మన వ్యధ లన్నియు దీరెనే, బెడదలు తొల గెనే బిసరుహాక్షిః మత్స్య మత్స్య పుచ్ఛాభి రామ విలోచనాంచల సుకృతముల్ పండెనే ముకురవదన" అని యామెను సంబోధించు చునే మాట్లాడుచుండెను ఏమి సంబోధన, ఆమె మత్స్య పుచ్ఛాభి రామ విలోచనాంచల యట, మీనాక్షి, మీన నయన యనుట యున్నది స్త్రీ కన్నుల సొగసును వర్ణించిన కవి నభూతో నభవిష్యతి కౌసల్య సంతాన రహితయైన కౌసల్య-బాష్పంబు లురలు కౌసల్య నేత్రాంచలములలో నింత అంద మెక్కడిది? అది యెప్పటిదో కాదు ఇప్పుడే వచ్చినది కాని, అశ్వమేధము వలన సంతానమును పొంద వచ్చునని తెలియగనే అతనికి అనంతమైన సంతోషము కలిగినది. కౌసల్య ఆ సంతోషమును దర్శించినది మత్స్య పుచ్ఛాభి రామ విలోచనాంచలయైనది ఆ సౌందర్యమును దశరథుడు దర్శించినాడు కవి దర్శించినాడు కావ్యమున ఉపమాన సౌంధర్యము వెల్లువలైనది ఈ అభిరమ్యత ఆమె కన్నులకు, శ్రీరాముడు కుమారుడుగా కలగ బోవుచున్నాడను ధ్వన్యర్థమును సూచించుచున్నదన్నను ఆశ్చర్య పడనవసరము లేదు

సంతానమును పొందుటకు అశ్వమేధము చేయవలెనను నిర్ణయము జరిగినది. ఆ నిర్ణయమును మునులు, ఋషులు ఆమో దించిరి, అప్పుడు వశిష్ఠు డిట్లన్నాడు

"నాయన! అశ్వమేధము నానర్పు గరిష్ట సుమంత్రి కృషి నా
రాయణు దెచ్చెదన్ హావిసు నందగ నాపయి నీయదృష్ట రే
ఖాయతి బుత్రుదున్ గలుగగా పసితల్లియు గోసలేంద్రి క
న్యా యువతీ శిరోమణి మహానుకృతంబుల పంట పండగా"

అశ్వమేధమును చేసి సంతాన వంతుడగుటయే దశరథుని కోరిక కాసి, వశిష్ఠుని మాటలవలన నారాయణుడే హవిర్భాగము లందు కొనను న్నాడని, అతడే కుమారుడుగా నుద్భవించ నున్నాడని, తెలిసి దశరథునకు పట్టరాని సంతోషమైంది కారణము దశరథునకు తన కులగురువు వాక్కుపై గల పరిపూర్ణ విశ్వాసమే. ఆ సంతోషముతోనే రాజు ముని పాదములందు వ్రాలినాడు అప్పుడు ఋషి శ్రేష్ఠుడు ఆయనను లేవనెత్తి కౌగిలించుకొన్నాడు ఇచట కవి యొక పద్యము వ్రాసినాడు

"మునిపతి జనపతి పూనిన గాదిలి కౌగిలింత నిడుపు లయిన యా
మునిపతి జనపతి గడ్డములను బడి ప్రమదాశ్రుతతి తళాతళ మెరిసెన్"

వృద్ధమునికి, వృద్ధరాజునకు, కలిగిన యానందమును వ్యక్తము చేయుటకు ఇంతకంటే మంచి పద్యమును వైచిత్రితో వ్రాయుట ఏ కవికిని సాధ్యము కాదనుటలో సందేహము లేదు కుల గురువునకు, మహారాజునకు పరస్పరము గల ప్రేమాభి మానములు దీనియందు వ్యక్తమైనవి ఇక్ష్వాకు వంశమున పుత్రోత్పత్తి స్పష్టముగా చెప్పినట్లైనది వార్ధక్య దశలో సంతానము కలుగుటలోని యానందమును కవి ఊహించి వారి యానంద బాష్పములు తళతళ మెరిసెనని చెప్పుట పరితలకును ఆనంద బాష్పములు కలిగించును అందుకే, యీ సంఘటనమును దర్శించిన 'కడమ మును లెల గన్నులు తుడుచుకొనుచు రాజుగాంచి' రట. అట్లగుటలో సందేహమేమి? కవి కూర్చిన సంఘటన బలమట్టిది

తనకు నారాయణుడు కుమారుడుగా కలుగనున్న విషయము తెలిసినప్పటి నుండి భూపతి పరమ సంభ్రమముతో నున్నాడు. తన పట్టమహిషి కావార్త యందించి శ్రీహరిని కుమారునిగా బొందుమని దానికి తగిన సన్నాహము చేయుమని పలికినాడు. కన్నుల కాటుక లద్దుకొమ్మనినాడు. చీనిచీనాంబరములు ధరించుమన్నాడు. భూషణావళిని ధరించుమన్నాడు. బాలు పరిదానవేళ ఆ విష్ణుమూర్తికి నీవు అదితి లాగున కనిపించవలె నన్నాడు. సంభ్రమముతో రాజు పలికిన యీ మాటలకు మనకు వలెనే కౌసల్యకును విచిత్రమైనవి. ఆ వెన్నుడు వచ్చునేని యీ మునిపతి తెచ్చునేని నవభూషలు చీరలు దాల్చి యెంత వెన్నుని దనియింతు? అని ప్రశ్నించినది. నిజమే నారాయణునకు కావలసినవి చీరలు భూషలు కావు కదా! మరేమి కావలయును? ఆ విషయము కౌసల్యకు చక్కగా తెలియును. అందుకే ఆమె సమాధాన మిది. నాదగు కనుంగొన లొత్తిన భక్తి జూచి మన్నన బొనరింపగా వలె సనాతను డాద్యుడతండు. అహా ఏమి యీ సుందరవాక్కు. శ్రీమన్నారాయణుడు వశముగునది భక్తి కని కౌసల్య ఎంత సుందరముగా పల్కినది. ఒక విధముగా పతిని అధిక్షేపించిన దన్నను విచిత్రము కాదు. ఆమె మాటలలోని సొగసు ఆమె దృఢమైన విశ్వాసము మనలను సంభ్రమాశ్చర్యములలో ముంచివేయును. ఆ శ్రీరామచంద్రునికి తగిన తల్లి యనిపించుకొను శక్తి ఆమెకున్నది యని మనకు విశ్వాసమును కలిగించినాడు కవి.

అనంతమైన పరిజ్ఞానము బహుముఖమైన ప్రతిభ కలిగిన కవికి వీనిని యథోచితముగా పొందుపరచుట సాధ్యము. ఇట్టి వైచిత్రియే కావ్య సౌందర్యమునకు హేతువగుచున్నది. ఆ సౌందర్యమే విశ్వనాథ వారి రామాయణమును కల్పవృక్షమును చేసినది. వారిమాటలలోనే చెప్పవలెననిన, కవి ప్రతిభలోని నుండు కావ్యగత శతాంశములు యందు దొంబడియైన పాళ్ళు యున్న వాక్కు కావ్యమున సార్థకత కలుగుచున్నది.

# రామాయణ కల్పవృక్షము - పద్య వైచిత్రి

డాక్టరు. తటవర్తి రాజగోపబాలం

ప్రపంచంలో అనేక సాహిత్యాలలో కవిత్వం ఛందోమయ భారతిని ఆశ్రయించియే ఆవిష్కృతమైనది కేవలం ఛందస్సు కవితకది బాహిరమైన ఆకృతియే కాని ఛందస్సు కవిత్వానికి సహజము, సనాతనము, సమీచీనము అయిన బంధురబంధమున్నది

భావావేశానికి తగిన రసానందాన్ని కల్గించడంలో ఒక్కొక్కపుడు అంతః స్నాయువున్ని కదిలింపగల శక్తి ఛందస్సుకు ఉంటుంది. అర్ధ సాధనా శ్రమ లేకుండా పాఠకులకు అప్రయత్నంగా భావం పట్టుకొనేటట్లు మాటల చక్కని పొందిక సాధిస్తుందని డాక్టరు రిచర్డ్స కన్ఫ్యూషియస్ చుంగ్ యంగ్ అన్నారు.

"Dr Richards uses Confucius in the Chung yung to state what this tendency towards a more perfect order brings about 'It enables us without effort to hit What is right and without the exercise of thought to apprehend "

ఛందః ప్రయోగౌచిత్యాన్ని గూర్చి క్షేమేంద్రుడు తన సువృత్త తిలకంలో

"కావ్యేరసాను సారేణ వర్ణనాను గుణేన చ
కుర్వీత సర్వవృత్తానాం వినియోగో విభాగవత్ "

అని రసానుగుణంగా, వర్ణనానుగుణంగా వృత్తాన్ని కవి వినియోగిస్తాడని చెప్పినాడు "ఈ రసానికి ఈ ఛందము" అన్న ఖచ్చితమైన, విస్పష్టమైన శాసనం కన్పించక పోయినా

"వీరస్య భుజ దండానాం వర్ణనే స్రగ్ధరా భవేత్,
నాయికావర్ణనే కార్యం వసంత తిలకాదికమ్,
శార్దూల లీలా ప్రాచ్యేషు మంధాక్రాన్తాచ దక్షిణే"

అనడాన్ని బట్టి వివిధ ఛ్ఛందస్సులకు వేర్వేరు సందర్భాల వినియోగం ఉందని తెలుస్తుంది కాగా ఛందంలో కృతి, ప్రకృతి, ధృతి, అతిధృతి అనే విభాగం ఒకటి కనబడుతుంది సాధారణంగా కృతి ప్రకృతులలో సౌకుమార్యరసాలు, ధృతి అతిధృతులలో ఔద్ధత్యరసాలు వాడడం జరుగుతుంది

కవి ఎంత స్వేచ్ఛాపరుడైనా ఛందః స్వీకరణలో భావ సన్నివేశాను గుణమైన ఛందః ప్రయోగం అతని కవితా వైదగ్ధ్యానికి కీర్తి పతాక సన్నివేశాను గుణంగా పద్యాన్ని స్వీకరించడం, స్వీకరించిన పద్యంలో ఎత్తుగడలోనే వైశిష్ట్యాన్ని ప్రకటించడం, సందర్భాన్ని బట్టి అనేక వాక్యాలతో పద్యాన్ని నడపడం, ఒకోసారి ఒకటి రెండు సమాసాలతోనే మొత్తం పద్యాన్ని కూర్చడం, సామెతలు జాతీయాలు పొల్లు పోకుండా పద్యంలో బిగించడం అంటే అవి ఏ ఛందంలో ఇముడుతాయో ఆ ఛందాన్నే స్వీకరించడం, భావాధిక్యాన్ని బట్టి వృత్తమో, సీసమో, కందమో చిన్న పెద్ద తారతమ్యాలు చూచుకొని దేనిలో ఆభావం మరింత స్ఫూర్తి మంతంగా ఉంటుందో దానినే గైకొనడం వీటన్నిటికంటే ముఖ్యంగా భావాన్ని ఛందస్సునకు బలిపెట్టకుండా ఉండడం, సన్నివేశాలలోని క్లిష్టతను సూచించేటుట్లు దుష్కర ప్రాసలు వేయడం, ప్రాసస్థానంలో పదాన్ని ముందరి పంక్తి చివరిఘ్నంటే త్రిప్పుకొని రావడం, అట్లే యతిస్థానాలలో కూడ అతుకు రాకుండడము-ఇవన్నీ పద్యరచనా వైచిత్రితో శిల్పం క్రిందికి వచ్చే కొన్ని విశిష్ట గుణాలు

శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ప్రదర్శించిన పద్యరచనా వైచిత్రి అత్యాశ్చర్యకరమైనది

వివిధ చ్ఛందస్సులకి కావ్యం సంగమస్థలి పద్యరచనా వైచిత్రిలో విశ్వనాథ విదగ్ధత ఈకావ్యంలో స్పష్టంగా కన్పిస్తుంది విశేష వృత్తాలను నడపడం ఒకటి. ప్రాచుర్యంలో ఉన్న పద్యాలను ఎత్తుకొనినా వానిలో తనదైన వైశిష్ట్యాన్ని చూపించడం మరొకటి ఈ కర్త కున్నాయి స్థూలంగా కొన్నింటిని పరిశీలిద్దాం

దశరథుడు యాగం చేస్తున్నాడు ఎక్కడెక్కడివారు రెక్కలు కట్టుకొని వచ్చారు సంతుష్టిగా ఆతిథ్యం పొందుచున్నారు "అంతట నొక్కనాడు గరుడంచల చంచల మారుతచ్ఛటాతాంత మహాగ్నియై" జటాయువు మింటు చరింపగా వసుధాపతి తలయెత్తి చూస్తున్నాడు ఇక్కడ పద్యం వ్రాయాలి మనకు ఆత్మీయులైన వారింటికి వచ్చినపుడు 'ఫలానివారే' అని తెలిసినా 'నువ్వా, వచ్చావా, రా!' అని ప్రారంభించి కూర్మిని ప్రకటించి ఆప్యాయంగా ఆహ్వానం పల్కుతాం ఇక్కడ మాటలు సహజ సుందరంగా ఉండాలి ఆత్మీయత ఉట్టిపడే యీ మాటలలో దీర్ఘ సమాసాలకు తావులేదు

"ఎన్నన్ నీవు జటాయువా? సఖుడ! రా! యెన్నాళ్ళ కెన్నాళ్ళ కీ
నన్నున్ లోన దలంచినావు కబురందం జేసిరా నీకునున్
మిన్నున్ డిగ్గుము నీవు వచ్చితివి నా మేధంబు సాఫల్య మం
దున్నీకున్ గబురంపుటన్ దగు సుమంత్రుండన్ సుమంత్రుండుగా"

అంటాడు దశరథుడు పద్యంలో ఉక్తి వైచిత్రి సరేసరి దీన్ని నొక్కి పల్కడానికి అనుగుణంగా ద్రుతంతో ద్విత్వ నకార ప్రాస ముందు కొంత దూరంలోచూచి 'నీవా, రా' అన్నాడు 'ఎన్నాళ్ళకొచ్చావు' అన్నాడు 'కబురంద చేశారా' అన్నాడు. మూడో పాదంలో పై నుండి క్రిందికి దింపాడు నాల్గోపాదంలో నా యజ్ఞం సఫల మవును అన్నాడు ఇక చివరలో సుమంత్రుడికి అక్షరాభిషేకం చేశాడు పొడి మాటలతో పద్యం వ్రాయడం సామాన్యం కాదు, అందునా సంభాషణాత్మకంగా

మరొకటి సంభాషణలు లేవు,-సన్నివేశం హడావుడిగా సాగుతోంది. మృత్యుముఖంలో ఉన్న లక్ష్మణుడు క్షణాలపై తేరుకోవాలి మారుతి వాయువేగాన్ని మించి వెళ్ళి మొత్తం సంజీవి పర్వతాన్ని తెచ్చాడు. దానిలో కావలసిన ఓషధిని సుషేణుడెంచుకొన్నాడు, ఇచ్చట

"వచ్చెన్మారుతి, తెచ్చె పర్వతము, సంభావింపగాలేన నే
నెచ్చోచ్చు మున్న వా యోషధుల్ కనుక భూభృత్తెల్ల భూభృత్తుగా
నిచ్చోదెచ్చితి జూచి కొమ్మనగ దానే యోషధుల్ కోరెనో
క్రొచ్చెన్ పీని సుషేణుడంత గొనిపో క్షోణీధరంబన్న చో"

అని శార్దూలం చరచర నడిచింది సన్నివేశంలో వివిదాంశాలు ఎంత వేగంగా సాగాయో పద్యపు నడక అంతవేగంగా సాగింది జరిగిన సంఘటనలు అనేకం ఉన్నాయి గనుక వ్రాసిన వాక్యాలు కూడ వానికి తగట్టుగనే ఉన్నాయి అసలు పట్టంతా పద్యపు ఎత్తుగడలో ఉంది. 'వస్తాడా? రాడా? సంజీవి తెస్తాడా? లేడా? అనే శంకలు ఆదిలోనే తీరాయి

సన్నివేశానుగుణంగా పద్యపు ఎత్తుగడను ప్రదర్శించిన వైచిత్రి విభిన్న ఘట్టాలలో విశ్వరూపాన్ని దాల్చింది యీ కావ్యంలో ఒకటి రెండింటిని ఆస్వాదిద్దాం

నిఖిలాస్త్రాలు వశిష్ఠుని బ్రహ్మదండం ముందు వెలవెల బోగా గాధిసూతి

"ఛీ! క్షత్రియబలంబు ఛీ! క్షత్రియబలంబు
నస్త్ర బలంబు ఛీ! నస్త్రబలము
బలమన్న చో బ్రహ్మబలమే బలంబగు... "

అన్న మాటల తీరును పద్యరచనలో చూపిన విధం సహజ సన్నివేశాను గుణమైన రచన గాక మరేమిటి?

అపుత్రుకుడై దశరథుడు కుములిపోతున్న రోజులవి. ప్రభు నవస్థకు మంత్రు లెట్లయినారో సుమంత్రుడు రాజుతో

"నిద్రాహారము లెల్లమాని యదిగో నీ మంత్రులున్ గాఢ శు
క్ర ద్రూ సంభవ దష్టులై మెలికలుంగా జుట్టు కొంచుందురో
భద్రా పొమ్మని పంచిరీ యొడకు . "

అన్న మాటలలో ఆవేదన ఆదినుండీ పొంగివచ్చింది.

అశోకవనంలో సీతమ్మను చూడవచ్చాడు రావణుడు తన కామాతురతను వాక్రుచ్చాడు. సీతమ్మకు అసహ్యం పుట్టింది.

"రక్కసి! మీదిమీదికిని రాకుము, కాకుము, బూదిపోవుగా
నెక్కడికట్లు వచ్చెదవు, నేనెవరన్ రఘురాజు కోడలన్'

అని హెచ్చరించింది తన మాటల్ని పద్యాల నుండీ చెబుతూనే వచ్చింది అదేమాట ఎన్నిసార్లు విన్నా రావణుడి తలకెక్కడం లేదు మళ్ళీ చెప్పాలి, ఇక్కడ పద్యపు ఎత్తుగడ

"ఇదివఱకెన్ని సార్లు వచియించితి రామశరాళి లక్షణం
బది కయికోవు ."

ఇంతకంటె ఏం వ్రాయాలి?

కల్పవృక్షంలోని అనర్ఘ పద్యఫలాలలో ఒకటి మహాభా సుప్రసిద్ధమైన

"ఈ సంసార మిదెన్ని జన్మలకు నే నీ పౌని వాల్మీకి భా
షా సంక్రాంత ఋణంబు దీర్పగలదా! సత్కావ్య నిర్మాణ రే
ఖా సామగ్రి ఋణంబు దీర్పగలదా! కాకుత్స్థుడౌ స్వామి గా
థా సంపన్నము భక్తి దేర్చినను ద్వైతాద్వైత మార్గంబులన్"

అన్న అవతారికలోని పద్యపు ఎత్తుగడలో పద్యంలో చోటు చేసు కొన్న అపూర్వ భావం. వాల్మీకిపై గల గాఢభక్తి ప్రపత్తులు ఒక్క మ్మడిగా వెలికి వచ్చాయి.

ఏదగ్గుడిన కవికి ఛందస్సు సంకెల కాదు అతని సాహితీ సామ్రాజ్యంలో గడ్డిపూచ కూడ గాండీవంగా కదను త్రొక్కుతుంది "కవి ప్రతిభలోన నుండును కావ్యగత శతాంశముల యందు తొంబ దియైన పాళ్ళు" అన్నది విశ్వనాథ విశ్వాసం ఈ ప్రతిభ ఎంతటి విషయాన్నైనా అలవోకగా నడిపించడంలో తెలుస్తుంది దీనిని బహు జటిల చ్ఛందమైన కందంతో విశ్వనాథ చక్కగా సాధించారు

కిష్కింధలో శరదాగమమైనది సుగ్రీవుడు సమయం పాటించలేదు రాముడు వేచివేచి వేగి పోవుచున్నాడు తమ్మునితో

మన మున్నామో లేమో
కనుగొనుటయు బట్టలేరు కపిరాజునకున్
దనదగు మన పనియేమా
యెన్నో మనమిచ్చోటు నుండి యేమైనామో!"

అన్న మాటలు సహజంగా సాగివచ్చాయి

మరో చోట

తన దర్శనానికై వ
చ్చిన సుగ్రీవుని గనుగొని శ్రీరాముండి
ట్లనె "

పద్యం సగం దాటిపోయింది ఇది వచనంలో వ్రాసినా వ్రాయ వచ్చును కాని కందం దానంతటదే కుదురుకు పోయినట్లయినది

కోకొల్లుగా జాతీయాలు, సామెతలు పద్యాలలో ఇమిడి పోయిన సన్నివేశము లెన్నో ఉన్నాయి మచ్చునకు—

"నిజముగా క్రొత్త బిచ్చగానికి బొద్దు
తెలియదన్నట్టు లున్నదీ తీరు చూడ"

కిష్కింధలో కాముకతతో గుహ కదలకున్న కపిరాజును గూర్చి

రాముడన్న మాటలు సందర్భ సార్థక్యాన్ని పుంజుకొని ఈ సామెత గీత పద్యానికే అలంకారమైనది

పరశురామునికి నృపలోకము చేసిన ప్రార్థనలో

నీ కడుపున బుట్టెదము
య్యా! కోపి! జామదగ్న్య! ..."

ఇచ్చట పద్యాదిని "చచ్చి" అని ఉండాలి కాని ఆరాజులు ఏలాగూ చావడానికి సిద్ధంగానే ఉండి బ్రతిమాలుతున్నారు గనుక ఆ మాట అంటే నిజంగా చావు కోరుతున్నట్లుంటుంది, కనుక విచిత్రంగా పద్యం ప్రారంభమైంది

సందర్భానుగుణంగా ధనుర్భంగ ఘట్టంలో జగద్విఖ్యాతలైన "నిష్ఠావర్ష దమోఘ మేఘ పటలీ. " ప్రభృతి వృత్తాలు సరే సరి ధనుశ్శబ్దం ఎంత తీవ్రమైనదో, ఎంత అధికమైనదో తెల్పగల్గునట్లు మూడు గురువులతో ఆదినుండి సాగదీసుకొని పోయే శార్దూలాలు యిచ్చట స్వైర విహారం చేశాయి

దాశరథి లంకలో అగ్నెత్రాడు ప్రయోయించినపుడు-

"లంకాంతః పుర కామినీ కుచ యుగీ లావణ్య విస్తీర్ణతా
సంకోచంబులు, దైత్య నాయక శ్రీవచస్సంచార రేఖా సమా
తంకంబుల్, దివిజాత సైనిక మనో ధైర్యాద్రి కుట్టాక వ
జ్రాంకంబుల్ పతి యగ్నె త్రాటి నినదశ్యాపారముల్ పొల్చెనన్"

శ్రీరాముని ధనుష్టంకారం లంకలో వాడవాడలా ఎట్లా బీభత్సాన్ని సృష్టించిందో అట్లా ఈ శార్దూలం చారు భీషణంగా నడిచినది

ఇట్లే సన్నివేశంలో క్లేశాన్ని సూచిస్తూ క్లిష్ట ప్రాసలు నడిపిన తీరలు కొన్ని-

వాలి దుందుభుల యుద్ధంలో 'తీక్ష్ణ మరుత్ప్ర వేగమున ....." అని

సంపాతి దర్శనానికి ముందు వానరులు దిగులుగా సీతా వృత్తాంతాన్ని స్మరించేటపుడు తమ స్థితిని చెప్పుకొనుచు_

"చచ్చి చావని సాము సీనుగుల ' అని
"ప్రాగ్జన్మార్జిత పాప కర్మ ఫలమై "అని

దశరథుని యాగ ఘట్టంలో

"అర్చిర్హోమము లేనివేళ వసుధాధ్యక్షుండు ... "

అని అచ్చటి పండితోత్తముల వాక్ప్రాగల్భ్యాన్ని చెబుతూ బిగించిన క్లిష్ట ప్రాసలు సహేతుకములు

ప్రాసను పాదాంతంలో బిగించి అల్లుకొని రావడం నన్నయాదికవులు నేర్పిన విద్య. ఇట్లా చేయడం వల్ల శ్రుతిపక్వతతో పాటు సహజ రచనా పాటవం వెల్లడవుతుంది పద పదాన పద్య రచనా శిల్ప ప్రాభవం పొందుపరచుకొన్న ఈ పద్యాన్ని చిత్తగించండి 'సుందర' లో జానకి దర్శనం_

"ఆకృతి రామచంద్రు విరహాకృతి కన్బొమతీరు స్వామి చా
పాకృతి కన్నులన్ ప్రభు కృపాకృతి కైశికమందు రామ దే
హాకృతి సర్వదేహమున యిందున రాఘవంశ మౌళి ధ
ర్మాకృతి కూరుచున్న విధమంతయు స్వామి ప్రతిజ్ఞామూర్తియై"

'ఇక సీస పద్యరచనలో చెప్పదలచిన విషయాన్ని నాల్గు సమభాగాలు చేసి నాల్గు పాదాలలో చెప్పి ఎత్తు గీతిలో సమన్వయం చేయడం_

"ఎఱ్ఱనౌ నేత్రమ్ము లిప్టి వేళానాల
ధూమ సంతానమ్ము దూటినట్లు
ఆకులు దినుట దీక్షాకాల భోజన
నియమ తీవ్రత చేత నెగడినట్లు

గీ॥

సప్తతంతు మహాకార్య సమయమందు
కర్తపోలిక గోకిల కానుపించె

ప్రతిపాదాన్ని ఉపమతో ముగించి ఎత్తుగీతిలో ఒక ఉపమేయం బెట్టి అన్వయం చేయడం.

ఋశ్యశృంగుని అయోధ్యకు గొనిరావలెనని దశరథునితో సుమంత్రుడు చెప్పిన తరువాత చంద్రవర్ణన

"ఒనర బోర్కాడించి యుయ్యేల తొట్టెలో
పండబెట్టిన పసిపాపవోలె
వీథులంబడి తిర్గి బూదిమై జల్లు
కొని పవ్వలం బెట్టు కుఱ్ఱవోలె.
నన్నమ్ముదించు మోమంతయు బెరుగన్న
ము నుజేసి కొన్నట్టి బొట్టెవోలె
చిట్టి! తలంటి పోసెదనన్న నందక
తొలగి పర్వులు పెట్టు నులిపివోలె

వెల్లదుస్తులు కట్టించి వీథులన్ షి
కారు పంపిన రాజ కుమారు వోలె
మింటనడు చక్కి జాబిల్లి మేదినీశు
నేత్రములకును జలువ పండించి పోసె''

ఇట్లా కొన్ని సీసాలు సాగినవి ఇంకా అనేక సీస పద్యాల నడకలు బహు రీతుల పోయినవి. కొన్ని

"ఆత్మ నిత్యమ్మ కాలాద్య వచ్ఛిన్నమ్ము సచ్చిదానంద
సంపచ్చయమ్ము"

"వనజాక్షి! నీవింక వనరగబోకువే నావంక జూడవే నళిన వదన''

"ఓయీ హృషీకేశ! దోయిలింతుము నీకు శార్ఙ్గ ధనూరాజ!
స్వాగతంబు"

"సన్న ఖర్జూరపు జూపలపై నూపరాశులు గంధమ్ము తీసినట్లు"

"ఉండ నేనని యేమి యుండనే ఉన్నది పద్మాక్షి సీత కావలయు నీమె"

"చిఱునవ్వు నవ్వినా చిన్నారి ముత్యాలు ప్రోవులు ప్రోవులు పోసినట్లు"

ఏవం విధముగా కావ్యమున సీసపద్యాలు పలుపోయలు పోయినవి

రామాయణ కల్పవృక్షములో పద్యరచనా వైచిత్రిని గూర్చి ప్రత్యేకంగా చెప్పవలసిన విశేషాంశం ఒకటి ఉన్నది భిన్న భిన్న విశేష వృత్తాలు ఎన్నో ఇందు చోటు చేసుకొన్నవి అవన్నీ సందర్భ శుద్ధితో పద్య రచనా వైచిత్రి దృక్పథంతో సాగినట్లు స్ఫురింపక మానవు తెలుగులో సాధారణముగా చంపకోత్పలాలకు, శార్దూల మత్తేభాలకు, కందం, తేటగీతి, ఆటవెలది, సీసపద్యాలకున్న ప్రాచు ర్యం తక్కిన వాటికంతగా లేదు కాని యీ కావ్యం ఈ మాటలకు అతీతమైనది సుమంతుడు రథాన్ని తోలినపుడు అశ్వగతి, రథోద్ధత వృత్తాలు, రామ పట్టాభిషేకనాన్ని గూర్చిన మాటలు ప్రియంవద, చంద్రికవృత్తాలు, వాలిసుగ్రీవుల యుద్ధంలో వైతాళీయము, అపాతలిక మహాస్రగ్ధర, లయగ్రాహి, లయహారి, ప్రహేయము స్రగ్విణి, త్రిభంగి వృత్తాలు, కిష్కింధ కవుల వర్ణనలో హయప్రచారము, తురగ వల్గనము, ద్విరదగతి, అక్కరలు, మత్తమ యూరము, మణి రంగము, పృథ్వి మొదలగు పద్యాలు యుద్ధకాండలో వంశస్థము, ఏకరూపు, చంచరీకావళి, శ్యేని, ఫలసదనము, జలదము, విమానము, మేదిని, వరాహము, సుకేసరవము, ఇల మొదలగు వివిధ ఛందస్సుల పద్యాలు పెక్కు చోట్ల కన్పించుచున్నవి.

ఉదాహరణకు యుద్ధకాండలో

"భీకర గర్ద భారుణము పెద్ద మొగిల్
ప్రకట శోణితోదకము వర్షము ద
ర్వీకర పుచ్ఛ దారముగ హృద్భయ బా
ధాకర ఘోరమై కురిసె నచ్చెరువై"

సందర్భాను సారంగా జలద వృత్తాన్ని ఎన్నుకోవడం జరిగింది.

సుందరకాండలో హనుమన్మంత్రాలను యథా తథంగా విశ్వనాథ పద్యాలలో నడిపించిన తీరు అత్యాశ్చర్యకరం. శచీపురం దరులు అశోకవనంలో మారుతిని కొల్చినట్లొకసన్ని వేశాన్ని కల్పించి-

"మంగళరూప! యయ్య! హరిమర్కట మర్కట! పంచవక్త్ర! ఖ
ట్వాంగ మహాసి ఖేట కుధరామృత కుంభసృణి ప్రదీపితో
త్తుంగ కరాంబుజాత! నవతోయద మూర్తి! త్రిపంచనేత్ర! స
ర్వాంగద కంఠహార యసురావలి మర్దన జాహో! మారుతీ!

ప్రాసంగోత్థ కకుద్భు జావనత! సర్వజ్ఞా! సమీచీన బా
హా సంపాదిత రామకార్య! దితిసుహా! నిత్యతృప్తా! స్వతం
త్రా! సింహానన! క్రోడ వక్త్ర! తురగాస్యా! అగ్ని గర్భా! మహా
త్మా! సర్వగ్రహభీ నివారణ! సముద్రాంభో మహాపత్త్రరీ!"

అని తనివి తీరా అంజనేయ స్తుతి గావించినారు

నిఖిల జగన్మంగళేచ్ఛతో తన కావ్యాన్ని 'మ ం గ ళ మ హా శ్రీ' వృత్తంతో ముగించడం మాత్రమేగాక ఆచివరి పద్యాం తములో "మంగళ మహాశ్రీ" అని "శ్రీ" తో సమాప్తి చేశారు విశ్వనాథ ఆదిలో "శ్రీమంజూషిక" అని శ్రీకారం చుట్టి కావ్యాంతంలో "శ్రీ"ని నిక్షేపించి ఆద్యంతమూ తన కావ్యంలో పద్యరచనా వైచిత్రిని సంపన్నం చేసుకొనిన కవి సామ్రాట్ శ్రీ సత్యనారాయణగారు

మ ం గ ళ మ హా శ్రీ

# కల్పవృక్షము - వ్యంగ్య వైభవము

ఆచార్య శలాక రఘునాథ శర్మ

శ్రీ శంకర భగవత్పాదులు అద్వైతాన్ని కనిపెట్టి ప్రపంచించి, ప్రతిష్ఠించి జిజ్ఞాసువులకు సచ్చిదానంద రూప పరబ్రహ్మ తత్త్వాన్ని అందించారు అలాగే ఆనంద వర్ధనులు కావ్య ప్రపంచంలో ధ్వని సిద్ధాంతాన్ని సుప్రతిష్ఠితం చేసి అందరికీ ఆనంద వర్ధనులయ్యారు నిజానికి అది ఆయన సృష్టి కాదు ఇది ఈయన సృష్టి కాదు. ఆ రెండూ నిత్యసత్యాలు. ఈ యిద్దరూ ఈ రెంటినీ దర్శించి లోక సంగ్రహ బుద్ధితో తమ దర్శనాన్ని లోకానికి సర్వసమర్థంగా నిరూపించారు

సాధారణ మానవుడు కూడ అనేక సందర్భాలలో అన్నదానికీ అనదలచుకున్న దానికీ విస్పష్టంగా భేదం [illegible] ఉన్నాడు. అందువలననే నా ఉద్దేశం అదికాదు, నేననుకొన్నది అదికాదు అంటూ ఉంటాడు. అంటే అన్నదాని కంటె విలక్షణంగా, అతి ముఖ్యంగా భాసించే 'అనదలచు కొన్నది' అంతరంగంలో కదలాడు తున్నదని స్పష్టమైన విషయమే కదా ! దాన్నే శాస్త్రకారుడు వ్యంగ్యం, ప్రతీయమానం మొదలైన శబ్దాలతో వ్యవహరించాడు అంతేకాదు, అదే ఆత్మ అనికూడ నిరూపించాడు. అది ఉంటేనే కావ్యానికి కావ్యత్వోపదేశం కలుగతుందని ఆత్మ శబ్ద వ్యవహారముచేత ప్రతిపాదించాడు ఈ ప్రతిపాదనను భావనాపుటంలో పెట్టి పరీక్షించారు మానవజాతి అదృష్టం కొద్దీ కల్తీ లేకుండా ధగద్ధగాయి మానముగా వెలుగొందే సిద్ధాంత సువర్ణం అక్షర సత్యంలా అందుబాటులోనికి వచ్చింది

ఆనందవర్ధనులు వ్యంగ్యాన్ని అంగనలయందు లావణ్యంవంటిదని పరమాద్భుతంగా పోల్చారు ఈ పోలికలోని గొప్పతన మేమిటంటే

దేహం స్పష్టంగా కానవస్తుంది కానీ, ఇదిగో కన్ను, ఇదిగో ముక్కు అన్నట్లుగా ఇదిగో అని ఒక ప్రత్యేకాకారముతో చూపరాని దిగసు లావణ్యం అది దేహాన్ని ఆశ్రయించుకొని అనుభూతికి వచ్చినట్లు వ్యంగ్యం శబ్దార్థాలను ఆశ్రయించుకొని భావనా పరిధిలో విహరిస్తూ ఉంటుంది అంటే వాచ్యార్థం రసం పీల్చి వదలివేసిన పిప్పిలాంటిది కాదు వెలుగును ప్రసాదించే దీపశిఖ లాంటిది కాబట్టి వాచ్యార్థ విషయంలో కూడ వక్త యత్నవంతుడు కావాలన్నాడు ఆనంద వర్ధనులు

ఈ పూర్వరంగంతో కల్పవృక్షంలోని వ్యంగ్య వైభవాన్ని స్థాలీపులాక న్యాయంగా నిరూపించటానికి ప్రయత్నం చేస్తాను.

శ్రీ విశ్వనాథ తమ కల్పవృక్షంలో బాలకాండలో ఇష్టి ఖండాన్ని 433 పద్యాలతో తీర్చిదిద్దారు ఈ ఇష్టి సాధారణమైన యిష్టి కాదు శ్రీ మహావిష్ణువు ముచ్చటపడి దిగివచ్చి కౌసల్య కడుపు పండించ వలసిన ఇష్టి మనం సాధారణంగా వ్రతాలు, నోములు చేస్తూ ఉంటాము తదనుగుణంగా ఫలితం కూడ అంతంత మాత్రముగానే ఉంటుంది. కాగా కవి దశరథుని యజ్ఞాన్ని వర్ణించిన తీరు, పై చూపునకు కవి సూక్ష్మాంశ తత్త్వజ్ఞతా స్ఫోరకంగా కనిపిస్తుంది కాని నిజానికి మనం గుర్తించ వలసినది అంతకంటె విశిష్టమైనది ఒకటి ఉన్నది

యజ్ఞ సంకల్పానికి ముందు దశరథుడు సంతానం కోసం పడిన తపన, మంత్రుల ఓదార్పు, ఓదార్పులో భాగంగా అతని రాజ్య పాలనా దక్షతను, అతనికే చూపి వర్ణించటం అనే కథా భాగాన్ని విశ్వనాథ విస్తృతంగా వర్ణించారు ఇందులో ఒకపద్యాన్ని సుమంత్ర వాక్యంగా ఇలా చెప్పారు

నిద్రాహారము లెల్లమాని యిదిగో నీ మంత్రులున్ గాఢ శు
క్ర దూర్రి సంభవ దష్టులై మెలికలుంగా జుట్టు కొంచుందురో
భద్రా! పొమ్మని పంచిరీ యెడన్ నన్ బావింపవే నీవాయ
క్షుద్రాత్ముండవు యాజ్ఞికుండవు నిద్రా శోకంబు నీ కేటికిన్.

రాజు అన పత్యతా వేదనతో సతమత మవుతున్నాడు. మంత్రులు గాఢ శుక్రదూర్రి సంభవ దష్టులై మెలికలు తిరికి పోతున్నారు దీనివలన ఆ మంత్రులకు రాజు మీద ఉన్న గాఢానురాగం వ్యక్త మవుతున్నది ఆది దశరథుని మనోధర్మంలోని ఉదాత్తతను అభివ్యక్తం చేస్తుంది. ఈ రెండూ కలిసి రాబోయే కథలో అతివేలంగా వర్ణించిన ప్రజాభద్రతలోని కీలకం ప్రతీయమాన మవుతున్నది ఎవరికేది లోపించినా రాజు ఇస్తాడు అని మంత్రులు దండోరా వేయించారు అధర్మపరులెక్కడ ఉన్నా పట్టితెమ్మని గూఢచారులకు ఆజ్ఞాపించారు కాని "బహు దినంబులు చనియు దనకిది లేదని జేని యెదుటి కొక్కడు రాడు వాడు దురాచారుడని ం జభటులొక్కని బత్యక్ష పరుపరు" దీనివలన కవి పాఠకుని స్ఫూర్తికి వదలిన మహావిషయ మేమంటే - శ్రీ మహావిష్ణువు దశరథుని తండ్రిగా వరించటంలోని సామఞ్జస్యం.

పై పద్యములో మరొక అంశాన్ని కూడ మనం పరిశీలించాలి "నీవా యక్షుద్రాత్ముండవు, యాజ్ఞికుండవు ఇదా శోకంబు నీ కేటికిన్"- ప్రజాతంతు వ్యవచ్ఛేదం జరిగి పోతున్నదన్న పరమ శోకంలో మునిగిపోయి ఉన్న దశరథుడు ఆది తన అధర్మ ఫలంగా భావిస్తూ ఉన్నదశలో పై మాటలను అంతగా పట్టించుకో లేదు సుమంత్రునితో కలిసి ధర్మం లోపం లేదని రాష్ట్ర ప్రజలను ప్రత్యక్షంగా చూచి తెలుసుకున్నాడు

మళ్ళీ సుమంత్రుడు మంత్రులు తరిమితే రాజు దగ్గరకు వెళ్ళాడు ఒకటి రెండు క్రొత్తమాటలతో పాటు మళ్ళీ పాత పాట

అదే పాడాడు. మొదటి మాటకూ ఈ అవ్యక్తమైన మాటకూ దాదాపు ఏబది పద్యాల అంతరం ఉంది. ఈ ఏబది పద్యాలలో దశరథుని కనులకు క్రమ్మిన ఒక పొర తొలగిపోయింది. కాబట్టి "అక్షుద్రాత్ముండవు యాజ్ఞికుండవు" అనే మాటలు అతనికి హఠాత్తుగా మెరిసిన మెరపులా చింతకాంతులను వెదజల్లాయి. అక్షుద్రాత్ముడు చేసిన యజ్ఞం అభీష్ట ఫలాభిసంధిని అత్యద్భుతంగా అసందిగ్ధంగా సమకూరుస్తుంది అనే స్ఫురణ అతనికి కలిగింది. తాను రాజ్యపాలనలో క్షుద్రాత్ముడేమో అన్న అనుమానం మొదట గుండెలో శంకయై కూర్చుంది. సుమంత్రుడు చూపిన సామ్రాజ్య యోగక్షేమభావన దానిని సమూలంగా తొలగించి వేసింది. ఇటుపై కర్తవ్యం యజ్ఞమే అన్న స్ఫురణ కలిగింది. ఈ స్ఫూర్తి కలిగిన వెంటనే దశరథునిలో దుఃఖం, వార్ధక్య జనిత వైక్లబ్యం, అనుత్సాహస్థితి మొదలైన కార్యావరోధ లక్షణాలన్నీ మాటుమాయమై పోయాయి. దీనిని కవి చాలా మనోహరంగా ప్రతీయమానం చేశాడు.

> "ఇంకను నీవహో యిచటనే నులుచుంటి విదేమి? పోయినా
> యులకెకు మంత్రులన్ బలువు మల్ల వశిష్ఠుల వామదేవులన్
> లెంక నృపుండు తమ్మనియె లెండని వేగమ కొంచురమ్ము నా
> శంకలు పోయె జేనికిని సంతతి గల్గు భయంబు లేదికన్"

దశరథుడు ఏదో చెప్పాలనుకొన్నాడు. చెప్పావనుకొన్నాడు. మదిలో మెదలిన ఊహా సద్యః ఫలాన్ని అందినంత పారవశ్య స్థితిలో ఉన్నాడు. ఈ స్థితిని అభివ్యక్తం చేస్తూ దూకివచ్చిన వాగ్ఝరి ఈ పద్యం. అందులోను మొదటి వాక్యం ఈ పారవశ్య స్థితికి పట్టిన దర్పణం. అతని తన్మయత్వం ఎంతదూరం పోయిందంటే లెంక నృపుండు అన్నంతవరకు. వశిష్ఠ వామదేవులు ఋత్విక్కులై తన్ను గట్టెక్కించాలి. వారి విషయంలో తన రాజాహంకార లక్షణం ఏకోశానా కనబడరాదు. ఈ స్ఫూర్తితో సుమంత్రుడు వారిని తన

దగ్గరకు పిలుచుకొనిరావాలి చివరి వాక్యంకూడ పరమాద్భుతంగా వ్యంగ్యార్థ ప్రతిపాదకంగా రూపొందింది "నా శంకలు తీఱె"- అని మొదట అస్మచ్ఛబ్దంతో నిలిచింది వాక్యం. వెనువెంటనే "ఱేనికిని సంతతి కల్గు భయంబు లేదికన్"- అనే వాక్యంలో 'నేను' 'ఱేడు'గా మారిపోయాడు మహాభావుకుడైన విశ్వనాథ కావ్య నిర్మాణంలో ప్రతి సూక్ష్మాంశమూ నిశితంగా పరిశీలింప వలసినదే అనటానికి ఇటు వంటి ఘట్టాలు నిదర్శనాలు. 'నాకు నిక సంతతిగల్గు భయంబు లేదహో' అన్నట్లుగా పలుక వద్దా? అని సామాన్యంగా అనిపిస్తుంది. కాని దశరథుడు తన్నిక్కడ ఒక వ్యక్తిగా, తన అనపత్యత కావలం వైయుక్తిక సమస్యగా భావించటంలేదు. అది తన రాజ్యానికీ, తన ప్రజలకూ సంబంధించిన విపత్కర పరిస్థితిగా భావిస్తున్నాడు. ఆ విపత్తులో తనకున్న భాగస్వామ్యాన్ని గూర్చి చింతిస్తున్నాడు. దానికి పరిష్కార మార్గమన్వేషిస్తున్నాడు ఈ పరిస్థితికి తాను కేంద్ర బిందువనే ధోరణితో ఆలోచిస్తున్నాడు. 'ఱేనికిని' అనేమాట వలన ఇప్పుడు తోచిన పరిష్కార మర్గంలో కారాధన సాధనంగా తోచి మురిసిపోతున్న ధోరణి అభివ్యక్త మవుతున్నది అతి సాధారణమైన పలుకులతో అతి గంభీరమైన భావజాలాన్ని స్ఫురింప జేయటంలో విశ్వనాథ అరితీరిన వాడనటానికి ఇది నిదర్శనం

వెంటనే రాజు ఆనంద తుందిలుడై అంతఃపురానికి వెళ్లాడు. అక్కడ "గల్లంబు హల్లకపాణి నూది బాష్పంబు లురల గూర్చున్న కౌసలాదేవిని జబ్బలు వేచి నిలుచుండబెట్టి కన్నుల గన్నులుంచి" అంటున్నాడు

వనజాక్షి నీవంక వనరగ బోకువే
నావంక చూడవే నలిన వదన
యమృతాంశు ముఖమండలా! దుఃఖమేటికే
కష్టముల్ తొలగెనే కంజనేత్రా

హరిణాక్షి! మన బాములన్న యు దీరెనే
బెడదలు తొలగెనే బిసరుహాక్షి!
మత్స్య పుచ్ఛాభిరామ విలోచనాంచల!
సుకృతముల్ పండెనే ముకురవదన.

క్రీడ హయమేధ మన్న నాగేటి కొఱ్ఱు
లాగి పాపంపు బెట్టు పొలాలు దున్ని
ద్విజ తర్పణమన్న బోదియలు త్రవ్వి
మంచి సుతులను శాలి పండించి వైతు

పద్యమంతా సంబోధనల మయం చేశారు కవి అందులో ఆయనకు కౌసల్యాదేవి ముఖ సౌందర్యము, కన్నుల కమనీయతా తప్ప మరేమీ కన్పడటంలేదు, సాధారణ పరిస్థితులలో ఈ దానిని ఉన్మత్త ప్రలాపన అనుకునే అవకాశం ఉంది. ఎందుకంటే ఆమె వయసు మళ్లినది అనవచ్చునో కాదో కాని నూతన వధువు మాత్రం కాదు. సంతానం లేకపోవటంవల్ల కుమిలిపోతూ కన్నులలో కాంతి రేఖలు కరువైన వ్యక్తి తనవల్ల తన నాథునకు కూడ మహాదుఃఖం వాటిల్లినదని గుండె దిగులుతో కుంచించుకు పోతున్న దీనురాలు. ఈ దశలో వనజాక్షి! నలినవదన! అమృతాంశు ముఖమండలా! కంజ నేత్ర! హరిణాక్షి! బిసరుహాక్షి! మత్స్య పుచ్ఛాభిరామ! విలోచనాంచల! ముకురవదన! అని సంబోధించటం ఎంతబాగు! అని సంభావించటం సమంజసమే

దీనికి విశ్వనాథవారి హృదయం ఇలా సమాధానం చెబుతుంది యజ్ఞంద్వారా యజ్ఞ పురుషుని సమారాధనచేసి సకల గుణాభిరాముడైన పుత్రుణ్ణి పొందగలనన్న ఉత్సాహాతిశయంతో క్రొత్త పెండ్లికొడుకువలె నైన దశరథునకు కౌసల్య నూతన వధువు వలె కనిపిస్తున్నది అందులో కన్నులలో కన్నులుంచిన దశరథుడు ఆమె

తత్త్వాలీన స్వరుపాన్ని కాక తొలిసారి చూలు ధరించిన ధర్మపత్నిని మనోనయనంతో మనసారా చూస్తున్నాడు పతి పారవశ్యాన్ని పరికిస్తున్న కౌసల్య కన్నులలో ముఖంలో వింతకాంతులు వెల్లి విరిసపోతున్నాయి వారిద్దరి కన్నులలోని ఆ ఆనందసాంద్ర స్థితి శ్రీమహావిష్ణువు ఆవాహనకు వెలిగించి పెట్టిన దీపాల కాంతి పుంజానికి ద్యోతకాలవుతున్నాయి ఈ ఆనందం ఆనందైక స్వరూపుడైన పరమాత్ముని అవతారానికి వ్యంజకమని కూడ భావించవచ్చు

ఈ విషయాన్ని కొంచెం వ్యాఖ్యానిస్తూ కవి తరువాత ఘట్టంలో అరంజ్యోతి ప్రియజ్యోతి అగు వశిష్ఠ భగవానునిచేత ఇలా అనిపించారు

నాయన! అశ్వమేధము నొనర్పు గరిష్ఠ సుమంత్రికృష్ణ నా
రాయణు దెచ్చెదన్ హవిసు నందగ నా పయి నీ యదృష్ట రే
ఖా యతి బుత్త్రుడున్ గలుగుగా పసతల్లియు గోసలేంద్ర క
న్యా యువతీ శిరోమణి మహాసుకృతంబుల పంట పండుగా

ఈ పద్యంలో పసతల్లి' కోసలేంద్ర కన్యా యువతీ శిరోమణి' అనే పదాలు మనం ఇంతకు ముందున్న కొన్ని భావాలను పట్టి యిస్తున్నాయి అసూయా గ్రస్తులు ఈ పదాలలో అనౌచిత్యాన్ని ప్రాస కోసం పడినపాటునూ చూస్తారు కానీ పూర్వాపరాలను మనోధర్మాలను కవిప్రతిభనూ సమన్వయించుకో గల సహృదయుడు రచనా సమకాలంలోని కవి గుండెను పట్టుకొని ఆనంద వీథీ విహారం చేస్తాడు

శాస్త్రకారులు ఆనంద వర్ధనులు కూడ వ్యంజకాలు సుప్తి వ్వాచన సంబంధాదులలా అనంత రూపాలలో ఉంటాయని స్పష్టంగా నిరూపించారు ఒకప్పుడు ప్రాస కోసం వేసిన అక్షరం కూడ వ్యంజకం కావచ్చు లేదా సమర్థుడైన కవి ఆ అక్షరం కోసమే ప్రాస నిర్మాణాన్ని ప్రారంభిస్తాడు

ఇటుపై సాగిన ఇష్టిఖండాన్ని శ్రీ విశ్వనాథవారు ఒక ప్రత్యేక తాత్పర్యంతో నిర్మించారు. యజ్ఞభూమి నిర్ణయం, యజ్ఞ కార్యాల అనుశాసనం అయిన తరువాత ఒక చంద్రోదయ వర్ణనం చేశారు కవి

క్రతుయత్న మెంతదూరము వచ్చెనో చూడ
వెళ్లేను వజ్రి వంపించె నొక్కొ
యజ్ఞాగతునకు నారాయణునకు మున్న
దలి పాంచజన్యంబు తరలె నొక్కొ
యాగఫలంబైన యమృత కుంభము మింట
దెరలి ప్రాగ్దిశ బయల్దెరె నొక్కొ
మైత్రావరుణి ప్రేమ మంజులాశీర్వాద
వల్లిక తలపూవు వదలెనొక్కొ

యష్ట తనువుల హోత్రి యైనట్టి తనువు
తోడి రుద్ర సరంభ విధూతి చెదరి
ముందునకు దూగెనో యన నిందు బింబ
మల్ల ప్రాచి పొరెడు పైని హాను లోలికె

ఇందులో మొదటి రెండు ఉత్ప్రేక్షలు ఈ యజ్ఞం ద్వారా రాజు దేవతలను, దేవతలు రాజును పరస్పరం భావించుకుంటున్నారన్న అర్థం స్ఫురిస్తుంది

"దేవాన్ భావయతానేన తే దేవా భావయన్తువః
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ"

అని గదా భగవద్వాణి! మఱియొక విశేషం. దేవతల విషయం ముందు ప్రస్తావించటం వలన దశరథుని ఇచ్ఛాపూర్తి ఆతనికంటె దేవతలకు అత్యావశ్యకమూ, అతిశయ ఫలదాయి అనే అంశం ప్రతీయమాన మవుతుంది

తరువాత కథలో ఋష్యశృంగోపాఖ్యానము చెప్పిన వెనుక మరొకమారు చంద్రవర్ణనం చేశారు విశ్వనాథ.

ఒనర బోర్కాడించి యుయ్యేల తొట్టిలో
బండ బెట్టిన పసిపాపవోలె
వీథులంబడి తిర్గి బూదియ మైజల్లు
కొని పర్వులం బెట్టు కుఱ్ఱవోలె
నన్నమ్ము దించు మోమంతయు బెరుగన్న
మును జేసికొన్నట్టి బొట్టివోలె
జిట్టి! తలంటి పోసెద నన్న నందక
తొలగి పర్వులు వెట్టు నులిపివోలె

వెల్లదుస్తులు కట్టించి వీథులన్ షి
కాదు పంపిన రాజకుమారు వోలె
మింట నడుచక్కి జాబిల్లి మేది నీశు
నేత్రములకు జలువ బండించి వోసె.

దశరథునకు అప్పుడు కన్పడిన చంద్రుడు - భవిష్యద్రామచంద్రుడే అని వ్యంగ్యమార్గాన కవి మనకు ఈ పద్యం ద్వారా సాక్షాత్కరింప జేస్తున్నారు

విశ్వనాథ క్రతువును సాంగోపాంగంగా మహాశ్రద్ధగా వర్ణించారు. అతిథి సంతర్పణను అతిలోకంగా వర్ణించారు మిత్ర సంభావనను పరమాదరంతో వివరించారు అన్నింటికంటె ఋత్విగ్దక్షిణగా భూమినంతటినీ లాంఛనప్రాయంగా ఇవ్వాలన్న సంగతిని మరచిపోయి - నిజంగానే దశరథుడు పండిన వైరాగ్య భావనతో ఇచ్చివేయటానికి సంసిద్ధుడవటాన్ని పరమ మనోజ్ఞంగా తీర్చారు ఈ యిన్నింటినీ సమాలోకిస్తే పాఠకునకు కలిగే స్ఫూర్తి ప్రబంధ ధ్వనిగా ఈ క్రింది విధముగా ఉంటుంది

ఆనంద స్వరూపుడైన పరమాత్ముని పట్టుకోవటానకి సంస్కార వంతమైన జీవాత్మ దశరథ రూపంలో పరితపిస్తుంది అదియే తపస్సు. ఆ తపఃఫలంగా ఆతనిలో పరమాత్మ లబ్ధికి మార్గం గోచరిస్తుంది. అదే యజ్ఞం ఆ సంకల్పం కలిగే వేళకు ఉన్న సర్వదుఃఖాలు అంతరించి పోతాయి అక్కడనుండి ఆనంద లబ్ధి ప్రయత్నమంతా ఆనందాత్మకంగా ఉంటుంది అదే దశరథుని ఉత్సాహాతిశయ రూపమైన కార్యకరణ శీలం కవి శాస్త్ర మర్యాదలను క్షుణ్ణంగా ఆకళించుకొని చేసిన యజ్ఞవర్ణన దశరథుని కర్మ శ్రద్ధకు దర్పణం పడుతుంది అతిథి సంతర్పణ అంతటా ఉన్న అంతరాత్మను గుర్తించటంలోని దృక్పథానికి స్ఫోరకం రాజ్యదానం "త్యాగేనైకే అమృతత్వ మానశుః" అన్న ఉపనిషదర్థాన్ని నిరూపిస్తుంది. రాముడు కొడుకై పుట్టటం కంటె అమృతత్వానికి ప్రతీక మరొకటి ఏముంటుంది?

ఈ విధంగా శ్రీ విశ్వనాథవారు ఇష్టిఖండాన్ని మహార్థ స్ఫోరకంగా నిర్మించి అమృత కుంభాన్ని మనకందించారు. అది ఖండాంతములో రెండు పద్యాలలో "పాయిసోపనిషత్" అన దగిన విధముగా మనకు కాన వస్తుంది.

ముది వృదాకువు సెజ్జ మునులు జోదిళ్ళయు
　　హాళిమై గూర్చు సుమాళి యొకడు
ప్రా మిన్కు చిట్ట చివళ్ళలో నసులరు
　　దోరించునట్టి కటారి యొకడు
ప్రామట్టి క్రీనీడ బారమ్ము మునలు లొ
　　మునులచే జదివించు పోటడొకడు
పాలవెల్లి కరళ్ళపై వెలికింతలై
　　కాలి వ్రేల్చెదు కందొకండు

పసిడియై గాలికిని రాలిపడిన యొక్క
నలుసు నివ్వెరిముల్లైన వెలు గొకండు
స్థూలమై వచ్చి వచ్చి తా సూక్ష్మమగుచు
జనపతి కరస్థ మగు పాయసమున జొచ్చె

అసుర కన్యా కంఠహార మంగళ సూత్ర
సూత్రి కర్తన కేళి సురియవాలు
దనుజ వాపీ కేళి వన సర్వతో భద్ర
భద్రితా హనువుపై బావకోడు
బర్హిర్ముఖాళి సంపత్తి వృద్ధ్యా జీవ
జీవ మ్మొగాకృష్టి జిగురుకండె
ముని ధర్మ కర్మ నిర్మూలనోత్కృప కంఠ
కంఠ దేశములకు గాని దిగులు

సూరిలో కైక కంటకాసుర వితాన
ప్రాణములపైకి నెత్తిన పాముపడగ
యగు మహాజ్యోతి యొక్క తంతంత వచ్చి
జరపతి కరస్థమగు పాయపమున జొచ్చె.

ఈ రెండుపద్యాలలో భగవంతుని కర్తవ్యత్రయం చక్కగా నిరూపింపబడింది. దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మస్థాపన అనేవి ఆ మూడు కర్తవ్యాలు శ్రీమద్రామాయణ కల్పవృక్షానికి బీజప్రాయమైన ఇష్టిఖండం పండించబోయే మహాఫలాన్ని మనోజ్ఞంగా చూపిస్తున్నాయి ఈ రెండు పద్యాలు

ఈ విధంగా కవి విశ్వనాథ ఇష్టిఖండంలో శ్రీ మహావిష్ణు దశరథునే ఎందుకు తండ్రిగా ఎంచుకోవాలో వ్యంగ్య మార్గా పరిబంధ ధ్వని రూపంలో నిరూపించిన విషయాన్ని సంగ్రహముగా వివరించటం జరిగింది



# కల్పవృక్షంలో అలంకార వైచిత్రి

డాక్టరు మల్లాది సుబ్బారాయుడు

శ్రీ మద్రామాయణ గాథను మహా కవులెందరో కావ్యాలుగా సృష్టించారు. కాని విశ్వనాథవారి చేతిలో రామచరిత్ర కల్పవృక్షమైంది. వారు కవిసామ్రాట్టులై జ్ఞాన పీఠాధి రోహణం గావించారు వారు వాల్మీకి చెప్పిన మూల కథను మాత్రం గ్రహించి స్వీయ ప్రతిభా ప్రవత్తుల్తో రసానుగుణంగా కల్పనలు చేసారు.

"రసము వేయిరెట్లు గొప్పది నవ కథాధృతిని మించి" అన్న వారి మాట వారి రసదృష్టిని తేటతెల్లం చేస్తోంది. రస పరిపుష్టికి దోహదం చేసేలా వారు వాడిన అలంకారాలు వాటిలో వారు చూపిన పదప్రయోగ నైపుణ్యం నాన్యతో దర్శనీయం అలంకారాలు పరమ ప్రాచీన కాలంనుండి ప్రయోగింప బడుతూనే ఉన్నాయి వేదాల్లో ఎన్నో అలంకారా లున్నాయన్న విజ్ఞుల పరిశీలనలో తేలిన అంశం అలంకారాల ద్వారా విశ్వనాథ వారు కల్పవృక్షంలో సాధించిన వైశిష్ట్యం, సౌందర్యం, సమీక్షించడం ఈ వ్యాసరచనకు పరమావధి

"అలంకారో తీత్యం లంకారః" అలంకరించునది అలంకారం అని వ్యుత్పత్తి. అలం క్రియతే అనేన చారుత్వ హేతురలంకారః అని విద్యానాథుని నిర్వచనం దేనిచే రసం అలంకరింప బడుతుందో దానికి అలంకారం అని పేరు. రస స్ఫూర్తికి కారణం అయిన కావ్య కన్యకను అలంకరింప జేయు వాగ్వైచిత్రి అని అర్థం అలంకార రహితమగు కావ్యం ఆభరణాలు ధరింపని స్త్రీ ముఖంవలె ప్రకాశింపదని భామహుడు పేర్కొన్నాడు ఇతర కావ్య సామాగ్రివల్ల కల్గిన కావ్య సౌందర్యమని మఱింతగా రాణింపజేసేవి అలంకారాలని భామహుని ఆశయం. అదే విషయాన్ని విశ్వనాథుడును పేర్కొన్నాడు.

అలంకారాలు సౌందర్యోపాదకాలని వామనుడు అన్నాడు అలంకార వాదులు కావ్యాత్మను గూర్చిన చర్చకంటె కావ్య సౌందర్య సాధనాల గూర్చి ఎక్కువగా చర్చించారు. అలంకారాలు ప్రయోగింపని కవిగాని వానిని గూర్చి చర్చింపని అలంకారికుడు గాని సాహితీ జగత్తులో లేరు దీన్ని బట్టి కావ్యసామాగ్రిలో అలంకారాల కున్న స్థానం తెలుస్తుంది

విశ్వనాథవారు తాము రచించిన రామాయణ కల్పవృక్ష మహా కావ్య కథను సమ విభక్తంగా ముప్పది ఖండాలుగా విభజించారు ఒక్కొక్క కాండలో అయిదేసి ఖండాలున్నాయి ఇవి రస సిద్ధికి పరమపద సోపానాలుగా నిలిచాయి వీరు కల్పవృక్షములో శబ్దాలంకారాలకన్న అర్థాలంకారాలనే ఎక్కువగా వాడారు కథా కథనంలో రస పరిప్లుతి నందుతూ, పాత్రౌచిత్యానికి వన్నెతెన్తూ, కవితా సౌందర్యానికి అద్దంపడుతూ పారకుల హృదయాల్లో పది కాలాలపాటు నిలిచేటట్లు విశ్వనాథ అలంకారాలు ప్రయోగించారు

"అలంకార శిరోరత్నం సర్వస్వం కావ్యసంపదాం
ఉపమాకవి వంశస్య మాతైవేతి మతిర్మమ"

బాల కాండంలో ధనుష్కండంలో విశ్వమిత్ర మహర్షి తపోస్థలి వర్ణించు పట్టున ఉన్న పద్యం హృద్యాతి హృద్యమైయున్నది

మాకంద తరుశాఖికా కోకిలా లాప
కౌతూహలాకార కలనజేసి
ప్రాతస్సమాయాత శీతానిలధూత
సాధుపల్లవ హస్త సంజ్ఞజేసి

ఇందు వసంత శోభ అప్సరసవోలె వచ్చిందట. కోకిలాలాపాలు సాధుపల్లవ హస్త సంజ్ఞలు మోహనలతలు సాదృశ్య ధర్మాలు

అప్సరసవోలె వసంతశోభ హృదయానంద దాయకం ఇందలి కవితా దార కాంతికంటె స్వచ్ఛమై స్రవించిపోతుంది భూమికి అవత రించబోయె మేనక కథ సూచన మాత్రముగా తెల్పబడింది అప్సరసయైన మేనక హొయలు వసంతశోభతో ముందుగా కదలి వచ్చింది. వసంతశోభ ఆశ్రమానికి అందానందిస్తే ఆ సీసం విశ్వనాథ వారి కవితకు వింతశోభనం ఎచ్చింది ఇది శ్రౌతీ ప్రభేదమైన ఉప మాలంకారం, ఆంగరసమైన శృంగారానికి పరిపోషకంగా ఈ అలం కారం మలచబడింది

శ్రీరామచంద్రుని పాదస్పర్శచే చైతన్యం పొందిన అహల్య పర్ణశాలాభ్యంతరములో బంతులు తీర్చి కూర్చున్న మునులకు భోజ నము పెట్టే సందర్భములో

"ఒక చేత గాంగవారి కమండలువు పూని
యన్నపూర్ణాదేవి యనగ వచ్చిన"

నట్లు విశ్వనాథ వారు వర్ణించారు అంతటిబాధ తీర్చడంతో అహల్య అన్నపూర్ణాదేవితో భావ సాదృశ్యం పొందింది అన్నపూర్ణ కౌశికా నగర పాలకపీర శిఖాదిరూఢ, అహల్య వారి అలకని తీర్చడానికి అన్నపూర్ణగా వచ్చింది జగజ్జననితో అహల్యను పోల్చడం చేత ఆమలోని పావిత్ర్యం వ్యక్తీకరింప బడింది

రామలక్ష్మణులు తమ జిలుగు వస్త్రములు వదలి నారచీరలు కట్టుకొని వనవాసమున కేగు సందర్భములో సీతాదేవి స్వభావం తెలిపేటట్లు చక్కని ఉపమాలంకారం ప్రయోగించారు

చను కిరాతి పన్ని చన్నట్టి పతిగాంచి
లేటివోలె, బెదరి బోటి సీత
నారచీర గాంచి నాథుని కోదండ
మానుకొనియె మేను మ్రాను కొనగ

నార చీరలు కిరాతి పన్నిన వలవోలె ఉంది. ఆ వలను గాంచి లేడిలా సీత బెదిరింది. అంతే కాదు మాౖన్పడి పోయింది. సీత స్వభావం లేడిలా ముగ్ధ మనోహరమైందని సాధు పౖవర్తన అని తెలుస్తోంది. వలతో తగుల్కొన్నట్లుగా నారచీరలు దాల్చేమని భావించింది. రాముడు అరణ్యానికి పోవడంచేతనే విపద్దశ పాౖరంభమైంది. నారచీరను కవి వలతో పోల్చేరు పద్యంలోని కిరాతి శబ్దంచే కైక పాౖతే సూచింపబడుతోంది

చెఱువులో బూలు చేతుల జిమ్ముకొంచు
గడకు జేరంగ జను నీతగాడువోలె
నెదురయిన నవ్వు మొగముల యిఱకటమున
రాజు నీదుచు నంతిపురంబు జేరె

దశరథుడు పాయస పాౖత చేతబట్టుకొని అంతఃపురానికి వెళ్ళేడు. మార్గమధ్యంలో చిరునవ్వులు చిందిస్తూ ఎందరో రాజుకి ఎదురయ్యేరు. వారందరినీ తప్పించుకొని రాజు అంతఃపురం చేరుకొన్నాడు ఈ నేపథ్యంలో దశరథుడు ఈతగాడు వోలె అని ఉపమ పౖయోగించారు. నవ్వు మొగాలు పువ్వులు తోట దశరథుడు ఈతగాని తోటి సాదృశ్యం పొంది ఉపమాలంకారం ఏర్పడింది. బిడ్డలు లేక జీవితాన్ని ఎంతో దుఃఖంతో గడిపిన దశరథుడు ఈతగానిలా అవతలి ఒడ్డుకి చేరుకోబోతున్నాడు ఇక్కడి చెరువు పున్నామ నరకానికి పౖతీకగా పౖయోగింప బడింది కవులు తామరలతో నిండిన చెరువులో ఈ దేహానికి నాశిని పౖక్కకు నెట్టడం లోక సహజం. పౖకృతిలోని ఈ విషయాన్ని చక్కని అలంకారంగా విశ్వనాథవారు నులిచారు చిన్ననాడుల పల్లెపట్టుల్లో జీవితం గడిపిన విశ్వనాథవారు తదనుగుణంగా ఈ అలంకారం నిర్వహించారు

రాముడు అరణ్య వాసానికి వెడుతూ తల్లియైన కౌసల్య కడకు వచ్చి అనుమతిని అభ్యర్థిస్తాడు ఆ సమయంలో కౌసల్యకు

దుఃఖం కట్టలు తెంచుకొని ప్రవహిస్తుంది రాముడు లేని తన జీవితము తలచుకొని కుంగి పోతుంది. ఆ సందర్భములో కౌసల్య హృదయ పరితాపం ప్రస్ఫుటమయ్యేటట్లు విశ్వనాథవారు చక్కగా వర్ణించారు రాముని గూర్చి కౌసల్య పల్కిన పల్కులివి

విరిగిన పాలకన్న సులువే యయిపోతిని మున్ను, నీవుగా
దొర వగుదన్న ప్రాఁ బెరిమతో నొక తూకము వచ్చె, దానికిన్
విరుగుడు పుట్టె, నీవిటుల వెళ్ళిన రేపటి దోటకూరలో
బురుగును దుల్పినట్లు దులుపుల్ పడనా మతిభావనాయతీ!

ఓ రామా! నేను విరిగిన పాలకన్న చులకన అయిపోయెను. నీవు వెళ్ళిన పిమ్మట తోటకూరలో పురుగును దులిపినట్లు నన్ను దులుపుతారు అని అన్నది పురుగును చూచినట్లు చూస్తారని తెలుగు వారు మాట్లాడుకొనే తీరులో విశ్వనాథవారు పలికించారు ఆమె మనస్సులోని భావన యదార్థం కాకపోవచ్చు కాని ఆమె ఆవేదనతో అట్లా పలికింది ఎంత స్వచ్ఛమైన పాలైనా విరిగితే వాటికి విలువ లేదు గదా! అదే సమయంలో కౌసల్య కైకను దృష్టిలో పెట్టుకొని "మొదట కాచిన కాయతోనే ముఃణీ గాఁగ తెలియవచ్చె" అంటుంది సవతి అయిన కైక ఆ లక్షణాన్ని మొదటి వరం తోనే తెలియచెప్పింది అన్న భావాన్ని తెల్పుతుంది కైక ముషిణి వంటింది అన్నమాట అందలి భావగాంభీర్యం ఆలోచించ వలసిందే కవిత్వం ఆలోచనామృతం కదా, పై రెండు అలంకారాల్లోని రెండు సమాసాలు విశ్వనాథవారు గ్రహించిన తీరు, వ్యక్తీకరించిన తీరు విలక్షమైంది

రామ పట్టాభిషేక వార్త మంథర విన్నది ఆమెలో క్రోధం అసూయా పాము విషంలా తారాస్థాయికి చేరింది. గబగబా కైక మందిరానికి వెళ్ళింది మంథర అప్పుడు కైక నీలి తెఱగప్పి సుఖాసుఖ నిద్ర పోతూ ఉన్నది అప్పుడు మంథర పల్కిన పల్కులు గమనింప దగినవి.

అవునె దౌర్భాగ్య మాకారమైన దాన
నీకు నిద్దుర యెటుపట్టునె దరిద్రు
రాల, యొకవంక నింటి చూరంటు కొనిన
సొగసుగా చలికాగెదు పగిది తోప"

"ఓసి దరిద్రురాల! ఒకవైపు చూరు అంటుకొని ఇల్లు కాలిపోతూ ఉండగా చలికాచు కొంటూ ఉన్నట్లు రామపట్టాభిషేకమనే అగ్ని నీ ఇంటి చుట్టూ ముట్టి ఉండగా ఎలా నిద్రపోతూన్నావని మంథర నిలదీసి ప్రశ్నించింది. పట్టాభిషేక వార్త మంథరలో ఎంతటి చిచ్చు పెట్టిందో మనం గమనించవచ్చు. చూరంటుకొనే సమయములో చలికాగితే ఎటువంటి ఫలితం వస్తుందో నీకూ అదే ఫలితం వస్తుందని హెచ్చరించింది మంథర దాది హెచ్చరికకు, అందులోని తీవ్రతకు పై అలంకారం ఎంతో దోహదం చేసింది తెలుగులోని సామెతనే అలంకారంగా మలిచారు

సీతాదేవిని రావణుడు అపహరించుకొని పోతూ ఉండగా జటాయువు రావణుని ఎదుర్కొన్నాడు యుద్ధం చేశాడు. ఆ సందర్భములో విశ్వనాథ వారు వ్రాసిన ఈ క్రింది పద్యం తిక్కన కవితను స్ఫురింప జేస్తోంది

అగ్గిని జీరలో ముడిచి యక్కట దొంగిల బోయినట్లుగన్
భగ్గున మండెదో శివశివా, నిను నార్పను రాదె చేటలన్
బుగ్గిని బోసియున్ జివరిబుగ్గిని జేటల నెత్తియైన నీ
యగ్గి శమింపదే యుగయుగాది మధర్మము నందు ద్రోహమై.

ఓ రావణా! అగ్నిని చీరలో దాచివేసి దొంగతనము చేయబోయినట్లు సీతను రథముపై నిడికొని అపహరించుకొని పోవుచున్నావు అని జటాయువు పల్కాడు అపహరించడం, నశించడం రెండెంటి సమాన ధర్మాలే వానితో పాటు సీతయొక్క అగ్ని యొక్క

తేజస్వితకూడా సమాన ధర్మమే. సీత అగ్నివలె స్వయం పరిశుద్ధురాలు అని ధర్మద్రోహులను భస్మీపటలం చేయగల సమర్థురాలనీ సువ్యక్తమవుతోంది రావణుని మరణం ఈ అగ్ని శమించదని కూడా జటాయువు హెచ్చరించాడు జటాయువు యొక్క ధర్మనిష్ఠ, సీతాదేవి అతిమానుష శీల సంపద విశ్వనాథ వారికి ప్రాచీన సాహిత్యముపై ముఖ్యముగా తిక్కన రచనా విధానంపై గల మక్కువ తేటతెల్లమవుతోంది "చిచ్చాడిం గట్టినయట్లు" అన్న తిక్కన్న గారి ప్రయోగం ఇక్కడ రూపాంతరం చెంది అగ్నిని చీరలో ముడిచి అన్న ప్రయోగంగా మారింది. తిక్కన కవితను స్ఫురింప జేస్తోంది

శూర్పణఖ ఖరదూషణాదల దగ్గరకు వెళ్ళి, రామలక్ష్మణులు పరాభవించిన తీరు వివరించి ముక్కు, చెవులు చూపించి విలపించింది. ఆ సమయంలో దూషణుడు రాముని గూర్చి పల్కిన పలుకులు సహృదయ హృదయా కర్షకాలు

"సాధు మృష్టాన్న భోజన సమయమందు
బంటి క్రిందకి గులకఱా వచ్చినట్లు
పీడొకడు వచ్చినాడయ్య వీరమాని
యల్పమును లెల్ల పీడొకడధికుడంచు"

"దండకారణ్యములో మునుల నందర్ని మృష్టాన్నంగా భజించే మనకు భోజనం చేసేటప్పుడు గులకరాయి వచ్చినట్టుగా రాముడు ఆటంకాలు కల్గిస్తున్నాడని దూషణు డంటాడు పంటికింద గులకరాయి పడితే పన్నే విరగవచ్చు. రాయి పగలదు పైగా తినే పదార్థం రుచి సంగతి ఎలా ఉన్న పంటిబాధ మాత్రం మిగులుతుంది ఇది ప్రతి వారికి నిత్యజీవితములో అనుభవైకవేద్యమైనదే రాముడు అభేద్యుడన్న విషయం స్పష్ట పరపబడింది ఇది విశ్వనాథ వారు భావనాబలముతో ప్రయోగించిన అలంకారంగా అనవచ్చు స్వీయ ప్రతిభతో అలంకార వైచిత్రిని ప్రదర్శించారు

శూర్పణఖ తన పరాభవముతో పాటు సీతా సౌందర్యవార్త రావణుని చెవిలోవేసింది ఆ చుప్పనాతి సీతాసౌందర్యం ప్రస్తుతించిన తీరు మెచ్చదగింది

"సంగీతము వలె అపాత మధురమైన సీతా సౌందర్యమే వేరు"

సీతా సౌందర్యం సంగీతంవలె ఆ పాత మధురమైనదని ఆమె అభిప్రాయం చెవినబడిన వెంటనే సంగీతం ఆనందం కల్గించి నట్లుగా నీ కంటబడిన వెంటనే సీత నీకు ఆనందం కల్గిస్తుంది అని ఆమె వ్యంగ్యంగా చెప్పింది రాగతాళ కంఠమాధుర్యాదులచే సంగీతం ఆనందం ప్రదం అట్లే సీత రూప వయో విలాస లావణ్యాదులచే ఆనందం కల్గిస్తుందని చెప్పింది ఆ మాట విన్నంతనే రావణుడు తల లూపి, సీతాపహరణానికై నాంది పూజ కావించాడు సంగీతం వలె సీతా సౌందర్యం హృదయైక వేద్యం స్త్రీలను కూడా మోహ పెట్టే సౌందర్యం సీతది. ఈ విషయము శూర్పణఖ చక్కగా చెప్పింది

ఇల్వలుడనే రాక్షసుడు కామరూపుడయి, త్రోవ కాచి బాటసారులను భోజనము పెట్టెదను రమ్మని పిలిచి ఇంటికి తీసుకొని వెళ్ళేవాడు తమ్ముడైన వాతాపిని గొర్రెగా మార్చి చంపి వారికి ఆహారం వడ్డించి వారు తిన్న తర్వాత తమ్ముని పిలిచేవాడు ఇల్వలుడు ఆ బాటసారుల పొట్ట చీల్చుకొని వాతాపి బయటకు వచ్చేవాడు ఆ తర్వాత ఆ బాటసారుల్ని వారిద్దరు తినేవారు ఇదీ కథ మోసం చెయ్యడం ఇల్వలుని పని, వాడెలా పొంచి ఉండేవాడో విశ్వనాథ అలాగ దర్శించారు చూద్దాం

ముదురు తొండ యొకడు ముంగాళ్ళపై నిక్కి
నిశ్చలంబుగాగ నిలచియుండి
కాళ్ళనడుమ నుండి కదలు చీమల బారు
చెదరు చీమలను గ్రసించునట్లు

తొండ నిశ్చలముగా నుండి కాళ్ళమధ్య నుండిపోవు చీమల గుంపులో చీలిన చీమలను మ్రింగునట్లుగా ఇల్వలుడు ద్రోవదప్పిన బ్రాహ్మణులను గ్రసించేవాడట ఇది ప్రకృతిలో తొండ ఆహారం సంపాదించుకొనే విధం. అలాంటివాడే ఇల్వలుడు ప్రకృతి పరిశీలనాచణులైన విశ్వనాథవారు చక్కగా ఈ అలంకారాన్ని ప్రయోగించారు.

శబరిని వర్ణించు ఘట్టమున చక్కని ఉపమాలంకారం గలదు శబరి రుచ్యములైన పండ్లను, సుగంధ భరితాలైన పుష్పాలను మెట్టపళ్లికలో పెట్టికొని, ఆ పట్టిక తలపై పెట్టుకొని రాముని దర్శింప వచ్చిందట ఆమె ఎట్లున్నదో పరికించండి

"． ． ... ．
విడివిడిగ మెట్ట పళ్ళిక బేర్చి శిరను
పైని నిడుకొని మెల్లగా వచ్చె శబరి
తుట్టతుదదాక నెండిన చెట్టుకొమ్మ
శేఖరంబున యందు ఋష్పించినట్లు"

వయసు ముదిరిన చెట్టు ఎండిపోవుట సహజం. ఆకులు రాల్చి ఎండిపోయిన చెట్టు కొనకొమ్మ పుష్పిస్తే ఎట్లా ఉంటుందో శబరి అట్లుందట దీనిని బట్టి శబరి శారీరక స్థితిని పాఠకులు ఊహించుకోవచ్చు. శబరిలో ఎండిన మోడే కన్పిస్తుంది. తలపై పుష్పాలు ఎంత చక్కని ఉపమానం ఆమె మనస్సు ఎంత ఉన్నతమైంది అనే భావం స్ఫురిస్తోంది

రామలక్ష్మణులతో కలిసి విశ్వామిత్రుడు మిథిలా నగరమునకు పోవుచుండగా జీర్ణం అయిన ఆశ్రమము కన్పించింది ఆ ఆశ్రమము బీడైనది, పర్ణశాల పాడైనది చుట్టు ప్రక్కల పుట్టగొనను కన్పించకుండెను ఆ గౌతమాశ్రమ వర్ణనం, అందలి ఉపమాలంకారం గమనించదగింది

కడు పరిభ్రష్టమైన యోగంబు వోని
యాశ్రమము జూచి రాముని యశ్రులందు
బాష్పములు గుత్తులై రామభద్రు ముఖము
హరివదలి చన్న వైకుంఠమట్లు తోచె.

పరిభ్రష్టమైన యోగము వలె గౌతముని ఆశ్రమము ఉన్న దట అట్లే హరి వదలిన వైకుంఠమట్లు తోచుచున్నదట హరిలేని వైకుంఠం ఎట్లా ఉంటుందో ఆ ఆశ్రమము అలా ఉందట. హరి రాముగా అవతరించాడు నిజంగా హరి వైకుంఠాన్ని వదిలాడు మహా యోగి అయిన గౌతముని యోగాభ్యాసానికి దూరమైంది ఆ ఆశ్రమం భ్రష్టయోగిత్వం గురించి చక్కగా చెప్పారు విశ్వనాథవారు.

విశ్వనాథవారు తెలుగు సామెతలను చక్కని ఉపమాలంకారాలుగా ప్రయోగించి అటు తెలుగు తియ్యందనాన్ని, ఇటు అలంకారిక వైభవాన్ని చాటారు రావణుడు తన పదితలలను నరికి ఈశ్వరునికి అర్పించాడు తనంతవాడింకొకడు లేడని అనుకొనే సందర్భములో వాడిన సామెతలు, దానివలన సాధింపబడిన అలంకారం పరిశీలించ వలసియుంది.

"అయినవారికేమొ యాకుల యందున
గానివారి కైన గంచములను
ఇంటిలోన దించు నింటివాసంబులు
లెక్క పెట్టునట్టి లెక్కగాగ

రెండు సామెతలు ఒకేసారి ఉపయోగింపబడినవి. శివుడు హంస రూపంలో సీతారాముల మధ్య రాయబారం నెరపుతాడు ఈ విషయం గుర్తించిన రావణుడు తనలో అనుకొన్న మాటలు తన ఇంటిలో ప్రతినిత్యం శివపూజ చేసేవాడు రావణుడు తిన్న ఇంటి

వాసాలు లెక్కపెట్టినట్లుగా శివుడు శత్రువగు రామునకు రాయబారం నెరిపాడు ఇది రావణుని వ్యథకు మూలం పై రెండు సామెతలతో రావణుని స్థితి చక్కగా విశ్వనాథవారు వర్ణించారు అట్లే శూర్పణఖ సీతను గూర్చి

"త్రాడువోలె వచ్చి దబ్బనమును బోలె
తేలునట్టి యంత తెలివిగలవు"

అని పలికింది శూర్పణఖ పలుకులు తెలుగవారికి తేటతెల్లమైనది సీతా సాహచర్యం వల్లనే రాముడు తనను తిరస్కరించెనని శూర్పణఖ అసూయతో అన్న మాటలివి దబ్బనపు పోటులవలె నున్నవి తనకు దొరకని సుఖము సీతకు దక్కినందులకు శూర్పణఖ పొందిన దుఃఖం పై వాక్యాలలో చక్కగా వర్ణింపబడింది

"పది తలల కుండలంబుల
గదలాడిన రవలకాంతి కడలయందున ని
ర్వది జాబిల్లి వెలుంగులు
పొదలిన వగు వెలుగు గంబములుగా నొప్పన్"

రావణుడు రథమెక్కి మారీచుని ఆశ్రమమునకు పోవు సందర్భమున పై పద్యం కూర్చబడింది రావణుని పదితలలకు కుండలాలు ఉన్నవట చెవుల కవియే లక్షణార్థము కుండలాల్లో రవ్వలు పొదుగబడ్డవి రావణుల కుండములందలి రవ్వలకాంతులు దిక్కుల కొనలను జాబిల్లి వెలుంగులతో నిండిన ఇర్వది దీప స్తంభము లాయన్నట్లుండెను సాధారణముగా సాగర ప్రాంతంలో నావికలు తీరమును గుర్తించుటకు దీప స్తంభములు [లైట్ హౌస్] స్థాపించుదురు దానిని ఆధారముగా జేసుకొని, విశ్వనాథవారు రవ్వలకాంతులను దీప స్తంభములుగా సంభావించినారు.

బాలకాండములో దశరథుడు సుమిత్రతో సుతులను పొందే గోరికతో అశ్వమేధయాగం చేయ సంకల్పించాడు. మునులెల్ల వల్లె యనిరి అది చెబుతున్న సందర్భములో చక్కని దృష్టాంతాలంకారం గలదు

"దీక్షగైకొని వ్రత యుక్తి ధృతమనో వి
నిశ్చయాత్మవు సుతుగోర్కె నెగడెదేని
ఫలము గందువు పొలములో వాన యొక్క
చెక్క గురిసి వేరొక చెక్క జుక్కపడదె"

పుత్రులు కావలెనన్న కోర్కె నీకున్నచో యజ్ఞదీక్ష వహించి నీవూ ఫలము పొందుము. మొత్తము పొలంలోని ఒక చెక్కలో వాన కురిసి వేరొక చెక్కలో చుక్క పడకుండ ఉండదు గదా అని దశరథుడు అంటాడు. దశరథుని భార్యలు ముగ్గురుగదా! చెక్క అనుమాట క్షేత్రం అను మాటకు తెనుగు పదము వర్షం అన్ని చెక్కల్లో పడట్లు ముగ్గురి భార్యల కడుపు పండాలని దశరథుని ఆకాంక్ష ఆ ఆకాంక్ష నిశ్చయ రూపం పొంది నల్గురు బిడ్డలు ద్భవించారు ఇందు దశరథుని హృదయ ప్రవృత్తి సుమిత్రయెడల అతనికి గల సుమిత్రత్వం స్పష్టమవుతోంది దీక్ష కష్టమైనది అని తెల్పుతూ ధృత మనో వినిశ్చయాత్మవు కమ్మని దశరథుడనంటులో స్థిర సంకల్పం అవసరం అన్న విషయం స్పష్ట మవుతోంది.

ఈ విధముగా విశ్వనాథవారు తమ రామాయణ మహాకావ్యములో ఎన్నో అలంకారాలు ఎన్నెన్నో విధాలుగా ప్రయోగించి కవి సామ్రాట్ బిరుదును సార్థకం చేసుకున్నారు



# ఆధునికాంధ్ర కవిత్వంలో విశ్వనాథ స్థానము

ఆచార్య కొలకలూరి ఇనాక్

విశ్వనాథ మహాకవి పద్యకవి. గేయకవి నాటక నాటిక రచయిత నవలాకర్త, కథా రచయిత సంస్కృతాంధ్ర ఆంగ్లము లలో పండితుడు, రచయిత, సాహిత్య విమర్శకుడు, తాత్త్వికుడు, ప్రతిభా సంపన్నుడు, విశేష వ్యుత్పన్నుడు, విశిష్ట దార్శనికుడు ఇంతటి విస్తృత సాహిత్యమును సృష్టించిన వాళ్ళు ఈ యుగము నందు లేరు వీరేశలింగం పంతులుగారు గత యుగ సాహితీమూర్తిగ పరికించి పరిశీలిస్తే అంతకు ముందు ఇంతటి విశాల సాహిత్యమును సృష్టించిన వాళ్ళు ఇంచుమించు లేరు అని చెప్పవచ్చును.

ఏ భాషలోనయినా ఇంత విస్తృతము సాహిత్యము సృష్టించిన వాళ్ళు అరుదుగానే ఉంటారు. విశ్వనాథకు జరిగిన సన్మానాలు లభించిన గౌరవములు, విశేష విషయములే అఖిలాంధ్రం గౌరవించినది భారతదేశంలో అనేక ప్రాంతములు అభిమానించాయి అనేక బిరుదములను పొందినారు జ్ఞానపీఠ బహుమతి పొందిన మొదటి అంధ్రుడు ఇంతవరకు ఇద్దరే ఇకముందు ఎందరు అయినా ఒక జీవిత కాలములో వేళ్ళమీద లెక్కించవలసినదే వీరిని విశ్వనాథ సాహిత్యములో వస్తువు సాధారణముగా పౌరాణికముగా నుండును లేకపోతే చారిత్రకముగా ఉండును ఎప్పుడయినా సాంస్కృతిక రాజకీయ నేపథ్యముతో పౌరాణిక చారిత్రక ధర్మంతో ఉండము జరుగతుంది. సాంఘిక వస్తువూ ఉంటుంది అయితే దీనికి పౌరాణిక చారిత్రక స్పర్శ ఉంటుంది

విశ్వనాథ పౌరాణిక చారిత్రక వస్తు దృష్టి విశిష్టము పురాణ ఇతి హాస జీవితముపట్ల అవగాహనము, అవలోకనము అత్యంత జాగురూకతో దీక్షా దక్షతలు ఆయనయందు నిండి యున్నాయి. భారత

దేశ చరిత్ర పట్ల అభిమానము ఆత్మీయిత ఆలోచన నిశితముగా ఉంది జాతి చరిత్రకు చారిత్రక యుగాల అవగాహనమే విదేశీయ చరిత్రకారుల వ్రాతలు వక్రభాష్యాలు చెప్పాయని నమ్మకము నాగరికతా వ్యామోహముతో దేశము పొందుతున్న పోకళ్ళకు వ్యతిరేకముగా అభిమానవంతుడి ఆత్మార్పణము విశ్వనాథ సాహిత్యములో ప్రత్యక్ష మవుతుంది

వర్ణధర్మాలు ఆశ్రమ ధర్మములు పురుషార్థాలు అధునిక కాలములో ప్రయోగానికి ఒక్కొక్కసారి భంగపాటునకు గురి అవుతుంటే ఆ ప్రమాదం భరింపరానిదై అది పరాభవము కాకుండా అడ్డుకోవటానికి సాహిత్యము ఆయుధముగా ధరించి నిలచిన వీరసైనికుడు విశ్వనాథ ఆ ఈ ధర్మములు పూర్వకాలములో ప్రాచీన సమాజములో సాహిత్యములో సాధించిన అభ్యుదయము ఎట్లు మమకారముతో తత్తుల్యస్థితి వర్తమానములో సాధించటము హృదయ పూర్వకముగా సాహిత్యములో సమాకాంక్షించే మేధావి విశ్వనాథ

విశ్వనాథ భాష గ్రాంధికము విశ్వనాథ సాహిత్యనఌలో వ్యవహారిక భాష విశేషముగనే ఉంది ఆ ఉండడములోని మైత్రి పరిశీలనా కావ్యము అవుతున్నది ఒకదశలో వ్యవహారి కాంధ్రము వ్రాయ వచ్చునన్న అభిప్రాయము విశ్వనాథకు కలగకపోలేదు వ్రాయటము జరిగింది అయితే వ్యావహారిక భాషనకు గ్రాంధిక రూపము వ్రాయటం విశ్వనాథకు ఇష్టము. పద్య గద్యాత్మకమయిన విశ్వనాథ సాహిత్యములో చాలా భాగము తన కాలము లోని వ్యవహారిక భాషనకు గ్రాంధికాక్షర రూపము విశ్వనాథ ఇంతటితో ఊరుకోలేదు నన్నయ నుంచి నేటిదాకా ప్రయాణము చేసిన ఈ తెలుగు గ్రాంధికము అని మనము అంటున్న నేటి వ్యావహారిక రూపమే అని చెప్పటమో కాదు విశ్వసించటము విశేష విషయములే

విశ్వనాథ పాత్రలు సప్రాంగణములో సంచరించినా సజీవముగా ఉంటాయి పాత్ర స్వరూప స్వభావాలలో వైశిష్ట్యము, అభివ్యక్తమయి పాత్ర విశేష ప్రాధాన్యము సంతరించుకుంటుంది. పాత్ర ప్రాంగణము పౌరాణికమయినా, చారిత్రకమయినా, సాంఘికమే అయినప్పటికిని కవి గుణగీతాలు, రూపురేఖలు, పాత్ర స్వభావములోని అంతస్సత్యము విశిష్టముగా ఆవిష్కృతమవుతుంది

పురుష పాత్రలుకంటే, స్త్రీ పాత్రలు మరింత విశిష్టముగా రూపొందాయి ఏ కాలములో అయినా ఏ రచయిత అయినా ఇంత వైవిధ్యము కల్గిన పాత్రలను సృష్టించడము అరుదు వందల పాత్రలు ఎన్నో అన్నీ అన్ని విధాలుగా అంత వేరు వేరుగా ఉంటాయి. ఒక పాత్ర పోలికకూడా మరో పాత్రలో అంత విశిష్టముగా కన్పించదు. పురాణపాత్రలు కూడా పురాణాలలో ఉన్నట్లుండవు క్రొత్తగా కనబడతాయి శబరి, కైక, అహల్య మనము మునుపు చూచిన వాళ్ళలాగ ఉండరు విశ్వనాథ మన సమాజములోని వ్యక్తుల స్వరూప స్వభావాలను ప్రాచీన పాత్రలో నిక్షిప్తము చేయటమూ, ఆపాదించటము, ఆ పాత్రలు తమ ఉనికిని దాటి కనబడతాయి. ఒక భౌగోళిక సామాజిక నేపథ్యములోని పాత్రను నేటి భౌగోళిక సామాజిక పాత్ర రంగు, రుచి వాసనా ఆపాదించటముతో ఆ పాత్ర మన పాత్రలయినాయి. అదే పద్యము తోటి మన వాతావరణము లోనికి మారటము మనకు చాలా ఇష్టముగా మారుతుంది అంతేకాదు విశ్వనాథ సాహిత్యములో కథాంశములయి గతముగా పురాణ చారిత్రకాలాలే అయినా అభివ్యక్తగతముగా ఆధునికమవుతూ ఉంటాయి. నేటి సమాజములోని ఒక వర్గము ఆలోచనలు, అభిప్రాయులు, భావాలు వాటి విలువలు నాటి కథల ఇతి వృత్తముల నేపథ్యముతో ప్రతిష్ఠించి ఆవిష్కరించటము తోటి పురాణ చారిత్రక కథలు నేటి జీవితముగా ఆ వర్గమునకు గోచర మగుచున్నవి విశ్వనాథ పురాణ చారిత్రాది కథాంశాలు వర్తమాన జీవితములో భాసించే అవకాశము ఇందువల్లన

ఏర్పడుతూ వస్తుంది గత జీవితము వర్తమానముగా భాసించేటట్లు సాహిత్యము నిర్మించటములో విశ్వనాథ సాధించిన పరిణామము, అంత పెద్ద మొత్తముగా మరే కవి రచయిత సాధించలేదు

వర్తమాన కథను జీవితాన్ని గ్రహించిన సందర్భములలో పౌరాణిక చారిత్రక భావాలు విలువలు ప్రతిష్ఠించి ఈ వర్తమాన జీవితానికి గత సమాజము సంస్కృతికి సంబంధము బాంధవ్యము ఏర్పరుచుటలో విశ్వనాథ విశిష్ఠుడు అందువల్లన విశ్వనాథ పౌరాణిక చారిత్రిక కథలలో ఆధునిక స్పర్శ, ఆధునిక ఇతి వృత్తములకు ఒక జీవిత స్పర్శ ఉండడము తథ్యము. అంటే విశ్వనాథ సాహిత్యము సమాజము మీద అధిగతమైన వర్తమానమైనా మన జీవిత సంబంధిత ధర్మ విపర్యయము పొందే స్థితి ఉంది. గతములో వర్తమానము, వర్తమానములో గతము ప్రతిష్ఠించటము విశ్వనాథ ఇది వృత్తములలో ప్రాణపతిష్ఠ పొందిన విశేషమైన అంశము,

విశ్వనాథ అభివ్యక్తిత విలక్షణముగా ఉంటుంది సర్వసామాన్య మార్గములో ఉండదు విశ్వనాథ వైశిష్ట్యానికి ఇతరేతరాంశములతో పాటు అభివ్యక్తి రామణీయానికి ప్రత్యేక ప్రాధాన్యము ఉంది విశ్వనాథ దర్శనము ఇతరులకంటే భిన్నముగా ఉంటుంది ఈ దర్శనములో ఆర్షసంస్కృతాదాయ నేపథ్యము ఉంటుంది ఆటు నుంచి నరుక్కరావటము బాగా తెలిసినకవి ఆ పునాది కవికి నిరంతర ప్రేరణ ఇస్తుంది అక్కడి నుంచి ప్రసరించే చూపువల్లన దర్శనములో ప్రత్యేకత కల్గి ప్రదర్శనములో నూత్నత్వము ప్రవేశిస్తుంది వ్యవహారిక భాషకున్న ఒడుపు, నుడికారమున కున్న పొదుపు, సంస్కృతి సహచర్యముతో సంస్కారము, దర్శనములో ప్రత్యేకత, ప్రదర్శనములో నూత్నతాన్వేషణ పలుకులో వక్రత, శబ్దశక్తికి జీవన మాధుర్యము సంతరించటములో విశ్వనాథ అభివ్యక్తిసౌందర్యము సంతరించుకుంటుంది. ఈ అభివ్యక్తి పునాది ఆర్ష జీవనాడి సత్య దృష్టి.

గత సమాజ సంస్కృతీ సంస్థాపన దృష్టి విశ్వనాథకు సత్పురుషుడు రాముడై, దుష్టుడు రావణుడైతే రాముడి ప్రవర్తనకు విష్ణుతత్త్వం ప్రాముఖ్యం వహిస్తే రావణుడి వ్యక్తిత్వాన్ని సామాజిక పురుషార్థము ప్రాధాన్యము వహిస్తుంది.

ఈ వ్యక్తుల తత్త్వము విశ్లేషించటము ఆ పాపుల అంతర తత్త్వము ఆవిష్కృతమైన అభివ్యక్తి రామణీయకతను సంతరించు కుంటూ ఉంటుంది ఆధునిక అభివ్యక్త ధోరణులు పౌరాణిక చారిత్రక కవులు, పాత్రలు సన్నివేశాలు సమయ సందర్భాలలో సమకూడటం వల్ల అభివ్యక్త సౌందర్యము విశ్వనాథ సముపార్జించటము సాధ్య మయినది.

అయితే విశాలమయిన విశ్వనాథ సాహిత్యాన్ని పరికించు టకు సమయం కాదది ఒక్క రామాయణ కల్పవృక్షమునకు మాత్రమే ఈ వ్యాసము పరిమితమయినది కవితా రంగం నుంచి కవి విశ్వ నాథ సందర్శనాకిది అవకాశము ఇస్తుంది విశ్వనాథ కవితా వ్యక్తి త్వము సమర్పించిన విశిష్ట సాహిత్య రూపము రామాయణ కల్ప వృక్షము. ఇదికాక పద్య సాహిత్యములో కావ్యములు ఖండకావ్య ములు, శతకాలు, గీతములు, ఉదాహరణములు, కావ్యములు ఉన్నాయి. కవిత్వము పురాణేతిహాస సంబంధి, లేదంటే చరిత్ర సంబంధి. కథ పురాణేతిహాస చరిత్ర కాలములో ఏదైనా, కథా ప్రాధాన్యము కంటే రచనా ప్రాధాన్యము ఎక్కువ కవిత నందుకున్న ఇతివృత్తము, తానందింపదలచిన సమాజసత్యము మోసుకుపోయె వాహికమాత్రమే. కథ ఏదైనా తానందింపదలచిన జీవితమే ముఖ్యము అందులో వేదన ఉండవచ్చును, తపన ఉండవచ్చును తాదాత్మ్యకం ఉండవచ్చును ఇన్నింటితో మిళితమయిన జీవితమే కవికి ప్రధానము అది అందించ టము ముఖ్యము అందుకే ఈ సాహిత్య సృష్టి ఈ తపన, వేదన, ఆర్తి, భక్తిగా మార్చును శృంగారము గావచ్చును ఆత్మాశ్రయం

గావచ్చును పరాశ్రయం గావచ్చును ఈ భక్తి శృంగారముల సమ్మేళనము నుంచి ప్రేమ కామాల కేంద్రాలు గోచరమవుతాయి ఆ కేంద్రములలో ప్రసరించిన దృష్టి నుంచి ఇతివృత్తము, పాత్రలు, సన్నివేశాలు సృష్టి అవుతాయి ఈ సృష్టి ఆవిష్కరములయిన తరువాత ఆ కథ, ఆ పాత్రలు, సన్నివేశాలు వాటి ఉనికికి నేపథ్య వాతావరణాన్ని పరిసరములను కోల్పోతాయి

నాటి కథ పాత్ర సన్నివేశములు నేటివి అవుతాయి నేటి కథ పాత్ర సన్నివేశములు వాటిని ప్రతిష్ఠించటములో విశ్వనాథ కవిత్వము విశేష ప్రాధాన్యము వహించినది విశ్వనాథ పాత్రలలో కూడా ఈ అద్వైతము విశిష్టముగా గోచరమగుచున్నది ప్రాచీనత నుంచి ఆధునిక ముఖంగా అవిచ్ఛిన్నంగా ప్రవహించే ఈ అద్వైత భావన విశ్వనాథను కవిని కావించినది

ఈ దృక్పథం విశ్వనాథ కవితాంతర్యంగా కవితా రమణీయముగా భావింపవచ్చును గుర్తింపవచ్చును కూడా

ఆంధ్ర ప్రశస్తి, ఆంధ్ర పౌరుషము, ఆంధ్రుల ప్రాచీన వైభవోన్నతి, నేటి దైన్యస్థితి వివరిస్తున్నాయి మాస్వామిలో విశ్వనాథ విశ్వేశ్వర స్వామిని పురుషుడ్ని కావించుకొని తాను వాసకసజ్జిక అయ్యారు, సతీస్మృతి అయిన వరలక్ష్మి త్రిశతిలో గిరికుమారుని ప్రేమగీతాలలో ప్రియపురుషుని ఆర్తి, భ్రమరగీతములు గోపికా గీతములు, శ్రీకృష్ణ సంగీతము మొదలగు వాటిలో పురుషుడు శ్రీకృష్ణుడు భ్రమర సందేశము శశిసందేశములో గోపికా రూపముతో ప్రకృతి పురుషుల తాదాత్మ్య ప్రతిష్ఠానమే పర్యవసానము. కుమారాభ్యుదయం, ప్రద్యుమ్నోదయం, ఋతుచరిత్రము, పౌరాణిక నేపథ్యములో సంతానోత్పత్తికి సాగిన సంరంభంలో ప్రకృతి పురుషుల దాంపత్య మాధురిమలో అద్వైత భావనమే ఆవిష్కృతమవుతుంది

ఆంధ్ర దేశచరిత్రలో నాటి ఉన్నతి, నేటిదుస్థితి ప్రసక్తము. భారతదేశ చరిత్రలో గత భారత ప్రాశస్త్యము, ప్రతిష్ఠించటానికి దాన్ని ప్రయోగానికి గురిచేస్తున్న దుష్టపాలకుల మీద పోరాటము వర్ణితము

శ్రీ కృష్ణగోపికలతో కూడియున్న దాంపత్యము వర్ణితము కావటము సందర్శనీయము కవి కథానాయకుడగుట, అభివ్యక్త మయిన ఆర్తి గమనార్హము

స్థూలంగా చరిత్రలో కాలముఖంగా నాటికీ నేటికీ అద్వైతభావన ఉంది కృష్ణుడు నాయకుడైనా, కథానాయకుడైనా ఇతరులు నాయకులైనా ఆయా కావ్యములలో వర్ణితమైన శృంగారము భక్తి, వేదన, తపన, ఆర్తి, పాత్రలు, కథలు దాటిన కవితారూపము అద్వైతము ధరించినాయి వస్తువు పౌరాణికమయినా, చారిత్రకమయినా, కాలాతీతమయిన శృంగార, వీర, భక్తి అతీతమైన సమన్వయి నేపథ్యములో అద్వైత భావనలో కవిత్వమును సంభావించటము విశ్వనాథ విశిష్టముగా దర్శనమిచ్చే సాహిత్య ధర్మము

ఇంతటి విస్తృత సాహిత్యము సృష్టించిన విశ్వనాథ జీవించిన కాలము 84 సంవత్సరములు. ఆ జీవనకాలములో 1895 - 1979 మధ్యన తెలుగుదేశములో ఉద్భవించిన ఉద్యమాలు సామాజికజీవితము కవిని రచయితని ప్రభావితం చేస్తాయి ఆ సమాజాన్ని కాలాన్ని ఉద్యమాలను ఆకవి రచయితల సాహిత్యం కొంతకాలం ప్రభావితం చేయవచ్చును అందువల్లన ఆ ఉద్యమాలు సమాజ జీవిత నేపథ్యములో ఆ ప్రభావ రంగంలో విశ్వనాథ కవిత్వము పరిశీలిస్తే విశ్వనాథ సాహిత్యము కలిగించిన ప్రభావము అవగత మవుతుంది ఆ స్థితిలోనే ఆధునికాంధ్ర కవిత్వములో విశ్వనాథ స్థానము స్పష్ట మవుతుంది.

విశ్వనాథను కొంచెము ముందు వెనుకల పరిశీలించటమంటే నూతన సాహిత్య రంగము సందర్శించటమే కందుకూరి వీరేశలింగం పంతులు కాలం నుంచి నేటిదాకా వ్యాపించిన సాహిత్యం స్థూలముగా రెండు మార్గములలో ఉన్నట్లు స్పష్టము కాగలదు కందుకూరితో ప్రారంభమయిన నూతన కవిత్వము కొంతకాలమునకు భావకవిత్వముగా ఆపైన అభ్యుదయ కవిత్వముగా పరిణామం చెందటము గుర్తిస్తే అది ఒక మార్గము

సంస్కృతములో వాల్మీకి వ్యాసుల వారితో అరంభమయిన కవిత్వము తెలుగులో నన్నయ తిక్కన మార్గంలో ప్రభవిస్తే అది ప్రాచీన మవుతుంది ఆ మార్గమే కొనసాగుతూ కందుకూరి కాలములో సంప్రదాయంగా, అనంతరకవుల కాలములో నవ్య సంప్రదాయముగా కొందరి దృష్టిలో పునరుద్ధరణ కాగా, అది కవిత్వంగా భావిస్తే అది మరో మార్గము

ప్రాచీన కవిత్వము సంప్రదాయ కవిత్వముగా, నవ్య సంప్రయ కవిత్వముగా ఒకే మార్గముగా తెలుగులో ప్రభవించాయి ఈ సంప్రదాయ ప్రయోగ కవితామార్గాలు రెండూ స్వతంత్రోదయంలో, జాతీయోద్యమంలో ప్రతిధ్వనించాయి అందువల్లన ఈ సాహిత్యం రెండూ రెండు మార్గాలుగా సాగుతూ ఒక్కొక్కసారి ఈ ఉద్యమాల సందర్భంలో ఒకటి అవుతూ వచ్చినాయి.

విశ్వనాథ కవిత్వము కొందరు సంప్రదాయమని, మరికొందరు నవ్య సంప్రదాయమని ఇంకొందరు పునరుద్ధరణ వాద కవిత్వమని భావించటం సహజమే అదంతా ఒక మార్గమే విశ్వనాథ కవిత్వము భావ కవిత్వమని భావించేవాళ్ళు లేకపోలేదు. ఈ నాలుగు స్వభావాల కవిత్వము విశ్వనాథలో ఉంది

సంప్రదాయ వాదంలో ప్రాచీనతపట్ల అభిమానము ఉంటుంది.

ప్రాచీన మార్గంపట్ల గౌరవము ఉంటుంది. నవ్య సంప్రదాయ మార్గములో ప్రాచీనతను నవ్యులు అంగీకరించేటంత యోగ్యంగా మార్పులు, చేర్పులు, కూర్పులు చేయుటం ఉంటుంది నవ్య సంప్రదాయ వాదంలో సంప్రదాయ వాదమే ప్రధానము అయితే అధునికుణ్ని అలరించే, జయించే, ఒప్పించే మార్పులు కథా నిర్మాణంలో పాత్ర సృష్టిలో సన్నివేశ కల్పనలో అభివ్యక్తితో ప్రక్రియలో, గ్రహణంలో ఆధునిక కల్పవృక్షములు సంతరించు కోవటము ఉంటుంది.

ఆధునికుడికి ఆమోద యోగ్యం కావించటములో చారిత్రక వస్తువు వర్తమాన సహజ చైతన్యం పోషకము కావించటములో నవ్య సంప్రదాయ తత్త్వము ఇమిడి యుంది పునరుద్ధరణవాదంలో ప్రాచీన జీవితము పునః స్థాపించే ప్రయత్నం ఉంటుంది స్థూలంగా ఈ మూడు సాహితీ ప్రయత్నాలు ఒక ప్రధాన రంగంలో భిన్న దశలే. సంప్రదాయ వాదానికి నవ్య సంప్రదాయ వాదం ఒక సవరణగా ఒక రంజకంగా, ఒక ఆమోదయోగ్యరూపం పరివర్తించే దశావిశేషం మాత్రమే అయితే సంప్రదాయ వాద సామర్థమే నవ్య సంప్రదాయ వాదం పెంచుతున్నప్పటికినీ అది ఎదుర్కొనే వ్యతిరేకం ఇది ఎదుర్కోడు పునరుద్ధరణ వాదంలో ఉద్ధరింపబడిన వచ్చేది. సంప్రదాయ వాదమే, ఆ దృష్టితో ఈ వాదం అందులో గతార్థం అవుతుంది.

కిన్నెరసాని పాటలు, కోకిలమ్మ పెండ్లిగేయ కవిత్వం, భావ కవితా శాఖనకు చెందిందే. ఆంధ్ర పౌరుషం, ఆంధ్ర ప్రశస్తి, దేశభక్తి ప్రబోధకవిత్వము భావ కవితాశాఖక చెందిందే ఇక్కడొక్క విశేషము దేశభక్తి కవిత్వము భావ కవిత్వములో, అభ్యుదయ కవిత్వములో నవ్య సంప్రదాయ కవిత్వము భావ కవిత్వములో అభ్యుదయ కవిత్వములో నవ్య సంప్రదాయ కవిత్వములో కూడా చేరుతుంది అయితే స్థూలంగా కవి ఏర్పరుచుకున్న కవితామార్గం విస్పష్టము చేసుకున్న తరువాత ఈ కవితాశాఖల వింగండింపు వినిమయం

తెలుస్తుంది. శ్రీకృష్ణుల గోపికల శృంగారమునకు సంబంధించిన వస్తుగతంగా ఉన్న కవిత్వము భావకవిత్వపు ఎల్లలలో లేదు. ఝాన్సీ రాణీ శివార్పణం నవ్య సంప్రదాయ మార్గంలో నిలుస్తాయి కుమారాభ్యుదయం, ప్రద్యుమ్నోదయం, ఋతుచరిత్రలు సం ప్రదాయ మార్గ దర్శకాలుగా నున్నాయి

స్థూలంగా విశ్వనాథ సంప్రదాయ వాదం నవ్య సంప్రదాయ భావ కవిత్వావరణలో, కవిత్వాభి వ్యక్తీకరించటం స్పష్టమవుతుంది. విశ్వనాథ కవితా సృష్టి స్థూలంగా ఇరవయ్యో రెండో ఏట నుండి మొదలయినట్లు భావించవచ్చును. 1895 న జన్మించిన విశ్వనాథ 1917లో కవితా వ్యాసంగం ఆవిష్కృతమవుతుంది. ఆంధ్రపౌరుషంలో ఆరంభమై ఆంధ్ర ప్రశస్తిగా పరిణమించిన దశలో విశ్వనాథ భావ కవితా మార్గంలో ఉన్నాడు అప్పటికి గురజాడ, రాయప్రోలు, అబ్బూరి, భావకవితా విజృంభణకు విశ్వనాథకు మార్గ దర్శకం అవటానికి అవకాశం ఉంది. కిన్నెరసాని పాటలు వ్రాసేకాలంలో అంటే 1923 నాటికి విశ్వనాథ భావకవే

ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో ఉద్యోగం చేసే రోజులలో అంటే 1932 తరువాత విశ్వనాథకు సంప్రదాయదృష్టి పెరిగినది. 1934 నాటికి విశ్వనాథుని జెండా వినీలాకాశము లో రెపరెప లాడింది. వేయిపడగలు పూర్తి అయినాయి. అప్పటికి విశ్వనాథ సంప్రదాయ వాదం దాని పునరుద్ధరణ వాదం కాంక్షించే రచయిత దాదాపు ఇదే కాలంలో తన నవ్య సంప్రదాయ సాహిత్యదృష్టి పెరగసాగింది ఈ కాలంలోనే తెలుగు సాహిత్యమునకు జ్ఞానపీఠ పురస్కారము సము పార్జించి పెట్టిన రామాయణ కల్పవృక్ష రచన ప్రారంభమైనది అతి విశాల సామాజిక కాలప్రాంగణములో ప్రభవించిన కవిత్వము కల్ప వృక్షము సంపూర్ణముగ అవతరించుటకు 1962కు ముందు సాధ్యం కాలేదు

విశ్వనాథ భావకవిగా మొదలై, దేశంలో సంప్రదాయ కవిగా మారి, రెండేళ్ళలో నవ్య సంప్రదాయ కవిగా పరిణామము చెంది దాదాపు ముప్పై ఏళ్ళుగా ఆ కవితా మార్గంలో స్థిరపడి సాహిత్యం సృష్టించాడు అనంతర కాలములో అవతరించిన కవిత్వము సాహిత్యం కూడా విశ్వనాథను పరిపూర్ణతను స్థిరీకరిస్తుంది సంప్రదాయ నవ్య సంప్రదాయ మార్గంలో ప్రయాణం చేస్తున్న విశ్వనాథను సాహిత్యములో పునరుద్ధరణవాదంగా సాహితీ లోకంలోని ఒకపట్టము ఏకపక్షముగా నిర్ణయము చేస్తుంది.

విశ్వనాథ కవిత్వము అంతా స్థూలముగా నవ్య సంప్రదాయమునకు చెందినదే. నవ్య సంప్రదాయ వాదులు కొంత రంగు, రుచి, వాసన మార్చుకున్నా సవరించుకున్నా, అలంకరించుకున్నా, ఆచ్ఛాదించుకున్నా సంప్రదాయ వాదమే అధునికుణ్ని ఆవేశపరచే సంప్రదాంశ సంభరితమే నవ్య సంప్రదాయవాదం ఇందులో ప్రధానంగా వస్తువు కథా ప్రణాళిక ప్రాచీనమైనా గూడా అధునికుణ్ని అలరించ గలిగి ఉండాలి ఆపని భక్తివల్లన సాధ్యము శృంగారవల్లన సాధ్యము అందుకే పురాణ వస్తువు గతంగా భక్తి శృంగారాలు సామాజికుడ్ని అలరించే మార్గంలో సాగుతాయి. విశ్వనాథ సాంఘిక వస్తువు కూడా పౌరాణిక స్పర్శతో కూడియున్నవి ప్రాచీనాంధ్ర భారతీయ చరిత్ర వక్రముగా వ్యాఖ్యానించటానికి గురిఅయినవని విమర్శ. ప్రాచీన సమాజములోని విలువలు ఆధునిక సమాజనులా వెలువడ మంటే ఉన్నత మనిపించటము ఈ వాదుల లక్షణము

ఒకనాడు భక్తి ఒక ఉత్తమమైన విలువ. నేడు స్వేచ్ఛ ఒక విలువయితే నాటి భక్తి నేటిస్వేచ్ఛ కంటే ఉత్తమ విలువుగా ప్రదర్శించటము నవ్య సంప్రదాయ లక్షణము అది విశ్వనాథ కవిత్వము అంతటా ఉంది వ్యవహారికాంధ్రము నేడు గ్రహించే భాషారుపము గ్రాంధికాంధ్రము ఒకనాటి రూపము నేటి భాషా స్వభావము నాటి

భాషా స్వరూపముతో సంతరించటము విశ్వనాథ సాధించిన నవ్య సంప్రదాయ లక్షణము

విశ్వనాథ సత్యనారాయణ సృష్టించిన పాత్రలు భౌగోళిక సామాజిక నేపథ్యము దాటి వర్తమాన జనజీవితములోని పాత్రలుగా మారతాయి ఉదాహరణకు కైక పాత్ర ఒకటి చూస్తే చాలు కల్ప వృక్షమునందు కైక దశరథుని ప్రియురాలు కైకేయి రాజకన్య హేలారతి డాగురేకుల తళత్తళ కాటుక, రాజు కంటికి అనటుంచేత ఆమె రాజునకు ప్రియమైన భార్య అతడామెయందు రమించును ఆమె వలననే రామాయణము కథ కాబోవుచున్నదని విశ్వనాథ తన కల్పవృక్ష రహస్యము నందు చాటి చెప్పినాడు

కల్పవృక్షము నందు కైకకు ప్రత్యేకత ఉంది ఆమె నిర్దోషిగా, త్యాగశీలిగా, గుప్తమైన నారాయణ భక్తికి సంకేతముగా రూపాంతరము చెందినదని తెలియజేసినారు కైకకు ధర్మాధర్మ ఉచితానుచిత సంఘర్షణలకు నెలవైన మహిత చరితగా చాలా సుకుమారముగా విశ్వనాథ చిత్రించాడు

ఏమైనను వాల్మీకి కైకను విశ్వనాథ మార్చడు రూపాంతరము గావించాడు కైక పాత్ర దుష్టతను పోగొట్టి శిష్టతను ఆపాదించాడు ఆధునిక సమాజములో ధర్మాధర్మ సంఘర్షణలో నలిగిపోయె ప్రాణులకు కైక పాత్ర ప్రతిబింబముగా, చేరువుగా, అంగీకార యోగ్యముగా రూపొందుతుంది పౌరాణిక చారిత్రక పాత్రలకు నేటి సామాజిక పాత్రల జవము, జీవనము సమకూర్చటము నవ్య సంప్రదాయ సాహిత్య లక్షణములే

ప్రాచీన కథలకు ప్రసిద్ధ కథలకు వర్తమాన జీవిత మార్గ నిర్దేశన సమవాదిగా రూపొందించటము కోసము మార్పులు చేర్పులు

చేయటము ఈ వాద లక్షణమే. అందులకే రామాయణ కల్ప వృక్ష మునందు అన్ని మార్పులు చేయవలసి వచ్చినది

విశ్వనాథ ఎవరి కోసము ఇంతటి సాహిత్యమును సృష్టించి నాడు తెలుగువాళ్ళకోసము తెలుగువాళ్ళ అందరికోసమా! కొందరి కోసమైనా కావచ్చును. ఆ కొందరు సంప్రదాయ మార్గ సంచార కులు, సంరక్షకులుగా వచ్చును ప్రయోగ మార్గ ప్రామాణికలకు కాకపోవచ్చును కాని విశ్వనాథ మరల నిదేల రామాయణమన్నచో అన్న ప్రశ్నలను అందుకొని తినుచున్న అన్నమే తినుచున్నాము ఎందులకు, తన రుచి బ్రదుకులు తనవికాన, చేసిన సంసారమే చేయుచున్నది తనదైన యనుభూతి తనదికాన, తలచిన రామునే తల చెదను నా భక్తి రచనలు నావికాన అని నర్మగర్భముగా సమాధా నము చెప్పారు విశ్వనాథ

విశ్వనాథ కవిత విలువలకు ప్రాతినిధ్యము వహిస్తుంది. సంఘ ములో ఈ విలువలను సమర్థించే చైతన్యమునకు ఈ సాహిత్యము కల్గి యుంటుంది. ఈ సంఘము ప్రేరణతో విశ్వనాథ పుట్టాడు

పరిణామం సహజ శీలమైన సమాజ స్థితికి గతికి ఈ సాహి త్యము ప్రాతినిధ్యము వహించదు మానవుని గతానికి విశ్వనాథ సాహిత్యము ప్రాతి నిధ్యము వహిస్తుంది. భవిష్యత్తునకు కాదు. ప్రాచీనతా పరమైన విలువలు నిలిచినంత కాలము ఈ సాహిత్యము సమాదరించ బడుతుంది మానవ వికాస క్రమమున విముక్తి పథంలో చైతన్య ప్రయాణములో స్థిర బిందువు నవ్య సంప్రదాయ సాహిత్యం చరబిందువు వామపక్ష సాహిత్యము. ఆధునిక సాహిత్య శిశ్చల ప్రశాఠశాల విశ్వనాథ సాహిత్యము తత్ప్రాశాఠశాలనకు పాలకుడు జ్ఞానపీఠ పురస్కార గ్రహీత విశ్వనాథ సత్యనారాయణ అంచబనము.

# విశ్వనాథుని వర్ణనాత్మకత

ఆచార్య వి రామచంద్ర

వర్ణనాత్మకత కావ్య లక్షణం అదిలేని కావ్యమే ఉండదు. తెలుగులోని కావ్యాల్లో కంటె రాయలనాటి ప్రబంధాల్లో ఈ వర్ణనాత్మకతకొక ప్రత్యేకత సిద్ధించిందన్న సంగతి పండితు లందఱకూ తెలిసిందే. నన్నెచోడుని నాటికే ప్రబంధాల్లో ఫలానా వర్ణనలు చెయ్యాలి అన్న నిర్దేశం కనిపిస్తుంది.

వనజలకేళీ రవి శశి
తనయోదయ మంత్రగతి రత, క్షితిప
రణాంబునిధి మధు ఋతు పురోద్వా
హనగ విరహ దూత్య వర్ణనాష్టా దశమున్

అని ఆ వర్ణనలు పద్దెనిమిది అని లెక్క చెప్పాడాయన ఆ తరువాత ఎక్కువగా, పురాణేతిహాసాలే రావడం చేత వాటి వైపుల్యంలో ఈ లెక్క లెక్కకు రాలేదు. కాని వర్ణనాత్మకతను మాత్రం కవులు వదల లేదు కాబట్టి, అందరూ దాన్ని ఆదరిస్తూనే వచ్చారు. వాళ్ళలో ఈ వర్ణనకొక వైశిష్ట్యాన్ని సంపాదించి, తనరచనల్ని తరువాత రాబోయే ప్రబన్ధాలకు మార్గదర్శకాలుగా తీర్చిదిద్దిన మహాకవి ఎఱ్ఱాప్రెగ్గడ. ప్రంబంధ యుగం వచ్చేటప్పటికి యీ వర్ణనాత్మకత బలపడి, ప్రబంధమంటే వర్ణనా విశిష్టమైన రచన అనే పేరు పొందింది కృష్ణదేవ రాయల కాలములో ప్రబంధం తన విశ్వరూపాన్ని ప్రదర్శించింది దండి కావ్యాదర్శంలో చెప్పిన సర్గ బంధ మహాకావ్య లక్షణాలన్నీ యీ ప్రబంధంలో ఇమిడియున్నవి ఈ లక్షణాలను గుఱించి చెప్పడములో ఆలంకారికులు ప్రబంధాల్లో అష్టాదశ వర్ణనలు ఉండి తీరాలని చెప్పారు కవి గజాంకుశం, కవి సర్పగారుడం మొదలైన పేర్లతో రచనలు చేసి వాటిలో కవులనే శాసించడానికి ప్రయత్నించారు నిరం

కులు కాలేని కవులు కొందఱు ఆలంకారిక నియమాల ననుసరించి బలవ తముగా అష్టాదశ వర్ణనలకూ తమ ప్రబంధాల్లో స్థానం కల్పించడానికి తంటాలుపడి, ఆ విధముగా తమ కావ్య సౌందర్యాన్ని చెఱతుల పాడు చేసుకొన్న వాళ్ళూ ఉన్నారు వర్ణనల అంతరార్థ మేమిటంటే, తీసుకొన్న కథను బట్టి, ఎన్ని వర్ణనలు చేయాలో అన్నే చేయడం అటువంటి వర్ణనల్ని లెక్కపెట్టి అలంకారికులు అవి పద్దెనిమిదనీ, ఇరవై అనీ, ఇరవైరెండనీ లెక్కచెప్పడమేతప్ప, అన్నీ ఉండాలని నిర్దేశించే అధికారము వాళ్ళకులేదు వాళ్ళకు విధేయులై తమ ప్రబంధ సౌందర్యానికి భంజకాలైన వర్ణనలు చేయవలసిన అవసరం కవులకూ లేదు.

ఏతదృష్ట్యా శ్రీ 'విశ్వనాథ' రామాయణ కల్పవృక్షాన్ని పరిశీలిస్తే, యీయన నిరంకుశులకు నిరంకుశుడుగా కనబడతాడు. ఆయన స్వీకరించిన యితివృత్తము రామాయణ గాథ ఈ మహాగాథలో ఆలంకారికులు చెప్పిన వర్ణనలేకాక, మఱెన్నో ఇతర వర్ణనలు కూడా చేయబడే అవకాశాలున్నాయి అందుచేత విశ్వనాథ రామాయణ కల్పవృక్షంలోని వర్ణనాత్మకతను గుఱించి వివరించాలంటే అష్టాదశ వర్ణనలను మాత్రమే గ్రహించవలసిన అవసరంలేదు. అలాగని ఆలంకారికులు చెప్పిన వర్ణలను ఉజ్జగించాలనేది నా ఉద్దేశం కాదు కాని కేవలం అవి మాత్రమే వర్ణనలు అనే భావంతో లెక్కపెట్టి వాటినే ఉదహరించే పని మాత్రం చేయను

విశ్వనాథవారు ముక్త్యాల యువరాజు శ్రీ వాసిరెడ్డి రాజారామగోపాలకృష్ణ మహేశ్వర ప్రసాదుగారిని రామాయణ అవతారికలో

చిఱునవ్వు నవ్వెనా! చిన్నారి ముత్యాలు
పోవులు పోవులు పోసినట్లు
కనులెత్తి చూచెనా? కప్రంపు జిఱుపొడు
లుప్పని తీగగా నూదినట్లు

ఈ పద్యాన్ని చదవగానే శ్రీ యువరాజుగారి మూర్తి కనులకు కట్టినట్లుగా సాక్షాత్కరిస్తుంది వర్ణనకు ఫలితం మూర్తి సాక్షాత్కారమే దర్శన ప్రదర్శనాలలో ఎంతో స్పష్టత ఉంటేనే తప్ప కవిత్వంలో ఈ గుణాన్ని సాధించడం చాల కష్టతరమైన విషయం కవి యొక్క ఏకాగ్రతకు, పరిశీలనాశక్తికి, వాగ్వైభవానికి ఈ పద్యం నిదర్శనం కాగలదు

అసలు విశ్వనాథ కవిత్వానికి విపరీతమైన పరుగేగాని నిదానమైన నడక లేదు. కాని ఆ పరుగులోను ఒక అందం ఉంది "ఊరక రసాకృతి నే స్రవియించి పోదు" అని శృంగార వీధిలో ఒక చోట తన కవిత్వాన్ని గురించి అంటారు సత్యనారాయణగారు రామాయణ అవతారికలో

"అతడె తోడు కల్గినను నచ్చముగా గలకండ లచ్చులుం
బోతలు పోసి యుండెదము పోతనగారి విధాన"

కొందరు కవుల లక్షణమది. వెనుదిరిగి చూడకుండా వ్రాసుకు పోయేవాళ్లు కొందరు, అచి తూచి మాటలువేసి శిల్పంలాగా పద్యాన్ని తీర్చిదిద్దే వాళ్ళు కొందరుంటారు కాని విశ్వనాథవారి చిత్తం నిత్యవేగి కాబట్టే తాను రసాకృతితో స్రవియించి పోయేటట్లు ఆయన చెప్పుకొన్నారు ప్రత్యేకించి ఆయన వర్ణనలలో కూడా ఈ గుణం స్పష్టంగా కన్పిస్తుందనడంలో సందేహంలేదు పాతే సాంప్రదాయకమైన పురవర్ణన వారు ఎలా చేసారో స్థాలీపులాకంగా పరిశీలిద్దాం

అసలు చక్కగ దీర్చిరా! వీథు లవని పుం
దడుదెంచెనని యుబ్బి విరిసెనొక్కొ
అసలల్లె యుండునా యాత్రోవ కలయంపి
చల్లి పూల్ముగ్గులు నల్లిరొక్కొ

ఈ పద్యంలో విశ్వనాథవారు సాంప్రదాయికమైన పురవర్ణన చేసి నప్పటికీ, ఆయన వెలువరించిన భావాలు మాత్రం గతానుగతికమైనవి కావు ఆ భావాలలో ఆయన భావుకత కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది

రాజుగారు విచ్చేస్తున్నారని వీథుల్ని చక్కగా దిద్ది తీర్చారనేది సాధారణంగా ఈ సందర్భములో కవులు చేసే వర్ణన కాని వీదులు ప్రభువు రాకకు ఉబ్బి విశాలమైన రూపం ధరించినట్లుగా ఇక్కడ కవి చమత్కృతి ఆ త్రోవలు, కలయంపి చల్లి దాని మీద పూలు, ముత్యాలు చల్లినట్లున్నవట ఈ వర్ణనలతోనే ఆ అయోధ్యా నగర ప్రజల వైభవం విశదమౌతుండగా, "అంలా త్రోవలెప్పుడును అట్లే ఉండును?" అనే సందేహాన్ని ప్రకటించి విశ్వనాథవారు ఆ ప్రజల వైభవాన్ని అత్యద్భుతంగ చిత్రించారు అంటే కలయంపి చల్లి దానిపై పూలు, ముత్యాలు పరచి ఆ త్రోవలను అలకరించడం పుర ప్రజలు రోజూ చేసే పనే కాబోలు అనే విస్మయాన్ని ప్రకటిస్తున్నారు కవిగారు అదే విధముగా ఎంతో అందంగా రాచబాటలలో అలంకరింపబడిన తోరణ కవాటాలు క్రొత్తగా నిర్మింపబడినవా? లేక యెప్పుడూ ఆ విధముగా ఉండేవేనా? అని అంటున్నారు

ఇంతవరకు సంశయాత్మకతను ప్రకటించిన కవి, కడపటు దశరథ మహారాజుకు మున్ను తెలిసిన ప్రదేశాలు, వస్తుజాలాలు కూడ క్రొత్త వన్నెలతో ఆయనకు సంతోషం కల్గించాయనీ అంతకంటె విశేషించి ఆ దారులెప్పుడూ ఆ విధంగనే ఉండడం వల్ల ప్రభువు రాక ప్రజలకు తెలియనేలేదని చెప్పి నిర్ణయం చేసి పద్యాన్ని ముగించారు ఆ విధంగా తనరాక ప్రజలకు తెలియరానివ్వనంతటి భోగ భాగ్యాలతో తన ప్రజలు తులతూగతున్నారని తన రాజ్యం సుభిక్షంగ ఉందని తెలుసుకొన్న మహారాజు ఎంతో సంతోషించాడు ప్రజలు తనను వచ్చి చూడలేదనో, తన రాక విశేషించి వాళ్ళకు తెలుపబడ లేదనో ఆయన తలపోయలేదు ఒక పద్యంలో ఇన్ని చిత్రమైన

భావాలు చెప్పడం అసాధారణ ప్రతిభావంతులైన కవులకు తప్ప ఇతరులకు సాధ్యంకాదు

సుమంతుడు దశరథ మహారాజుకు ఋశ్యశృంగోపాలఖ్యానం చెప్పే సందర్భములో రోమపాదుని దేశంలో కలిగిన కఱువును గురించి ఈ క్రింది విధంగా వర్ణించారు కవిగారు

మాగాని పరశురామ ప్రీతియైనట్లు
మొలకనాకులె యెఱ్ఱ తలలు వేసె
మెట్టు చాలుల విత్తు వెట్టక మున్నె చు
మ్మలు చుట్టి మలమల మాడిపోయె

ఈ పద్యాన్ని చదివితే కవికి పల్లె జీవితంతో, పైరు పంటలతో ఎంత సన్నిహితమైన పరిచయం ఉందో తెలుస్తుంది. ఆ పరిచయంతో పాటు నిశితమైన పరిశీలనాశక్తి లేనివారు ఇటువంటి వర్ణనలు చేయలేరు

ఈ ఋశ్యశృంగుని కథను దశరథునికి మంత్రి చెప్పే సందర్భంలోనే కవి చేసిన చంద్రవర్ణన ఈ క్రింది విధంగా ఉంది.

ఒనర బోర్కాడించి యుయ్యేల తొట్టెలో
బండ బెట్టిన పసిపాప వోలె
వీథులంబడి తిర్గి బూదియ మైజల్లు
కొని పర్వులం బెట్టు కుఱ్ఱవోలె

సాధారణంగా కవులు చందోదయ వర్ణన, చంద్రాస్తమయ వర్ణన వంటివి చేస్తే విశ్వనాథ ఆకాశవీథిలో కన్పిస్తున్న చంద్రుని ఈ పద్యములో వర్ణించారు అయనకా చంద్రుడు స్నానం చేయించి ఊయెల తొట్టిలో పరుండబెట్టిన పసిపాపలాగా, వీథులమీద ఒంటిపై బూడిద చల్లుకొని పరుగులు పెట్టె కుఱ్ఱవానిలాగ, పెరుగన్నం తింటూ మోహమంతా పూసుకొన్న కుఱ్ఱవానిలాగా, తలంటి పోసుకొందువు రమ్మని

అమ్మమ్మలు, నాన్నమ్మలు పిలిచినప్పుడు చేతికందకుండా పరుగులు పెట్టే చిలిపి వానిలాగా కన్పించాడు చంద్రుణ్ణి ఒక కుఱ్ఱవాడిలాగా చూడడమనే భావన విశిష్టమైంది ఆ చంద్రుడు కూడ భిన్న దశలలో కన్పించే విధానాన్ని బట్టి రకరకాల కుఱ్ఱవాళ్ళ ఆకారాల్లో కూడ చిత్రించి చూపారు అంతేకాదు ఒక్కొక్కప్పుడు చంద్రబింబం ధవళాతి ధవళంగ కన్పించడం గంభీరంగ కదలుతున్నట్లు ఆకాశవీథిలో కన్పట్టడం మనకు తెలిసిన విషయమే అది దృష్టిలో ఉంచుకొని తెల్లని బట్టలు ధరింపజేసి వీథిలో షికారు కొఱకై పంపబడిన రాజ కుమారుని వలె చంద్రుడు కన్పిస్తున్నాడని కూడ కవిగారు వర్ణించారు ఒక చంద్రబింబాన్ని ఇన్ని రకాలుగా ఉల్లేఖించి చెప్పడం కవి సంపత్తికి నిదర్శనం

మేనకా విశ్వామిత్రఘట్టాన్ని స్పృశించకుండా విశ్వనాథ వర్ణనాత్మకతను గురించి చెప్తే అది సమగ్రం కాదు. విలక్షణమైనదే అయినా సాధారణ ప్రేమికుల మనస్తత్వాన్ని పట్టి ఇచ్చే శృంగార వర్ణన ఇక్కడ కన్పిస్తుంది

తనపాద మామె పాదము జతగా బెట్టి
యస్మత్పదంబు మోటని వచించు
దన హస్తమామె హస్తము మీద బోర్లించి
నీ చేయిలేదని నిహ్నవించు
నామె ప్రక్కగ నిల్చి యగు నా బుజము దాక
వచ్చితివేయని పలవరించు
జెక్కిలి జెక్కిలి జేర్చి గడ్డము గ్రుచ్చు
కొన్నదాయని గుచ్చిగుచ్చి యడుగు

ఈ పద్యం చదవగానే ఒక మహర్షి ఒక మామూలు ప్రేమికునిలాగ ఈ విధంగా ప్రవర్తిస్తాడా? అనే సందేహం కొందరికి కలుగవచ్చు

కాని ఎంతటి మహర్షులయినా తామరస నేత్రలిండ్ల బంధాలు కానంత వఱకే అయిన తర్వాత వాళ్ళు కాముకులే కాబట్టే కవి విశ్వామిత్రుని కాముకతను ఈ విధముగా చిత్రించి చూపడం అన్నింటి కంటె చిత్రమేమిటంటే అంతటి విశ్వామిత్రు మహర్షి "ఆకు కదిలితే తనకు భయం కలుగుతుందని అమాంతం మేనకను కౌగిలించు కొన్నాడట

విశ్వామిత్రుని మేనక గెలిచింది కదా అని, ఆయన మరింత తీవ్రతరమైన తపస్సు చేయబూను కొన్నప్పుడు ఆయన మీదకి రంభను ఉసిగొల్పుతాడు దేవేంద్రుడు ఆమె భయపడినా ఒప్పుకోదు ఆ విధముగా ఇంద్రుని బలవంతం చెతవచ్చి తన ముందు తైతక్క లాడుతున్న రంభతో విశ్వామిత్రుడిలా అన్నట్లు కవి వ్రాసాడు

కామక్రోధములన్ జయించుటకు సంకల్పించి కాయంబు నా
నా మార్గంబుల శోష పెట్టుకొనుచో నా యందు వైరంబుగా
నేయో పాడెదవేమొ యాడెదవు నీ యెల్లం దుటారింపులున్
గోమేదన్ బదివేలయేండ్లు శిలవై కూర్చుండవే యంచనన్

ఈ పద్యం విశ్వామిత్రుని కోపాన్నే కాదు విశ్వనాథ సహజ కవితా ధోరణిని కూడ ప్రదర్శించి చూపుతుంది.

శివ ధనుర్భంగానికి కోపించి జనకుని సభకు వచ్చిన పరశు రాముని ఈ క్రింది విధముగా వర్ణించాడు కవి.

తాళ ప్రమాణమౌ తను యష్టి కలవాడు
జలధి నుర్వులుబోని జడలవాడు
అఖిలాంగములను రుద్రాక్షముల్ కలవాడు
కాంతి పిండుల యెఱ్ఱ కనులవాడు

ఫాల భాగంబున బ్రహ్మతేజమువాడు
చేతులం దాయుధ శ్రీగలవాడు
కైలాసమును వోలె గదలించరాని వా
డఖిల సంహార కాలాగ్ని వోలె.

ఇందలి అర్థాన్ని నేను వివరించ నక్కరలేదు కాని యెంతో రీవిగ నిలబడ్డ పరశురాముని మూర్తి ఈ పద్యములో సాక్షాత్కరిస్తుంది. కవికి గల రూప చిత్రణ సామర్థ్యానికిది నిదర్శనం కాగలదు

సీతారాముల కళ్యాణానంతరం వాళ్ళ దాంపత్య జీవితం యెంతో సుందరముగా వర్ణింపబడింది. అందులో నవదంపతుల పట్ల కైక చేసిన కొన్ని అల్లరి చేష్టలను కూడా కవి యెంతో రమణీయముగా వర్ణించారు.

సీత తోడ జెప్పు జెలగి కైకయి యంద
గాడు తండ్రి నీవు కాదటంచు
రాముతోడ జెప్పు రమణ కైకయి యంద
కత్తె సీత నీవు కాదటంచు

అందగత్తె సీతే కాని నువ్వు కావని రామునితోను, అందగాడు రాముడే కాని నువ్వు కావని సీతతోను చెప్పి ఆ విధముగ అనందించడం ఆమె విచిత్రమైన మనస్తత్వానికి, సీతారాముల పట్ల ఆమెకున్న ప్రేమకు తార్కాణముగా కన్పిస్తుంది

సీతారాములు వనవసానికి బయలుదేరి వెళ్ళేటప్పుడు కౌసల్య సీతతో రాముణ్ణి జాగ్రత్తగ చూచుకొమ్మని చెప్తుంది ఆ సందర్భములో విశ్వనాథ వర్ణించిన తీరు బహు ముచ్చట

వనిలోన నేరితెచ్చిన కందమూలముల్
చిదుకు మంటలపైన జిముడనీక
దారినేగెడు వేళ ధరణీంద్రు కథలతో
బుజ్జైన మనసును నొవ్వనీక

ఈ పద్యములోన భావి కథా సూచన కన్పిస్తుంది "ఏదో కావలెనని యెడదను నెఱపి యెప్పుడు అవనీదూరముల్ పోవనీక" అన్న మాటల్లో సీత మాయ లేడిని కోరి రాముణ్ణి దాని వెనుక పంపించటం ధ్వనిస్తుంది తక్కిన పంక్తుల్లో సీత రాముణ్ణి తల్లిలాగా ఏ విధముగా కాపాడాలో కౌసల్య చెప్పడం, అందుకు బదులుగా సీత తనకూ రామునికీ ఉన్న అవినాభావ సంబంధాన్ని నిరూపిస్తూ ఎన్నో విషయాలు చెప్పడం పరమ రమణీయమైన విశ్వనాథ వర్ణనాత్మకతకు తార్కాణాలుగా కన్పిస్తాయి,

సుగ్రీవుడు సీతను వెదకడానికై హనుమదాదులను ఆయా దిక్కులకు పంపే సందర్భములో విశ్వనాథ ఆయా దిక్కులలో గల విశేషాలను తెలుపుతూ చేసిన వర్ణనలు వర్ణన వహించిన విశ్వరూపాలు అంతేకాదు ఆ వర్ణనలన్నీ వివిధ చ్ఛందో విశేషాల కాటపట్టు కావడమేగాక అక్కరపడి ఆయన ప్రదర్శించిన అక్కర యొక విశ్వరూపం మహాకవులు చేసిన అష్టాదశ వర్ణనాదులు ఈ విపుల కావ్యములో పుష్కలముగానే ఉన్నాయి

వివిధ రస పరిపోషకాలుగాను, అనేకమైన చిత్ర విచిత్రమైన విషయాలకు విశదీకరణగాను విశ్వనాథ చేసిన వర్ణనలు అనేకం కావ్యమున ఉన్నాయి అసలు కవి అంటేనే వర్ణించే వాడని కదా అర్థం వర్ణమంటే అక్షరం అక్షరమంటే నాశనంలేనిది అటువంటి అక్షరమైన వర్ణంతో మనోజ్ఞమైన భావాలను ఆవిష్కరించ గలిగి, భావనాశక్తితో మనోహరమైన మూర్తి చిత్రణం చేయగలిగి మహాకావ్యాలు వ్రాయగలిగిన కవులలో విశ్వనాధవారు గణనీయులు అయినే చెప్పుకొన్నట్లుగా ఆయనొక రస ప్రవాహం ఆయన వర్ణనలు తీయని నీటిబుగ్గలు ఆ మధుర జలాన్ని సేవించ గలగిన సహృదయులు అదృష్టవంతులు



# విశ్వనాథ చిత్రించిన విజ్ఞాన శబరి

డాక్టరు కోటి సూర్యనారాయణ మూర్తి

శ్రీ మద్రామాయణం భారతీయ సాహితీ సామ్రాజ్యానికి విశ్వసాహితీ నియుత్తలంలో నిరంతరము వెలుగులు వికసిమ్మే సూర్య బింబము మమత, మానవత, ధర్మ తత్పరత, వాత్సల్య పూరిత భక్తి నైర్మల్యత్వాది సుగుణ సుగంధ పరిమళాలు వెదజల్లే మహాకావ్యము సనాతన కాలమునుండి నేటికాలము వరకు విశ్వ జనీనతను సంత రించు కుంటున్న గ్రంథ రాజం రామాయణము

భారతీయ ధార్మిక వ్యవస్థకు మూలస్తంభాలయిన శ్రుతి, స్మృతి, సూత్ర రహస్యాలను తన రామాయణములోని ఆఖ్యానో పాఖ్యాన పాత్ర చిత్రణాదులతో సమాజమునకు చాటి చెప్పినాడు వాల్మీకి మహర్షి అయితే విశ్వనాథవారి కవితా రూపతపస్సు, ఊహా సంపత్తి, కథాకథన శిల్పములతో వాల్మీకి రామాయణమునకు భాష్య ముగా కొనసాగినది అన్నిటిని మించి జీవునివేదన, జీవాత్మ పర మాత్మ పదము చేరు విధము భక్తిపూర్వకముగ రచించి సాహిత్యరంగ ములో సుస్థిరత స్థానము పొందియున్నాడు

కల్పవృక్షము ఒక శిల్ప వృక్షము

కల్పవృక్షము, హరిచందనము, పారిజాతము, సంతానము, మందారము అనే ఐదు దేవతా వృక్షములలో కల్పవృక్షమునకే అగ్ర స్థానము తెలుగున వెలసిన రామాయణము అన్నింటి యందును శ్రీమద్రామాయణ కల్పవృక్షమునకే అగ్రపీఠము శ్రీమద్రామాయణ కల్పవృక్షములో ప్రదర్శితమైన వైదుష్యం అనల్పము, అనితర సాధ్యము అది కల్పవృక్షమే కాదు శిల్పవృక్షమనుట లెస్స

కల్పవృక్షము అడిగిన వారికి గోరినదెల్ల ఇచ్చునట్లే కావ్య

దృష్టితో రామాయణ కల్పవృక్షము చదువు వారిని రస, రీతి, భావ, ధ్వని చమత్కారమును, భక్తితో చదువువార్కి మోక్షమును, శిల్ప దృష్టితో చూచువార్కి కవితాంగములతో కూడిన ఉదాత్తమైన శిల్ప రమణీయకమును అందించు మహాకావ్యము

కల్పవృక్షము భారతీయాత్మ దర్శన దర్పణము భారతీయ తత్త్వ సారాంశ రసములో కల్పవృక్షమును పెంచడము జరిగినది అందులో ఏకాత్మను ఏరెమ్మను, ఏ చిగురును చూసినా భారతీయత దర్శనమగును అందులో ఏమాత్రము అసత్యము లేదు. అక్షరాలలో ధ్వనిని, పదములయందు చమత్కృతిని పాత్రలలో విలక్షణతను కథలయందు సంప్రదాయాను సరణిని ప్రదర్శించడము అది విశ్వనాథవారి వైచిత్రి ఎందరో కవులు రామాయణమును రచించినారు. తమ ప్రతిభా ఉత్పత్తులచే పాత్రపోషణ కావించినారు పాత్రచిత్రణ విషయములో వాల్మీకిస్థాయిని అందుకున్నవారు సాహితీలోకములో లేరు విశ్వనాథవారు మాత్రము వాల్మీకి దరిదాపులకు చేరికోగలిగారు

రామాయణము ఒక మహాసముద్రము అనంత జీవసంచారమునకు అందు ప్రవేశ సంచారములు కలవు వాల్మీకి యందలి పాత్రల తీర్చిదిద్దిన తీరు నిరుపమానము ఆ విషయమున వాల్మీకిని తప్పు పట్టేవారు లేరు కాని విశ్వనాథవారు మాత్రము పాత్రలను తీర్చిన తీరు వాల్మీకి కంటె విలక్షణతను కల్పవృక్షమున చూపినారు. వారు ఒక్కొక్క పాత్ర చిత్రణ రీతిని వివరించుటకొక గ్రంధము కావలయును విశ్వనాథవారు ప్రతి పాత్రను స్పష్టమైన రేఖలతో తీర్చిదిద్దిరి అట్లా తీర్చిదిద్దబడిన పాత్రలలో ఒక రసవదమృత ఫలము శబరి వృత్తాంతము

శబరివంటి భక్తి ప్రధానమైన పాత్రల చిత్రణలో విశ్వనాథవారు తమ ప్రగాఢమైన ఆధ్యాత్మ తత్త్వాన్ని అమోఘమైన

దైవభక్తిని ఆదరపాత్రమైన అద్వైతాభిమానమును అత్యంత ప్రతిభను మహిమోపేతముగా ప్రదర్శించినారు

శ్రీమద్రామాయణ కల్పవృక్షములో శబరి పాత్రను పరిశీలిస్తే విశ్వనాథవారు ఒక ప్రత్యేక అభిమానముతో ఈ పాత్రను సృష్టించినారా! అన్నంత వైశిష్ట్యం వైలక్షణ్యం కనిపిస్తుంది ఈ శబరి పాత్ర అరణ్యకాండ చివరన దర్శనమిస్తుంది

పంపాతీర నివాసిని మతంగముని శిష్యురాలు అయిన ముదుసలి శబరి ఆశ్రమమునకు రామలక్ష్మణులు వచ్చిరి వారికి వన్య ఫలములు ఇచ్చి సమర్పించి రామచంద్రుని దర్శనమువల్లన తన జన్మ సార్థకమైనట్లు, తన తపస్సు ఫలించినట్లును భావించి రాముని దివ్యత్వమును నుతించుచు అగ్ని ప్రవేశము గావించి స్వర్గము చేరుటయే శబరి వృత్తాంతము.

కబంధుడు రామలక్ష్మణులకు సుగ్రీవుని వృత్తాంతమును తెలియజేయుచూ సుగ్రీవుని దైవక్షేత్రమును అతని అన్న వాలి ఆక్రమించివాడు అతనికి నీవు ఉపకారము చేస్తే అతడు నీ కార్య సాధనకు ఉపకరించును ఇతరులకు మనము ఎంత మేలుచేసిన మనకంత మేలు కలుగును అతడు పరమకృతజ్ఞుడు మాయలలో రాక్షసుల నందరిని మించినవాడు. అతడు తలచిన మీ కార్యము సిద్ధిస్తుంది అని సుగ్రీవుడుండే ఋష్యమూకాద్రికి దారిని తెలియజేస్తాడు

రామలక్ష్మణులు కబంధోక్త మార్గములో వెళ్ళుతూ పంపానది పడమటితీరమున శీతలవాయువులను ఉత్తరీయాలుగా కప్పుకుని ఊగుతూ నడుస్తూ ఉండగా వెనుక ఎవరో 'రామా' అని పిలిచినట్లైంది తిరిగి చూస్తే ఎవరు కనిపించలేదు లక్ష్మణుడు మాత్రము ఇది శబరి పిలుపై ఉంటుందంటాడు రామునికి శబరిని చూడాలనే కోర్కె మదిలో తారాడుతుంది ఇక్కడ విశ్వనాథవారు ఆ ఆశ్రమ ప్రాంతమంతా

రామనామ నాదంతో ప్రతిధ్వనిస్తుంటూందనే భావాన్ని ధ్వని గర్భితముగా చెప్పారు. రామునికి అలాంటి కోరిక కలగగానే శబరి పూలు పండ్లు మంచి రుచి రంగు కలిగిన వాటిని మెట్టపళ్ళెములో పేర్చుకొని శిరసుపై నిడుకుని శబరి వచ్చినది. అపుడామె ఎట్లున్నది

తుట్టతుదదాక నెండిన చెట్టు కొమ్మ
శేఖరంబున యందు బుష్పించినట్లు

ఇచ్చట విశ్వనాథవారు శబరి ఆకారమును తెలియజేయుటకు వాడిన ఉపమానం అమృతోపమానం సాధారణముగా ఋషులను, సన్యాసులను వర్ణించేటపుడు అలంకారములు అంతగా ఉపకరించవు కాని అప్రతిమాన ప్రతిభా వ్యుత్పత్తులు కల కవి దీని కతీతుడు

శబరి యెయిలు వెల్గులలోని పూలను, బంగారు, రాగి కరిగిస్తే కలిగే రంగు కలిగి మాధుర్య సహితాలు, రసానుకులాలు అయిన ఫలాలను విడివిడిగా పేర్చుకొని వచ్చింది అపుడామె తుట్టతుద దాకా ఎండిన చెట్టు కోన కొమ్మలో పుష్పించినట్లుందని ఉపమించడము ఎంతో సామరస్యంగా ఉంది. ఇది ఒక భావుక చిత్ర శిల్పవిన్యాసము

శబరి సిద్ధురాలయిన వృద్ధురాలు ఆమె ఉపాసనా ఉపవాసాదులతో బక్కచిక్కి ఎండిన శరీరము గలదై ఉన్నది కాని నెత్తి మీద పండ్లు పూలు ఉన్న పళ్ళెం ఉంది అవి రంగు రుచి కలిగి ఉన్నాయి అందుకే ఆమె ఎండిన చెట్టు చివరి కొమ్మలో పుష్పించిన విధముగా ఉందని ఉపమింపబడినది

శబరి కనులలో కన్నీళ్ళు నిండి యున్నవి ఆ కన్నీళ్ళు నిండిన కన్నులయందు స్వామి తన ప్రతిబింబమును చూచుకుని సీతా వియోగబాధను మరచినాడు శబరి కనులయందు నీరారగా కనులు తేరుకున్నవి అంటే ఆమె ఆనందాశ్రుజలమునందు స్వామి

తన ప్రతిబింబమును చూచుకున్నాడట జలధిశాయియైన శ్రీమన్నా రాయణుడు శ్రీరామచంద్రుల వారు శబరి నేత్రజలాయిలందు తన ప్రతిబింబమును చూచుట లాగా భగవంతుని అంశ జీవులోనే ఉన్నదని భగవంతుని ప్రతిబింబమే సూచించుటలో జీవేశ్వరుల బింబ ప్రతిబింబ భావ సంబంధమిట గమనింప దగినది

శబరి రామా గమనం కోసము నిరీక్షించు క్షణం ఒక యుగంగా నిరీక్షించుచున్నది ఆ కోరిక ఇపుడు ఫలించి పుష్పించినది ఆ పుష్పములను శిరస్సున పెట్టుకొని ఆమె ప్రవేశించినది ఇందులో మరో పరమార్థముగూడ వికసించుచున్నది శబరి భక్తి పుష్పించి ఫలించినది అదే అమె శిరస్సుపై కనిపిస్తున్నాయని కవి ప్రతీకా త్మంగా ధ్వనింప చేస్తాడు అది గదా విశ్వనాథవారి ప్రతిభ ఈ దృశ్యమును ఒక నిపుణుడైన చిత్రకారుడు రంగులు రంగలించి చిత్రిం చిన వర్ణచిత్రంవలె తీర్చిదిద్దారు విశ్వనాథవారు ఇది సామాన్యు లకు అలవినేరనివి మహాప్రతిభావంతుడు మాత్రమే ప్రదర్శించగల శిల్పము అంతేగాదు శబరి కన్నులలో స్వామి తన ప్రతిబింబమును చూచి విరహబాధ నంతటిని విడిచినాడట ఇది అత్యంత మనోహరమై నటువంటి భావన చిత్రకారుని కుంచెనకు కూడ అందనటువంటి ఊహాచిత్రము

సంభాషణల ద్వారా పాత్రలను సృష్టింపజేయడము ఆంధ్ర వాఙ్మయంలో కొద్దిమందికి మాత్రమే సాధ్యపడింది తిక్కనాదుల యందు, అల్లసాని పెద్దనలు ఈ తరహా శిల్పమును పోషించిరి అటు వంటి శిల్పమునే విశ్వనాథవారు శబరి పాత్రయందు ప్రదర్శించి తన ప్రతిభను చాటినారు

రామాయణ కల్పవృక్షమునందు శబరిపాత్ర ప్రవేశించినం తనే తలపై పూబుట్ట దింపకుండగనే సంభాషణతో మొదలగును

"తలపై బూవుల తట్ట దింపక యయోధ్యావీధుల న్నిన్ను నా
వలె గన్గొనగు వారలుందురె! యనం బ్రాణేశు డువ్వెత్తు న
వ్వుల నచ్చో నినువంటివారు కలరా! బూబళ్ళికం దింపుకో
వలె నన్నన్ జిరనవ్వునన్ మఱచితిన్ స్వామీ యటంచాయెయున్

రాముని అధ్యాత్మ తత్త్వాత్మకమైన హాసం హాస్యము ఇక్కడె మొదలవుతుంది రామునితో శబరి అయోధ్యా వీధులలో నీవలె నన్ను చూసే వాళ్ళుంటారా! అంటుంది అనగా అయోధ్యలో ఎందరో రాముణ్ణి చూస్తారు కాని తనలాగా తన్మయతా భావముతో చూసే వాళ్ళుంటారా అన్న ధ్వని గర్భితంగా అడుగుతుంది పూలతట్ట దించక పోవటము ఆ ధ్వనికి ఉపపత్తి

అంత శ్రీరామచంద్రులవారు చిరునవ్వులతో అక్కడ నీలాంటి వాళ్ళుంటారా! ముందు పూలతట్ట దించుకో అంటాడు శబరి చిఱునవ్వు దరహాసము లోలకిస్తు మరచితిని స్వామి అంటుంది. ఇక్కడ ప్రాణేశుడనే ప్రయోగము ఉవ్వెత్తు నవ్వు ఈ శబరి నవ్వు మధుర భక్తిని ప్రతిపాదించుటకు సావిగా గ్రహించవచ్చును. అంతేగాదు శబరి మరచితిని స్వామి అనడము ఆమె తన్మయత్వానికి పరవశత్వానికి చిహ్నిక అనవచ్చును పాత్రయొక్క చిఱు చలనాన్ని గూడా ప్రేక్షకుని కనులముందు కదలించు విధముగా చిత్రించాలంటే కవి ఆ పాత్రలో లీనమైనపుడే అది సాధ్యమగును. అట్లాగ సృష్టించిన పాత్రలే జగత్తున సజీవముగా నిలచిపోవును

శబరి పూలతట్ట దించగానే స్వామి మునివేళ్ళతో చరణ యుగంపై పూలు చల్లుకుంటాడు అంత శబరి అయ్యో! స్వామీ! అంటూ దోసిళ్ళతో రాముని పాదాల మీద జల్లుతుంది. ఇక్కడ అయ్యో! స్వామి అనకుండానే పూలు జల్లవచ్చును కాని ఆమె తన్మయతకు పరాకాష్టకు చిహ్నంగా అయ్యో స్వామి అనే మాటకు విశ్వనాథవారు ప్రయోగించారు

ప్రతిభావంతుడైన కవి తాను సృష్టించిన పాత్రలకు ఇలాంటి ఎన్నెన్నో కల్పనలను కూడా వర్ణించి రూపు కట్టించగలడు

శబరి భక్తి ప్రధానమైన పాత్ర భక్తికి తన్మయత్వము పరా కాష్ట ఆ స్థాయిని శబరి చేరుకుంది అనే విషయాన్ని ధ్వని గర్భిత ముగా చెప్పడమే ఈ మరవితిన్ స్వామి అనటము అయ్యో స్వామీ అనటము కొండంత అర్థమును గోరంత మాటలో ధ్వనింప జేయడమే శిల్ప రహస్యము నిన్ను చూసిన నాకు ఆకాశమును సముద్రమును వనములను చూసినట్లైనది నీ ఆకారమును చూచి విస్మయము చెం దెను ఇది భగవంతుని యొక్క విశ్వరూపమును శబరి సందర్శించినదని ధ్వనింప చేయడము కవి ఉద్దేశ్యము

రామునికి శబరి ఫలాలను రుచికరమైన వాటిని ఆరగించ మని అర్పిస్తుంది అపుడు రాముడంటాడు నన్ను నట్టడవిలో నిలబెట్టి తినమంటే ఎట్లా నేను కాళ్ళు కడిగికోవలయును కనులు తుడిచికో వలయును స్నానము చేయవలయును అనగా అందులకు శబరి అం టుంది ఇక్కడ పరిచెట్టు నా ఇల్లే నిత్య పవిత్రమూర్తివైన నీకు స్నానాదులా! చేతులుండడముచేత పూలు తెచ్చాను చెట్లుండడముచేత పండ్లు తెచ్చాను శరీరము ఉండముచేత నడిచి వచ్చాను వయస్సు ఉండడముచేత ఊహించాను అంతేగాని నేను పూలు తేలేదు క్రొత్తగా నీవు ఇక్కడికి రాలేదు అని అద్వైత తత్త్వ సూత్ర గర్భితంగా పలు కును జీవాత్మకు పరమాత్మకు అభేదత్వం వ్యక్తంచేసిన సందర్భము ఇది పండ్లారగింపవే ప్రాణసాధ అంటుంది శబరి నీవు తిని చూచి రుచికరములయినవి ఏవీ చెప్పకనే నేనెట్లు తినాలి అంటాడు స్వామి

"స్వామి ప్రతివృక్ష మందున బ్రిథమ మందు
నేను రుచిచూచియే తెచ్చినా ననంగ
శబరి శ్రీరామచంద్రుడు నిబడమంద
మృదు సుహాసుడు చూచె సౌమిత్రివంక'

కొందరు పెద్దపెద్ద గృహముల యందుండియు చెట్టు క్రింద ఉన్నట్లుగ బావించుచు అసంతృప్తి ప్రకటించు చుందురు. శబరి ప్రతిచెట్టు తన గృహమేయిని భావించినది తృప్తినొందుటకు భావం ప్రధానము రాముడు నిత్య పవిత్రమూర్తి యని మర్యాద పురుషోత్తముడని గ్రహించినది శబరి అందులకే ఆమె ఇట్లనుచున్నది

"నే బూలు తేలేదు నే బండ్లు తేలేదు
లీలామనోజ! రాలేదు నేను
కొత్తగా నీవు మా కొండిక చోటికి
రాలేదు బుద్ధి దారా ప్రసన్న!

ఇందు శబరి రాముని లీలామనోజ! చిత్తజన్మ! ప్రాణనాథా! అని పిలిచినది నీయీడేమిటి? నాయీడేమిటి? అనుచునే రాముడామె పిలుపునందలి తలంపు అంగీకరించినాడు అప్పుడానీతమ్మట పండ్లారగింపవే ప్రాణనాథా! అనుచు శబరి ఫలములను సమర్పించినది. రాముడు స్వీకరించెను. ఫలాహార భుక్తి ముగిసిన పిదప శబరీ రామచంద్రుల చమత్కార సంభాషణ ఆరంభమగను. ఇది శబరీ ఖండమునకు అయువు పట్టు అనదగిన సన్నివేశము

అవ్వ! యెంతో తపించి నీమాయు వెల్ల
నార్చి నీవిట్టు లెండియే కైతివనంగ
ప్రభువ! స్నేహంబుచేత నార్పంబు చేసి
యింత దివ్వెగా వెలిగించవే యటంచు

అవ్వా ఎంతో తపస్సు చేసి నీ ఆయుస్సునంతా అర్పించి ఈ విధంబుగా ఎండి ఏకైతివి గదా! అంటాడు రాముడు. అంత శబరి ప్రభూ! నీ స్నేహంతో తడిచేసి చిన్నదివ్వెగా వెలిగించు అంటుంది శబరి యోగసిద్ధిని పొందినవారు కోరు కోరిక యిది ఆత్మలనే ఏకును

పరమాత్మ జ్యోతి స్వరూపుడు నాకు కూడ నీ సారూప్యం కల్పించు వని దీనిలోని ధ్వని ఇది సాలోక్యానికి తరువాత దశ

"అవ్వ! నివ్వెరి వెన్నెల యట్లు ముగ్గు
బుట్టవలెనయ్యె నీ శిరంబును ననంగ
బ్రభువ! నీయాత్మ వాకిట రంగవల్లి
నిలుచుటకు నింతగాఁగ బండిన దటంచు"

అవ్వా! నీ శిరస్సు నివ్వెర వెన్నెలలాగ ముగ్గుబుట్టలాగ అయింది కదా! అంటే ప్రభూ నీయాత్మ వాకిట రంగవల్లి వేయుటకు తల పండింది అంటుంది ఇది భక్తి పండి పరిపక్వత చెందినవారు చెప్పే సమాధానము శబరి సాత్వికి. సత్వగుణము తెలుపు శబరి భక్తి పండినది అనుటకు చిహ్నికగా ఆమె భక్తి పండినది భక్తి పరిపక్వత చెందిన తరువాత, ఆ తరువాత దశ భక్తుడు భగవంతునిలో ఐక్యము కావడమే. శబరి పరమాత్మ పదము చేరుటకు సమాయత్తము అగుచున్నదని ధ్వని పూర్వకముగ కవి చెప్పకనే చెపుచున్నాడు

అవ్వ! నీకిట్లు తీవ్ర వ్రతాభిషంగ
మునను ప్రాణాలు గూళ్లు పట్టిన వనంగ
బ్రభువ! నీయింత తీవ్ర దయాభిషంగ
మునను ప్రాణమ్ము గూడు జేరిన దటంచు

అవ్వా! నీవు తీవ్రమైన వ్రతాభిషంగంవల్ల ప్రాణాలు గూళ్లు పట్టినాయి గదా! అని రాముడంటే ప్రభూ తీవ్రమైన దయాభిషంగంతో ప్రాణము గూటిలోనికి చేరింది అంటుంది. ఈ తీవ్ర వ్రతాభిషంగం మనే మాట వాల్మీకి సంశ్రితవ్రతా! అన్నదానికి సమానార్థములో వాడబడినది ఇక్కడ శబరి పల్కిన పల్కులు అధ్యాత్మ కోవిదులు పలికేమాట గమనము గ్రహించ వలసియున్నది వాల్మీకి మహర్షి యగు శబరిని సామాన్య పామరస్త్రీగా చిత్రించలేదు ఆమె విజ్ఞాన వంతురాలు అని పేర్కొనినాడు

"ఏవముక్తస్స ధర్మాత్మా శబర్యా శబరీ మిదం
రాఘవః ప్రాహ విజ్ఞానే తాం నిత్యామ బహిష్కృతాం
దనోస్సకౌశాత్తత్త్వేన ప్రభావం తే మహాత్మనః

వాల్మీకి యేది చెప్పినను నూటికి కోటి కొకచోట చెప్పును మరి రామాయణ కల్పవృక్షమునందు వాల్మీకి రాసిన దానికి భాష్యమునే గదా విశ్వనాథవారు తెలిపారు వాల్మీకి చెప్పిన విజ్ఞానే తాం నిత్యమ బహిష్కృతాం వాక్యమును విశ్వనాథవారు తమ కల్పవృక్ష రహస్య ములు అన్న గ్రంథమునందు సమన్వయించినారు

శబరి శిరోజములు తెలుపు ముగ్గు తెలుగు తెలుపు సత్త్వ లక్షణము శిరోజము లనగా వెంట్రుకలని మాత్రమే కాదు శిరస్సు నుండి పుట్టుబడినవి అని అర్థము శబరి భావములు సాత్త్వికములు సత్త్వభావ సంపదచే మాత్రము తెలియదగినది ఆత్మ రాముడు ఆత్మ స్వరూపుడు ఆత్మారాముని తత్త్వము తెలియగోరుచో పండిన సత్త్వ భావములను ఆత్మ తత్త్వప్రాంగణ రంగవల్లికను గావింపవలెను పండబారిన సత్త్వభావమున రామతత్త్వము గోచరించినది శబరికి అట్లే గోచరించినది అందులకే నివ్వరి వెన్నుల యట్లు ముగ్గు బుట్టవలె నయ్యెనని రాముడనగా నీ ఆత్మవాకిట రంగవల్లి అనుటచే అంతగా పండినదని శబరి చెప్పుటలో రహస్యార్థమిదియే.

శబరి రాముని ప్రాణనాయక! ప్రాణనాథా! అని సంబో ధించును. శబరికి రాముడు ప్రాణనాథుడెట్లగును అంతేగాదు సత నువు, లీలామనోజ, చిత్తజన్మ అనియు పిలుచును నడుము వంగి, సీమంత ప్రదేశ మాత్రమృదు శిరోజము శిత పక్ష్మాంత కేశ ధవళిత దృష్టియునై యెండిన చెట్టువలెనున్న ముదుతల శబరిని చూచినచో రామునకు సీతావియోగ విస్మృతి కలుగుటయేమి? రాముడే యిట్లను చున్నాడు

"నీ యీడేమిటి నీదు మేను భుజగీ నిర్మోకమున్నట్లుగా
నా యీడేమిటి నా శరీరమును సంతానద్రుమ శాఖాకృతిన్
బ యెంచో నను జిత్తజన్ము డనుచుం బొల్లంబడన్ బ్రాణనీ
ధా యం బాడెదు నీకు నీయెడల జిత్తంబట్లనే యున్నదిన్"

శబరి ప్రాణనాథా యనుటయు, రాముడను నాకు నీయెడల చిత్తంబట్లనే యున్నదనుటయు చిత్రముగ నున్నది ఇట్లు అనుట రాముని పరిహాస శీలత అనుకొందమా! కాని ఇది దేవ రహస్యము దేవ రహస్యములు చెప్పకూడనివి అని విశ్వనాథవారి అభిప్రాయము కారణము శరీరమునందుగల ఆత్మకు ప్రభవము సూర్యుడు సూర్యవంశమునకు చెందినవాడు శ్రీరాముడు ఆత్మకు వాక్కు, ప్రాణము మనస్సు అని తెలియుచున్నది అందువలననే విశ్వనాథ సతనువు, ప్రాణనాథ, ప్రాణనాయక వంటి సంభాషణలు శబరిచే పలికించినాడు ఈ సంభాషణలు సార్థకములేగాని నిరర్థకములు గాదు. ఎంతో ఆధ్యాత్మిక తత్త్వసారము తెలిసినవారుగాని ఈ విషయమును గ్రహించలేరు ఇటువంటి ఎన్నో విషయములను విశ్వనాథవారు తెలిపియున్నారు

రామాయణమునందు ప్రతిపాత్ర ఏదో ఒక సందేశానికి సంకేతముగా, ఏదో ఒక ఉదాత్త భావమునకు ఉదాహరణగా, ఏదో ఒక ఉత్కృష్ట ధర్మమునకు ఉపమానముగా ధర్మ రహస్యమునకు దోహదం చేసే విధముగా అంతరార్థ గర్భితముగా సృజింపబడినవే అని చెప్పవచ్చును.

అబలత్వంకాని, అధమ కులంగాని దృఢవ్రతమునకు, తపోధనార్జనానికి, సిద్ధి పొందుటకు అడ్డంకులుకావని సత్య సందేశానికి ప్రతీకగా రామాయణంన శబరి పాత్రను రూపొందించబడినది శబరి పూర్వాశ్రమ జీవితము గురించి ఎవరు తలచినట్లుగావారు ఊహించుకో

వలసినదేగాని గ్రంథమునందు ఆధారాలు చాలా మృగ్యము ఆమె మతంగమహర్షి శిష్యురాలుగా, రామ ఉపాసకురాలుగా రామాయణము నందు శబరి దర్శన మిస్తుంది

సద్గురుసేవ వల్ల కడజాతివారు కాని ఆడవారుకాని జ్ఞానము గడించవచ్చు. సిద్ధిని పొందవచ్చు దివ్యత్వమును పొందవచ్చు అనే సంకేతముగ శబరిని తీసుకోవచ్చు శబరి చెంచెత బోయకులము నకు చెందినది అని మనకు తెలియును గదా

శబరి సామాన్య స్త్రీ కాదు యోగిని యోగిని మాత్రమే గాదు. ఒక దేవతా రూపమైన దీధితి శబరి సిద్ధిపొందిన యోగా భ్యాసం కలది సంశ్రిత వ్రత అహంకార మమకారములను జయిం చిన శ్రీమణి తన సర్వస్వమును సర్వేశ్వరార్పితంచేసి యోగాగ్ని లో తన దేహమును హోమముచేసి పుణ్యలోక పదప్రాప్తిని పొందిన పుణ్య చరిత శబరి.

శబరి భక్తి అపూర్వమైంది అమలమైంది అదర్శవంతమైనది అంతరత్యాగ రూపమైంది అపారమైంది అమరమైంది వాల్మీకి శబరిలో నిక్షిప్తీకరించిన భక్తితత్త్వమును విశ్వనాథవారు తన రామాయణ కల్పవృక్షమందు చక్కగ వ్యక్తీకరించినారు విశ్వనాథవారు శబరిని ధర్మచారిణిగ, ధర్మనిపుణగ, సన్యాసినిగ, తపోధనిగ సంశ్రిత వ్రత సిద్ధమైన యోగాభ్యాసము కలదిగ చిత్రికరించి సఫలీకృతులైనారు



# శ్రీ మద్రామాయణ కల్పవృక్ష భాషా శైలులు

డాక్టరు లకంసాని చక్రధరరావు

కవిసమ్రాట్ కళాప్రపూర్ణ పద్మభూషణ విశ్వనాథ సత్యనారాయణగారు తమ భాషాశైలీ కవితా విషయాలను, విశేషాలను వివరించే రెండు ముఖ్యమయిన పద్యాలను తమ రామాయణ కల్పవృక్ష ప్రారంభంలో రచించినారు

"నాది వ్యవహారభాష మంథరము శైలి
తత్త్వము రస ధ్వనులకు ప్రాధాన్య మిత్తు
రసము పుట్టింపగ వ్యవహారము నెఱుంగ
జనును లోకమ్ము వీడి రసమ్ము లేదు"

"తొడవుల్ వృత్తులునున్ గుణంబులును రీతుల్ వ్యంగ్యముల్ దీప్తియే
ర్పడగా గావ్యత, సంస్కృతం బొలసి యాంధ్రం బయ్యె నీతెల్గు, మేల్
నుడి కారమ్ములు దేశ్యముల్ పలుకు బళ్ళున్ జాతి మాట్లాడు కై
వడి సత్కావ్యము లొప్పు నాంధ్రమున నా రామాయణం బట్టిదే"

తన భాష 'వ్యవహారభాష' అనీ తన శైలి 'మంథరము' అనీ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు స్పష్టంగా తెలిపారు ఈ పదాల వివరణను ఇస్తే ప్రసంగోద్దేశం నెరవేరినట్లే మొదట భాషా విషయిక విశేషాలను గమనిద్దాం కావ్యభాష గ్రాంథిక భాషకంటె విలక్షణమైనది వ్యావహారికభాష లేదా వాడుకభాష శ్రీ సత్యనారాయణగారు కావ్యభాషలోనే తమ కల్పవృక్షాన్ని రచిస్తున్నారనేది స్పష్టమైన విషయమే. వీరి దృష్టిలో వాడుకభాష అంటే ఏమిటో 'తొడవుల్ వృత్తులు' అన్న పై పద్యంలోనే కొంత వివరణ దొరుకుతుంది తెలుగుకావ్యాలన్నీ 'మేల్ నుడికారమ్ములు దేశ్యముల్ పలుకు బళ్ళున్ జాతి మాట్లాడు కైవడి" ఉన్నాయని శ్రీ విశ్వనాథవారు భావించటమే కాకుండా తమ రామయణం కూడా ఆ విధంగానే

ఉందన్నారు తెలుగు నుడికారాలతో, తెలుగుపదాలతో, తెలుగు పలుకుబళ్ళతో తెలుగ జాతి మాట్లాడేటట్లున్న దే శ్రీ సత్యనారాయణగారి దృష్టిలో వ్యవహార భాష జాతి జనులందరికీ అర్థమయ్యే భాష మాత్రమే వ్యావహారిక భాష అని పిండితార్థం రామాయణ కల్ప వృక్షంలో శ్రీ విశ్వనాథవారు పేర్కొన్న లక్షణాలు కల వ్యవహార భాష ఉందో లేదో చూద్దాం

శ్రీ విశ్వనాథవారు తమ స్వభావాన్ని

"నేను మనస్సన్న్యాసిని
నే నిది యిమ్మంచు నడగ నెవ్వరి నెపుడున్
దానెది యేనియు బ్రాప్త
మ్మైనన్ వలదంచు జెప్పనంతియు గాకన్"

అనే పద్యంలో తెలిపారు ఈ పద్యంలో మూడు వాక్యాలున్నాయి (1) నేను మనస్సన్న్యాసిని, (2) నేనిది యిమ్మంచు నడగ నెవ్వరి నెపుడున్, (3) తానెది యేనియు బ్రాప్తమ్మైనన్ వలదంచు జెప్పను ఈ వాక్యాలు చాలతి అలతి పదాలతో, సూటిగా చెప్పేరీతిలో మనం మాట్లాడుకొనే విధంగా ఉన్నాయి వారి వచన రచనకు పద్య రచనకు పెద్దగా తేడా ఉండదు వారి పద్యాలు వచనం వలె ఉంటాయని చెప్పవచ్చు లేదా వారి వచనం పద్యంవలె ఉంటుందని చెప్పవచ్చు

దశరథ మహారాజు తనకు సంతానం లేనందుకు బాధపడటాన్ని చూడలేని సుమంత్రుడు అర్ధరాత్రి ఏకాంతంలో కలుసుకోగా దశరథుడా మంత్రితో అతడెందుకు వచ్చాడో తెలియని కారణంగా

"నీకేమి వలయునో యది
కై కొమ్మన నాకునేమి కావలయును మీ
రీ కరణి దిగులు పొందుచు
మాకు దిగులు కలుగ సేత మాన్పగ వలయున్"

అని మాట్లాడతాడు 'నీకేమి కావాలో తీసుకో' అని దశరథుడంటే "మీరు దిగులు పడుతూ మమ్మల్ని దిగులు పెడ్తున్నారు కాబట్టి మా దిగుల్ని పోగొట్టండి" అని సుమంత్రుడంటాడు ఈ పద్యంలో ఒక్క సంస్కృత శబ్దం కాని అన్యదేశ్య పదం కాని లేదు ఇది అచ్చమయిన తెలుగు పద్యం పుత్రులులేని కారణముగా దిగులుపడుతున్న రాజును మంత్రి సుమంత్రు

"దైవమను కాలమైనప్డు తమకు గూడ
గొడుకు కలుగును నే నెఱుంగుదును దీని"

అని ఓదారుస్తాడు ఈ ఓదార్పు మాటలు అత్యంత సహజమయిన భాషలో ఉన్నాయి

రోమపాదులవారి రాజ్యములో వర్షాలు కురవని స్థితిని కవి సమ్రాట్టులు కమనీయముగా స్వభావోక్తితో వర్ణించారు

"నూగాని పరశురామ ప్రీతియైనట్లు మొలకనాకులె యెఱ్ఱితలలు వేసె
మెట్టచాలుల విత్తువెట్టక మున్నె చన్నులు చుట్టి మలమలమాడిపోయె
ఊటలూరెడి సెలయేటి మేల్వరసలు యెండినబుగ్గలై యింకిపోయె
బావులలోనీరు వట్టి పూడికదీయ మన్నుపుట్టిన జల మిన్నుముట్టె"

"పాడియావుల చన్నులు పట్టు నెత్రు
ధారలోడిన జనులు హాహారవములు
రాజు మొగసాల నిలిచి మొఱ్ఱలిడినంత
విభుడు నేడ్చుచు వారిజే విసరి పంపి"

రాజ్యంలోని వర్షాభావ పరిస్థితుల్ని కళ్ళకు కట్టినట్లుగా ఈ పద్యము నందు వ్యక్త పరచారు విశ్వనాథవారు

శ్రీరామచంద్రుడు బాల్యంలో పలికిన మాటలను గమనించండి.

"తనో 'లామలు' తండ్రిపేరెవరయా? 'దాచాత మాలాలు' 'నౌ
లే! నాపే రననమ్మగా' లనగ నోలిం దల్లి కౌసల్య 'తం
డ్రీ'! నా గానన బోయినాక కనులన్ సీర్వెట్టు 'గౌన్సల నౌ
గా నే కానులె యమ్మనే' యని ప్రభున్ గౌసల్య ముద్దాడెడిన్"

పై పద్యంలోని వాక్యాలు పసిపిల్లల వ్యవహారంలో ఉన్న పసిడిపలుకులే

" అప్పరమేలు దొల్లి, య నగననగను నగగు డన్నట్టిరాజు"

"ఆయిన కిద్దఱు భార్యలు పెద్దయామె కేశిని, ఆమె వైదర్భుని కూతురు, రెండవయామె సుమతి, ఆమె అరిష్టనేమి కూతురు కేశిని ధర్మిష్ఠ, సత్యవాదిని సుమతి మహాసౌందర్యవతి, ఆమె గరుడిచెల్లెలు" సగర వృత్తాంతకథలోని పైవాక్యాలలో ఎంతమాత్రమూ క్లిష్టతలేదు. తేలిక మాటలతో శిశిర వర్ణన

"అగ్ని కార్యంబు సేయుట యయ్యు గూడ
సోమయాజియు నెదురుగా సోమిదమ్మ
యగ్ని కిరుప్రక్క గూర్చుండి యర్ధరాత్రి
మైన దాక లేవరు చలియపుడు దోచ"

"ఉంక ముఖంబు లన్కణి విటుంకములన్ లిఖియుంచి యున్న మీ
నాంక రస ప్రసంగ మధురాదిమ గాథలు పౌరదారికా
హంకరణ క్రియా సమభిహార మహా పరిహాస సంకథా
సంకలతంబు లొప్పిదపుశైలి బఠింతురు ప్రౌఢ భామినుల్"
[శృంగార నైషదము . 7-157]

అనే శ్రీనాథుని పద్యంలో శైలి శబ్దాన్ని ప్రకారం అనే అర్థంలో ప్రయోగించారు "ప్రాయేణాచార్య వర్యాణా మియం శైలీ యత్ స్వాభిప్రాయ మపి పరోపదేశ మివ వర్ణయతి," అనే కుల్లూకభట్టు మనుస్మృతి వ్యాఖ్యానాన్ని ఉదాహరించి 'అభిప్రాయ వ్యక్తీకరణ'

లేదా 'సమన్వయ పద్ధతి' అనే అర్థాల్ని అప్పే పండితుడు తన నిఘంటువులో ఇచ్చాడు సంస్కృతాంధ్రాలలో "ఒకానొక పద్ధతి లేదా విధానం" అనే అర్థాల్లో శైలిపదం ప్రయోగించ బడింది ఈ అర్థం ఆధునికార్థం "రచనా విధానం" అనే అర్థంలో ఆధునిక కాలంలో ఈ పదం రూఢమైంది

భారతీయాలంకారికులు రచనా విధానానికి సంబంధించి వృత్తి, పాక, గుణ, శయ్యా, రీతులనుగూర్చి పేర్కొన్నారు "పదానామన్యోన్య మైత్రీశయ్యా," "విశిష్ట పద రచనా రీతిః" అని లాక్షణికుల అభిప్రాయం పదాల అన్యోన్య మైత్రి శయ్య ఔతుందనీ, విశిష్టమైన పదాల కూర్పు రీతి ఔతుందనీ భావం. ఏయే వర్ణాలు, ఏయే పదాలు ఏయే రసాలకు అనుకూలంగా ప్రయోగించాలో అలంకారికులు నిర్దేశించారు శృంగారరసంలో దీర్ఘ సమాసరచన ఉండకూడదని, రౌద్రాది రసాలలో సమాసం లేకుండా ఉండరాదని ఆనందవర్ధనులు తెలిపారు; ఈ అభిప్రాయాన్ని జగన్నాథుడు ఖండించాడు పద బంధాల సందర్భోచితమైన కూర్పును 'శైలి' అని వ్యవహరించవచ్చు. ఆంగ్లంలోని 'Style' అనే పదానికి పర్యాయ పదంగా నేడు 'శైలి' అనే పదం ప్రయోగించ బడుతోంది ప్రతి కవికి ఒక విధమైన 'Style' ఉంటుందని ఆంగ్లేయుల భావన అందువల్లకే "Style is the man," "Style is the shadow of man" అనే వాక్యాలు ఆంగ్లంలో ఉన్నాయి. సమర్థుడయిన కవి రసానుగుణంగా పదాల కూర్పుచేస్తాడని మన వారి భావన

"మఱియు రచనాశ్రయంబులై మధురరస ని
వేశ యోగ్యత వృత్తులు కైశికియును
నారభటియును సాత్త్వతి భారతియును
నంగి బొగడొందు దల్లక్షణము లొనర్తు"

[కావ్యాలంకార సంగ్రహము 2-72]

రసోపస్కారకాలైన వృత్తులు కైశికి, ఆరభటి, సాత్త్వతి, భారతి అని నాలుగు విధాలుగా ఉన్నాయని రామరాజ భూషణుడు పేర్కొన్నాడు ఇవి రచనను ఆశ్రయించి ఉంటాయనకండా నాట్యాన్ని ఆశ్రయించి ఉంటాయని చెప్పవచ్చు రచనను ఆశ్రయించి ఉండేవి రీతులు రీతులు గుణాలతోకూడినవి కాబట్టి మాధుర్యాది గుణాలు రచనా నిష్ఠాలు కాబట్టి రీతులే కైశిక్యాది వృత్తుల్ని ప్రకటిస్తాయని చెప్పవచ్చు

"చెలగుం గైశికి కోమలార్థ రచనా శ్రీ నుద్ధతార్థ క్రమా
చలితా డంబరహ ర్తి యారభటి, యీషత్ప్రౌఢ సందర్భ ని
శ్చలయా భారతి పొల్చు, సాత్త్వతియు నీషత్కోమలార్థ క్రమం
బులు, సి వృత్తులకున్ యథోచిత రసస్ఫూర్తుల్ నిరూపించెదన్"

[కావ్యాలంకార సంగ్రహము 2-73]

కోమలార్థ ప్రకటనకు కైశికీ వృత్తి, ఉద్భటార్థ స్ఫూర్తికి సాత్త్వతీ వృత్తి, ఉపయోగించబడతాయి ఏయే వృత్తులు ఏయే రసస్ఫోరకాలో ప్రతాపరుద్ర యశోభూషణంలో వివరించబడ్డాయి

"అత్యంత సుకుమారౌ ద్వౌ శృంగార కరుణౌ మతౌ
అత్యుద్భుత రసౌ రౌద్ర బీభత్సౌ పరికీర్తితౌ
హాస్య శాంతాద్భుతాః కించిత్సు కుమారాః ప్రకీర్తితాః
ఈ షత్ప్రౌఢౌ సమాఖ్యాతౌ౦సౌ వీరభయానకౌ"

[ప్రతాపరుద్రీయమ్, నాయకప్రకరణమ్ 17, 13]

శృంగార కరుణ రసాలు మిక్కిలి సుకుమారార్థాలు (ఇక్కడ కైశికీ వృత్తి), రౌద్రబీభత్సరసాలు మిక్కిలి ఉద్ధతార్థాలు (ఇక్కడ ఆరబటీ వృత్తి), హాస్య శాంతాద్భుత రసాలు కొంచెం సుకుమారార్థాలు (ఇక్కడ భారతీ వృత్తి), వీరభయానక రసాలు కొంచెం

ప్రౌఢార్థ సందర్భాలు (ఇక్కడ సాత్త్వతీ వృత్తి) కొందరాలంకారికులు భారతీవృత్తిని శబ్దవృత్తిగా అంగీకరించి దానిని అర్థవృత్తిగా అంగీకరించక దాని నుంచి 'కైశిక్యాది త్రివిధ వృత్తులు' జనించాయని భావిస్తారు మూడువృత్తులు, మూడు రీతులు, మూడు గుణాలు, మూడు పాకాలు అని వీరి సిద్ధాంతం

"రీతిర్నామ గుణాశ్లిష్ట పద సంఘటనామతా" అని విద్యానాథుడు మాధుర్యాది గుణాలతో కూడిన పద సంఘటన రీతి అని నిర్వచనం ఈరీతులు వైదర్భి, గౌడి, పాంచాలి అని మూడు రకాలు

"అతిమృదుల బంధయుత, యుత, యనాయాత సమాస
దనరు వైదర్భి, రూక్ష బంధయును ఖరస
మాస యగు గౌడి, యు భయాత్మ మహిమ గలిగి
యలరు బాంచాలి, (వీని లక్ష్యము లొనర్తు)
[కావ్యాలంకార సంగ్రహము 2-81]

మిక్కిలి మృదు సమాసాలతో, నాతి దీర్ఘ సమాసాలతో ఉన్న రచన వైదర్భి అని పరుషాక్షరాలతో దీర్ఘ సమాసంగా ఉన్న రచన గౌడి అని, కొంత మృదురచన కొంత పరుషరచనలది పాంచాలి అని రీతుల్ని మూడు రకాలుగా విభజించారు

పాకాలు కూడా మూడు రకాలుగా ఉన్నాయి

"పాకము దీరికార్థ పరిపాకమునందగు, నందు గోస్తనీ
పాకము, నారికేళ ఫలపాకమనన్ ద్వివిధంబు, గోస్తనీ
పాకమ సంవృతార్థ పరిపాక నివేద్యము, నారికేళ పా
కా కలనంబు గూఢ నిబిడార్థ విచార్యము, వీనిలక్ష్యముల్ '

అర్థ పరిపాకమే పాకం అర్థ శబ్దానికి భావం అని అర్థం ఇది ద్రాక్షా పాకమని నారికేళ పాకమని రెండు రకాలు ద్రాక్షా

పాకం అగూఢమైన అర్థంయొక్క రుచి, నారికేళపాకం గూఢార్థం యొక్క రుచిని ఇస్తాయి ద్రాక్షాపాకం సులభ గ్రాహ్యమని, నారికేళ పాకం దుష్కర గ్రాహ్యమని ఫలితార్థం నాతి కఠినమైన దానిని కదళీ పాకం అని నిర్వచించ వచ్చు

వామనుడు "కావ్య శోభాయాః కర్తారో గుణాః, తదతిశయ హేతవ స్త్వలంకారాః, పూర్వే నిత్యాః" (గుణాలు కావ్యశోభను సమకూరుస్తాయి, అలంకారాలు కావ్యశోభాతి శయాన్ని కల్గిస్తాయి, గుణాలు (కావ్యంలో నిత్యాలు)అని గుణప్రాశస్త్యాన్ని పేర్కొన్నాడు "శ్లేష, ప్రసాదం, మాధుర్యం, సౌకుమార్యం, సమత, అర్థవ్యక్తి, ఉదారత, కాంతి, ఓజస్సమాధు"లని గుణాలు పది "మాధుర్యోజః ప్రసాదాఖ్య యస్తేన పునర్దశ" అని మమ్మటుడు మూడు గుణాలే కావ్యంలో ముఖ్యమని పేర్కొన్నాడు మాధుర్యోజః ప్రసాదాలే ఈ మూడు గుణాలు

"సరసములగు వాక్యంబులు
పరుసను వేర్వేఱమించు వగమాధుర్యంబు"
[కావ్యలంకార సంగ్రహము 4-61]

విడివిడిగా అంటే దీర్ఘ సమాసాలు లేకుండా ఉన్న సరసర పదాల కూర్పు మాధుర్యం

"శృంగారకత్వం మాధుర్యం శృంగారే ద్రుతి కారణమ్
కరుణే విప్రలంభే తచ్ఛాంతే చాతిశయాన్వితమ్"
[కావ్య ప్రకాశః 8-67]

ఈ మాధుర్య గుణం శృంగార కరుణ శాంతరసాలకు ఉపస్కారకంగా ఉంటుందని మమ్మటాచార్యులు పేర్కొన్నారు

"విలసిత సమాస భరితో
జ్జ్వల బంధం బోజ మయ్యెసరి."
[కావ్యాలంకార సంగ్రహము 4-68]

దీర్ఘ సమాస బంధమే ఓజం సంయుక్తాక్షర 'మహాప్రాణాక్షర' రేఫాక్షరాది వర్ణఘటిత పద సంపుటి ప్రయోగం వల్ల ఓజోరచన కావించవచ్చు

"శ్రుతిమాత్రేణ శబ్దానాం యేనార్థ ప్రత్యయోభవేత్
సాధారణః సమగ్రాణాం సప్రసాదో గుణః స్మృతః"
[కావ్య ప్రకాశః 8-76]

శబ్దం విన్నంత మాత్రంచేత అర్థ ప్రతీతి కలిగినట్లైతే ప్రసాద గుణమున్నట్లుగా భావించవచ్చు అని మమ్మటుడు

| వృత్తులు | రీతులు | పాకాలు | గుణాలు | రసాలు |
|---|---|---|---|---|
| కైశికివృత్తి | వైదర్భీరీతి | ద్రాక్షాపాకం | మాధుర్యగుణం | శృంగార కరుణ హాస్యశాంతాద్భుతాయి |
| ఆరభటీవృత్తి | గౌడీరీతి | నారికేళపాకం | ఓజోగుణం | రౌద్రబీభత్సరసాలు |
| సాత్త్వతీవృత్తి | పాంచాలీరీతి | కదళీపాకం | ప్రసాదగుణం | వీరభయానకరసాలు |

సుకవులు రసాను గుణంగా వృత్తుల్ని రీతుల్ని పాకాల్ని గుణాల్ని స్వీకరిస్తారు అంతేకాని వారు ఏదో ఒకే వృత్తిని, రీతిని, పాకాన్ని, గుణాన్ని స్వీకరించి రచన చేయరు. కావ్యంలో విభిన్న రసాలుంటాయి కదా కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు తమ కల్పవృక్షంలో వారెన్నుకొన్న రచనావిధానాన్ని సమీక్షిద్దాం

మేనకా విశ్వామిత్రుల శృంగార ఘట్టాన్ని కళాప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణగారు మనోహరంగా వర్ణించారు.

"తన పాదమామె పాదము జతగాబెట్టి
యస్మదాహ్లాదంబు మోటని వచించు
దనహస్త మామె హస్తముమీద బోర్లించి
నీ చేయి లేదని నిహ్నవించు

నామె ప్రక్కగ నిల్చియగు నా బుజముదాక
వచ్చితివేయని పలవరించు
జెక్కిలి జెక్కిలీ జేర్చి గడ్డము గ్రుచ్చు
కొన్నదాయని గ్రుచ్చి గ్రుచ్చియడుగు"

నాను కొని కూరుచుండి నీ యిచ్చమైన
రత్న కాంతి తనూ ప్రభారాశి క్రమ్మి
నా తనూకాంతి గూడ రత్నముల ప్రభలు
చిమ్మెనని చిల్కరించును జికిలినవ్వు"

సమాస భూయిష్ట రచన కాకుండా శృంగార రసాను గుణ మయిన వైదర్భీరితిలో రచన కావించారు శ్రీ విశ్వనాథవారు 'కైశికీ వృత్తి, మాధుర్యగుణం, ద్రాక్షాపాకం ఈ పద్యంలో ఉన్నా యనేది స్పష్టం కవిసమ్రాట్టు పేర్కొనట్లుగా వ్యవహార భాషాశైలి ఇందులో ఉంది

దీర్ఘ సాంస్కృతిక సమాసాలతో కఠిన (పరుష) వర్ణఘటిత రచనతో శివధనుర్భంగ సందర్భముగా మొదటి రెండు పద్యాలున్నా మిగిలిన పద్యాలలోని రచన అంత కష్టంగా అనిపించదు; పాంచాలీ రీతిలో ఇట్టి రచనా విధానం తప్పదు

"నిష్ఠావద్ద మోఘ మేఘ పటలీ నిర్గచ్ఛ దుద్ద్యోతి త
స్పృష్టేరమ్మ దమాలికా యుగ పదుజ్జృంభన్మహా ఘోర బం
హిష్ఠ స్ఫూర్జ దుషండ మండిత రవాహీన క్రియాప్రౌఢి ద్రా
ఘిష్ఠంబై యొక రావమంతటు నెసంగెన్ భిన్న చాపంబునన్"

"నృత్యన్మంజుల తారహార కబరీ నిష్యంది ముక్తామణి
ప్రత్యగ్ర ప్రసవాక్షి సంకలన దివ్యత్కంధ రా భేద సా
హిత్య ప్రౌఢ నవాప్సరో నటన సాహిత్య ప్రశస్తాచ్ఛ దృ
గ్గీత్యాకార మనోజ్ఞమై ధనువు మ్రోగెన్ సర్వలోకంబులన్."

"స్ఫీతాష్టాపద విద్యుదుజ్జ్వల పయః పీయూష ధారా ధునీ
నీతాస్వాద్య తర ప్రగల్భ వచన స్నిగ్ధానవానాం భోజసం
ధా తీర్థాకృతి మాగధోల్బణము నానా మేది నీరాట్సుభా
గీతి స్వాదు మనోజ్ఞమై ధనువు ప్రమోగెన్ రాజలోకంబులన్"

ఈ మూడు పద్యాలను కలిపి పరిశీలించినపుడు వీరరసం స్ఫురిస్తుంది. తదనుగుణ శబ్దజాలం కవిసమ్రాట్టుచే ప్రయోగించబడింది

శాంతరస నిర్భరమైన ఈ సీస పద్యాన్ని గమనించండి. ప్రకృతి వర్ణనకు తగిన అలతి అలతి పదాలు ఈ పద్యంలో ప్రయోగించబడ్డాయి

"పిప్పలపై ప్రవాలు పిట్టలు పడకుండ, లీలగా నడిచెడి లేటికాన
లనిలాగ్రనీయ మానాప్సరో గాన స్వ, నంబాలకించెడి నాగకన్య
లూహ ప్రయుక్త సత్ స్వాహా వచస్సమ, వహ్నికుండోద్గారిఫలరసంబు
లాను పూర్వీ పరివ్యాప్త వర్ణిసహస్ర, శ్రీఘ్రు నిర్వర్తితాశీః సహస్ర"

"మాత్మకులమరు దెంచె నంచాశ్రమస్థ
సరసి దలలెత్తి చూచెడు జలరుహాళి
చూడు జూడగ రఘురాజ చూడమునకు
శాంత భోగమ్ము స్వర్గము సరణిం దోచె"

పై పద్యంలో కైశికీవృత్తి, వైదర్భిరీతి, మాధుర్యగుణం, ద్రాక్షాపాకం ఉన్నాయి

"ఓహో రామచంద్ర! ఓహో రామచంద్ర! ఓహోహో రామచంద్ర! అంతదూరమునుండి నీ పిలుపు నాకు వినవచ్చె నా పిలుపు నీకు విననగుటలేదా! ఈ పడితలల పిశాచము నన్ను బట్టుకొన్నదయ్యా? ఓహో రామచంద్ర! ఇంతవరకు సామీప్యమ్ము చేర రాక పోయితివే! అయ్యో! నేని యాపత్సాగరంబున నెన్ని నిలువుల లోతు

డిగబడిపోయినవి! ఈ యినుపడెక్కల వికారపు రక్షః కళీగము నన్ను గిల్లిగిల్లి పట్టి పీకుచున్నది ఈ మహా వన మధ్యంబున ధీవర శ్రేష్ఠుండనైయున్న నా ... పల్లగా రమ్మై పోయితిని ఓ మహా జనులారా! కౌసల్యా సుమిత్రలారా! ... మీకు గల ప్రేమలకు ఇంక దిలోపములు ... యోమ్మ! ఋషిపత్నీ శాంతా దేవీ! నీ ముద్దు మఱదలు నీ ధర్మపు వెలార్చు మఱదలు చెవులు దోర పెట్టుకొని విన నోచు కొనలేదు ఓ మహారాజా! అజ సంతానమా! నీ కులంబుననైన యింతటి అపనింద నెఱుగకుండ దాటి పోయితివి నీవే యదృష్టవంతుడవు ఒక ఆడదాని జీవితమున నిట్టి అయోగ్యమయిన దుఃస్థితి వ్రాసి యుండరాదు ఇది జరిగినచో నేమి భవిష్యత్తో యెవరు చెప్పగలరు?"

ద్రాక్షాపాకంలో కైశికీవృత్తి వైదర్భీరీతి మాధుర్య గుణాలతో విలసిల్లి కరుణ రసశోభిత మయిన కవిసమ్రాట్టుల వచన రచన చిన్న చిన్న మాటల పేటిగా వెలుగొంది వ్యవహార భాషాసరళిలో విలసిల్లింది

శయ్యకు శైలికి సంబంధముంది శయ్యకు శబ్దపాకమనే వ్యవహారముంది శయ్యకు కావ్యాలంకార సంగ్రహంలో లక్షణం చెప్పబడింది

కదిసి పదంబులు ముందటి
పదములతో బరమ మైత్రి బరగి పర పదా
స్పద మనకుండి న గతులం
దదిశయ్య, తదీయ లక్ష్య మాపాదింతున్"

పదాల సరస సమ్మేళనమే శయ్య అని చెప్పవచ్చు "పదవృత్త్యా సహిష్ణుత" యే శయ్య అని ఆలంకారికుల వక్కాణ

"మాలాకారో రచయతి యథా సాధు విజ్ఞాయ మాలాం
యోజ్యం కావ్యేష్వవహిత ధియా తద్వ దేవాభి దానమ్"

పూలమాలను కట్టేవ్యక్తి ఏ పువ్వు తరువాత ఏ పువ్వును ఏ విధముగా బాగా అమర్చుకుంటాడో అదే విధంగా కవి కూడా ఏ పదంతో ఏ పదం కలిస్తే బాగుంటుందో తెలుసుకొని ఆ విధముగా (కావ్య) రచన చేయాలి అని భామహుడు తెలిపాడు "The choice of best words in best place" అని వర్డ్స్ వర్త్ కవి పేర్కొన్నాడు. ఏ పదాలు ఏ స్థానంలో ఉంచితే బాగుంటుందో ఎంచుకొని ప్రయోగించటమే కవి ప్రతిభకు నిదర్శనం. పదాల ప్రయోగం అస్థాన పతితం కాకూడదు. కళాప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణగారి కల్పవృక్ష కావ్యంలో శయ్యా సౌభాగ్యం పుష్కలంగా ఉంది. ఏ పదం ఏ స్థానంలో, పద్యంలో లేదా వచనంలో ప్రయోగించాలో వీరికి తెలిసినట్లుగా తెలిసిన కవులు ఆంధ్ర సాహితీ లోకంలో అరుదు.

"అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భోగ మస్మాదృశుం
డలఘు స్వాదు రసావతార ధిషణా హంకార సంభార దో
హల బ్రాహ్మీ మయమూర్తి శిష్యుడయినా డన్నట్టి దావ్యోమ పే
శల చాంద్ర మృదుకీర్తి చెళ్ళపిళ్ళ వంశస్వామి కున్నట్లుగన్"

తనవంటి గొప్పశిష్యుడు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికి లభించి నట్లుగా నన్నయ తిక్కనలకు లభ్యం కాలేదనే విషయాన్ని చక్కని పదాల కూర్పుతో ఈ పద్యంలో వెల్లడించారు. ఇందులో శయ్యా సౌభాగ్యం ఉంది. "అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదు" ఏమి లేదు? అనే సంశయం పఠితకు లేదా శ్రోతకు కలుగుతుంది. సమాధానం "ఆ భోగము" ఏ భోగము? "అస్మాదృశుండు . శిష్యుడయినా డన్నట్టి"ది అనేది సమాధానం. ఆ భోగం మరెవరికి ఉంది!

"చెళ్ళపిళ్ళ వంశ స్వామి కున్నట్లుగన్" అని సమాధానం "అలఘు స్వాదు . మూర్తి" శిష్యుడికి విశేషణం కాగా, "ఆవ్యోమపేశల ... కీర్తి" అనేది గురువుగారికి విశేషణం

యజ్ఞ పురుషా విర్భావ ఘట్టంలో

"అంతటు నవ్వేలుగు దిశా
క్రాంతమ్మై యగ్నికంటె గాంతమ్మై దుః
ఖాంతమ్మై సర్వసుఖ
ప్రాంతమ్మై సర్వదృగ్ధురా పటువయ్యెన్"

అనే పద్యం శయ్యాశోభితమై వెలుగొందింది

శ్రీమద్రామాయణ కల్పవృక్ష కావ్యోప సంహారణలో కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు రచించిన ఈ క్రింది పద్యాన్ని పరిశీలించండి

"సద్యో నిర్గతమైన సర్వకవితా సంభారమున్ నీకు నై
వేద్యం బిచ్చితి రామచంద్ర! ప్రభువా! విశ్వాసముం బూనవే
యాద్యంబై చను జీవలక్షణము సంహారంబు గావింపవే
హృద్యంబై చను నీదు తేజమును సారింపంగదే గుండియన్."

శయ్యాశోభితమై శాంతరస నిర్భరమై, మాధుర్య గుణ గణితమై, ద్రాక్షాపాక పరిపూతమై, కైశికీ కాంతమై, వైదర్భి విలసితమై శ్రీ విశ్వనాథవారి ఈ పద్యం వెలుగొందుతూంది

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి భాషాశైలులు అనితర సాధ్యాలు, హృదయాంగమాలు, రసస్ఫోరకాలు.

  

# రామాయణ కల్పవృక్షంలో భాషా విశేషాలు

ఆచార్య జాస్తి సూర్యనారాయణ

జ్ఞానపీఠ అవార్డును పొందిన కవిసామ్రాట్ విశ్వనాథ సత్య నారాయణ మహా మనీషి. బహు భాషావేత్త సంస్కృతము నందు గూడ వీరు దృశ్య కావ్యములను రచించి వీరికి దేవ భాషలోగల పాం డిత్యమును ప్రకటించుకున్న దిట్ట తెలుగున వీరు చేపట్టని ప్రక్రియ లేదు 'కిన్నెరసాని' కథను పాటలుగా రాసి సంగీత ప్రేమికుల మన్ననలను వీరు పొందినారు వీరు రచించిన కోకిలమ్మ పెళ్ళి రసిక హృదయములకు స్పందన గలిగించినది కావ్య విమర్శమునందు వీరికి వీరే సాటి ఒకండు నాచన సోమనాథుడనే పేరుతో వీరు రచిం చిన విమర్శన గ్రంథము తెలుగులోని విమర్శనాత్మక రచనలకు మకు టాయమానము తెలుగువారు వెనుకటి కాలంలో ఎలా దేదీప్యమా నంగా ఉన్నారో తెలియజేసేది వీరి ఆంధ్ర తేజమనే గ్రంథము తెలుగు నందు దృశ్యశ్రవ్య కావ్యములనేనేకములు వీరు రచించినారు. నవలలను నిర్మించుటలో వీరి ప్రతిభ అన్యదుర్లభము

ఈ రచనలన్నీ ఒకఎత్తు రామాయణ కల్పవృక్షం మరోఎత్తు దీన్ని వీరు అతి వేలమగు మథనతో చింతనతో రూపు గావించారు. ఇందుగల ఖాండములు ఆయా సందర్భమునందు నిబద్ధమయిన కథకు సూచకము ఈ విధముగ ఖాండ రూప విభజనము గావించినవారు మరెవ్వరు లేరు భారతీయ భాషలందన్నిట రామాయణమున కను వాదము లున్నాయి వారందరు మూల విధేయముగా 'కాండ' మనే విభజనమునే ఆదరించినట్లు తెలుస్తుంది

రామాయణ కల్పవృక్షంలో భాషలో గుర్తింపదగిన విశేషా లనేకాలున్నాయి. తెలుగు కావ్య రచయితలలో వ్యుత్పత్తి సన్నగిల్లి

అనుకరణ మీాదు మిక్కిలి అయిననాటి సాహిత్యమునే! క్షీణయుగ సాహిత్యమని వాఙ్మయ వేత్తలు గుర్తించారు ఈ యుగము నుండి తెలుగు పద్య రచనమునకు నాంది పలికినవారు తిరుపతి వేంకటకవులు వీరు తక్కిన అంగములతో పాటు తమ రచనల్లోని భాషయందు గూడ క్రొత్త పుంతలకు పోయినవారని పరిశీలనవల్ల తెలుస్తుంది ఈ కవుల గ్రంథాలను సమగ్రంగా పరిశీలించిన విశ్వనాథపై ఈ కవుల ప్రభావము కొంత ఉంది వీరు చేసిన విశేష ప్రయోగాలను కొన్నింటిని విశ్వనాథ తన రామాయణ కల్పవృక్షంలో అనుసరించటం వాస్తవం

శతృంతము

వర్తమానార్థక మయిన శతృ ప్రత్యయానికి రూపాంతరం 'శానచ్' అనేది ధాతువు పరస్త్రీ పదమయితే శతృ వస్తుంది ఆత్మనే పదమైతే శానచ్ వస్తుందనేది సంస్కృత నియమం శాన జంతములు [అన] అజంతములయినందున మన వారదిగ తెలుగులో శానజంతములను వాడుక చేసినంతగా శతృ [అతి] అనగా హలంతముల నాదరించలేదు. శీల వచ్ఛాత్రపుత్ర [దేవీభాగవతం పుట 569] ఇత్యాది ప్రయోగములందు శీలవత్, అనే హలంతాన్ని తిరుపతి వేంకటకవులు వాడుక చేశారు విశ్వనాథ రామాయణ కల్పవృక్షంలోని గజపుష్పీ ఖండంలో [365] జీవత్కాలము నందు అనే ప్రయోగంలో, హలంతమైన జీవత్ అనే దాన్ని వాడారు ఇంతకు మునుపు తెనాలి రామకృష్ణుడు మొదలయిన కొద్దిమంది తెలుగు కవులీ విధంగా హలంతమును వాడుక చేయటం గలదు జీవత్తాతం పాదుండు పొందు మొదలయిన సందర్భంలో గుర్తించాలి

'పురా' అనేది సంస్కృతంలో దీర్ఘాంతమయిన అవ్యయం, దీనికి తెలుగులో వాడుకలేదు - ప్రాచీనుల ఈ అవ్యయాలనంతగా తెనుగులో చేర్చలేదు పురాభవము, వృథా మాటలు మొదలయిన

ప్రయోగాలను తిరుపతి వెంకటకవులు దేవీ భాగవతంలో వాడారు పురాభక్తి [నూపురఖండ 360] పురాహవము [నిస్సంశయఖండ 184] సహసాపీ నిపాతిత [నిస్సంశయ 210] మొదలయిన ప్రయోగాలు విశ్వనాథ విచిత్ర కల్పవృక్షంలోనివి ఓటిలో ముందు దీర్ఘాంతమయిన అవ్యయాలు ప్రయుక్త లయినాయి

దేవానాం ప్రియ

ఇదొక అపూర్వ ప్రయోగము దీన్ని విశ్వనాథ దేవానాం ప్రియులై చరించిరి [జటాయు ఖండ-64] అనే సందర్భంలో వాడుక చేశారు తిరుపతి వేంకట కవులు సుశీల-202 లో ఈ ప్రయోగాన్ని వాడుక చేశారు ఈ రెండు ప్రయోగాల్లో సంస్కృతంలో అలుక్య సమాసముగా గుర్తించిన దీనికి మూర్ఖులు అని అర్థం పింగళి సూరన రాఘవ పాండవీయంలోగూడ ఈ సమాసాన్ని అదే యర్థంలో [అవ తారిక-6] వాడియున్నాడు అలుక్య సమాసాన్ని నిపతిస్తూ పాణిని తన వ్యాకరణంలో ఈ సమాసానికి సంబంధించి ఒక సూత్రాన్ని నిర్మించాడు దేవానాం ప్రియ ఇతి చ మూర్ఖేఅని సూత్రము పాణిని ఈ అలుక్య సమాసానికర్థాన్ని గూడ నిర్దేశించి ఉండటం గుర్తించాలి ఈ సందర్భంలోగల మిగిలిన సమాసాలకు వేనికి అర్థ నిర్ణయం విష యములో పాణిని శ్రద్ధ వహించి యుండలేదు. పైగా పింగళి సూరన వరకు ఎవ్వరును ఈ సమాసాన్ని యర్థంలో గానీ తదన్యార్థంలోగాని వాడుక చేసి ఉండలేదు ఈ సమాసంలో గల పూర్వోత్త పదాల అర్థాన్ని గమనిస్తే వ్యస్తంగా నీ పదానికి మూర్ఖుడనే అర్థంరాదు. వ్యస్త ముగా పదాలకు గల అర్థాన్ని విక్రమించిన సమస్త పదానికి అర్థం గలగటం అసంబవము గాకన్నా ప్రసిద్ధం గాదు

ఈ పథబంధానికి వ్యస్తపదాలకు గల అర్థంతో సరివచ్చు అర్థమే ఉంది బౌద్ధమతం వాడైన అశోకునకు బిరుదుల్లో ఈ సమా సం అన్యతమం బౌద్ధమతాన్ని ద్వేషించే వర్గానికి చెందిన వారి

బిరుదు కీయర్థం గలిగించి వ్యవహరించారు. కాలాంతరంలో దీనికి వ్యాకరణ అనుమతి లభించింది అయినా బౌద్ధమత ప్రాబల్యాన్ని గుర్తించిన వారీ సమాసాన్నీ యర్థంలో [వ్యాకరణ ప్రతి పాదితార్థం] ప్రయోగింప వెనుకాడారు ఈ సాహసమునకు ఉద్యమించిన వారిలో మొదటివాడు పింగళ సూరన ఈ సమాసాన్ని వ్యాకరణ ప్రతిపాదితార్థంలో ప్రయోగించిన వారు మరెవ్వరును లేరనిపిస్తుంది! దీనికి వ్యాకరణకర్త [పాణిని] విధించిన యర్థానికి భిన్నంగానైన ఈ పద బంధాన్ని సంస్కృతాంధ్రిలో ఎవ్వరూ వాడినట్లు లేదు వ్యాకర శాస్త్రానికి భాషపై ఎంతటి పరిభావంగలదో దీనివల్ల తెలుస్తుంది

'వినా' అనేది సంస్కృతంలో ఒక అవ్యయం వినోక్త్వలింగా కారంలో ఈ యవ్యయమే ప్రధమావయంగా ఉన్నది. ఈ వినాను తెనుగలో ప్రయోగించిన వారిలో మొదటివారు తిరుపతి వేంకట కవులు వీరి 'సుశీల' కావ్యంలో అయిదో ఆశ్వాసం 35 పద్యంలో కాని వినాగ అని ప్రయోగం గలందు ఇందులో 'గ' అనే దానికి మూల రూపము 'కా' అనేవె.నుద్యంతంబగు నగు దాతువు. ఇది క్రియా విశ్లేషణ నిష్పాదకంగా తెలుగు వాడుతారు మెల్లగా చల్లగా మొదల యినవి ఉదాహరణములు ఈ నుజ్యంతం వినాపై చేరింది ఈ కవుల ప్రయోగంలో దీన్ని విశ్లేంచి ప్రయోగించిన ఘనత విశ్వనాథకు దక్కింది ఈ వినాను వాడితే తృతీయ లేదా ద్వితీయ లేదా పంచమీ విభక్తులు రావాలని సంస్కృత వ్యాకరణ నియమము 'పృథగ్వినా' నానాబ్రస్తృతీ యాన్య తరస్యాం అష్టాధ్యాయి 2-3-32 అ సూత్రం ఈ రాము వినా [బాలకాండ - 154 రామాయణ కల్పవృక్షం] అనే ప్రయోగంలో ద్వితీయా విభక్తి గలదు రాము వినాని మేషమును మనజాలను [కల్పవృక్ష. అభిషేక ఖండ 217 221] అనునది గూడ ద్వితీయాంతమున ప్రయోగించినందుల కుపకరించే రూపమే నిన్ను వినా ఘటిల్లునె [బాలకాండ 151]. వినాతో యోగ మున్నందున తృతీయ విభక్తిని వాడుక చేయుటకు రామాయణ కల్పవృక్షం

అయోధ్యాకాండ-అనసూయ ఖండంలోని 100 పద్యంలో గల నీచేతి వినా గరిక పోచైన గదలదు, అనే ప్రయోగం ఉదాహరణ ఈ అవ్యయం వాడినవాడు న పంచమీ విభక్తి వాడుక చేసినట్లు చెప్పటానికి తగిన ఉదాహరణం గానరాలేదు

ఇంతేగాక ఈ అవ్యయాన్ని నఞ్ తత్పురుష సమాజంలో ఏర్పడే రూపాన్ని [న, వినా] 'అవినా' గల్పించి దానికి స్థితిని పరంగా చేర్చి 'అవినాస్థితి' అనే రూపాన్ని కవి [అయోధ్య - అనసూయ ఖండ 262] ప్రయోగించటం గుర్తింపదగిన యంశము వినాకృత రాజ్యుడు [మారీచఖండ 131] అనే ప్రయోగంలో వినా అనే అవ్యయం సమాసంలో అద్యవయంగా నిలచి ఉంది వినాకరించు [పంచవటి 87] అనే ప్రయోగంలో 'వినా' అనేది ఉపసర్గను పోలియున్నది 'అను' లేక అంగీ అనే సందర్భంలో ప్రయోగయోగ్యములు వారు వినా [రామాయణ కల్పవృక్షం నిస్సంశయ ఖండము 80] అని వ్యాకరణ ప్రోక్తమయిన విభక్తి విరహితముగ [ప్రథామాంతంలో] ప్రయోగం గూడ ఇందు గలదు

సంస్కృత సమాసాల్లో సామాన్య విశేష భేదాల త్రిప్రాథమికాలు విశేష సమాసాల్లో పద ప్రాధాన్యాన్ని దృష్టిలో ఉంచుకొని నాలుగు విభాగాలేర్పడినాయి పూర్వపదం ప్రధానంగా గలిగిన సమాసాన్ని అవ్యయీభావమంటారు సుబంతాదుల కలయకతో ఏర్పడిన ఈ సమాసం అవ్యయంగా రూపు దాలుస్తుంది ఈ వర్గానికి చెందిన సమాసాలు క్రియకు విశేషణాలు [Adverbs]గా ప్రయుక్తాలవుతాయి కల్పవృక్షంలో ఈ విధంగాను ఏర్పడ్డ సంస్కృత సమాసాలను వాడుక చేయుటమే గాక ఈ మార్గంలో క్రొత్త సమాసాలను గల్పించి ప్రయోగించటం గూడ గలదు 'ఆజ్ఞా మను స్మృత్య' అనే పదముల కలయిక వలన విష్పన్నమైనదే 'యథాజ్ఞ' మనే అవ్యయీభావ సమాసము రామాయణ కల్పవృక్షం బాలకాండలోని 53

పద్యంలో ఈ ప్రయోగం గలదు సభార్యం [కల్పవృక్ష-బాల-195] అనే అవ్యయీ భావ సమాసమునకు విగ్రహము 'భార్యయా సహ' అనిగావచ్చు ఆశ్చర్య-భక్తి భయ-శ్రద్ధాభిస్సహ, అనే విగ్రహాన్ని సంగ్రహించి నందున ఏర్పడినదే సాశ్చర్య భక్తి భయ శ్రద్ధం [కల్ప వృక్ష-బాల-283] అనే సమాసము అవ్యయీ భావము నందు సమ సించు నవయవములు రెండుకు మించిలేవని పరిశీలనము వలన తెలి యును ఈ మహాకవి నాల్గు పదములతో నొక అవ్యయిమును గలిపి పై సమాసమును నిర్మించెన తెలియును పై నుదాహరించిన సమా సము లన్నియు కవి కల్పితములే గాని సంస్కృత వ్యాకరణ ప్రతి పాదితములు గావు సంస్కృత సమాస నిర్మాణము నందలి విమర్శ మును గుర్తించి పై రీతినీ సమాసములను కవి గల్పించి యుండును

ఈ విధముగ అవ్యయీ భావ సమాస నిర్మాణము నందు ప్రత్యేకతను ఎరింగి తన యభిమతానుసారముగ నీ వర్గమునకు చెందు సమాసముల అతివేలముగ నిర్మించి ప్రయోగించిన ఘనత వంగభాషకు గలదు ఈ యంశము నందు రవీంద్రనాథ్ టాగూర్ ప్రయోగించిన ఈ క్రింది ఆవ్యయీ భావ సమాసములు గుర్తింప దగును యదాసాధ్య, యదాసమయ యథోపయుక్త యధాకర్తవ్య యథాయోగ్య యథాస్థాన మొదలయిన సమాసరూపముల అసంఖ్యాం కముగ రవీంద్రుని రచనల్లో గలవు పై సమాసము లన్నియు ద్వి తీయ ఘటితములే చతురవయవ ఘటితమైన సాశ్చర్యభక్తి భయ శ్రద్ధం ఇత్యాది వలె బహు పద ఘటితములైన అవ్యయీభావ సమాసములు బెంగాలీ భాషలో ప్రయుక్తములు గాకుండుట గమనింప దగిన యంశము నిర్మశకం, నిర్మక్షికం మొదలయిన యవ్యయీ భావ సమాసముల భావార్థంలో ఏర్పడినట్లు వ్యాకరణము చెప్పి యున్నది దీనిని సమూనాగా తీసుకొని నిష్పక్షికం [రామాయణ కల్ప వృక్షము సమీకరణ ఖండము - 244] అనే నమూనాన్ని గల్పించి ప్రయోగించిన ఘనత విశ్వనాథ కవికి దక్కింది

తెనిగింపు –

సంస్కృత సమాసముల నాంధ్రీకరించి ప్రయోగించుట తెలుగు కవుల కనాదిగ ఉన్న ప్రత్యేకత అకుటిక్క, అకుంజనిక అనే విపర్ణశాలకు తెనుగుసేత నీటి వామి, నిర్వామి అనే నిజంశయము నను తెనిగింపు అమృతమునకు తెనిగింపే వేల్పుబువ్వ ఋష్యాశ్రమ మునకు తెనుగే తబసితోలు!. ఈ విధంగా సంస్కృతమునందు సహజ ములయిన పద బంధాలకు వికృతి రూపాలు గల్పింప దానవి చదువు వారి దృష్టిని వాటికి మూలమైన సంస్కృత [illegible] ఆ పదములు ఎల్ల ప్రాకృత తెనుగు [illegible] ఉద్భూతములయి [illegible] పూని యుండునని మన కవగతమగును ఈ సందర్భమునందు మహా భాష్యకారుడయిన పతంజలి చెప్పిన మాటలను సంధింపదగును అవి ప్రథమములయిన శబ్దములే సాధు శబ్దములు వాటి నుంచి గలిగి నవే అపశబ్దములు అపశబ్దములులే కవి కృతి రూపములు గలగటానికి వక్తలయొక్క శక్తిహీనత తొందరపాటు, శ్రద్ధలేమి[పలుకుటయందు] మొదలైనవి కారణాలు వికృతి రూపములు లేదా అపశబ్దములను విన్నంతనే శ్రోతకు వికృతి విరహితమయిన శబ్దం [సుశబ్దం] జ్ఞాప కానికి వస్తుంది వెంటనే దాని యర్థం శ్రోత యొక్క మనేనేత్రంలో స్ఫురిస్తుంది ఆ స్ఫురణ వికృతి అపశబ్దాని కర్థాన్ని నిర్ణయిం చటంలో సహకరిస్తుంది. అంటే అపశ్శబ్దములు లేక వికృతి రూప ములు అర్థం గావాలంటే శ్రోత ప్రకృతి రూపములను కూలంకషంగా ఎరిగినవాడై ఉండాలి పైని నిరూపించిన విధంగా తెనిగించిన పద బంధల కర్థం గ్రహించాలంటే శ్రోతకు వానికి మూలమైన సంస్కృత రూపాలతో పరిచయం చాల అవసరం అంటే మనవారు రచించిన అచ్చ తెనుగు కావ్యాల్లో భాషగానీ ఆంధ్ర నామ సంగ్రహాది నిఘం టువులో గల తెలుగు పదాలు గానీ సంస్కృత పదాల కనువాదులై నందున వాటిని అర్థం చేసుకునే శక్తి సంస్కృత భాషా పండింతులకే ఉంటుందిగాని సంస్కృతము నేర్వని తెలుగు వారికి ఉండదు అచ్చ

తెనుగు కావ్యములకు తెలుగువారి మన్ననకు న రాక పోవటానికి అప్రక్రియ అచిరకాలంలో కవుల ఆదరం పొందలేక పోవటం ఈ కారణము వల్లనే యని గ్రహించ నగును పైన నిరూపించినట్లు పండితైక వేద్యములయిన తెనిగింపు విశ్వనాధ కృత కల్పవృక్షంలో కొన్ని ఉన్నవి సిరకొండ [హిమాలయ]కల్పవృక్షం అవతారిక 18, ముయ్యేరు [త్రిపథగా] ప్రస్థాన ఖండ 455, కోరుకుల చెట్టు [కల్ప వృక్ష] పాదూఖండము 179, నడిమింటన్ [గగనమధ్యము] పూర్వ రాత్ర ఖండము 375 మొదలయినవి

సంస్కృత సిద్ధ సమాసము లందలి పదములకు తెనుగు లేదా సంస్కృత పదాంతరములతో గల్పించుట తెలుగు కవుల కనూచానమైన యాచారం పద వినియాత్మకము వికారమున కాకర మైన ఈ సమాసములు మూల రూపములను [సాధురూపములను]మన మనస్సునకు స్ఫురింపజేయును దాని అవికార లేక [అపశబ్ధముల అర్థ ధీహేతువులగుచున్నవని మనము తలంపనగును.

| | | |
|---|---|---|
| సరః ప్రభవాస్తుని (సూర్య) వంశము | బాలకాండ | 6 |
| సరయూ ఝురము (నది) | బాలకాండ | 21 |
| హయ (అశ్వ) మేధము | బాలకాండ | 23 |
| ఋష్యవిషాణ (శృంగ) మౌళిని | బాలకాండ | 54 |
| తురగ (అశ్వ) మేధము | బాలకాండ | 62 |
| ఘటోద్భవుడు (కుంభ సంభవ) | దశ్శోర్ష | 281 |
| సుధాహారుక (అమృతాశనులు) | జటాయువ | 222 |
| తుదాంషాడశ్మ (ఇంద్రనీలమణి) కచ | శబరి | 1:3 |
| హిమగ్రావ రాజు (హిమవంతుడు) | నూపుర | 244 |
| రక్తోలు లాయక్షా భర్త (మహిషాసుర) | నూపుర | 272 |
| త్రియామాచర (రాత్రించర) | సంశయఖండ | 36 |

| | | |
|---|---|---|
| నాళీక గర్భాండము (బ్రహ్మాండము) | నిస్సంశయ | 377 |
| కుంభ సూతి (ఘట సంభవ) | నిస్సంశయ | 386 |

పై వానిలో కుంభసూతి, ఋష్యశృంగ మొదలయినవి వ్యక్తి నామములు. ఇందును పద వినియమము గుర్తింప దగిన యంశము.

మనుజులలో పులి [రామాయణ కల్ప వృక్ష అభిషేక 292] అనేదొక విచిత్రమైన పదబంధము. ఇందులో పూర్వపదాంతంలో గల 'లో' అనే ప్రత్యయం నిర్ధారణ షష్ఠీ విభక్తిలో వస్తుంది నిర్ధారణ షష్ఠికి లోపల ఉ పర్ణింపబడు బాల వ్యాకరణము-కారక - 16 అనే సూత్రం ఈ సందర్భంలో గను సంధింపదగిన వ్యాకరణాంశము. ఈ పదబంధానికి మూలము 'పురుష వ్యాఘ్ర' అనేది, ఉపమానోపమేయభావము ఆధారముగ ఏర్పడినదీ సంస్కృత సమాసము అష్టాధ్యాయిలో మొదటి పాదంలోని 56వ సూత్రమయిన ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే అనే సూత్రం ఈ సమాస విధాయకమయిన సూత్రం ఉపమానోపమేయములు సాదృశ్య వాచకము ఈ వర్గానికి చెందిన సమాసాలకు అర్థం వివరించే సందర్భంలో గన్పించే విగ్రహ వాక్యంలో కనబడుతాయి పురుషః వ్యాఘ్రః ఇవ, అనేవి పదములు చంద్ర శార్దూలనా గాద్యాః పరే శ్రేష్ఠత్వ గోచరాః అనే నిఘంటు పంక్తుల సందర్భము నందును సంధింప దగినవి ఇందులో పురుషుడు ఉపమానము. వ్యాఘ్ర ముపమేయము. ఇవ సాదృశ్య వాచకము సాధారణ ధర్మమైన శూరాది పదాలకి విగ్రహ దశలో ప్రమేయములేదు. దీన్ని తెనిగిస్తే పులివంటి [పౌరుష విషయంలో] మనిషి అని అనదగును. కాని ఈ కవి 'మనుజులలో పులి' అని అనువదించారు. అలా అయితే దీనికి పురుషాణాం [నిర్ధారణ షష్ఠి] వ్యాఘ్ర అని సంస్కృతంలో విగ్రహాన్ని గల్పించాలి అలా అయితే ఈ పద ద్వయం సంస్కృతంలో సమసించదు. దీనికి పాణిని నిర్మించిన - న నిర్ధారణే 2 2 10 అనే సూత్రమే మూలము అయినా

వ్యాకరణనియమాన్ని అతిక్రమించి కవి ఈ సందర్భంలో తన నిరుం కుశత్వమును నిరూపించుకొనినని తలంచటం సమంజసం

దఘ్నార్థకం:-

లోతు అనేది మొల, తొడ మొదలైన తెలుగు పదాలకు పర ముగా చేరటం దానివల్ల మొల లోతు మొదలైన పదాలేర్పడం మనకు సుపరిచితం "లోతు" అనే దానికి సందర్భంలో గల యర్థానికి తుల్యార్థంతో "బంటి, కొలది" అనే వాటిని రెండింటిని వ్యాకరణం గుర్తిం చింది ధఘ్నార్థంబున బంటి కొలదులగు [బాలవ్యాకరణం. తద్ధిత. 27] అనేదీ సందర్భంలో వ్యాకరణం గుర్తించిన సూత్రము బంటి-కొలది-లోతు మొదలైన తెలుగు పదాలకు సమానార్థకం "దఘ్న" అనే సంస్కృత ప్రత్యయం ఈ భాషలో ఈ యర్థంలో మరి రెండు ప్రత్య యాలను పాణినీయం గుర్తించింది ప్రమాణేద్వయ సజ్ దఘ్నచ సూత్రచః అష్టాధ్యాయి 3 2 32 ఇందులో ద్వయస మూడచ్చులు గల ప్రత్యయము దఘ్నమాత్ర అనేవి రెండచ్చుల గలవి దీనికి [ఇందు జలానికి] తొడలోతు గలదనే యర్థాన్ని తద్ధితాంతం చెబు తుందని దీనికిచ్చిన వృత్తి వివరిస్తుంది ఊరూ ప్రమాణమస్య అని ఊరు ద్వయ సమనే దాని అర్థాన్ని వివరింప నుద్దిష్టమైన వాక్య తెలియ జేస్తుంది

రామాయణ కల్పవృక్షంలో తత్కర్త ఈ 'దఘ్న' అనే ప్రత్య యాన్ని తదన్యార్థంలో ప్రయోగించాడు ప్రగాఢ అతివేలము, అత్యంతము అనే అర్థంలో deep అనే మాటను ఆంగ్లంలో వాడటం deep love మిక్కిలి లోతైన అతి వేలమైన అనురాగం అని చెప్పాలి. ఈ ఆంగ్ల పదానికి ఇంచుమించుగ తుల్యార్థంలో 'దఘ్న' అనే సం స్కృత ప్రత్యయాన్ని ఈయన వాడుక చేసియుండునని ప్రయోగ ముల నాధారముగ చేసికొని మనము గ్రహించ నగును

ఏమి భయంబది ప్రాణ దఘ్నము [మారీచ ఖండము 44] అనే ప్రయోగంలో ప్రాణ దఘ్నమునకు ప్రాణములను వెలికి లాగి వేయునంతటి ఉత్కటము, అతివేలము అయిన భయమని చెప్పనగును ప్రాణ వాయువు జీవి శరీరంలో ఏ మూల, ఎంతలో ఉన్నవో తెలియదుగాని నిగూఢముగా దాగియున్న ఆ ప్రాణవాయువులకు సంచలనము గలిగించునంత లోతుకి భయము చొచ్చుకుపోయి ప్రకంపనము గలిగించినదని తలంపనగును ముని శాపఖండము 370లో గూడ ప్రాణ దఘ్నము ప్రయుక్తము బాలకాండలోని 285 పద్యంలో హృదయ దఘ్నమనే ప్రయోగం ఉంది ప్రాణమువలె హృదయము శరీరము నందున్నట్లు అందరంగీకరింతురె గాని వాటిని చూచిన వారెవ్వరును లేరు అట్టి అమూర్తమైన హృదయములోనికి చొచ్చుకొని పోయినదనే యర్థంలో ఈ విశేష ప్రయోగాన్ని మనం గుర్తించగలము

ఈ సందర్భంలో మరో విశేష ప్రయోగం "బహిస్సౌందర్య దఘ్న రసికత" మారీచ ఖండములోని 312 పద్యంలో ఈ ప్రయోగముంది తాటక రామ లక్ష్మణుల గుణగణములను గూర్చి ఏ మాత్రం ఆలోచించక బాహ్యమయిన శరీరమునకు గల సౌందర్యమును గాంచినంతనే ముగ్ధమై తన హృదయము నాపురుషులందు లగ్నము గావించిందనే సందర్భం లోనిదీ ప్రయోగం ఈ యర్థ వంతములగు ఆంగ్ల వాక్యాంశములనీ 'దఘ్న' చెప్పజాలి యున్నది భాషాంతరము లందలి విశేష భావములను తమ తమ భాషలందు వ్యక్తము చేయుటకై మనీషాధీ బలముగల కవివతంసులు తమకందు బాటులో నున్న పదములు లేక ప్రత్యయములను ఆ విశేషార్థంలో వాడుక చేసి తమ భాషను సుసంపన్నం చేస్తుంటారనే యంశాన్ని మనమీ విశేష ప్రయోగం వల్ల తెలియ నగును.

హృదయ దఘ్న, బహిస్సౌందర్య దఘ్న మొదలయిన ప్రయోగాల్లో "దఘ్న" అర్థవంతంగా లేకపోవటం వాచ్యార్థం కుదర

నందున లక్ష్యార్థమును చెప్పుకున్నట్లు మనమీ సందర్భంలో వాచ్యేత రార్థాన్ని చెప్పుకోవలసి ఉంటుంది

పదముల పొందిక అర్థవంతం గాకపోతే లేదా అసహజత పొడ చూపితే దాన్ని "వక్రోక్తి" యనటం మనకు తెలియునది గాదు ప్రస్తుత ప్రయోగ విశేషములను వక్రోక్తి లక్ష్యముగా గుర్తించటం వగను

విశ్వా రాజు - పంచవటీ ఖండము - 110

ఇదొక విశేష ప్రయోగం 'విశ్వామిత్ర' అనే సమాసానికి పర్యాయ పద మీరూపము విశ్వ-మిత్ర అనే రెండు పదములు సమ సించే సందర్భంలో పూర్వ పదాంతంలోని హ్రస్వానికి దీర్ఘమాదేశ మవుతుందని పాణిని [మిత్రేచర్షౌ 6 3 130] స్పష్టం గావించారు. విశ్వ + మిత్ర = విశ్వామిత్ర అయినది. కాని పరిపదం అమిత్ర అని భ్రాంతిపడి పూర్వ పాదాన్ని 'విశ్వగా' ఊహించి నడుమ సవర్ణ దీర్ఘ సంధి వచ్చినందున ఈ రూపం వచ్చిందని మనవారు కొంద రూహించారు ఇది కేవలము భ్రాంతి మూలకమయిన విభాగము. పూర్వ పదాంతస్థ స్వరానికి దీర్ఘ మాదేశము గా వచ్చే పద బంధాలను వివరించే సందర్భలోనిదీ [మిత్రేచర్షే] సూత్రము కృషి + వల = కృషీవల, అమర + వతీ = అమరావతీ, శర + వతీ = శరావతీ, పరి + పాక = పరీపాక, ని + కాశ = నీకాశ, అష్ట + పద = అష్టాపద మొద లయిన రూపసాధన క్రమములోనిది. విశ్వ + మిత్ర = విశ్వామిత్ర అనేది, ఈ సందర్భాన్నీ ఈ పదం యొక్క నిజస్వరూపాన్నీ గుర్తిం చకపోగా తప్పుగా విడదీసిన మహా పండితులు ప్రాచీనకాలమునందే ఉన్నారు అట్టి వారిలో నొకడు అప్పకవి 'విశ్వామిత్ర' శబ్దాన్ని అనుచితంగా విభజించినందున పద్యాక్షరం 'అ' [అమిత్ర] కారంగా సిద్ధించింది దీనికి అకారముతో యతి మైత్రిని పాటించినవాడు

రంగనాథ రామాయణ కర్త ఈయతికి లక్ష్యలక్ష్యతను అప్పకవి ఉభయవశుల్లో నిత్య సమాసయతుల్లో గల్పించాడు లక్ష్యలక్షణ నిర్మాతలలో ఇంతగా నాటుకుపోయిన అపోహను తొలగించాలంటే ఈపదం దీర్ఘాంతమనే యభిప్రాయం పాఠకుల్లో నాటుకుపోవాలి అందున విశ్వారాజు అనే ప్రయోగాన్ని కవిచేసి యుండును. పదముగ హల్లునందున దాన్ని అమిత్రవలె ఆ రాజుగ విడదీయ వీలు గానందున ఈ ప్రయోగం విశ్వా+మిత్ర అనే సముచిత విభాగానికి మార్గ దర్శకమవుతుందని విశ్వనాథ నమ్మినందున ఈ ప్రయోగమును గావించి యుండును

క్రియా పదములు -

ధాతువుల నుండి వివిధ కాల పురుష వచన బోధక క్రియా రూపాలు ఏర్పడుతుంటాయి అలాంటి ధాతువు లంతమందించు ను గలిగి ఉండటం సాంప్రదాయక వ్యాకరణాలు చెబుతున్నాయి సంస్కృతం ధాతువులకు ఈ యించు చేరుతుంది కొన్ని కృదంతాలకు గూడ ఇంచు చేరి దాతువు లేర్పడటం గలదు శయనించు[శయన+ఇంచు] మొదలయినవి ఉదాహరణములు 'కమల' అనే నామంపై ఇంచు చేరినందున ఏర్పడే 'కమనించు" అనే రూపాన్ని విశ్వనాథ కవి తన రామాయణ కల్పవృక్షంలో అతని కన్నులు చమరించినచో కమనించుగ ద్రై [పూర్వరాత్ర ఖండ 324] అనేసందర్భంలో గలదు. "కమనించు"అనేది ఉద్దిష్టార్థమును ప్రస్ఫుటముగ పరితకు తెలియజేయగాగి ఉంది "శీతసించు" శీతనింపించు నిస్సంశయ ఖండ 220 ఇత్యాది ధాతువులను గూడ ఈ కవి ప్రయోగించియున్నాడు భుజిక్రియ [దశవర్ష 34] వినలికరించు [దమపర్ష 420] శ్వశ్రియనం చాడు [గజప్రష్టి ఖండ 103] మొదలయిన విశేష ధాతువుల ప్రయోగమీ కవి కావ్యము నుందు గలదు శుభము పలుకు, అనే దానిలో శుభమునకు పర్యాయ పదశ్యమయిన శ్రేయి సమనేది పలుకుటుకు మారుగ "అడు" అనేదానికక్కడ వాడి యుండటం గమనింప దగును.

ప్రబంధ కాలానికి ముందున్న భాషలో అక్కడక్కడ గాన వచ్చే విశేష్య విశేషణములకు సమానమైన లింగ వచన విభక్తులు గల వాక్యాలు కొన్ని ఈయన రచనలో కనపడతాయి ప్రభు సుభాషా దిని రాత్రి [దశరథ ఖండము-15] అనే ప్రయోగంలో రాత్రి స్త్రీ లింగము నందు ఉండుటచే దానికి విశేషణము [ప్రభుసు భాషాదిని] గూడ స్త్రీ లింగమున యుండుట గమనార్హము విశేషమునకు వలెనే విశేషణము గూడ ప్రథమా విభక్తి ఏకవచనము నందే యుండుట తెలియవలసిన యంశం.

సంస్కృత భాషామయ వాక్యము నందలి సంబోధన ప్రథమా విభక్త్యంతమునకు తుది యచ్చు హ్రస్వముగనే యుండ వలసిన సందర్భములందు కొందరు తెలుగు కవులు దీర్ఘాంతముగా వాడిరి అట్టి వారిల్లో అగ్రతాంబూలము భాస్కర రామాయ కర్తకు లభిస్తుంది. అతని రామాయణంలో అరణ్యపర్వ - 220 పద్యంలో హే లక్ష్మణా, హతోస్మి అనే దిసందర్భంలో గుర్తించాలి ఈ దివచన భాగమునందలి చందో నిర్బంధము వల్ల దీర్ఘత్వం వచ్చిందని చెప్పటానికి వీలు గాని దీ రూప విశేషము సంబోధనలో తుది స్వరం దీర్ఘం తెలుగులోని నియమము. ఈ విధానమునకు విధేయులయనందున ఈ రీతి రూపములు సంస్కృతమునకు న్యాగబాకినవని మనము గ్రహింపనగు ఇట్టి ప్రయోగము లన్నమయ్య సంకీర్తనములందు కొన్ని గలవు కందుకూరి రుద్రకవి తన నిరంకుశోపాఖ్యానంలో ఇలాంటి ప్రయోగాలను కొన్నింటిని గావించి యున్నాడు నాటి ప్రచురమును ప్రాచీనము అయిన ఈ పద్ధతిని తిరుపతి వేంకటకవులు పునరుద్ధరించిరి వీరి నానారాజ సందర్శనంలో సంస్కృతభాషామ వాక్యంలో సంబుద్ధ్యంతము నందలి తుదిస్వరమునకు [తెలుగు మర్యాద ననుసరించి] దీర్ఘత్వమును గల్పించి హే దేవీ, శాంకరీ మనోహరిణీ మొదలైన ప్రయోగాలను జేసారు సంస్కృతమునందీ పదములన్ని 'దేవి' ఇత్యాదిశ హ్రస్వాంతములు గనే నిలిచి యుండుట ఆభాషా స్వభావము

ఈ మార్గమును ఆదరించి మరల ప్రతిష్ఠ గల్పించిన ఘనత విశ్వనాథ కవికి దక్కినది ఈతని రామాయణంలోని పాదూకాండం 309 పద్యంలో సకలక్ష్మాపాలక పరమేశా' భక్త్యా, అనే సంస్కృత భాషామయ వాక్యంలో 'పరమేశ' లోని తుది స్వరం దీర్ఘాంతరిగా ఉండటం గమనింపదగిన యంశం

అతి ప్రాచీనులయిన తెలుగు కవులలోని విశేషములను పున రుద్ధరించుట వానికి ప్రాణప్రతిష్ఠ చేయుటలో విశ్వనాథ కవికి ఉత్సాణ గలదని తోచును

కారక విశేషములు ..

మన మాతృభాషయయిన తెలుగు సుసంపన్నమూ సర్వ సమర్ధనని విశ్వనాథ సత్యనారాయణగారి యభిప్రాయము రాక్షస స్త్రీల నడుమ ఒదిగి ఒడిగి జీవితమును గడపుచున్న సీతను తనయను భావము వలన జగజ్జనుల కందరకు ముక్తిని గలిగింప దగిన శక్తి గలి గియు అట్టి యవకాశము లభింప నందున దీనావస్థలో నున్నదని చెప్పును. 'నీచ భాషా క్లిశ్య మానావస్థయై జగమ్ము క్త్యైక మార్గోపదేశ రాహితమైన దేశభాషముం బోవె' [ఇంద్రజిత ఖండ-356] ఇందులో దేశభాషకు సీతకు రాక్షసస్త్రీలకు నీచభాషలకు పోలిక అశోకవనంలో ఉన్న సీతకు నిస్సహాయ స్థితిలో ఉన్న మనదేశ భాషకు పోలిక ఈ భాషను సుసంపన్నము శక్తివంతము చేయాలంటే ఇందులో అర్థబోధ కత భావ ప్రకటనలకు వలయు పదాల వాక్య నిర్మాణరీతులు వృద్ధి చెందాలి ఆ దృష్టితో వీరు విశిష్ట పదాలను వాడటమేకాక అపూర్వ ములయిన వాక్య నిర్మాణం గావించారు. ఈ నిర్మాణం ముందు విం తగాను కొత్తగానూ ఉన్నా ప్రయోక్త అయిన కవియొక్క దక్షత వలన జన బాహుళ్యం యొక్క ఆదరణకు పాత్రమై భాషను సుసం పన్న చేస్తుంది

ఈ కవి క్రొత్తగ ప్రవేశ పెట్టిన వాక్య రీతులు చాలవరకు సంస్కృత వాక్యరీతుల కనుసరణముగా ఉన్నవి అట్టివానిని క్రింద చూడనగు

ఆ దేవిహస్తమున గైకొని దశవర్ష 28 తాందేవిం హస్తే గృహీత్వా
మునిని ప్రదక్షిణించి దశవర్షఖండ 180 మునిం ప్రదక్షిణీ కృత్య
తపో రక్షతత్రి కవితా వాగ్దానులు. దశవర్ష 213 తపో రక్షాయాం..

అనే సంస్కృత సప్తమీ విభక్తి ఏకవచన ప్రత్యయాంతానికి బదులు పై ప్రాతిపదిక అంతంలో 'త్ర్త' అనే దాన్ని వాడాడు ఇది సంస్కృతంలో సప్తమీ విభక్త్యంతమునకు మారుగ వాడుక చేస్తారు సప్తమ్యాస్త్రల్ 5-3-10 సప్తమీ విభక్తిని లేదా అధికరణ కారకము నీ విశేష సంబంధములను తెలుప ఈ కవి వాడినట్లు ఈ క్రింది ప్రయోగముల మూలమున మనము గ్రహింప గలము

| | |
|---|---|
| నిను పాదంబుల యందనన్ నరికిదన్ | జటాయుఖండ 195 |
| సుగ్రీవిండును రామచంద్రుని పదక్షోణిన్ ప్రమాణ క్రియావ్యగ్రుండు | మూపుర ఖండ 293 |
| నేత్రముల్లన్ జలంబులు ధునీగతి గాగ బలిత్యజించుచున్ | ఉషఃఖండ 239 |
| సీతా యున్న నన్వస్తియా | దిశా ఖండ 294 |
| అతని యందీ మీాకుగల ప్రత్యయము | సంశయ ఖండ 349 |
| పాదముల యందు నమస్కరించు | ప్రస్థాన 6 |
| సుమంత్రుండు రథంబు నందు యుగ్యములన్ ఘటించె | ప్రస్థాన 349 |
| పాదముల యందు మ్రొక్కి | మునిశాప 456 |
| ధరాపతికి ప్రాణము నందు న రక్ష చేసె కైక | పాదూఖండ 406 |
| తన తమ్ముని రాముడు బాహువులందు గైకొని | పాదూఖండ 340 |

పైని చూపిన కారకములు తెలుగునకు క్రొత్తగ నున్నవి.

సమాసములు

సంస్కృత సమాసములను తెనిగించుటయే గాక సంస్కృత పద ఘటితములైన సుదీర్ఘములు వినూత్నము లయిన సమాసము లీ కావ్యమునందు బహుళముగ ప్రయుక్తములై యుండుట గుర్తింపదగిన అంశము

పితృ వాక్యపాలనా నినీషా మనీషా సనాతనుడు అవతారిక 1

నినీషా అంటే అగ్రగామి మనీషా అంటే దృఢ సంకల్పమనీ అర్థం తండ్రి మాటను పాటించాలనే యభిమతంగల వారిలో ప్రథ మగణ్యుడయినట్టి కాలమునకు చెందినవాడు త్రేతా యుగమునకు చెందిన రాముని గుణముల నీ యంశము వివరింప జాలియున్నది.

ఘురట్టోగ్రదంత కనిష్పేడన రావఘూర్ణిత సభాదామము నూపుర 314
లాంగూలనల్గు కృతాస్ఫోట విశీర్ణ భిత్తి శకల క్షోదము నూపుర 314

మహాబలవంత డయిన హనుమంతుడు తన తోకను చుట్టు కునే ప్రయత్న చేయగా దానికి తగిలి ఛేదిల్లిన గోడ నుండి శకల ములు అమితంగా ఉన్నాయని ఈ సమాసానికి ఉద్దిష్టార మనుకో వచ్చును కేకి కేకోరమణీయ రావలతికా పరిహాసి మనోజ్ఞ షడ్జ మార్వాగవము. అనే ఈ సుదీర్ఘ సమాసము గజ పుష్పి ఖండమునందలి 366వ పద్యంలో గలదు

ఈ క్రింది సమాసములు స్త్రీ వాచకములు

| | | |
|---|---|---|
| వారాశి పీచీ దృశ [మండోదరి] | కుంభకర్ణ ఖండము | 2 |
| బంభరాయి తనేణి [కైకేయి] | నియమపాలన | 201 |
| తురాషాడశ్మ కచ [సీత] | శబరి ఖండ | 143 |
| పుష్పం ధయాంతాలక [కైకేయి] | అభిషేక ఖండ | 230 |

బౌద్ధ మతం వ్యాప్తిలో గల కాలంలో పాళీ అనే ప్రాకృ తం ప్రాబల్యాన్ని వహించింది అనంతర కాలమున ఈ పాళీ

సంస్కృత భాష కతి సన్నిహితముగ చేయాలని తద్భాషా పండితులు కొందరు దృఢ సంకల్పంతో యత్నించారు వారి ప్రయత్నము వలన పాళీ భాషలో సంస్కృత బహుళత పాళీ పద ధాతువులకు సంస్కృత ప్రత్యయాదులు చేర్చి ప్రయోగించటం ప్రచురమయినది సంస్కృత భూయిష్ఠమైన పాళీనే తరువాత వారు సంకర సంస్కృతమని పేర్కొనిరి ఈభాష బౌద్ధమత ప్రబోధకుల గ్రంధములకు పరిమితము ఏనాడు ఏవర్ణము వారికిని ఇది మాతృ భాషగా లేదు

ప్రాకృత భేదమైన పాళీ పదములకు ముఖ్యంగా ధాతువుల కంతంలో సంస్కృత 'శతృ, [అత్] అనే ప్రత్యయాన్ని గల్పించి వాడుక చేయుటం సంకర సంస్కృతంలో ఒక అంశం ఇందు వల్ల ఏర్పడిన రూపములు నేటి హిందీ భాషయందు గలవు కహత్, కరత్, కథత్ మొదలయినవి వర్గమునకు చెందినవి వీనిలో కహ కర్ కథ్ మొదలయినవి హిందీ లేదా పాళీ ధాతువులు

ఈ విధంగా 'అత్' అనేది 'దర్పణ' అనే నామం తరువాత చేరినందున ఏర్పడే 'దర్పణత్' [నిస్సంశయ ఖండ 308] అనేదాన్ని ఈ కవి వాడియున్నాడు

భాషా-వాఙ్మయ లేదా తాత్విక దృష్టి గలవారెవ్వరైనను ఈ గ్రంథము నందు తాము నిత్యము మనము చేయు అంశముల మన ఉదాహరణములను తత్సమన్వయమును గుర్తింపగలరు ఈ దృష్టితో నీ గ్రంథము కల్పవృక్షమను తన నామమును సార్థకము చేయించు కొన జాలియున్నదని నిస్సంశయముగ చెప్పవచ్చును



# అవిచ్ఛిన్న సంప్రదాయార్థి : విశ్వనాథ

ఇడలి మందేశ్వరరావు

కొంతకాలం సాహిత్య విమర్శలో చారిత్రిక దృక్పథ మన్నది ఒకటి ఏర్పడి, కావ్యాలను పరిశీలించేటప్పుడు అది క్రమంగా కవి కాలాదులను నిర్ణయించడం తోటే, కావ్యంలో తత్కాల సమాజ స్థితి గతులు ఎలా కనబడు తున్నాయో చూపడంతోనూ, తృప్తిపడడం వల్ల సాహిత్య వేత్తలలో ఒక అసంతృప్తి ఏర్పడింది. సాహిత్యేతర అంశాలు సాహిత్య విమర్శలో జొరబడు తున్నాయనీ, భావుకతా దారిద్ర్యం, సహృదయ ప్రతిస్పందన దీనిలో లోపిస్తున్నాయనీ దీని మీద వచ్చిన అభియోగం,

గతమున మంచి నిండు కొన్నదనీ, సమకాలీన సామాజిక స్థితి గతుల్ని ఆధారంగా చేసుకొనే రచయిత కావ్య నిర్మాణానికి పూనుకోవాలనీ మరొక దృక్పథం, సమకాలీన సమాజ ప్రయోజనం ఎంతవరకూ తీరుస్తుందన్న దాన్ని బట్టీ, కావ్యం యొక్క మూల్యాన్ని నిర్ణయించాలని వీరి వాదం గతమును పూర్తిగా విస్మరించాలన్న వాదం ఫ్యూచరిస్టుల (Futurists) లోనూ, తర్వాత డాడాలలోనూ వికృత రూపాన్ని దాల్చింది సామాజిక దృక్పథానికి రచయిత నిబద్ధుడై ఉండాలన్న దానికి మార్క్సిస్టు విమర్శ ఒక రకముగా తీవ్ర రూపం

ఏ దృక్పథమైనా మరి తీవ్రస్థాయిని చేరుకొనే టప్పటికి అందులోని గుణాలకన్న దోషాలే ఎక్కువగా పొడ సూపుతాయి దీని మీద ఒక తిరుగుబాటు వస్తుంది పై దృక్పథాలు అటువంటి అభిశంసలకే గురి అయాయి

ఆలోచించగా ఒకానొక కావ్యాన్ని చదివేటప్పుడు ఆ కావ్యం వ్రాయబడ్డ కాలంవల్ల కూడా ఆ కావ్యానికొక అస్తిత్వ మేర్పడు

తుంది. ఆ కావ్యాన్ని ఆ కాలపు చట్రం (frameం)లో పెట్టి చూస్తేనే అందులోని కొన్ని అంశాలకు ఔచిత్యం గోచరించి, వాటికి కావ్యత్వాన్ని మనం అంగీకరిస్తాం మనుచరిత్ర, వసుచరిత్ర, కళాపూర్ణోదయం వంటి కావ్యాలకున్న బలాన్నీ, బలహీనతనీ, అవి పుట్టిన కాలం వాటికి సంతరించి పెడతాయి అంటే ఆ కావ్యాలను ఆనాటి కాలం నాటివి కనుకనే మనం ఆనందించడానికి కొంత కారణ మవుతొందన్న మాట

ఇక ఆ కావ్యాలలో ఏ అంశ అయితే ఆ సమకాలీనమైన స్థితిని దాటి, నేటి వరకూ నిలిచి ఉంటుందో, దేని వల్లనైతే ఆ కావ్యాన్ని ఆనందించ గల్గుతున్నామో, అది ఆ కావ్యం మనకు అందిచ్చే సాహిత్య పరమైన వారసత్వం అది కాలం వల్ల తరగడం లేదు, సమాజంలో, నాగరికతలో వచ్చిన మార్పుల వల్ల విరగడం లేదు ఏ అంశ అయితే ఆ సమకాలీన సామాజికాంశల్ని కూడా అధిగ మించి, కాలాన్ని నిర్లక్ష్యం చెస్తూన్న జరయు, రుజయు దానిని తాక నశక్యంగా చేస్తున్నదో, ఆ సాహిత్యాంశం నాటినుంచి నేటికి మనకు సంక్రమించిన వారసత్వం—అది సాహిత్య సంప్రదాయం

కాగా నన్నయ నుంచి నేటి వరకు-ఇంకా ఆలోచిస్తే, వాల్మీకి నుండి నేటి వరకు-వచ్చిన ఏ సాహిత్యాంశాలకు సహృదయుడు ప్రతి స్పందిస్తాడో అది సాహిత్య పరమైన సంప్రదాయమన్న మాట ఈ సంప్రదాయాన్ని విస్తృత పరచే ప్రయత్నంలో కవులు అటు ఇటు ప్రయాణం చేస్తూంటారు, ఒకడు అలంకారానికి పట్టం కట్టాలను కుంటాడు, ఒకడు రీతి మార్గ ప్రవర్తకు డవుతాడు, ఒకడు ఔచిత్యమే కావ్యానికి జీవగర్ర అని దానిని సాధిస్తాడు ఇంకొకడు శ్లేషవల్ల మాత్రం కావ్యత్వాన్ని సాధించలేమా అనుకుంటాడు ఒకడు నూత్న శైలీ విన్యాసాన్ని సాధించాలన్న తలపుతో శబ్దాలంకార ప్రీతిని కనపరుస్తాడు ఈ కవులందరిలోనూ విలక్షణత్వం

ఏది ఉన్నా, దానిని పోషించేది మాత్రం ఆదికవి నుంచీ అవిచ్ఛిన్నంగా సాగుతున్న కవితాధార అయితేనే వాట్లకు కావ్యత్వం లభిస్తోంది ఈ విలక్షణత్వం కావ్యత్వాన్ని విస్తృత పరచేదైతే, అది సంప్రదాయానికి బలాన్ని చేకూర్చేదవుతుంది సంప్రదాయాన్నే విస్తృత పరుస్తుంది అది కూడా తర్వాతి కవులకు వారసత్వంగా మిగిలిపోతుంది కాని కవి సాధించ దలచిన వైలక్షణ్యం కనుక బలహీనమైనదైతే, నీరసమైనదైతే, అది వాడిపోయి, సంప్రదాయ పరిధిని విస్తృత పరచ నశక్యమైనదై, విఫలమైన ప్రయోగంగా నిలిచిపోతుంది.

నన్నయ నుంచీ నేటివరకూ కవులు ఛందస్సును వాడుతూనే ఉన్నారు అయితే కొందరు కవులు అంతకు పూర్వపు కవులు వాడని వృత్తాలను వాడి ఉండవచ్చు అంతవరకు అది ఛందస్సుకు సంబంధించిన సంప్రదాయాన్ని విస్తృత పరచినట్లే భావించ వచ్చు మరికొందరు క్రొత్తవృత్తాలనే సృష్టించుకోవచ్చు స్థూలంగా ఇదంతా సంప్రదాయాన్ని విస్తృత పరచడం లాగే కనబడినా, వాట్ల ప్రభావం తర్వాత కవుల మీద పడక పోవచ్చు తెలుగులో 'సీస'మున్నది కనుక, 'వెండి', 'బంగారాన్ని' కూడ సృష్టింప బూను కున్నారు కొక్కొండ వేంకట రత్నం పంతులుగారు, అవి వారి మేధా సంపత్తికి, ప్రయోగ శీలత్వానికి తార్కాణ మవుతున్నాయి కాని తర్వాత తరాల వారు వానిని మరచి పోవడల వల్ల, ఆయన సంప్రదాయాన్ని విస్తృత పరచినట్లు అవలేదు అలాగే యథాక్రమంగా వెనుకటి ఛందస్సును వాడడానికి మాత్రమే ప్రాముఖ్యమిచ్చే రచనలు ఒకేనొక ఆచారాన్ని పాటించినట్లు అవుతుంది కాని, సంప్రదాయాన్ని అవగాహన చేసుకొన్నట్టు అవదు, నన్నయ తిక్కన, నాచన సోమన, తెనాలి రామకృష్ణుడు పాటించిన ఛందో నియమాలలో సామ్యం ఉన్నా, వాళ్ళ పద్యాలన్నీ ఒకే మాదిరిగా ఉండవు. నన్నయ పద్యం లోని ధారాశుద్ధి తిక్కనలో కనబడదు తిక్కన పద్యంలోని నిరంధ్రమైన కూర్పు నన్నయలో కనబడక పోవచ్చు తెనాలి రామకృష్ణుడు

శబ్దాలను ఏరుకోవడంలోనూ, కూర్చడంలోనూ వైలక్షణ్యాన్ని సాధి స్తాడు వీనివల్ల వారి కావ్యాలకు విలక్షణమైన రామణీయకత గాని, ఉదాత్తతగాని, వైదగ్ధ్యం కాని సిద్ధిస్తుంది ఈ యీ విధాలుగా ఈ కవులు ఛందస్సును వాడడంలో ఆచార దాస్యానికి పాల్పడకుండా, సంప్రదాయాన్ని ఆచార దాస్య స్థితికి దిగజార్చకుండా, సంప్రదా యాన్ని పోషించిన వాళ్ళు అయారు

విశ్వనాథ ఆచారానికి దాస్యం చేసినవాడు కాదు, సంప్ర దాయార్థి సంప్రదాయాన్ని విస్తృత పరుస్తూ, ప్రహతం కాని మార్గాన్ని అన్వేషించిన ప్రయోగశీలుడు విశ్వనాథ కొన్ని పద్యాలు వెనుకటి కవులను జ్ఞప్తికి తెస్తూ తాజా గుణాన్ని కల్గి ఉంటాయి ఇటు వంటి రచన కష్టంకాదు కాని చాలచోట్ల పద్యం చిత్రంగా నడు స్తుంది "నీ దగు పాలి నేలయును నీవయి యేలికొనంగ రావె! యన్నా?" (అయోధ్య పాదూ 343) అన్న భరతుని ప్రార్థనను విని, రాముడు ఇలా అంటాడు

"అడిగెన్ దమ్ముడు, నన్ను తానొసగ లేదన్నట్టి వాదున్ మిగి
ల్చెడి రీతిన్ వచియింతి, తీవగుచు వాంఛింపగ, నేదీర్ప, నే
న డ యండై చననే దదర్థమున, నేడో స్వామ్యమే లేని యొ
క్కెడ, దాతృత్వ పరాక్రమంబు నను దుష్కీర్తి వ్యథా మగ్ను డౌ"

ఇది సుఖంగా పాడుకోవడానికి అనువైన పద్యం కాదు ఇందులోని వాక్య నిర్మాణం, వాక్యపు విరుపు, విలక్షణంగా ఉన్నాయి. విస్తృత లేఖనం (Long hand)లో ఉండే దానిని సంక్షిప్త లేఖనం (Short hand) లో చూపుతున్నట్టు ఉంది. అందుచేత పద్యపు కూర్పు బంధు రంగా ఉంది హడావిడిగా పద్యాన్ని చదువుకొని పోవడానికి అవ కాశం లేక, క్షణ క్షణానికి ఆగవలసి వస్తోంది ఇది అందరూ ఎరిగిన వృత్తమే అయినా, వృత్తిగతి మారింది ఇది పద్యమే అయినా,

వెనుకటి కవుల పద్యం వంటిది కాదిది పద్య రచనా సంప్రదా యాన్ని విస్తృత పరచడానికి చేసిన యత్నమిది

విశ్వనాథ ఛందస్సులో కూడా ద్వైవిధ్యాన్ని చూపాడు. విస్మృతిలో పడ్డ 'మధ్యాక్కఱ' మీదకు కవుల దృష్టిని మళ్ళించాడు క్రొత్త వృత్తాలనూ వాడాడు. వాట్లన్నింటినీ వెనుకటి 'వెండి', 'బంగారం' పద్యాలలాగ-తర్వాతి వారు వాడకపోవచ్చు కాని ఆ పద్యాలు ఆ ప్రకరణానికి అనువై ఉన్నాయా, అనువై ఉండి వానికి కావ్యత్వ సిద్ధి కల్గుతోందా అని చూచుకోవాలి బాలకాండలోని కళ్యాణ ఖండాంతాన శ్రీరామచంద్రుని గూర్చి నాల్గు 'క్షా హారము' లున్నాయి

"ఆనందాస్యుడు పరుషంబె నే మాట యనడు తో నాడు
ద్దానే ముందుగ నెవరైనన్ గానీ యితరుల పారుష్య
స్థా వొక్తుల్ తలప డొగిన్ దానై సర్వశర సు విద్యా పా
రీణుండయ్యు నితరశస్త్ర వ్రాతంబు కృతికి నగ్గించున్"

ఇది పరమ రమణీయమైన పద్యమే కాదు ఇది రామాయణ కావ్య కథా సర్వస్వాన్ని ఒడిసి పట్టినట్టుగా ఉంది రాముని చరిత్ర అంతా ఈ పద్యానికి వ్యాఖ్యాన ప్రాయంగా ఉంది ఈ ఛందస్సును తర్వాత వాళ్ళు వాడక పోవడంవల్ల ఈ పద్యం పాతదైపోదు సహృదయుడీ పద్యానికి ప్రతిస్పందిస్తూన్నంత కాలం, దీనిలోని ఆకర్షణ తరిగిపోదు

కాగా, విశ్వనాథ ఛందోబద్ధమైన కవితను వ్రాయడం వల్లనే సంప్రదాయాన్ని పోషించిన వాడు కాలేదు. అతడు తీర్చిన పద్యశైలి నూత్నమైనది, సాంద్రమైనది, అనితర సాధ్యమైనది. సంప్రదాయాన్ని పోషించిన కొంగ్రొత్త వ్యాఖ్యాన రూపంగా నిలిచేది

అయితే సంప్రదాయాన్ని కేవలం ఛందస్సుకే పరిమితంచేస్తే అది మరీ సంకుచిత పరిధి అవుతుంది సంప్రదాయం అంతకన్న విస్తృతమైంది సంప్రదాయంలో ఇతరమైన సాహిత్యాంశలూ ఉంటాయి సంప్రదాయం సంస్కృతీ పరమైనదీ అవుతుంది సంప్రదాయానికి ఆధ్యాత్మిక భూమిక ఉంటుంది ఇన్నింటా విశ్వనాథ తాను సంప్రదాయార్ధినని చెప్పుకొన్నాడు

సాహిత్య పరమైన మరొక అంశం అలంకారం అలంకారాన్ని వాడడం, అందులో ఉపమానాన్ని ఉపయోగించడం ఆదికవి నుంచీ నేటివరకూ వస్తూన్న సంప్రదాయమే అయితే చాలమందిలో ఉపమాన ద్రవ్యసంచయ మంతా వెనుకటిదే దానికి మెరుగు పెట్టడమె చాలమందికి తెలియదు, దానిని దాటి పోవడానికి అశక్తు లవుతారు విశ్వనాథ అలంకార నిర్వహణలో క్రొత్త చిత్రాలను సృష్టిస్తాడు సీతను రావణుడెత్తుకొని పోతున్నాడు సీత ఆక్రోశం చేస్తుంది ఇచ్చట బాల తరు సంతానములతోనూ, హరిణ శాబకములతోనూ, వన దేవతలతోనూ, తన్ను "పదిపుట్టె లొక్కచో గనపించెడు శ్మశాన భూతు డెవ్వడో బలత్కారాపహారణము చేసెనని చెప్పుడీ బిడ్డలారా!" అంటుంది సీత అప్పుడు మింట గిరిగింతలు పెట్టి దక్షిణాభిముఖంగా పోయే రావణుని రథం మీద నున్న సీతకు గోదావరి నది కనబడింది ఆ నదీమతల్లి ఎంత బాధపడిందో, బిడ్డకింత అపద వచ్చిందని!

'తన బిడ్డను దన్నుకొని మింటబోవు గృధమ్ము గుర్తు పెట్టుకొని
నేలమీద బరువెత్తు మహా భుజంగివోలె" గోదావరి కనిపెంచిందట.

అసలు విశ్వనాథ వట్టి సంప్రదాయార్థి మాత్రమే కాదు, "సర్వ ధర్మ మూల బీజంబుగ అవిచ్ఛిన్న సంప్రదాయార్థి' అది కథను ఎన్నుకోవడంలోనూ, దానిని నిర్వహించడంలోనూ, అందులో ధర్మానికి ప్రతీకగా, ధర్మ సంస్థాపనార్థం అవతరించిన రాముని కథను చెప్పడంతోనూ ఆగిపోలేదు, విశ్వనాథ ధర్మాభినివేశం

అలంకారాలను వాడడంలో కూడా వ్యక్తమవుతుంది అయోధ్యను వర్ణించిన సుమంత్రుడు "ధర్మాను బంధ్యద్భుతో త్ప్రేక్షల" నే వాడాడట! యజ్ఞ సమయమందలి మహానసంలోని ద్రవ్యములు అన్న పురాసులుంటాయి, సూపరాసులుంటాయి, అప్పడాలు ఉంటాయి అని అంటే అది వట్టి నీరసమైన వార్త. కాని విశ్వనాథునికి అదంతా 'రాఘవుల యిలవేల్పు శ్రీరంగనాథ ప్రభువు పవళింపు సేవకై భద్రపరచి నట్టి సంభారము"లా గోచరించినదట! అందుకే

"అన్నంపురానులు చిన్న తోమా లెల
కై సన్న జాజులు పోసినట్లు
సన్న ఖర్జూరపు, జాపలపై సూప
రానులు గంధమ్ము తీసినట్లు"

కనపడ్డాయట! ఇవి వట్టి ఉపమానాలు కావు, వీని వెనుక ఒక భక్తి భావం, తాను కూర్చుకున్న ఈ కవితాసంభారాన్ని ప్రభువు నైవేద్యమిచ్చే మన స్థితి ఆవిష్కృత మవుతున్నాయి

హనుమ రామలక్ష్మణులను భుజలమీాద ఎక్కించుకొని సుగ్రీవుని వద్దకు తీసుకొని వచ్చేటప్పుడు

"సరగ నాగ్నే యమునకు నీశాన్యమునకు
వ్యాప్తమైన మహేంద్ర చాపంబు కొసల
వరుణ పర్జన్యు లధివసింప నయినట్లు
లన్న దమ్ములు బుజముల నధివసించి

నారట అలంకార నిర్వహణలో వస్తువుకు రామణీయకతను సాధించడంతో పాటు ఉదాత్తతనుకూడ సాధించడానికి అనుకూలమైన ఉపమాన సామగ్రిని సర్వత్ర కూర్చుకుంటాడు విశ్వనాథ సుమంత్రుని రథముమీాద జానకీదేవి

"త్రయ్యర్థ్వమున స్వరితాను దాత్తములచే
దీపించెడు నుదాత్తదీధితి వలె,
సత్త్వరజోగుణ సంసేవితంబైన
లీన తమోగుణ రేఖవోలె
సీతాన్వ మార్గ్నియు మిఱుదెసెన్ బలిసిన
ప్రాచీ దిశా కాంతి భరము వోలె
నాది వరాహ దంష్ట్రాగ్ర శేషాహి ఫ
ణాగ్ర భూషిత వసుంధరయు బోలె
హ్వాషిత నారద తుంబురు ఋషివిపంచి
కా సమాభిషేవిత సామగాన విద్య"

ఐలెనన్నదట!

ఇక పద్యం కూర్పునుంచి అలంకారం నుంచి, వర్ణనల దగ్గరకు వెడితే అదొక అద్భుత తర్పనంలా కనబడుతుంది కల్ప వృక్షంలో అనేక చోట్ల సూర్యోదయ సూర్యాస్తమయాది వర్ణన లున్నాయి అవి ఎక్కడ కక్కడ క్రొత్తగా కనబడతాయి అయితే మహాకావ్యమైన కల్పవృక్షంలోని వర్ణనలలో ఒక వైశిష్ట్యం ఉంది ఈ వర్ణనల వెనుక కథ కూడా కనబడుతుంది కిష్కింధా కాండ ఇట్టి వర్ణ నలకు మంచి అవకాశాన్నిస్తుంది అక్కడ ఉన్న చరాచర జగత్తు అంతా రాముని స్థితిని ప్రతిఫలిస్తూనే ఉంటుంది నూపురఖండ ప్రారం భం కనబడే అడవి అంతా రాముని "దైన్య ధైర్య రమణీయ" స్థితికి అద్దం పడుతుంది ఒక చెట్టుకు అల్లుకొని ఉన్న తీవను ఒకగాలి పెళ్ల దూరంగా విసిరివేసింది కాని అది రామునకు అలా కనబడదు. ఆ గాలి పెళ్లలో తనకు సీతావియోగాన్ని కల్గించిన రావణుడే కనిపిస్తాడు

"ఆ చెట్టున కా తీవకు
రాచి పెనంగొనిన ప్రణయ రాగము కలుగన్
పీచి దక్షిణ వాయువు
త్రోచెన్ మృదువల్లి దూర దూరంబులకున్"

శరత్తులో ప్రతీక్షా భావ తీవ్రములైన రాముని కన్నులకు కనబడే లోకమంతా సీతనే జ్ఞప్తికి తెస్తుంది. అక్కడ తేటికాంతలు గీశ్చతురలు గీతికల నాలపిస్తూ పతులకు కుసుమ పాత్రలలో తేనెలను నింపి ఇస్తున్నారట! అయ్యయ్యో!

"మత్పరిచర్యా మహోద్ధి మహిజాత మైథి లేశ్వరుని
సత్పుత్రి నా సేవలెల్ల షట్పదీ సదృశ చేసెడిని
హృత్పుట స్థిత మధుకుల్య యెంతయేని ప్రేమ మీఱ
మత్పురాకృత కర్మనిట్లు మహిజాత మాయమై పోయె!"

సీతారాముల వియోగం సాధారణమైన వియోగం కాదు లోకాన్నంతనీ రామునకు సీతామ్మయంగా చేసింది ఆ వియోగం సీతకు లోకమంతా రామ మయంగా కనబడింది అశోకవనంలోని సీతకు

"తరుణ స్నిగ్ధ పయోద గర్భ తనుతన్ వాల్గొకిలల్, నామ సుందర పూర్వాక్షర లోప సంస్ఫురణ చేతం జిల్కలున్, దా మొదల్ సరి వ్యత్యస్తముగా మరాళములు, పింఛ వ్యక్త నేత్రాంశు సంభరమై కేకులు, నయ్యశోకమున రామత్వం బె దీపింపగా,"

ఈ పద్యంలో చిత్రమేమంటే కోకిలలు, చిలకలు, మరాళములు, నెమళ్ళు విరహోద్దీపకములు ఈ సామగ్రినే ఆధారంగా చేసుకొని వానియందు రామత్వమును ప్రకాశింప చేయడంలో విశ్వనాథ అలంకారిక మర్యాదను గౌరవించే శిల్పిగా దర్శన మిస్తున్నాడు

సీతారాములు ఒకరి కొకరు దగ్గరగా ఉన్నప్పుడు వారు సాధారణ దంపతుల లాగే కనపడతారు ఏదో ఒక దానికి మాట పట్టింపు వస్తూనే ఉంటుంది అంటే పైపై పొరల్లో వారి అనురాగ మెట్టిదో మనకు తెలియదన్న మాట.

అలంకారికుల విశ్లేషణలో ప్రణయ భావం మూడు విధాలుగా ఉంటుందట. ఒకటి 'కుసుంభ' రాగము ఇది పైకి మాత్రమే

కల్పిస్తుంది తర్వాత తర్వాత తొలగిపోతుంది. ఆ తొలగిపోవడం వైరాగ్యం వల్ల, ఫలితం జ్ఞానప్రాప్తి కర్ణను దేవహూతుల రాగం దీనికి ఉదాహరణ మరొకటి 'మంజిష్ఠ' రాగము. ఇది పైకి గాఢంగా ఉంటుంది, హృదయంలో కూడా అంత ఘనిష్ఠంగా ఉంటుంది దీనికి నలదమయంతుల, ఇందు మత్స్యజుల రాగములు ఉదాహరణములు ఇక మూడవది 'నీలి' రాగము ఇది పైకి కనిపించదు, కాని మనోగతమై శాశ్వతంగా ఉంటుంది దీనికి సీతారాముల ప్రణయం పరమోదాహరణము బాలకాండలో ఒక చోట రాముడు "ఐన దానికి మఱియును గానిదాని కేలికతనాన జిల్ల కజ్జాలు పెంచి, సీతకెవ్వలు "పర్యంతము అవుతుంది, చివర "ప్రభువు ప్రకటించు గాఢానురాగ మహస్సి'"

ఇది లోకానికి కనపడే సీతారాముల దాంపత్యంలోని చిటి పొటి కలహాలు, కాని, నిజానికి "జనకజా రఘురాములు దివ్యకాములు"

"సీతయు రామచంద్రుడును జేతములందు యుగాలు కల్పముల్
నాతియు బూరుషుండుగ ననంతర దంపతి భావ యాపనా
వ్యాతత సంస్కృతి ప్రథము లైనటు లాత్మ దలంచుముందు రా
సీతకు రామచంద్రునకు జేతము లందలి ప్రేమ యెట్టిదో!"

ఇది భారతీయ దాంపత్య భావానికి మహోత్కృష్టమైన సంప్రదాయ దర్శనం

అయితే సీతారాముల దాంపత్యంలో రాగమెంత ఉన్నదో వైరాగ్య భావం కూడా అంతే ఉంది రాముడు బాలకాండలోనే ఈ వైరాగ్య భావాన్ని పెంచుకొన్నాడు ఇదే రాముని ప్రేమను మెరుగు పరుస్తుంది ఇంతటి వైరాగ్యాన్ని అతడు పెంచుకోబట్టే సీతా వియోగాన్ని సహించగల్గి, లోకాపకారకమైన రావణ వధను చేయ సమర్థుడయ్యాడు

రామాయణం కేవలము కావ్యమేకాదు సంప్రదాయ బుద్ధి ఉన్న వానికి అందులో అనేకమైన ఆధ్యాత్మికాది రహస్యము లున్నట్లు తోస్తుంది ఆ రహస్యాలను కవి ప్రత్యక్షంగా చెప్పడు అవన్నీ కథలో కలిగి ఉంటాయి, శిల్పములో అంతర్భూతమై ఉంటాయి; బహ్వర్థకమైన శబ్దాలలో మరుగునపడి ఉంటాయి రామాయణంలోని తాత్త్విక విశేషాలను వివరిస్తూ విశ్వనాథ 'నా రాముడు' అన్న గ్రంథాన్ని వ్రాసాడు అందులో రాముని గూర్చి 'ఆనందమయుడు', 'ఆనందమూర్తి' 'అవతారమూర్తి', 'బాలరాముడు' 'కోదండరాముడు' 'అయోధ్యారాముడు', 'దశరథరాముడు', 'జానకీరాముడు', 'రఘు రాముడు', 'ఆత్మారాముడు' అన్న పది శీర్షికలలో చర్చిస్తూ, రామాయణంలోని సీతారాముల తత్త్వాన్ని వివరించాడు ఈ తాత్త్విక భూమికతో కల్పవృక్షాన్ని చదివితే అదొక ఆధ్యాత్మిక గ్రంథమై, విశ్వనాథ "సర్వధర్మ మూల బీజంబుగ నవిచ్ఛిన్న సంప్రదాయార్థి" ఎలా అయాడో విస్పష్టంగా తెలుస్తుంది

హనుమంతుడు లంకలో సీతకోసం వెదుకుతున్నాడు అశోక వనంలో ఆమె కనపడింది ఆమె సీతయే అన్న నిశ్చయానికి వచ్చే టప్పుడు హనుమంతుడు

"ఈ యమ ముఖాబ్జముననే
వో యధ్యాత్మిక మహస్సు లదిత జ్యోత్స్నా
ప్రాయముగ నబికి వచ్చెడు
నీ యమ జానకియె సంశయేతర ఫణితిన్"

అనుకున్నాడట. ఈ "ఆధ్యాత్మిక మహస్సు" ప్రసక్తి తేవడానికి కారణం సీత వేదములయొక్క తత్త్వము అని ధ్వనింపచేయడానికి, ఈమె వేదముల తత్త్వమే గాక శక్తి స్వరూపిణి కనుక "ఈమె లక్ష్మీ సరస్వతుల వంటిదికాదు, ఎక్కువ భాగము పార్వతివంటిది శక్తి

వంటిది" ఇది రావణునకూ తెలుసు అందుకే అరణ్యకాండలో సీతను రాక్షస స్త్రీలకు అప్పచెపుతూ రావణుడు ఇలా అంటాడు

"యనితర దృశ్యమాన జగదాభరణాకృతి, వెండికొండ యె
త్తిన సమయంబునన్ గినుక తేరిన యెఱ్ఱని కెంపు కన్నులం
ద నరిన దేవి వచ్చె, సముదారత భక్తి భజింపగా వలెన్"

ఏ స్వామి కోసమైతే కుత్తుకలను కోసి ఇచ్చాడో, ఆ స్వామికి ఈమె సీమంతిని అని తెలుసుకొని, భక్తిశ్రద్ధలతో ఆమెకు సాక్షసాంగనలు పరిచర్య చేయాలంటాడు రావణుడు. ఆ తత్త్వాన్ని మనకు జ్ఞప్తికి తేవడానికి కవి సుందరకాండలో

"జానకీదేవి దక్షిణ పార్శ్వం బశోకంబు బొదకానించి యర్ధనారీశ్వరి వోలె బరమ శివాకారమై" నిలుచున్న దంటాడు

మరి రావణుడూ తక్కువవాడు కాడు వాడు 'సర్వవేదార్థ పరిజ్ఞాత" వాడికి అదొక అహంకారం అందుకే సీతతో ఏమంటు న్నాడో వినండి

"నన్నున్ మించినవాడు పండితు డనంతన్ లేడు వేదార్థముల్
నన్నున్ సుంతయు మించి లేవవి నెలంతా? నేను వేదోక్తు లి
వ్విన్ని వ్విన్ని యటుంచు లెక్కయిడితిన్!"

అంతటివాడు కనుకనే వానికొక దుష్టమైన కోరిక కలిగింది. బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో రాముడు బ్రహ్మయు, శివుడును కాదని తెలుసును. ఇక మిగిలినది విష్ణువు అందుచేత రాముడు విష్ణువైన సీత లక్ష్మియే "ఆ లక్ష్మిని వీడు గ్రహించినచో రాముడు విష్ణువుకాడు. రాముని విష్ణుత్వము పోవును అపుడు తాను మహావిష్ణువగును ఇది వాని కోరిక'' అందుకే సీతాపహరణం చేసాడు కాని రాముని గరించి వాని మనసులోని సంశయ మెన్ని విధాలుగా రూపుకట్టిందో,

ఆ సంశయ మెన్ని విధాలుగా తీరడానికి రాముడవకాశ మిచ్చినా, మోహం క్రమ్ముడంవల్ల రావణునికి సంశయం ఎలాతీరలేదో, వివరించే కథ యుద్ధకాండలోని సంశయ ఖండం నుంచి నిస్సంశయ ఖండం వరకూ నడచిన కథ

కాని రావణుడు "పరమ శివభక్తుడు శాక్తేయుడు సర్వ వేదార్థ పరిజ్ఞాత అంతటి వానిని వధించుట సులభముకాదు అందు చేత ఇద్దరును (సీతయు, రాముడును) కలిసి వచ్చిరి .. . శక్తి యొక్కయు వేదతత్త్వము యొక్కయు సాహాయ్యము రామునకు కలిగి తీరవలయును". ఇంతటి తత్త్వాన్ని నిక్షేపిస్తూ విశ్వనాథ కల్ప వృక్షాన్ని వ్రాసాడు

ఇక లౌకిక దృష్టినుంచి చూస్తే కల్పవృక్షం నేటి మానవుని గురించి చెపుతుంది.

మానవుణ్ణి గురించి సాధారణంగా సాహిత్యంలో రెండు విధాలుగా అభిప్రాయాలు కనబడతాయి మానవుడే మహోన్నతు డనీ, అతడు ఎంత ఎత్తుకైనా ఎగరకలడనీ, అతడు ఈ లోకాన్నే గాక లోకాంతరాలను కూడా బాహువుల పట్టగలడనీ-ఒక దృక్పథం దీనికి మౌలికంగా ఉన్నది కాల్పనిక (Romantic) దృక్పథం. మానవుని పెరుగుదలకు కొన్ని అవధులున్నాయనీ, ఆ పరిమితులలోనే అతడు తన జీవితాన్ని సుసంపన్నం చేసుకొనేందుకు, తృప్తిని సాధించేం దుకు అవకాశం ఉంటుందని కొందరు భావిస్తారు. ఇది సంప్రదాయక (Classical) దృక్పథం కాల్పనిక దృక్పథంలో మానవుడే దేవుడవ గల్గితే, సంప్రదాయ దృక్పథంలో దేవుడే మానవ జీవితాని కొక లక్ష్యాన్ని సాధించడానికి. ధర్మాన్ని సంస్థాపించడానికి, మానవునిగా అవతరిస్తాడు సంప్రదాయ వాది మానవుని పరిమితుల్ని, అతని విజయాల్ని కూడా అర్థం చేసుకుంటూనే, అతని పరిమితులలో ధర్మ బద్ధంగా అతడెలా ప్రవర్తించాలో విశదీకరిస్తాడు.

అధర్మ ప్రవృత్తి వల్లనే ఇంతటి రావణుడు, సీతాపహరణం జరిగినప్పటి నుంచీ అవ్యవస్థిత చిత్తుడయ్యాడు ఇంత వైభవమున్నా ఇంతటి భోగమున్నా అతని మనసుకు శాంతిలేదు మనసున ఏదో సంశయం, ఆ సంశయం తీరదు ఆ సంశయానికి మూలంగా ఉన్నది వానిలోని ధర్మం, నాస్తికత, సంశయ నివారణకోసం తన సైన్యాన్ని మంత్రుల్ని, హితుల్ని, సోదరులను, అందరినీ పోగొట్టుకున్నాడు. తుదకు తనకూ మరణమే సిద్ధించింది

ఈ రావణుని కథ ఆధునిక మానవునకు - సర్వభోగాలూ, లోకాంతరాలూ అందుబాటులో ఉన్న ఆధునిక మానవునకు - ఒక హెచ్చరిక

మరి రాముడూ, లక్ష్మణుడూ, హనుమంతుడూ కూడా మహా శక్తిమంతులే హనుమకు స్వస్వరూప జ్ఞానం కల్గి, తాను పయోధిని లంఘించగలనని అంటూ, సం జవమున్ బలంబును మనస్సునకందవు

రామునికీ సర్వలోకములు, సర్వభూతములు, అయిన అదుపు ఆజ్ఞలలోనివే సీతాపహరణం జరగగానే మొదట రాముడు బెంగటిల్లి పోయాడు, ఎంత వెదకినా ఆమె జాడ తెలియక పోయేటప్పటి క్రుద్ధుడైపోయాడు

"అన్నా లక్ష్మణ! నే నెవండనవి పీ రన్కొందురో! మిన్నును నే
మన్నేకంబుగ జేసి వారినిధులున్ క్ష్మాభృత్తులున్ వాహినుల్
మున్నా రాచ మహాగ్ని సంజనిత ధుమ్యాచ్ఛన్న రోదోంతరం
సన్నాంధ్యంబుగ సృష్టికిం జివర, విస్పష్టంగా గూర్చెదన్"

నిటలమందు రుద్రుల కనీనికలందు ఆయాగ్నులతో కటకటలాడే స్వామిని చూసేసరికి, సమస్త భూతములు, సమస్త లోకములు హడలిపోయాయి అప్పుడాతని శాంతింప చేయ గల్గినవాడు లక్ష్మణుడొక్కడే "అల్పులు నిత్యమూ చేతనైన దగు సంహారాన్ని చేస్తూ ఉంటారు, మరి నీవో సమస్త ధాత్రికీ శరణ్యమవు,

"నే నుంటిని ఋషులుండిరి
నానా వన పర్వతములు నానా జలధుల్
పూని వెదక డము, ఘోర న
దీ నిష్యందములు గుహలు దీర్ఘ ముఖంబుల్"

శ్రీరామచంద్రుండు సౌమిత్రియొక్క భక్తి పరిచయ తర్క చమత్కార కార్య నిర్వాహకత్వములకు లొంగియు గోపమ్ము విడువక ధనుష్పాణియై—

మరి దారి తీయుము!" అన్నాడట!

రావణుడైతే లోక సంహార సమర్థములైన అస్త్రాలు చేత నుంటే, లోకాల్ని తగల పెట్టడానికి కాని, వాని సాయంతో అధర్మ వృత్తికి పాల్పడడానికి కాని జంకడు రామునికీ అట్టి అస్త్రాలూ, అంతకు మించినవీ ఉన్నా, వాట్లన్నింటినీ లోక రక్షణార్థమే, ధర్మాన్ని ప్రతిష్ఠించడానికే ఉపయోగిస్తాడు

మానవుడు సాధించిన విజయాలకు విశ్వనాథ అబ్బురపడతాడు కాని ఈ విజయాలు మానవునిలోని ఆస్తిక భావాన్ని పెంపొందించాలి, ధర్మాన్ని పరిరక్షించాలన్న అభినివేశం ఆతనికి గల్గించాలి ధర్మం పక్షాన నిలబడి పోరాడేటట్టు చేయాలి అంటాడు విశ్వనాథ రావణునిలా అహంకారాన్ని, గర్వాన్ని పెంచుకొని సంశయగ్రస్తుడయితే మానవుని కథ పెద్ద విషాద గాథ అవుతుంది కాని సంప్రదాయ వాది కనుక విశ్వనాథ రాముడు మానవునిగానే జన్మిస్తాడనీ, మానవునిలోనే రాముడు సాక్షాత్కరిస్తాడనీ సృష్టిస్తాడని ధర్మాన్ని మూలకందంగా చేసుకొన్న అవిచ్ఛిన్న సంప్రదాయార్థి ఎప్పుడూ లోకానికి ఆశాజ్యోతినే వెలిగిస్తాడు

విశ్వనాథ అదే పనిని చేసాడు అందులకే అవిచ్ఛిన్న సంప్రదాయార్థి అయ్యారు

# కల్పవృక్షము - అవతారిక

డాక్టరు వేదుల కామేశ్వరరావు
మేజర్ రిసెర్చి ప్రోజక్టు (యు జి సి)

శ్రీమంజూషిక భక్తరక్షణ కళా శ్రీచుంచు వానంద వ
ల్లీ మంజు ప్రసవంబు చిద్గగన ప్రాలేయాంశువున్ మోక్ష ల
క్ష్మీ మాణిక్య వినూత్న మేఖల కటాక్షీభూత నీహార రుక్
శ్రీ మంతంబయి పొల్చు వెల్గు నొకడే సేవింతు విశ్వేశ్వరా!

ఇవి శ్రీ విశ్వనాథవారి శ్రీమద్రామాయణ కల్పవృక్షము అవతారికలో ప్రప్రథమ పద్యం కృత్యాది. ఈ పద్యమంతా సంస్కృత శబ్ద ప్రచురంగా సాగింది ఈ పద్యమే కాదు ఈ మహాకావ్యంలో పలు పద్యాల తీరు ఇలాగే ఉంటుంది శ్రీ విశ్వనాథ వారు గీర్వాణాంధ్ర గిరా దురంధరులు ఆ మాటకు వస్తే సర్వాంధ్ర కవులు గీర్వాణాంధ్ర దురంధరులే అసలు మొదటి నుండి సర్వాంధ్ర భాషా వాఙ్మయములు సంస్కృత భాషా సాహిత్య సంప్రదాయంతో బహుధా ప్రభావితములయినవి కాని చిత్రం సంస్కృతంలో వాల్మీకి వ్యాస కాళిదాసాదుల మహాకావ్యా లేవీ శ్రీకారంతో ప్రారంభం కావడమన్న సంప్రదాయం అక్కడ లేదు కాని సహస్ర వసంతాల చారు చరిత్రగల ఆంధ్ర వాఙ్మయానికి ఆద్య మహాకవిగా ఈనాటికీ పరిగణింప బడుచున్న నన్నయ భట్టు మహా కవీంద్రుని మొదలు ఆధునిక యుగం దాక కావ్యాన్ని శ్రీకారంతో ప్రారంభించడమన్నది పరిపాటిగా వస్తున్నది. విశ్వనాథవారు ఒక చోట తాను "అవిచ్ఛిన్న సంప్రదాయార్థిని" అని చెప్పుకొన్నారు ఆ సంప్రదాయార్థముల మార్గాన పయనించిన ఆయన శ్రీకారంతో ఈ కావ్యారంభం చేయడం సమంజసంగా ఉంది ఆయనకు ఇలవేల్పు విశ్వేశ్వరుడు ఎదవేల్పు శ్రీరాముడు ఆ ఎదవేల్పును గూర్చిన ఈ మహాకావ్యాన్ని పరిపూర్ణంగా ఎరిగిన పరమేశ్వరుని ప్రార్థనతో వెలయించడం చాల సముచితంగా ఉన్నది. ఆ ఇలవేల్పు అయిన విశ్వేశ్వరుని

గూర్చి ఒక శతకాన్ని "మాస్వామి" అనుపేర అంటే తన స్వామి అనేకాక 'మా' అనడంలో తన కులస్వామి అనే చూపుతో ఎన్నడో వెలియించారు

ఆ విశ్వేశ్వరుడు సర్వసంపదలకు అధిష్ఠాన దైవతం కాబట్టి ఆయన యొక్క తేజ స్వరూపాన్ని "శ్రీ మంజూషిక" అని సంభావించారు ఆయన భావనలో ఇంకా ఆ తేజస్వరుపం ఎలాంటిదంటే భక్తరక్షణలో అది సమర్థమైనది ఆనందలతకు పూచిన మనోహర పుష్పం ఆనందమే పరబ్రహ్మ స్వరూపం "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అన్నది ఉపనిషత్తుల వక్కాణ ఇంకా ఆ వెల్గు ఎలాంటి దనగా జ్ఞానమనే గగన తలంలో వికసించిన శశిరేఖ అంతే కాక "ప్రజ్ఞానం బ్రహ్మ" అని ఉపనిషద్వాక్యం (Viswanadha is a Concious Poet) విశ్వనాథ తటస్థుడై పాఠకునకు తన రచనను సమీక్షిస్తాడు కవిశేఖరుడయిన తిక్కన, నాచన సోమన, పింగళి సూరన ఇట్టివారు శివకేశవాభేదం ఓంకార పద వాచ్యంబైన హరిహర బ్రహ్మము రెండూ పరమేశ్వర స్వరూపాలే భారతంలో పదునేనవ పర్వాంత పద్యాలు అద్భుతంగా ఉన్నాయి వాటికి అవేసాటి.

సాధకునకు జ్ఞాన సమాధి ఫలితావస్థకు వచ్చేటప్పుడు అతనికి (భ్రూమధ్యంలో ఆ పరబ్రహ్మం ప్రతీకగా ప్రప్రథమంగా అంతర్గతంగా భృకుటి మధ్యంలో నున్న జీవనాడిలో మనః చక్షువునకు సాక్షాత్కరించేది చంద్రకళ విశ్వేశ్వరుడు చంద్రకళాధరుడు అందుచేత విశేషణం కూడ చాల సార్థకమైనది అంతే కాదు ఆ వెలుగు మోక్షలక్ష్మికి మాణిక్య వినూత్న మేఖల అయినది అంటే వజ్ర వైడూర్యాదులతో చేయబడిన సరికొత్త కాంచీదామము అనగా మొలనూలు దానిని మేఖల అనుటలో అది సర్వలక్ష్మి సర్వాంగీణ పరిష్వంగము చేసుకొనేటటు వంటిదనిన్నీ, నిత్య ప్రత్యంగముగా భాస్వంతము అయ్యేటటు వంటిదనిన్నీ తాత్పర్యము ఇంకా అది ఎలాంటి దంటే చంద్ర

కాంతి సంపదలు తన కంటి చూపుగా చేసి కొన్నట్టిదది. ఇటు వెలుగుకు చీకటికి భేదము వివరించబడినది. కన్ను విప్పితే వెలుగు— కన్ను మూస్తే చీకటి అందుచేత వెలుగును గ్రహించేది కన్ను అది చంద్ర కళామయము అంటే చంద్రకళ చల్లని వెలుగు. అదే పరబ్రహ్మ స్వరూపము ఆ వెలుగు నొక్కదానినే నేను సేవిస్తాను అంటే అనన్య పరతంత్రమైన మనస్సుతో పరబ్రహ్మ పదార్థాన్ని అనగా శ్రీరామ చంద్ర పరబహ్మమును మాత్రమే నేను ఉపాసిస్తానని తాత్పర్యము శ్రీరామచంద్ర శబ్దంలో ఉన్న శ్రీకార, చంద్ర శబ్దములకు సార్థకతను చేకూర్చడమే విశ్వనాథ వారి అంతరంగికమయిన పూనిక సారాంశమేమన శివకేశవ పరబ్రహ్మములకు అభేద రూప కల్పనము

కైలాసాచల సానువాసము వృషస్కంధాగ్ర సంస్థాయి త
త్ప్రాలేయాచల కన్యకా కుచతటీ పర్యంక నిద్రాగతం
బాలోలాగ్ర జటాతటీ ఘటితనా కౌక స్సరిత్కంబు దే
హాలంకారిత లేలిహానము వెలుం గర్చింతు విశ్వేశ్వరా॥

ఈపద్యము నందు శివుని పరమయిన భావనము చేయబడినది అర్చామూర్తి, ఉపాసనామూర్తి అయిన శివుని తేజస్సు సగుణబ్రహ్మ స్వరూపము

పంచ భూతములు, సూర్యచంద్రులు సర్వేశ్వరుని తను సప్తకము కాగా ప్రకృతి సిద్ధమయిన శరీరాంతర్గతమయిన ఆత్మకు ప్రత్యేకత ఏమున్నదని శేషప్రశ్న అట్టి సందర్భమున అష్టమ తనువు వాడు అనగా యజ్ఞపురుషుడు యజమాని యగుచున్నాడు

మహేశ్వరేవా జగతామధీశ్వరే
జనార్ధ నేవా జగదంత రాత్మని—అన్నట్టుగా విశ్వాత్ముడు, అంతరాత్ముడు అయినట్టిది హరిహర బ్రహ్మము తిక్కన సోమయాజి

కూడ హరి హరబ్రహ్మము, పరబ్రహ్మ స్వరూపమే యని వక్కా ణించినాడు చంద్రునికిగల 16 కళలలో 15 కళలు మాత్రమే మనకు కనబడుతాయి 16వ కళ శివుని దగ్గర నున్నది అనగా నట్టి చంద్ర శేఖరుడగు ఈశ్వరుని దర్శించ లేకున్నానన్న ఆవేదన ప్రదర్శిత మగుచున్నది శ్రీరామ చంద్రునిలో పరబ్రహ్మ స్వరూపము సంపూ ర్ణముగా నున్నది- అని తాత్పర్యము ఈ మూడు పద్యాలలో దైవస్తుతి గావింపబడినది

పావు నెఱుంగు బ్రహ్మ నగపాలును మాత్ర మెఱుంగు బార్వతీ
దేవియు నీ వెఱుఁగుదువు తెల్లము రామ మహాత్మ్య కృత్స్న మా
దేవున కెను నీయనుమతిం బడి నంకిత మిత్తు జానకీ
దేవి మనోహరుండు రఘుదేవుని సాధు కథా ప్రపంచమున్॥

శ్రీరామ చంద్రుని తత్వం పూర్తిగా ఎవరికిని తెలియదు_ ఒక్క పార్వతి పతికి దక్క బ్రహ్మ దేవునకు, సరస్వతీదేవి భర్తగా, నాల్గవ భాగము మాత్రమే తెలియును. పరాశక్తి నాలుగంశములలో ఒక పాలు లక్ష్మి. మఱియొక పాలు సరస్వతీ కాగా మిగిలిన రెండు పాళ్లు పార్వతీదేవి కావున రామతత్వము పార్వతి కెఱుక యట. విశ్వేశ్వరునకు మాత్రమే రామ తత్వము సంపూర్ణముగా తెలియును. కావున యా శివదేవుని యనుమతిని అనగా శివ తత్వాన్ని పూర్తిగా దర్శించి, రామాయణ మహాకావ్యంలో రామచంద్రుని తత్వాన్ని వ్యక్తం చేయగలుగు తానని స్పష్టీకరించాడు

సర్వ భారతీయ భాషలలో లెక్కకు మించిన సంఖ్యలో రామా యణములు గలవు తెలుగు భాషలో కూడ అనేకానేక ప్రక్రియలలో రామాయణ గ్రంథములు వెలసినవి భాస్కర రామాయాణాదులలో రంగనాథ రామాయణము బహుళ వ్యాప్తి నందెనది కాని మనసు లోనిమాట చెప్పలేదు రామకథను మాత్రమే వాల్మీకి మహర్షి

వ్రాశాడు రామ కథలోని పరమార్థం [తత్వం] ఇత్యాదులను రామాయణ గ్రంథ కర్త తీరును చూడలేదు

జాగ్రదవస్థనేమి యన స్వప్న సుషుప్తుల గూడ రామనా
మగ్రహణంబె నాపయిన మానస జిహ్వలు సేయు దత్కధా
ప్రగ్రహ కృష్టి సంశ్లథ ధురావశమై చను మన్మనోఽశ్వ మో
యుగ్రుడ! నీవ సారధివ! యూనుము పగ్గములన్ గరంబులన్॥

'మటల నిదేల రామాయణం బన్న ప్రశ్నకు' తన భక్తి రచనలు తనవి గాన" అన్న సామాన్యమైన సమాధాన మిచ్చాడు విశ్వనాథ అంత కంటె బలవత్తరమైన కారణ మీపద్యంలో చూపబడింది మానవునకు జాగ్రద వస్థలో కంటె స్వప్న సుషుప్తి అవస్థలలో చైతన్యము పరిమితముగా ఉంటుంది సుషుప్తి స్వప్నావస్థలు నిద్రా కలత నిద్రలు స్వప్న సుషుప్తిలలో చరించే తత్వమే పరమాత్మ విశ్వ నాథకు సంబంధించి నంతవరకు దానినే రామతత్వమని స్పష్టీకరించాడు రామకథ ప్రస్తావన వచ్చేటప్పటికి విశ్వనాథ మనస్సు అనే అశ్వం పరుగులు తీస్తుంది కాన రామకథను అతి జాగరూకతతో వ్రాయాల్సి ఉంది కాబట్టి నీవే సారధివయి నడిపించ వలెనని శివుని ఆహ్వానిస్తున్నాడు కవి విశ్వనాథ భారతంలో శ్రీకృష్ణుడు అర్జునునకు సారధి యైనట్లే, పగ్గములను చేతబట్టి రామకథా రచనను కొన సాగించడానికి తోడ్పడవలెనని శివుని ప్రార్థించినాడు మానవ శరీరము రధము, ఇంద్రియాలు అశ్వములు, మనస్సు పగ్గము కాగా బుద్ధి సారధిగా చిత్రింపబడుతుంది. శివ స్వరూపమైన బుద్ధి పగ్గాలను బట్టి సారథ్యం వహిస్తే గాని భావావేశము నదుపులో నుంచి, సంయమనంతో రచన సాగదని భావము

వ్రాసిన రామచంద్రుకథ వ్రాసితి నంచని పించుకో వృధా
యాసము గాక కట్టు కత లైహికమా? పరమాయటంచు దా
జేసిన తండ్రి యాజ్ఞయును జీవుని వేదన రెండు నేకమై
నా సక లోహ వైభవ సనాథము నాథ కథన్ రచించెదన్॥

రామ తండ్రిని కథ ప్రధానముగా కావ్యరచన సేయు మని తండ్రి యాదేశము కట్టుకథల నల్లుటవలన ఇహపరాలకేమి ప్రయోజనమని పితృదేవుని ప్రశ్న వీనికి తోడు మనస్సంకల్పము తోడైనది. విశ్వనాథుడయిన శివునకు తన తండ్రికి అభేదము కల్పించు కొన్నాడు "నీకు తండ్రికి భేదంబు లేకయున్న "పరమ నిశ్చలబుద్ధి నర్పణము సేత" అని శివునిలో వేరొకచోట అన్నాడు విశ్వనాథ. అంటే విశ్వనాథకు తండ్రియాజ్ఞయే శివుని యాజ్ఞ అంతే కాక జనన మరణ మాయా ప్రవృత్తిని వదలించు కొనేందుకు పొందే ఘర్షణయే జీవుని వేదన అనగా జ్ఞాన భక్తి మార్గాల రెండింటను రామకథను రచింప సిద్ధపడి నాడు విశ్వనాథ తుదకు "నాసకలోహ వైభవ సనాథము నాథ కథన్ రచించెదన్' అని ముగించాడు పద్యాన్ని, తన ఊహా సంపద సనాథము అనగా రక్షణ కలిగిన తాను తన ఊహా పథంలో పయనిస్తూ, అనాది యైన పరతత్వ కథను చెప్పబో మన్నట్లు స్పష్టము చేసినాడు విశ్వనాథ.

అ నా తండ్రియన్ దధీచి శిబి కర్ణాదుల్ పునారూప సం
స్థానం బందిన కర్మయోగి సితచంద్ర ప్రౌఢ కాంతిచ్ఛటా
స్నానంబాడిన స్వచ్ఛ లింగమయినిన్ సాధించి మానందమూర్
లోనన్ నిల్పిన భక్తరాజు సుజన శ్లోకుండు దారుం డొగిన్॥

ఈ పద్యంలో శ్రీ విశ్వనాథ తన తండ్రితాతల వీరగాథ లను తెలిపియున్నారు తనతండ్రి దానశీలతను 4 పద్యాలలో వివరిం చారు అవిచ్ఛిన్న సంప్రదాయార్థి కావున సంప్రదాయాలను వివ రించినాడు. దధీచి, కర్ణుడు ఇత్యాదులు పునారూప సంజన్ములయి అసంతృప్తిలగుటవలన తనతండ్రిగా అవతరించినట్లుగా తెలిపియు న్నాడు అంటే పూర్వులగాథలను (**Antecedents**) తెలియచేసినాడు. చంద్రజ్యోత్స్నలో స్నానమాడి శివలింగమును తెప్పించిన పరమశివ భక్తాగ్రేసరుడు తన తండ్రి నందమూరు గ్రామమున ప్రతిష్ఠించినాడు.

కర్మయోగి యగు తన తండ్రి శోభనాద్రి దాన గుణములను శిబికర్ణాదులతో పోల్చినాడు తరువాత పద్యమున తండ్రి దాన ప్రశస్తి వివరింపబడినది

తన తండ్రి దానగుణాతిశయము చేత ఆకులు దూసిన కల్పవృక్షము (స్వర్గపు) వలె అయినాడు పరిచయమున్న పాలేరు (మాలవాడు)నకు ధరించిన అంగవస్త్రము ధోవతి నిచ్చిన సంఘటనను వివరించినాడు తన వ్యక్తిత్వమును గూడ నిస్సంకోచముగ దెలుపుకొనుట గమనింపదగినది తానును పరమ భక్తాగ్రగణ్యుడై యుండుట ఇది సోత్కర్షకాదు. యదార్థము మహత్తర కావ్యవతారికలో అబద్ధం ఆడడు పైగా ఈమాటలు శివునితో అంటున్నాడు. శివ తండ్రులకు అభేదమును కల్పించినాడు నిశ్చలమైన బుద్ధితో శ్రీమద్రామాయణ కావ్యము ప్రశస్తముగా రచించి అర్పింతునని విన్నవించుకొన్నాడు

సప్తసంతానములలో బ్రశస్తిగాంచి
ఖిలముగా కుండునది ధాత్రి గృతి యటన్న
నట్టి కృతి శత నిర్మాత నైన బిడ్డ
బడసె నాతండ్రి కృతలోక పారిషదుడు

తటాకము, నిధి, అగ్రహారము, దేవాలయము, ప్రబంధము, వనము, పుత్రుడు- అను నీ యేడింటిని సప్త సంతానము లని వ్యవహరింతురు వానిలో ఖిలము గాకుండునది కృతి అనగా ప్రబంధము శ్వాశతమైనది వాల్మీకి రామాయణ కావ్యము వేలాది సంవత్సరము లయినను నేటికిని నిలిచియున్నది అట్టి కృతి శతము నిర్మించిన విశ్వనాథ వంటి మహాకవిని పుత్రుడుగా బడసిన శోభనాద్రి నిజంగా ధన్యుడు లోకములో కావ్యకర్త కీర్తి చిరస్థాయిగా ఉంటుంది కావ్యగత కథా విశేషములంటె ఉపదేశ పూర్వక

మయిన, మహోన్నత కీర్తి శిఖరాల నందిన కావ్యప్రతిష్ఠలో నూటికి తొంబదిపాళ్ళు కవి ప్రతిభపయి ఆధారపడి యుండు ననుట నిర్వివాదాంశము అంతేకాదు కేవలము నవ్య కథా నిర్మాణము కంటె రస పరిపుష్టి నందిన కావ్యము వేయిరెట్లు గొప్పదనుటయు సత్యమే సర్వ భారతీయ కావ్యములలో ప్రథమము, శ్రేష్ఠము నైన వాల్మీకి రామాయణమును ప్రతిభాసంపన్నమైన రామాయణ కల్పవృక్షముగా తీర్చి దిద్దిన తనవంటి మహాకవిని పుత్రుడుగా బడసిన అదృష్ట విశేషము శోభనాద్రికి మాత్రమే దక్కినదని విశ్వనాధ వారి యభిప్రాయము

తమ్ములు రామచంద్రునకు తమ్ములు సూహా యెఱింగి చేయు నా
దమ్ములు ధర్మరాజునకు దమ్ములు చెప్పిన యట్లు చేయ నా
తమ్ములు నట్టి రందు జిన తమ్ముడు సన్మతి రామమూర్తి చి
త్తమ్మున నేను వానికొక దైవముగా గనిపింతు నెంతయున్॥

విశ్వనాథ వారికి గల ఇరువురు తమ్ములలో వెంకటేశ్వరరావు మొదటివాడు, చిన్నతమ్ముడు రామమూర్తి ప్రొఫెసర్ యస్వీ జోగారావు గారికి రామమూర్తితో తొమ్మిది సంవత్సరముల పరిచయమున్నది అన్నయైన సత్యనారాయణగారి యూహల కనుగుణముగా వర్తించుటలో వారిరువురు రామచంద్రుని తమ్ముల వంటి వారట, చెప్పిన పనిని యథా తథముగా నిర్వర్తించుటలో ధర్మజుని తమ్ముల వంటి వారట తమ్ములిరువురును సత్ప్రవర్తనతో పాటు సంస్కృతాంధ్ర భాషలలో పాండిత్యమును గడించిన దిట్టలు వారితో సంప్రదించిన మీదటనే తన కవితలను వెల్లడి చేసెడివాడట విశ్వనాథ తండ్రి, తమ్ముల గుణ గణాలను బట్టి విశ్వనాధవారి వంశ గౌరవ ప్రతిష్ఠలు స్పష్టము సత్యనారాయణగారికి కూడ భ్రాతృ వాత్సల్యమపారము చినతమ్ముడు రామమూర్తికి అన్నగారు సత్యనారాయణగారు సాక్షాత్తు దైవ సమానులే యని వారిరువురను బహుధా కొని

యాడినారు విశ్వనాథ వ్యాసమహర్షికి గణపతి, తిక్కనామాత్యునకు గురునాథులవలె విశ్వనాథ వారికి తన తమ్ముడు వెంకటేశ్వరరావు వ్రాయసకాడు సామాన్యంగా మహాకవులు స్వంతంగా వ్రాయడం కన్న కవిత చెప్పటంలో ఎంతో ప్రతిభా సంపన్నులు "ఊహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్ దొరకినగాక--" అన్న అల్లసాని వారి మాట ఇందులకు తార్కాణము

విశ్వనాథవారు అవతారిక నందు గురుస్తుతి గావించియున్నారు తమ గురుదేవులు చెళ్ళపిళ్ళ వెంకటేశ్వరుల స్వరూప స్వభావములను వివరించినారు గురువు హృదయ మృదుత్వమును వారికిగల శిష్యవాత్సల్యమును తెలిపినారు చెళ్లపిళ్లవారు తమగురువులని నాటి ఆంధ్ర కవిలోకమునకు సగర్వముగా చెప్పికొనెడివారు ఆ విధముగనే కథా ప్రవచనము చేయువారందరను హరి కథా పితామహుడు అజ్జడ ఆదిభట్ల నారాయణ దాసుగారి శిష్యులమని చెప్పికొనుట కద్దు కవితా మూర్తులుగా మహత్తరముగా వ్యక్తిత్వం కలవారుగా, సంస్కృతాంధ్రభాషా కవితా పాండిత్య ప్రభువులగా తమ గురువులను తనివి దీరవర్ణించి, చెళ్ళ పిళ్ళ వెంకటేశ్వరులవారి ప్రతిభను వ్యక్తము చేసినారు

అలనన్నయ్యకులేదు తిక్కనకు లేదా భోగముస్మాదృశుం
డలఘు స్వాదు రసావతార ధిషణాహంకార సంభారదో
హల బ్రాహ్మీమయ మూర్తి శిష్యుడైనాడన్నటి దావ్యోమపే
శల చాంద్రీ మృదుకీర్తి చెళ్లపిళ వంశస్వామి కున్నట్లుగన్

తన శిష్యత్వము కారణముగా నన్నయ తిక్కనాది మహాకవులకు లేని ఒకానొక అపురూపమైన భోగము తన గురువరేణ్యులు చెళ్ల పిళ్ల వారికి కలిగిన దని యీ పద్యములో ఒక సుదీర్ఘ సంస్కృత సమాసమున విశ్వనాథ చెప్పినాడు ఇది ఆ మహాకవి అహంకార ప్రదర్శనా

భాసించింది బాహ్యాభ్యంతరమయ మూర్తికి అహంకార ముంటే తప్పులేదు ఉండక తప్పదుకూడ తనవలన గురువుగారికి కీర్తి కలిగిందనడంలో సందేహంలేదు తండ్రి విషయంలో కూడ తనవలన ఘనత వచ్చిందన్నాడు ఆయన తీరే అంత ఇతరత్రా కూడ పొగిడి గురుభక్తిని ప్రకటించాడు ఇది స్వాతిశయం కాదు, అవినయం అంతకంటే కాదు ఇది కేవలం ఆత్మ విశ్వాసం మాత్రమే ఈ పద్యం చూడగానే "అమలోదాత్త మనీష--కళాకోవిదుడి--" అని చెప్పుకొన్న తిక్కనగారి పద్యం గుర్తుకు వస్తుంది

'వానలో తడియని వాడు-జంట కవులైన తిరుపతి వెంకట కవుల కవితా సుధలో మునుగనివాడు' లేడని యెడు ప్రశస్తి నందినారు వీరి గురుదేవులు, చెళ్ళపిళ్ళవారు కూడ కవిసమ్రాట్టు సత్యనారాయణగారి విషయంలో చెపుతూ "నా మార్గంబున కాదు " ఇత్యాదులచే విశ్వనాథవారి సహజ పాండితీ వైభవాన్ని బహుధా ప్రశంసించారు

విశ్వనాథవారు తనతో జంటకవిగా కొంతకాల ముండిన కొడాలి ఆంజనేయులుగారిని అవతారికలో మూడు పద్యాలలో స్మరించుటను బట్టి కొడాలి వారి గొప్పతనం, విశ్వనాథ సహృదయత్వం ప్రకటిత మగుచున్నవి కొడాలివారు గాంధీ ఉద్యమంలో పడ్డారు. విడిపోయిన అనంతర కాలంలో కవితా హృదయాన్ని పంచుకొన్న జంటకవిని ప్రస్తుతించి, తన కృతజ్ఞతా భావాన్ని వ్యక్తీకరించాడు. తన కవితా వ్యవసాయంలో సహవ్రతుడు కొడాలితో ఖండ కావ్యరచనచేసి ప్రసిద్ధులైనారు ఈ మూడు పద్యాలలో విశ్వనాథ స్నేహశీలత ప్రత్యక్షర సాక్ష్యం యిస్తాయి. నన్నయభట్టు తన సహాధ్యాయి నారాయణభట్టును స్మరించినట్లుగా కొడాలిని స్మరించటం గమనార్హం

ఇంతే కాదు అతడు జోడుగా ఉంటే పరమాద్భుతముగా కావ్యరచన సాగెడిదట 'పోతనగారి విధాన" అనడంలో పోతన పద్యర

చనా, విధానంపై వీరికి గల ప్రగాఢమైన అభిమానం స్పష్టమౌతోంది. భావతీవ్రత వలన శబ్దమేరుటకు తన మనస్సుకు నిలకడ లేనే లేదని విశ్వనాథ చెప్పికొన్నాడు తిక్కనను గూర్చి "ఏ ముఖాంబున పల్కిన" అని ఎఱ్ఱనగారు చెప్పినట్లుగానే విశ్వనాథకు పలికినదే వేద వాక్కుగా రచన సాగినది తిక్కన వలెనే శబ్దార్థములపై ప్రభుత్వం విశ్వనాథకు కూడ ఉన్నాయని తెలియుచున్నది

సంప్రదాయ పద్ధతికి భిన్నమైన తీరున సరస్వతీ దేవిస్తుతి గావించిన విశ్వనాథ, పిల్లల మఱ్ఱి పిన వీరభద్రుడు ప్రత్యేకించి పేర్కొన దగినవారు పిల్లల మఱ్ఱి సరస్వత్యుపాసన గలవాడు విశ్వనాథకు సరస్వతి ఉపాస్యదేవత యగునో కాదో తెలియరాదు సరస్వతిదేవి తలపై చంద్రరేఖ ఉంటుంది. ఫాలస్థలంలో జ్యోతిః ప్రకాశం ఉంటుంది ఆమె వాక్కులకు ఇతని వాక్కులకు సామ్యం కలదని ధ్వని తన శబ్ద సంపదను సూచించుటకు ఆమెను కేవలం వాగ్దేవిగా వర్ణించాడు

ఈ దృశంబుగ మహాకావ్య రచనా ప్రసూనవన భంభ
రామాయణ చిత్తుండనై సర్వధర్మ మూల బీజంబుగ నవిచ్ఛిన్న
సంప్రదాయార్థినై —

ప్రసూన వనమనగా పుష్పవనం అని సామాన్యార్థం విశేషార్థాన్ని బట్టి పుట్టేది — భావాన్ని తలపోసి (జన్మింపజేసి) చెప్పేది అని అర్థము జీవితంలోని సంఘటన భావాలకు పుష్ప సామ్యంలేదు కాని కావ్యంలోని సంఘటన భావాలకు పుష్పసామ్యం ఉంది ఉదా తల్లిప్రేమను చూడవచ్చును ఇది ప్రయత్నం పూర్వకం గాదు తుమ్మెద పువ్వుచుట్టూ తిరిగిన తరువాత స్వాదు మధువును పసిగట్టి (తేనెకోసం) వ్రాలుతుంది అలాగే తాజమహాలు శిల్పం చూడముచ్చటయినది శిల్పసౌందర్యాన్ని చూచి ఒకరు ఆనందిస్తే, పరావస్తు శాస్త్రజ్ఞులకు తాజమహాలు వివరాలే కావాలి

అవిచ్ఛిన్న సంప్రదాయార్థి యనగా పురుషార్థములను పాటించుట ఇందు ధర్మము చాల ముఖ్యమైనది ధర్మబద్ధమైన సంపాదన, వినియోగము ఉండాలి అట్లే కామం సర్వధర్మ మూల బీజంబుగా రచన చేశాడు విశ్వనాథ కొడుకుగా, తండ్రిగా, శత్రువుగా మిత్రుడుగా, సోదరుడుగా, భర్తగా ధర్మపరిఘువు రామచంద్రుడు వాల్మీకంలో యుద్ధకాండలో మొదటిసారిగా రాముడు, రావణుని చూచినపుడు 'వీరుడవైతే రా'! అని ఆహ్వానించాడు కాని రావణుడు వీరోచిత కర్మచేయలేదు

ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి
తిక్కన శిల్పపు తెనుగుతోట
యెఱ్ఱన్న సర్వమార్గేచ్ఛా విధాతృండు
పోతన తెలుగులపుణ్యపేటి
శ్రీనాథుడు రస ప్రసిద్ధ ధారాధుని
కృష్ణరాయడ నన్య కృతిప్రబంధ
పెద్దన్న వడపోత నిక్షురసంబు
రామకృష్ణుడు సురా రామగజము

ఒకడు నాచన సోమన్న, యుక్కివుండు
చెప్పి పదిసార్లు తిరుగ వ్రాసినను మొక్క
వోని యీ యాంధ్ర కవిలోక మూర్ధన్యమణుల
మ్రగ్గపు స్థానములుగ నమస్కరించి॥

విశ్వనాథవారు కావ్యమున పూర్వకవిస్తుతి చేశారు నన్నయ పూర్వకవిస్తుతి చేయలేదు తిక్కనామాత్యుడు ఒక్క నన్నయభట్టును మాత్రమే స్మరించాడు విశ్వనాథ చేసిన పూర్వకవిస్తుతి వంటిది అరుదుగా కన్పిస్తుంది అనడం కంటె ఇట్టిది అపూర్వం, అద్భుతం అనడం సహజం

విశ్వనాథకు పూర్వకవులలో (ఈ) గీటుకు వచ్చినవారు తొమ్మండుగురు మాత్రమే. పదవవాడు తానే అని ఆయన విశ్వాసం అంటే తనను వారితో పోల్చుకొన్నారన్నమాట ఎందుకంటె శైలికి అంత ప్రాముఖ్య మిస్తాడు కనుక కావ్యం యొక్క సర్వ సలక్షణా లను సామరస్యంగా అంతర్భూతం (సమగ్రంగా ఆలింగనం) చేసి కొనేది శైలి మాత్రమే శైలి భగవద్దత్తం — అప్రయత్న పూర్వకం. (Style is the man–Johson) వ్యక్తిత్వం సర్వం వ్యక్తమయ్యేది ఒక్క శైలిలోనే అని తాత్పర్యం పై పద్యంలో పేర్కొన్న తొమ్మిది మందికి ఒక్కొక్క విశేషణం వాడారు అది వారి వ్యక్తిత్వాన్ని తెల పేది నన్నయ ఋషికల్పుడు వాల్మీకి ఋషి నన్నయ అటువంటి వాని అర్ధకవి వాల్మీకి ఇద్దరును సంస్కృతము, తెలుగు సాహితీ జగత్తులకు జగదాద్యులైన కవులు తిక్కన మహాశిల్పి అతని శిల్పం విశ్వనాథను చక్కగా ఆకర్షించింది చిత్రకారుడు తన ప్రతిభను (Two dimensions) ద్విపరిమాణాలతో (పొడవు వెడల్పు రెండు కొలతలతో) నిర్మిస్తే, శిల్ప మందంతో మూడు కొలతలతో శిల్ప నిర్మాణం చేస్తాడు తిక్కన తన రచనలో ఆ శిల్పకళా ప్రాభవాన్ని సమగ్రంగా చూపాడు అందువలననే ఆ విశేషణం సంస్కృత భాష లోని మహాకవులవలె తెలుగుభాషలో అంతటి మహత్తరమైన శిల్పం తిక్కన చూపాడని అర్థం 'తిక్కన శిల్పపు తెనుగుతోట' అని ప్రయో గం తోట అనడం కూడ ఒక విశేషమే అడవిలో వలెగాక పురుష ప్రయత్నంతో అందంగా తీర్చిదిద్దిన వృక్షజాలంకలది అని తాత్పర్యం

ఇక్కడ ఒక చిన్నచమత్కార సహితమైన యదార్థ సంభా షణ మనవి చేస్తాను బ్రహ్మశ్రీ వరుల (చినసీతారామస్వామిశాస్త్రి) దువ్వూరి (వేంకటరమణశాస్త్రి) గార లిరువురకు ప్రొఫెసర్ యస్వీ (జోగారావు) ప్రియశిష్యుడు ఒకప్పుడు డాక్టరు బెజవాడ గోపాల రెడ్డిగారు వరుల దువ్వూరి వారలకు పాండిత్యంలో తేడా ఏమిటని ప్రశ్నించారు. యస్వీ తడుముకోకుండా వరులవారు అడవి, దువ్వూరివారు తోట అని సమాధాన మిచ్చారు

పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని రీవ
సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు — — అన్న శ్రీనాథుని వాక్యాన్ననుసరించి, ఎఱ్ఱన శైలికి బదులు సూక్తి వైచిత్రిని గూర్చి పలుకుట సర్వసామాన్యమైనది. కాని అదిసరి కాదు "సర్వమార్గేచ్ఛా విహారుడు" అనుటయే సమంజసము ఛందస్సు, అలంకారము, పాత్రచిత్రణ, రసపోషణ, వర్ణనాదులలో స్వేచ్ఛావిహారుడు ఎఱ్ఱన. వీని కుదాహరణము లెన్నియేని చూపవచ్చును

ఇక పోతన విషయం తెలుగుదేశంలో రామమందిరం లేని గ్రామం భాగవతం లేని గ్రామం లేదనెడు కీర్తి నందినది భాగవతం. ఇందు దశావతారాలు, ఆధ్యాత్మిక చింతన ఖగోళాది శాస్త్రాలు, సామాన్యుణ్ణి సంస్కారిగా మార్చగలిగే రచన భావసంపద ఇత్యాది లోకోత్తర రచనా రామణీయకం ద్యోతకమవుతున్నవి. సంగీత మాధుర్యం, భక్తితత్త్వం. నారద భక్తిసూత్రాలకు వ్యాఖ్యానం, సమగ్రదర్శనం, అనేక శాస్త్రాల సముదాయం భాగవతములోని ప్రత్యేకత "విద్యావతాం భాగవతే పరీక్షా" అని ప్రసిద్ధి నందినది మూలాతిశాయియైన సౌందర్యం భాగవతం సొమ్ము ఇంటింట భాగవతం ఉంటుందంటే అదే తెనుగుల పుణ్యపేటి

శ్రీనాథుడు కవి సార్వభౌముడు అతని కవితాధార గంగా ప్రవాహ తుల్యమని, రసపోషణమున నాతడు జగన్నాథుడని వర్ణించాడు విశ్వనాథ కవితలోగల పదాలకు అర్థం చర్వణ స్థితికి రాకున్నను సామాన్య పాఠకునకు రసస్ఫూర్తి నిస్తుంది శ్రీనాథునివాక్కు. ఉదాహరణకు నిగటపాటల--" శివవర్ణన "వాతోత్పత్రిక - విడంబించుచున్" ఈ కవితలు అర్థం కాకపోయినా సంధ్యాకాల వర్ణన, తాండవం కనబడుతుంది తెక్కన తేలిక పదాల తరువాత దీర్ఘ సమాసం రచించడం ఇట్టిదే భీముని కోపాన్ని వర్ణిస్తూ "నేలయి నింగియు తాళములుగాగ-- రూపంబు కదిసి-- పద్యార్థాన్ని, సమాస భూయిష్టంగా రచించినా సులువుగా గ్రహించవచ్చును

ఆముక్త మాల్యదను రచించిన శ్రీకృష్ణదేవరాయలను 'అనవ్య కృతి ప్రబంధ' అని వర్ణించాడు విశ్వనాథ నిజానికి ఆముక్తమాల్యద దానికదేసాటి అతిలోకభావన, ఉద్యమాలు, రాజయుద్ధనీతులు, రాజ సామాన్యములైన తత్వ రహస్యములు, ఎన్నో ప్రయోగములున్నాయి గ్రంథనామ సార్థకతకూడ సమంజసమే తమిళపదాలకు సంస్కృతీ కరణయే శూడికొడుత్తాళ్ ఆముక్త మాల్యద

పెద్దనార్యుడు మన చరిత్రలో శ్రీనాథుని అనుకరణము కాననగును నారికేళ పాకాన్ని-ద్రాక్ష కదళీ పాకంగా మలచి నందున 'పెద్దన్న పీరపోత నిక్షు రసంబు'-అని విశ్వనాథ పేర్కొన్నాడు రామకృష్ణుని సురారామ గజముతో పోల్చాడు బరాహతము ఇంద్రునికి చెప్పినట్లు వింటుంది ఇందుద్రికి మాహటిపెడు అ గజము ఇతరత్రా స్వేచ్ఛా విహారము సాగిస్తుంది అట్లే స్వచ్ఛంద ప్రవృత్తి గల వాడు రామకృష్ణుడు భూలోక ఏనుగులతో కాక నందనవనంలో శ్రేష్ఠత కలిగినవాడు సర్వగణ ప్రపంచానికి అటపతిగా 'నిరంకుశాః కవయః' అన్నట్లు సర్వ కవిలోకంలో ఎంతటి స్వేచ్ఛా విహార కవిశ్రేష్ఠుడు మరొకడు లేడు

నాచన సోమనాథుని విషయంలో విచిత్రమైన విశేషం కనబడుతుంది 'ఒకడు నాచన సోమన' అన్నది గవనార్థం 'ఉక్కివుండు' -నేది ప్రమాదవశాత్తు ప్రయోగింపబడినదే సమర్థుడనే తలంపుతో పొరపాటు పడినాడు. విశ్వనాథ 'ఏకో నారాయణః'- ద్వైవము ఒక్కడే అనే భావము కవి అంటే సోమనే అనే ఊహలో చెప్పాడు ఎందుకు? నాచన సోమనాథుడు నవ కాలీన ప్రభువులచె మహాకవులచే ప్రశస్తి పొందినవాడు ఆంధ్రకవి లోకంలో మరేకవికీ లేని సకల భాషాభూషణ, సాహిత్య రసపోషణ, సంవిధానచక్రవర్తి సంపూర్ణకీర్తి, నవీన గుణసనాథ అనె బిరుదు పంచకాన్ని పొందిన కవి శ్రేష్ఠుడు నాచన సోమనాథుడు "ఏగతి రచియించిరేని సమకాలము

వారు మెచ్చరే కదా!" అన్నది లోక సహజం అసమాన్య బిరుదులు పొంది, ఆంధ్ర సాహిత్యంలో క్రొత్తపోకడలు చూపినవాడు సోమన. ఎవరైతే తనకృతికి తానే ఒక తటస్థుడైన పాఠకునిగా సమర్థించుకో గలడో వాడే 'Conscious Artist- అన్నదే విశ్వనాథ ఉద్దేశ్యం గా ఉంటుంది

పైని చెప్పినవారు మహామహులైన కవులనుకు తిరుగు లేనివి గతకాలానికి సంబంధించిన వారైనా వీరందరినీ తన గురు ద్ధులలో నిల్పి, పరోక్షంగా గురువులన్నాడు ప్రగాఢమైన ఆదరాభి మానాలతో శైలి-శిల్పములకు సంబంధించి, వారి ముద్ర తనపై గల దని చెపక చెప్పినట్లయినది

భాస కాళిదాస భవభూతి దిఙ్నాగు
లును ప్రశస్త వాగ్వి లక్షణుడు ము
రారి భట్టునకును రామకథా భాష్య
కారులకును మోడ్పుకై ఘటించి॥

రామకథలను గ్రహించి భాసుడు, కాళిదాసు, భవభూతి దిఙ్నాగులు నాటకాలను రచించారు భాసుడు అభిషేక్త రాఘవము, ప్రతిమా నాటకము కాళిదాసు రఘువంశము, మురారి అనర్ఘ రాఘ వము రచించారు భవభూతి ఉత్తర రామచరిత్ర, దిఙ్నాగుడు కుంద మాల రచించాడు ప్రశస్త వాగ్వి లక్షణుడు మురారివలె తానును వాగ్వి లక్షణ సంపన్నుడనని చెప్పికొన్నాడు భట్టు అనగా పండి తుడు మురారి భట్టు పండితుడు విద్వాంసుడు అని ప్రత్యేకంగా చెప్పాడు

మురారికి తృతీయ పందా-అని గదా! ప్రసాదగుణ విశి ష్టమైన రచనకు మారుగా కష్టైల ంజ్ఞం లాంటి సమాసాలతో రచన సాగించడం చూస్తాం అనర్ఘ రాఘవం మొదటి రెండుశ్లోకాలు

చూడండి. వీరంతా రామకథకు భాష్యకారులు అట్లే తానుకూడా ఒక భాష్యకారుడననే తెలిపారు. ఈ పద్యంలో 'కైమోడ్పు' అని ఉంది కైమోడ్పు ఘటించడమంటే నమస్కరించడం. వారు తాను భాష్యకారులే అయినా వార్లది 'కైమోడ్పు'కాగా తనది 'మోడ్పుకై' అటు

అచ్ఛమైన యమృత మమరులు త్రావి నా
రోయి! దానినే నసూయ పడను,
పరమ మౌనియైన వాల్మీకి కృత రామ,
సత్కథా సుధారసంబు త్రావి

ఈ లోకంలో నదులు, గిరులు ఉన్నంత వరకు నిలిచేది రామకథ స్వానుభూతితో విశ్వనాథ రచించినది కల్పవృక్షము ఎత్తుగడలో రామకథా మృత విషయ ప్రస్తావన అమోఘం, పద్యరచనా ప్రారంభంలో గడుసు పోకడ అద్భుతం.

రామాయణ ప్రశంసను ఎందరో ఎంతో గొప్పగా చేశారు కాని అవి బోడివి అంటే అవి తమ యనుభూతిని మేళవించి చెప్ప లేదు అన్న మాట విశ్వనాథ హృదయ దఘ్నమైన అనుభూతితో ప్రవచించాడు, అమృతంకంటె గొప్ప పదార్థం లేదు దానిని అమరులు గ్రహించినా తనకు అసూయిలేదు ఎందుచేత? ఒకానొక కిరాతుడు సప్తర్షుల చేత (రామ) మరా అనే మంత్రం ఉపదేశింపబడి, రామ నామ జపం చేత పరమ మహర్షియైన వాల్మీకి రామకథామృతం తనకు దక్కినది గనుక ఏవం విధ భావవైచిత్రి ఇకపై మరి ఏకవి ప్రశంసించినా ఇంత గొప్పగా ఉండదు—అని ఘంటా పథంగా చెప్ప వచ్చు జగదాద్యుడైన వాల్మీకి మహర్షి రచన రామాయణము ఏన్నో భాషలలోనికి అనువదింపబడింది కావ్యలోకంలో ప్రాగ్రేసర మైంది సర్వేసర్వులు అంగీకరించిన మహర్షికి నమస్కారం సర్వశిల్ప భూయిష్ఠము, సుందరమునైన వాక్కు రామాయణ గాధ తన వాక్కు కూడ అట్టిదే అనిధ్వని.

సర్వ కావ్యవాక్కు జనియించె నే మౌని
వదన సీమ నుండి వాని దలతు
సర్వశిల్ప భూమి సర్వ లక్షణలక్ష్య
నవని ధాత్ర భూతు నాకుజాతు

అర్వాచీనులయిన లాక్షణికులందరకు లక్షణ భిక్ష పెట్టిన వాల్మీకి మహర్షికి అంజలి ఘటింతును

ఈ సంసార మిదెన్ని జన్మలకు నేని మౌని వాల్మీకి భా
షా సంక్రాంత ఋణంబు దీర్పగలదా! సత్కావ్య నిర్మాణ రే
ఖా సామగ్రి ఋణంబు దీర్పగలదా! కాక త్తున్నదౌ స్వామి గా
థా సంపన్నము భక్తి దీర్చనను ద్వైతా ద్వైత మార్గంబులన్॥

ఇది స్వీయానుభూతిని బట్టి వాల్మీకి మహర్షిని గూర్చి చేసిన స్తుతి. కాని వట్టిది కాదు ఎందుకంటే ఎన్ని జన్మలకైనా ఆ మహర్షి ఋణం తీర్చుకో గలనా యని తపన బాధ పడుచున్నాడు వాల్మీకికి అంతగా ఋణగ్రస్తు డయినాడు అంటే రామాయణాన్ని అంత కూలంకషంగా చదివి అనుభవించాడన్న మాట

లోకంలో సత్కావ్య నిర్మాణానికి కూడ ఆ మహర్షియే. ఆ మహాకవియే ఒరవడి అని ఈ మహాకవి ప్రగాఢ విశ్వాసం ఎంత భక్తితో ఆ రామకథను సుశ్లీ ఎంత మహాకావ్యంగా తీర్చిదిద్దినా ఆముని ఋణం తీర్చుకోలేరని తాత్పర్యం ద్వైతాద్వైత మార్గంబులన్' అనడంలో విశేషమేమిటంటే ఒకటి భక్తిమార్గం—రెండోది జ్ఞానమార్గం తాను రామచంద్రుని భక్తుడనను కోవడం ద్వైత మార్గం తానే రామచంద్రుడనను కోవడం జ్ఞానమార్గం సహజంగా భక్తుడు తర్వాత జ్ఞానమార్గంలో పడ్డాడు భక్తిమార్గం వదలేక రెండింటిమధ్య కొట్టుమిట్టుండి రెండు మార్గాలు చూపాడు—అంటే తన కల్పవృక్షంలో అవలంభించాడు

ఒక్క వాల్మీకి కాక వేరొక్క డెవడు
సుకవి శబ్ద వాచ్యుండిక గుకవిసింద
యప్రశస్త పథంబుగా నప్పుడు చేసి
ముని ఋణంబు దీర్ప నీ కావ్యమును రచింతు॥

ఈ లోకంలో వాల్మీకి తప్ప సుకవి అనిపించుకో దగిన వాడు వేఱొకడు ఉన్నాడా అని విశ్వనాథ ప్రశ్న అంటే కాళిదాసాదులు సుకవులు కారని కాదు అర్థం, వారందరినీ మించి వాల్మీకి సుకవి అని విశ్వనాథ అభిప్రాయం అందుచేత ఇక పూర్వాంధ్ర కవుల సంప్రదాయాన్ని అనుసరించి, కావ్యావతారికలో కుకవి నింద చేయడం దేనికనే అని [illegible] విశ్వనాథ చివరగా ఒక్కమహా వాక్యం సెలవిచ్చాడు "ముని ఋణము దీర్చని కావ్యమును రచింతు" ఎన్ని జన్మ లెత్తినా వాల్మీకి ఋణం తీర్చుకోలేనని ముందే ఉద్ఘాటించిన ఈయన మళ్లా యిలా అనడమేమిటి? ఇది స్వవచోఘాతంవలె కన్పిస్తుంది కానికాదు ముని ఋణం ఎలాను తీర్చుకోలేము కాని తీర్చుకోవడానికి ప్రయత్నం చేయకపోతే ఎట్లా? అందు చేత ఏకొంతో ఆ ప్రయత్నం చేయడం కోసం ఈకావ్యాన్ని రచిస్తున్నాను అయి ఉంటుంది ఇది విశ్వనాథ వారిభావము,

రామాయణ కల్పవృక్ష మహాకావ్యావతారిక గురించి చెప్పవలసిన ముఖ్యాంశాలన్ని పైన చెప్పడము జరిగినది ఇకపోతే యే తత్కృత కోటితత్కృత పోషకుడు ముక్త్యాల సంస్థాన ప్రభువు అనాలోచితంగా కొందరనుకుంటారు ఆయన కృతిపతి అని కాదు నిశ్శంకముగా కృతిపతి కవికి ఇలవేల్పు అయిన విశ్వేశ్వరుడే ఆస్వామికిని తన పితృ పాదులకును అభేద భావన ఒకచో చేసియుండుటచే అనుషంగికంగా ఆపితృ పాదులకును కృతిపతి ప్రతిపత్తి కొంత చేకూరగలదు

ఇది కల్పవృక్ష అవతారికకు సంగ్రహ విశ్లేషణ

